శ్రీ వ్యావహారికాంధ్ర

# తులసీరామాయణము

## రెండవ భాగము



రచయిత్రి:

శతపతి రుక్మిణమ్మ

వెల రూ. 13/-

ఓమ్

అవ్యయానంద గ్రంథమాలా

ఏకాదశ రత్నము.

## శ్రీ వ్యావహారికాంధ్ర

# తులసీరామాయణము

## రెండవ భాగము

రచయిత్రి:

శతపతి రుక్మిణమ్మ



వెల రూ. 13/-

ప్రథమ ముద్రణ 1988 1000 ప్రతులు

Paper used for the printing of this book has been made available by the Government of India at Concessional rates.

ప్రతులకు :

పతి వేణుగోపాలశర్మ, సాహిత్యరత్న
శ్రీ వాగీశ్వరీ విద్యానికేతన్
17-106 క్రొత్తపేట, యలమంచిలి.
(విశాఖ జిల్లా.)

ముద్రణ : శ్రీ కొండపల్లి ప్రింటింగ్ ప్రెస్ - రాజమండ్రి.

ఓం

# శ్రీ వ్యవహారిక ఆంధ్ర తులసీరామాయణం

## నాలుగో సోపానం కిష్కింధాకాండ

శుభకరమైన సుందరాకారులూ మల్లెమొగ్గలవంటీ నల్లతామర పువ్వులవంటీ శరీర వర్ణాలు గలవారూ పద్మాలవంటి విశాల నేత్రాలుగల వారూ విలువిద్యయందు మహాప్రవీణతా ప్రభావమూ గలవారూ బలానికి ఉనికి పట్టైనవారూ వేదములచేత వర్ణింపబడేవారూ గోబ్రాహ్మణప్రియులూ సాటిలేని అనుభవజ్ఞానులూ సజ్జనులచేత కీర్తింపబడేవారూ సీతాదేవిని వెదకుతూ తిరుగుతున్నవారూ అయిన రామలక్ష్మణులను నాకు రమ్యమైన భక్తిని ప్రసాదించుటకై నమస్కరించి ప్రార్థిస్తున్నాను. పరబ్రహ్మమనే సముద్రంలో పుట్టిందీ శోభావంతమైందీ సంసార జ్వరానికి వైద్యమూ శివుని నోటినుండి వెడలిన పవిత్రమంత్రమూ సీతాదేవికి ప్రియజీవన మైందీ, గొప్ప కలి సంబంధమైన నానావిధ పాపాలను ధ్వంసంచేసేదీ తరుగులేందీ ఐన రామనామామృతం ఎల్లప్పుడూ పానం చేస్తుండేవాడు మాత్రమే ధన్యుడౌతాడు. ముక్తికి ఉనికిపట్టూ మహాపాపనాశకరమూ వ్యక్తముకాని సుఖాన్నిచ్చేదీ పార్వతీపరమేశ్వరులకు ఎల్లప్పుడూ నివాస స్థానమూ జ్ఞానరత్నానికి గనివంటిదీ యోగులకు ఆశ్రయింపదగిందీ ఐన కాశీక్షేత్రాన్ని సేవించడానికి ఆసక్తిని పొందని వారెవరు? క్షీరసాగరం మథించినప్పుడు దేవతలందరూ గొప్పఆర్తితో దేవా! చంద్రశేఖరా! రక్షించు రక్షించు అని మొత్తిపెట్టగా హాలాహలమంతా తీసి ఒక నేరేడు పండు లాగున మింగి వారిని రక్షించిన శంకరునివంటి కృపగలవాడు న్నాడా? ఓమందమైన మనస్సా! అతిసులభంగా కోరిన కోరికలిచ్చే ఆ పరమేశ్వరున్ని నీవెందుకు ఆశ్రయించవు? దేవా! లక్ష్మీరమణా!

మహాత్ములైన మునులచేత పూజింపబడే పాదపద్మాలుగలవాడా! ఎల్లప్పుడూ శివునిచే స్మరింప బడేవాడా! లీలకోసం లోకాలను సృష్టించి నటించే ప్రభూ! అవధరించు అప్పుడు ఈశ్వరుడు పార్వతితో చెప్పిన శ్రీరామచంద్రుని పవిత్రమైన కథను చెపుతున్నాను విను భరద్వాజా! దీనిని విన్నయెడల జన్మమృత్యు సంసారాంధకారమంతా తొలగిపోతుంది. అని యాజ్ఞవల్క్యమునీంద్రుడు చెపుతున్నాడు. అప్పుడు శ్రీరామచంద్రుడు తమ్మునితోకూడా ఋష్యమూకపర్వతం దగ్గరకు వెళ్లేడు. ఆ కొండమీద మంత్రులతో ఉన్న సుగ్రీవుడు కోటిసూర్యప్రకాశమానులైన రామలక్ష్మణులను చూచి భయపడి హనుమంతునితో సఖా! అటుచూడు. ఆ రూపవంతులూ బలవంతులూ ప్రకాశవంతులూ అయిన వారిద్దరూ ఇటువైపు వస్తున్నారు. వారెవరో? నీవు బ్రహ్మచారి రూపంతోవెళ్లి వారి ఉద్దేశాలేమో? తెలిసికొని నాకు సంజ్ఞ చెయ్యి. వారు వాలిచేత పంపబడినవారే ఐతే మనస్సులు మహామలినంగా ఉంటాయి. అదితెలిసికొని నాకు సంజ్ఞతో తెలియజేస్తే వెంటనే నేను పర్వతందిగి పారిపోతాను. అని సుగ్రీవుడు చెప్పగానే విని హనుమంతుడు అలాగే చేస్తాననిచెప్పి బయలు దేరేడు.

## హనుమంతుడు రామలక్ష్మణుల యొద్దకువచ్చుట

అప్పుడు హనుమంతుడు బ్రాహ్మణవేషం ధరించి వెళ్లివారికి భక్తితోనమస్కరించి వినయంతో స్వామీ! మీరెవరు? రాజకుమారులలా కనిపిస్తున్నారు, అతిమృదువైన పాదాలుగలవారు. ఏకారణంచేత ఈఅరణ్యంలో కాలినడకను తిరుగుతున్నారు? మీవంటివారు ఈకష్టాలను సహించి తిరగడానికి కారణమేమి? మీరు ముగ్గురు మూర్తులలో ఇద్దరా? లేక నరనారాయణులా? మహాత్ములారా! పరమాత్మతత్వమే ఇలా మూర్తులు ధరించినట్లున్నమీరెవరు? స్వామీ! అనగానే రాముడంటున్నాడు. విప్రా!

నేను కోసల చక్రవర్తియైన దశరథ మహారాజుగారి పుత్రున్ని. తండ్రిపంప డంచేత భార్యతోకూడా ఈఅరణ్యానికి వచ్చేను. ఇతడునాతమ్ముడు లక్ష్మణుడు. నాపేరురాముడు. నాభార్యను రాక్షసుడెవడో ఎత్తుకొని పోవడం చేత మేము ఆమెను వెదుక్కుంటూవస్తున్నాము. బ్రాహ్మణోత్తమా! మా చరిత్రంతా చెప్పేను, ఇక నీవృత్తాంతంచెప్పు అన్నాడు. రామునిమాటలు విని హనుమంతుడు ఇతడు పరమాత్ముడైన ప్రభువు. సర్వాంతర్యామి అనితెలిసికొని వినయంతో రామునిపాదపద్మాలు పట్టుకొని శరీరంపులక రించి నోటమాటరాక శ్రీరామచంద్రుని సుందరమూర్తిని చూస్తూ అంతా మరచిపోయి అలాఉండిపోయేడు ఉమా! ఆసుఖాన్నివర్ణించి చెప్పలేము. అని శివుడు పార్వతికిచెప్పేడు. ఈవిధంగా హనుమంతుడుండి కొంతసే పటికి ధైర్యం తెచ్చుకొని దేవా! నీమాయచేత మోహింపజేయబడినవాడి నౌటచేత అనుపమానుడవైన నిన్ను తెలిసికోలేక మీరెవరనిఅడిగేను. కాని స్వామీ! కేవలమనుష్యుని విధంగానీవు నన్ను తెలియనట్టుఅడుగుతున్నావేం? దేవా! నేనుజ్ఞానహీనున్నీమందబుద్ధినీ అవుటచేత నిన్నుమరచిపోయేను. నీవూనన్నుమరచిపోయేవా? భువనేశ్వరా! నన్నుమరచిపోవడం నీకు ఉచితమేనా? నీపాదపద్మసేవకోరిఉన్నానుగదా! మహాత్మా! నీమాయకు మోహితులు కానివారెవరున్నారు? ఆనందనిలయా! నిష్కళంకా! స్వప్రకాశా! పరంధమా! నీకరుణవలననే కదా జనులు చెప్పశక్యంకాని నీమాయను దాటగలుగుతారు. దేవా! నీభజనా ఇంకా ఇతరమైన సాధనలేవీ నేనెరుగను. స్వామినిసేవకుడు తల్లిని శిశువూ నమ్మిచింతలేకుండా పోషింపబడినట్లు నేను నిన్నేనమ్మేను. కనుకనే నిశ్చింతగా ఉన్నాను. ఓజగదీశా! ఏవిధంగా నైనానన్నురక్షించే భారంనీది అంటూ హనుమంతుడు నిజరూపాన్నిపొంది గొప్పభక్తితో రామచంద్రుని పాదపద్మాలమీదపడ్డాడు. రాముడు అతన్నిలేవనెత్తికౌగిలించుకొని వానరేంద్రా! నీవువిచారించకు నిన్నులక్ష్మణునితో సమానంగా చూచుకుంటాను. నన్నునమ్మినవారిని ప్రేమతోచూస్తాను. నన్నుతప్ప ఇతరమెరుగని నిపుణులు అనన్యభక్తు

తెలియవు. నాధా! మీకృపవలన నాకిప్పుడు కొంచెం బోధకలుగుతుంది పురుషోత్తముని గాథలు విన్నకొలదీ తనివితీరకుంటుంది. కాబట్టి నాధా! ఆ తరువాత శ్రీరామచంద్రుడు ఏమిచేసేడో ఆనతీయండని పార్వతి ప్రార్థించింది. చంద్రశేఖరుడు అప్పుడు కాత్యాయనితో దేవీ! అమృతంకన్నా గొప్పదైన శ్రీరామచంద్రుని చరిత్రవినడంకంటె భాగ్యమున్నదా? అని చెప్పి తరువాయికథ ఈ విధంగా చెప్పేడని భరద్వాజునితో యాజ్ఞవల్క్య మహాముని చెపుతున్నాడు. అప్పుడు అలావ్యాకులంతో ఉన్న శ్రీరామచంద్రున్ని చూచి సుగ్రీవుడు అంటున్నాడు. ఓ రఘుప్రభూ! విచారించక మనస్సులోధైర్యం నిలబెట్టు తండ్రీ! మాతల్లి సీతాదేవి ఏవిధంగా లభిస్తుందో ఆ ఉపాయంచేసి తెలిసికొంటాను దేవా! ఈపనినెరవేరేవరకు పట్టుదలవిడువను. నీసేవకున్ని అన్నాడు. ఆ ఆదర పూర్వకమైన సుగ్రీవుని మాటలు విని రామభద్రుడు సంతోషించి ఇలా ప్రశ్న చేసేడు.

## వాలి సుగ్రీవులకు విరోధం సంభవించిన కథ

ఓయీ! సూర్యపుత్రా! నీవు దీనంగా మంత్రులతో కలిసి ఈ కొండమీద ఉండడానికి కారణమేమి? అంతా సవిస్తరంగా నాకు చెప్పు. అన్నాడు. అదివిని సుగ్రీవుడు. రామచంద్రా! వాలీ నేనూ అన్నదమ్ములం. మేమిద్దరం చెప్పశక్యంకానంత అన్యోన్యప్రేమలతో ఉండేవాళ్లం వాలి అన్న, నేను తమ్మున్ని. ఇలా ఉండగా మయుని కుమారుడు మాయావి అనేవాడువచ్చి మాపట్టణద్వారం దగ్గర నిలబడ్డాడు. అర్ధరాత్రి సమయంలో అలావచ్చి మహాబలవంతుడైన వాలిని యుద్ధానికి రమ్మని పిలిచేడు. పిలిచిందేతడవుగా వాలి ఉగ్రుడైవెళ్లి వాడిని ఎదిరించేడు. వాడు భయపడి వాయువేగంగా పారిపోయేడు. వాడిని వెంటాడుతూ మా అన్నగారు యుద్ధానికి వెళ్లేడు. అతనికి సహాయంగా నేనుకూడా వెళ్లేను. అప్పుడా రాక్షసుడు గుభాలున ఒక్క కొండగుహలో దూరిపోయేడు. అప్పుడు వాలి నాతో సుగ్రీవా! నేనీబిలంలో ప్రవేశించి వీడిని పట్టి చంపి

తెలియవు. నాథా! మీ కృపవలన నాకిప్పుడు కొంచెం బోధకలుగుతుంది పురుషోత్తముని గాథలు విన్నకొలదీ తనివితీరకుంటుంది. కాబట్టి నాథా! ఆ తరువాత శ్రీరామచంద్రుడు ఏమిచేసేడో ఆనతీయండని పార్వతి ప్రార్థించింది. చంద్రశేఖరుడు అప్పుడు కాత్యాయనితో దేవీ! అమృతంకన్నా గొప్పదైన శ్రీరామచంద్రుని చరిత్రవినడంకంటె భాగ్యమున్నదా? అని చెప్పి తరువాయికథ ఈ విధంగా చెప్పేడని భరద్వాజునితో యాజ్ఞవల్క్య మహాముని చెపుతున్నాడు. అప్పుడు అలా వ్యాకులంతో ఉన్న శ్రీరామచంద్రుణ్ని చూచి సుగ్రీవుడు అంటున్నాడు. ఓ రఘుప్రభూ! విచారించక మనస్సులో ధైర్యం నిలబెట్టు తండ్రీ! మాతల్లి సీతాదేవి ఏవిధంగా లభిస్తుందో ఆ ఉపాయంచేసి తెలిసికొంటాను దేవా! ఈపని నెరవేరేవరకు పట్టుదలవిడువను, నీసేవకుణ్ని అన్నాడు. ఆ ఆదర పూర్వకమైన సుగ్రీవుని మాటలు విని రామభద్రుడు సంతోషించి ఇలా ప్రశ్న చేసేడు.

## వాలి సుగ్రీవులకు విరోధం సంభవించిన కథ

ఓయీ! సూర్యపుత్రా! నీవు దీనంగా మంత్రులతో కలిసి ఈ కొండమీద ఉండడానికి కారణమేమి? అంతా సవిస్తరంగా నాకు చెప్పు. అన్నాడు. అదివిని సుగ్రీవుడు. రామచంద్రా! వాలీ నేనూ అన్నదమ్ములం. మేమిద్దరం చెప్పశక్యంకానంత అన్యోన్యప్రేమలతో ఉండేవాళ్లం వాలి అన్న, నేను తమ్ముణ్ని. ఇలా ఉండగా మయుని కుమారుడు మాయావి అనేవాడువచ్చి మాపట్టణద్వారం దగ్గర నిలబడ్డాడు. అర్ధరాత్రి సమయంలో అలావచ్చి మహాబలవంతుడైన వాలిని యుద్ధానికి రమ్మని పిలిచేడు. పిలిచిందేతడవుగా వాలి ఉగ్రుడైవెళ్లి వాడిని ఎదిరించేడు. వాడు భయపడి వాయువేగంగా పారిపోయేడు. వాడిని వెంటాడుతూ మా అన్నగారు యుద్ధానికి వెళ్లేడు. అతనికి సహాయంగా నేనుకూడా వెళ్లేను. అప్పుడా రాక్షసుడు గుభాలున ఒక కొండగుహలో దూరిపోయేడు. అప్పుడు వాలి నాతో సుగ్రీవా! నేనీబిలంలో ప్రవేశించి వీడిని పట్టి చంపి

పదిహేను దినాలలో వస్తాను. అలానేను రాకపోతే చచ్చిపోయేననే అనుకో, అని చెప్పి తొందరగా ఆకొండగుహాలో ప్రవేశించేడు. అప్పుడు నేను నెలరోజులవరకూ అక్కడ నిరీక్షిస్తూ ఉన్నాను. కాని ఎప్పటికీ వాలి రాలేదు. ఆ కొండగుహాలోనుండి రక్తప్రవాహం మాత్రం కొట్టుకొని వస్తుంది, నేనది చూచి శత్రువే వాలిని చంపేసేడని భయపడిపోయి ఇక్కడ ఉంటే ఇక నామీదకు వాడు వస్తాడేమో అని ఆగుహాకు అడ్డంగా ఒక పెద్ద రాతిబండ పెట్టేసి వడిగా కిష్కింధకు పరుగెత్తి వచ్చేసేను. అప్పుడు మంత్రులందరూ ఈ రాజ్యానికి రాజులేకపోతే బాగుండదని ఆలో చించి నన్ను బలవంతంగా రాజుగా పట్టాభిషేకం చేసేరు, ఇంతలో వాలి శత్రువును చంపేసి వచ్చేడు, రాజసింహాసనంమీద ఉన్న నన్ను ఆశ్చ ర్యంతో చూచి గొప్పక్రోధంతో నా సర్వస్వమూ నాభార్యనూ కూడా తీసు కొని దయలేకుండా నన్ను కొట్టి తరిమేసేడు. దీనరక్షకా ! నేనా దెబ్బలకు సహించలేక నానా దిక్కులకూ పరుగెత్తేను. అంతటా తిరిగి తిరిగి ఎక్క డకు వెళ్లినా నన్ను వాలి తరుముకొని వస్తుండడం చూచి భయంతో ఏదిక్కూ కానక ఈ పర్వతం మీదకు మునిశాప భయంవల్ల వాలి రాడు గదా ! అని ధైర్యంతో నాటినుండీ ఇక్కడ ఉన్నాను. కాని ఏ సమయాన్ని వాలి ఎవరిని పంపి బాధింపజేస్తాడో అని భయపడుతూనే ఉన్నాను. అని చెప్పగానే శ్రీరామచంద్రుడు అతనిదుఃఖానికి కారణం అంతా తెలుసుకొని చెయి చాచి అతనితో అంటున్నాడు, సుగ్రీవా ! నీకు భయంలేదు. నిన్ను బాధించే వాలిని నేను వధిస్తాను. విడిచి పెట్టను. కొంచెమైనా కనికరం లేకుండా సోదరుడవైన నిన్ను బాధించే దుర్మార్గుని ముఖంచూస్తే పాపం కలుగుతుంది, మిత్రుని కష్టం గోరంతైనా కొండంతలాగున చూచి వెంటనే నివారించాలి. తనకష్టం కొండంతైనా గోరంతగా చూడాలి, అటు వంటివాడే నీతిమంతుడు. అట్టిభావంలేని శఠులతో స్నేహం చెయ్యనే కూడదు. మిత్రుడెప్పుడైనా తన హితున్ని చెడ్డదారినుండి తప్పించి మంచి మార్గంలో పెట్టాలి. మిత్రునియొక్క సద్గుణాలనుచెప్పి అవగుణాలను

దాచిన వాడే స్నేహితుడు, తన శక్తికొలదీ ఉపకారం చేస్తూ ఆపద వచ్చి నప్పుడు నూరంతలు సహాయపడుతూ మిత్రుని మేలుకోరేవాడే తగిన స్నేహితుడని వేదాలు చెపుతున్నాయి. ఎదుట మృదువుగా మంచిమాటలాడి వెనుక తిరిగే సరికి నిందలాడేవాడు ఎప్పుడూ హితుడుకాడు. ఎవని మన స్సైతే వక్రంగా ఉంటుందో ఆ దుర్మార్గుని స్నేహం విడిచిపెడితేనే శుభం కలుగుతుంది. అన్నా! చెపుతున్నాను విను. దుష్టసేవకుడూ దుష్టు రాలైన భార్యా లోభగుణంగల రాజూ కపటంతోనున్న స్నేహితుడూ ఈ నలుగురూ పీడాకరులే, అని తెలిసికో.

## రాముడు సప్తతాళాలినీ పడగొట్టడం దుందుభి కళేబ రం తన్నడం

మిత్రా! నా బలాన్నిగూర్చి సందేహించకు. ఈ కార్యం నేను తప్పకుండా నెరవేరుస్తాను అన్నాడు. రాముడు ఇలా అనగానే సుగ్రీవుడు రఘువీరా! వాలి గొప్పవీరుడూ బలవంతుడూ యుద్ధంలో మహాధీరు డూను. ఎటువంటి శూరులకైనా అతన్ని చంపడం సాధ్యంకాదు. పూర్వం దుందుభి అనే ఒక రాక్షసున్ని చంపి ఆ కళేబరం ఇదిగో ఎంత పెద్దదో చూడు. దీనిని బంతిలాగున వాలి తన్నుతుంటాడు, వాలి మహాబల శాలి. ఏడు తాటిచెట్లనూ ఒక్క దెబ్బతో పడగొట్టగల మహావీరుడు. రఘువీరా! అతన్ని ఎవరు జయించగలరు? అనగానే శ్రీరామ చంద్రుడు సుగ్రీవా! విచారించకు అనిచెప్పి ఆ ఏడు తాటిచెట్లూ ఒక్క బాణంతో పడగొట్టి ఆ దుందుభి కళేబరాన్ని నూరుయోజనాల దూరం తన్ని పారేసేడు. అప్పుడు సుగ్రీవుడు రాముని పరాక్రమం చూచి ఆహా! ఈమహాత్ముడు జగదీశ్వరుడు అని మనస్సులో తలంచి అతనిపాద పద్మాలకు మాటిమాటికి నమస్కరించి ప్రేమతో ఉప్పొంగిపోయి ఇతడు వాలిన్నే కాదు మూడులోకాలలో ఉన్న దుష్టులనూ సంహరించగల సమ ర్థుడని నమ్మి గొప్ప ఆనందంతో జ్ఞానం ఉదయించడంవల్ల అంటున్నాడు.

రామా! నీకృపవలన నామనస్సులోని చంచలమంతా పోయింది ఇక ఈ పరివారాన్నీ సుఖాన్నీ సంపదలనూ కోరికలనూ విడిచిపెట్టి నానాథుడవని నిన్నే సేవిస్తాను. దేవా! ఈసౌఖ్యాలన్నీ నీభక్తికి అంతరాయాలని తెలివిగల వారంటారు. శత్రుమిత్రులూ సుఖదుఃఖాలు మొదలైన ద్వంద్వాలన్నీ మాయచేత కల్పింపబడ్డాయి. కాని పరమార్థాలు కావు తండ్రీ! నీవు ఒక్కడవే పరమార్థాన్ని ఇచ్చేవాడవు. నీ అనుగ్రహంవల్ల నాకు దుఃఖం దూరమైంది. నీ పాదదర్శనం వల్ల నాకు మహాభయంకరమైన పగవాడు వాలి నాకిప్పుడు ప్రాణస్నేహితునిలా కనిపిస్తున్నాడు. రాక్షసాంతకా! సకలంవిడిచిపెట్టి నిన్ను రాత్రింబగళ్ళూ మహానందంతో భజించే వివేకం నాకియ్యి అన్నాడు. ఆకపీంద్రుని వివేకంతో కూడిన మాటలు నవ్వు ముఖంతోవిని. రాముడు అంటున్నాడు. సూర్యపుత్రా! నేనన్నమాట సత్యం తప్పదు. అని రాముడు అన్నాడని గరుత్మంతునితో కాగభుశుండి చెపుతున్నాడు. నటుడు కోతులను చతురతతో ఎలానాట్యమాడిస్తాడో ఆలాగే శ్రీరామచంద్రుడు జీవులను ఆడిస్తుంటాడని ఆతని మహిమ వేదాలు చెపుతుంటాయి.

## తార రామ సహాయంతో ఉన్న సుగ్రీవునితో పోర వద్దని వాలి కుపదేశించుట

అప్పుడు శ్రీరామచంద్రుడు మిత్రుడైన సుగ్రీవున్ని వెంటతీసికొని ధనుర్బాణాలు పట్టుకొని కిష్కింధాపుర ప్రాంతానికి వెళ్లినంతనే వాలిని యుద్ధానికి పిలువుమని సుగ్రీవునితో చెప్పేడు, రాముడున్నాడన్న ధైర్యంతో సుగ్రీవుడు గర్జిస్తూ వాలిని యుద్ధానికి పిలిచేడు. ఆ ధ్వని విని వాలి క్రోధంతో బయలు దేరి వెళ్లబోతుండగా తార అడ్డంగా వచ్చి అతని పాదాలు పట్టుకొని ఇలా బోధించింది. నాథా! కోసల దేశ రాజ కుమారులు యోధాగ్రగణ్యులు కోటి సూర్యప్రకాశులు రామలక్ష్మణులనే వారు వచ్చి సుగ్రీవునితో సఖ్యం చేసేరట. వారు యమధర్మరాజునైనా సులభంగా

జయించగలవారట. అందుచేత వారి సహాయం చూచుకొని సుగ్రీవుడు ఇప్పుడు యుద్ధానికి పిలుస్తున్నాడు కాబట్టి మీరు వెళ్లడం మంచిదికాదు. అనగానే వాలి ప్రియురాలా! నీవు భయపడకు రామచంద్రుడు సమదర్శి అయినట్టయితే సుగ్రీవునికి మేలుచేసి నాకు అపకారం చేస్తాడా? చేస్తే చెయ్యనియ్యి. సనాధుడనౌతాను, అంటూ దురభిమానం గల ఇంద్రపుత్రుడు సుగ్రీవున్ని గడ్డి పోచలాగున చూచి వెళ్లి ఆతనితో యుద్ధానికి తయారు పడ్డాడు. వాలి సుగ్రీవులిద్దరూ ఘోరంగా పోరాడుతూ వాలి సుగ్రీవున్ని ఒక పెద్దగుద్దు గుద్దేడు. కేక పెట్టేడు, ఆ గుద్దు వజ్రాయుధంలాగున తగిలి సుగ్రీవుడు గిరగిరా తిరిగి గొప్ప దుఃఖంతో రాముని దగ్గరకు పరుగెత్తుకొని వచ్చేడు అలా వచ్చి కృపానిధీ! రామా ఉగ్రుడైన వాలి సామాన్యుడు కాడు. లయకాలుడని విన్నవించేనుకానా? అబ్బా నేను అతనిదెబ్బలకు సహించలేక నీ దగ్గరకు పరుగెత్తుకొని వచ్చేను, దేవా! దయఉంచి నన్ను కాపాడవా? అనగానే రాముడు సుగ్రీవా! మరేమీ భయపడకు మీ అన్న దమ్ములిద్దరూ ఒకే ఆకారంతో ఉండడంచేత నేను భ్రమపడి బాణం వెయ్య లేదు. అని అతని శరీరమంతా చేతితో నిమిరేడు. శ్రీరామచంద్రుని చెయ్యితగలగానే అతని బాధలన్నీ పోయి ఆనందంతో రామున్ని వినుతించేడు. పాషాణమైన పడి ఉన్నమునిపత్ని మీద అతని పాదరజం తగిలే సరికి క్లేశమంతా పోయి చక్కని స్త్రీ యై నిలబడ్డది. అటువంటివాసుదేవుని కరపద్మంతో సుగ్రీవున్నినిమిరి నప్పుడు అతని బాధలు తొలగి పోవడం ఆశ్చర్యమా? తానే భ్రమలకన్నింటికీ కారణం, అటువంటి పరమాత్ముడైన రాముడు భ్రమ పడడమేమిటి? భక్తుల హృదయం పరిశీలించడానికి హరిక్రీడ చూపిస్తుంటాడు. అప్పుడు రాముడు గురుతు తెలియడానికి సుగ్రీవునిమెడలో పూలదండవేసి గొప్పబలం కలిగేలాగునచేసి మళ్లా పంపించేడు. సుగ్రీవుడు మళ్లావెళ్లి వాలిని పిలిచేడు. వాలి మహాక్రోధంతో మళ్లా వచ్చేడు. ఇద్దరూ అనేక విధాలుగా యుద్ధం చేస్తున్నారు.

## వాలి వధ

చెట్లచాటునుండి గుణధాముడైన రాముడు చూస్తూ సుగ్రీవుడు ధైర్యంచెడి ఓడిపోయే సమయంలో ఒక్కబాణంవేసి వాలిని కొట్టేడు. ఆ దెబ్బకు వాలి భూమిమీద పడిపోయి రాముని చూచి వేగంగా లేచి కూర్చొని ఆ నీలమేఘశ్యాముని పాప బంధాలనుండి విడిపించేవాణ్ణీ ఆర్తజనులను రక్షించేవాణ్ణీ అతిపవిత్రమైనవాణ్ణీ అందమైన జటా కిరీటంగలవాణ్ణీ మాయానాటకమాడే ప్రభువునూ రాక్షసుల సంహరించే వాణ్ణీ కోదండధారినీ యోగి జనులనే పద్మాలకు సూర్యునివంటి వాణ్ణీ సాటిలేని ప్రభగలిగిన వాణ్ణీ సూర్యవంశం అనేకలువలకు చంద్రునివంటి వాణ్ణీ సకల కలుష నివారణమైన నామంగల వాణ్ణీ అన్ని భువనాలకూ ప్రభువైన శ్రీరామచంద్రుని కన్నులారా చూచి తనివితీరక మరీ మరీ చూచి ఇతడు లోక గురుడని మనస్సులో అనుకొని అతని పాదపద్మాలు హృదయంలో ధ్యానించుకొని లోపల భక్తి పైకి కఠినత్వం తోచే లాగున రామునితో అంటున్నాడు. వాలి స్వామీ! భూమిమీద ధర్మం నిలబెట్టడానికి పుట్టేవుగదా! నా యందేతప్పుచూచి ఈ విధంగా కిరాతుడు చేసేపని చేసేవు సుగ్రీవుడు నీకు మిత్రుడా? నేను శత్రువునా? ఇది ధర్మమేనా? అన్నాడు. అప్పుడు శ్రీరామచంద్రుడు వాలితో అంటున్నాడు. తమ్ముని భార్యా చెల్లెలూ పెండ్లికాని కన్యా కోడలూ ఈ నలుగురూ సమానులు వారిని ఎవడైతే కూడాలని కోరుతాడో ఆ దుర్మార్గుడు వధకు అర్హుడు నీవు అందులో ఒకడివి అవుటచేత నిన్ను బాణంతో కొట్టేనురా దుష్టా! మదాంధా! నీ ప్రియపత్ని ఎంతచెప్పినా వినకుండా స్వాభి మానంతో నాప్రాపుకోరియున్న నీ తమ్ముని విరోధంతో గెలవడానికి వచ్చేవు. అటువంటి రోషం దుర్గుణం అహంకారం అపారమైన స్వాభి మానం కలిగిన నిన్ను వధించడం తప్పుకాదు. అన్నాడు. అనేసరికి వాలి ఓహో! జానకీపతీ! నీ ముందర నా ఉచితం కాని ప్రావీణ్యత ఎంతమాత్రం సాగలేదు. నేనెంత పాపాత్ముడనైనా ప్రాణాలు విడిచే సమయాన్ని నాకు

నీవేదిక్కని నమ్మేను నాగతిపై కాపాడు పద్మలోచనా! అంటున్న వాలియొక్క మృదువైన మాటలు విని రాముడు తన కుడిచేతిని అతని శిరస్సుపైనిపెట్టి వానరనాథా! శరీరం నిలిచేలాగున చేను ప్రాణాలు నిలబెట్టుకో. అన్నాడు. అదివిని వాలి ప్రభూ! అనందరాశీ! నా విన్నపం విను. మహాత్ములైన మునులుకూడా జన్మ జన్మాలయందూ ప్రయత్నించి ఏనామాన్ని అవసాన దశలో పలుకలేక పోతుంటారో కాశీపట్టణంలో శివుడు ఎవనినామ బలంచేత అవినాశమైన మోక్షాన్ని జీవులకు ఇసుంటాడో అటువంటి మంగల ప్రభువైన నిన్ను కన్నులారా చూస్తూ నోరు తెఱచి నామం పలుకుతూ ప్రాణాలను విడిచిపెట్టే భాగ్యం నాకు ఇంకొకసమయంలో దొరుకుతు దా ? దేవా ! వేదాలు ఎల్లప్పుడూ ఏ విభున్ని ఇదికాదు ఇదికాదు అని నిర్ణయించి చెపుతుంటాయో యోగులు ఇంద్రియాలనూ మనస్సునూ వశపరచుకొని ధ్యానంతో ఏమూర్తిని చూడ గలుగుతారో ఆ ఆదిదైవమైన నిన్ను కన్నులారా చూచేను. నీరజాక్షా! ఇంతకన్నా భాగ్యమున్నదా? దేవా ! వీడెంత దేహాభిమానో చూద్దామని ఇంకా ఈ శరీరం నిలబెట్టుకో, అన్నావు స్వామీ ! ఎంత దుర్మార్గుడైనా కల్పవృక్షాన్ని నరికి పారేసి బూరుగుచెట్టుకి నీరుపోసి పెంచుతాడా ? రామా! మంగళకరనామా! కర్మవశం చేత నేను లోకంలో ఏ జాతిలో ఏరూపంతో పుట్టినా నీ పాదభక్తిమాత్రం తప్పక నాకు కలిగేలాగున కృపతో వరం ప్రసాదించు స్వామీ! ఇదుగోవీడు నాతోసమానమైన బల పరాక్రమాలు గలవాడు నా పుత్రుడు అంగదుడు వినయవంతుడు. శ్రీరామచంద్రా! వీనిని నీ దాసునిగా చేపట్టి కరుణతో పరిగ్రహించు. ఇదిగో సంతోషంతో శరీరం విడిచిపెట్టేస్తున్నాను అనిచెప్పి మదించిన ఏనుగు మెడలో పూలదండ జారిపోతున్నా తెలియనట్టు శ్రమలేకుండా శరీరం విడిచి పెట్టేసేడు. అవసాన దశలో వాలికి రామభక్తి యెక్కువ గుట చేత అతనికి శ్రీరామచంద్రుడు వైకుంఠధామనివాస పరమసుఖాన్ని ఇచ్చేడు. అప్పుడు కిష్కింధలోనున్న స్త్రీపురుషులందరూ అక్కడకు వచ్చి

దుఃఖించేరు. అందులో తార అధికమైన దుఃఖంతో హారాలన్నీ జారిపోగా తలవెంట్రుకలు విడిపోగా అనేక విధాలుగా వాలిని గురించి తలపోస్తూ ఏడ్చింది. అప్పుడు రాముడు ఆమెను చూచి మాయను తొలగజేసి జ్ఞానాన్ని కలుగజేసి ఓకాంతా! భూమి నీరూ అగ్ని వాయువు ఆకాశంతో పాంచ భౌతికమైన అధమ శరీరం భూమి మీద పడిపోయింది. కాని అందులోని జీవుడు నిత్యుడు. అతడు ఎల్లప్పుడూ ఉండేవాడే. ఇందులో నీవు దేని కోసం ఏడుస్తున్నావు? అనే సరికి జ్ఞానంకలిగి ఆమె రాముని పాదాలు పట్టుకొని స్వామీ! నాకు ఎల్లప్పుడూ ఎడతెగని భక్తినిమ్మని వేడుకుంది. పార్వతీ! కొయ్యబొమ్మలను ఆటలాడించినట్టు ఈజీవకోటినంతటినీ శ్రీరామచంద్రుడు చిత్రంగా ఆడిస్తుంటాడు అని శివుడు పార్వతితో చెపుతున్నాడు. అప్పుడు రాముని ఆజ్ఞ ప్రకారంగా సుగ్రీవుడు అన్నకు ఉత్తర క్రియలన్నీ విధి ప్రకారంగా చేసేడు ఆతరువాత రాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు.

## సుగ్రీవ పట్టాభిషేకం

తమ్ముడా! ఈ వానర రాజ్యానికి సుగ్రీవున్ని రాజును చెయ్యడానికి వెళ్లు పట్నంలోకి అన్నాడు. అనగానే లక్ష్మణుడు రాముని పాదపద్మాలకు నమస్కరించి వానరులతో కూడా సంతోషంతో వెళ్ళి పట్నంలో ఉన్న బ్రాహ్మణులనూ పెద్దలనూ స్త్రీలనూ పిలిపించి అందరి యెదుటా గీత వాద్యాలతో సుగ్రీవున్ని రాజుగానూ అంగదున్ని యువరాజు గానూ శుభంగా మహావైభవంగా పట్టాభిషేకాలు చేయించేడు.

పార్వతీ శ్రీరామచంద్రునితో పోలిన హితుడూ గురువూ తండ్రీ తల్లీ బంధువూ ఈశ్వరుడూ ప్రభువూలేడు. దేవతలూ మునులూ మనుష్యులు వాళ్ల మేలు కోసమే స్నేహంచేస్తారు. కాని రాముడు తనకు ఏ ప్రయోజనం లేక పోయినా ఆశ్రితులను కాపాడుతూ ఉంటాడు. యోగులకూ దేవతలకూ

బ్రహ్మకూ నాకూ కూడా అతడే ప్రాప్త కాని అతనికే ఆధారంలేదు. తనకు తానే ఆశ్రయం జ్ఞానానికి ఏ దైతే జ్ఞానంఇస్తుందో ఆజ్ఞానానికి అతడేజ్ఞానాన్ని ఇస్తున్నాడు ప్రకాశానికి ప్రకాశమిచ్చే ప్రకాశానికి అతడే ప్రకాశమిస్తున్నాడు. సుఖాలన్నింటికీ ఏసుఖమైతే సుఖాన్నిస్తుందో ఆసుఖానికి సుఖాన్నిచ్చే సుఖస్వరూపుడతడే సుమతీ! ఆసుఖరాశిని స్తుతించడానికి నాకూ శక్యం కాదు, వాలిభయంచేత రాత్రింబగళ్ళు దుఃఖిస్తూ శరీరంనిండా దెబ్బలు తగ్గి మనస్సు ఉడికిపోతూఉన్న సుగ్రీవునికి రాజ్యపట్టాభిషేకం చేసేడు. చూడు. రాముని కరుణ ఎటువంటిదో. భవానీ! ఎరిగి ఎరిగి ఇటువంటి స్వామిని ఎవరైతే విడిచిపెడతారో వారు ఆపద అనే అగాధమైన సముద్రంలోపడి చస్తూ పుడుతూ ఎప్పటికీ ఒడ్డుచేరలేరు. అప్పుడు సుగ్రీవున్ని రాముడు పిలిచి రాజనీతంతా బోధించేను సుగ్రీవుడు భక్తితో చేతులు జోడించి వింటున్నాడు.

## రామలక్ష్మణులు ప్రవర్షణ గిరిపైనుండుట

అప్పుడు శ్రీరామచంద్రుడుసుగ్రీవునితోఅంటున్నాడు. సూర్యపుత్రా! నేను పద్నాలుగేళ్ల వరకూ పట్టణంలోకి రాను. ఇప్పుడు వర్షకాలం వచ్చింది. ఈ వర్షాలు తగ్గేవరకూ ఈ పర్వతంమీదనే ఉంటాను అంగదుడూ నీవూ వానర రాజ్యం సుఖంగా ఏలుకొండి నా కార్యం మాత్రం మరచిపోకు. అన్నాడు. సుగ్రీవుడు సంతోషించి రామునికి నమస్కరించి పట్టణంలోకి వెళ్లిపోయేడు. అప్పుడు ప్రవర్షణగిరి శిఖరంమీదం రాముడు తమ్మునితో కూడా నివసించి ఉన్నాడు. అంతకు పూర్వమే దేవతలు జగదీశ్వరుడు కొండమీద కొన్నాళ్లు ఉంటాడని అందమైన కొండగుహా అమర్చి ఉంచేరు. శ్రీరామచంద్రుడు అక్కడ నివసించినప్పటినుండి చెట్లు చిగుళ్లూ పువ్వులూ పండ్లూ నిండుగా ఉండటంచేత ఎంతో అందంగా ఉన్నాయి. ఆ పువ్వులలోని తేనెకోసం తుమ్మెదలు జుమ్మజుమ్మమని రొదలుచేస్తూ సంచరిస్తున్నాయి, ఆ కొండమీద పండ్లూ దుంపలూ ఆకులూ ఎక్కువగా

ఉంటున్నాయి. సాటిలేని అందమైన ఆ కొండను చూచి రామలక్ష్మణులు సంతోషించేరు. దేవతలూ సిద్ధులూ మునులూ పక్షులూ మృగాలూ తుమ్మెదలూ రూపాలను ధరించి వారిని సేవిస్తున్నారు. శ్రీరామచంద్రుడు నివసించడంచేత ఆ పర్వతం ఎంతో శుభప్రదంగా ఉంది. పార్వతీ! అక్కడ ఒక శుభ్రమైనస్ఫటికశిలమీద రామలక్ష్మణులిద్దరూ కూర్చున్నారు. అప్పుడు భక్తిజ్ఞాన వైరాగ్యాలను గురించి అనేక పుణ్యకథలన్నీ లక్ష్మణునితో చెప్పి వర్షకాలాన్ని ఇలా వర్ణించి చెప్తున్నాడు

## వర్షఋతు వర్ణన

లక్ష్మణా! చూచేవా మేఘాలు ఆకాశంనిండా కమ్మి ఎలాగర్జిస్తున్నాయో అదుగో నెమళ్లుచూడు గొప్పవిరాగిభక్తున్ని చూచి పొంగిపోయి ఆడినట్టు ఎలానాట్యంచేస్తున్నాయో! అవిగోమేఘాలు ప్రియసఖిని బాసిన నామనస్సుకిభయంగొలిపేలాగున భయంకరంగా ఉరుముతున్నాయి దుష్టుని మనస్సులో ప్రీతి భక్తి నిలవనట్లు మెరుపుమెరిసి వెంటనే కనబడకుండా మాయమైపోతుంది. లక్ష్మణా! అదిగో చూడు. పండితుడు విద్యపొందిన కొలదీ వినయవంతుడైనట్టు మేఘాలు భూమిమీదకిదిగి వర్షధారలు కురుస్తున్నాయి దుష్టుడు ఆడే మాటలకు కోపంతెచ్చుకోకుండా సహించే సజ్జనుని విధంగా వర్షబిందువులు మీదపడి నప్పటికీ ఈ పర్వతం ఎలా సహిస్తుందో చూడు లక్ష్మణా! దుష్టులకు కొంచెం భాగ్యం కలిగిందనగానే గర్వించి అభిమానంతో తిరిగినట్లు చిన్న చిన్న నదులు పొంగి చెలరేగి పోతున్నాయి అనేక విధాలైన శరీరాలు ధరించి మాయదట్టంగా కప్పిన జీవునివికారాలు లాగున భూమిమీదపడి వర్షబిందువులు మలినంతో ఉన్నాయి సజ్జనునియందు సద్గుణాలన్నీ వచ్చినిండినట్టునాలుగువైపుల నుండీ నీరు కాలువలై వచ్చి సరస్సులన్నీ నిండిపోతున్నాయి. జీవుడు హరినిపొంది అచలుడైనట్టు ఈ పరివాహజలమంతా సముద్రంలో చేరి స్థాయిపొందడానికి వెళ్తుతుంది. లక్ష్మణా! చూడు పాషండవాదులకు

సద్గ్రంథ మార్గం కనిపించనట్టు భూమంతాగడ్డితో కప్పబడి దారి కనబడకుండాఉంది. వటులు వేదాలు చదివినట్టు నాలుగు దిక్కుల నుండీ కప్పల అరపులు మనస్సుకి ఆనందంగా వినబడుతున్నాయి. సాధన చేసేవాని మనస్సులో క్రమంగా బోధకలిగినట్టు చెట్లచివరలను నవనవలాడుతూ చిగుళ్ళు ప్రకాశిస్తున్నాయి. ధర్మరాజ్యంలో దుర్మార్గాలన్నీ అణగిపోయినట్లు జిల్లేడు మొదలైన చిన్న చిన్న చెట్లు ఆకులన్నీరాలిపోయి కనిపిస్తూన్నాయి. తమ్ముడా! చూడు క్రోధంధకార్మన్ని అణగగొట్టేసినట్టు ఎక్కడా ధూళిలేకుండా అణగిపోయింది. ఉపకార పరుని ధనం లాగున భూమినిండా సస్యాలు నిండిపోయేయి దంభంగల వానిదగ్గర చెలికాండ్రు అందరూచేరినట్టు రాత్రిదట్టమైన చీకటిలో లెక్కలేనన్ని మిణుగురుపురుగులు కనిపిస్తున్నాయి. లక్ష్మణా! స్వతంత్రంగా తిరిగిన స్త్రీభ్రష్టురాలైనపోయినట్లు అధికమైన వర్షంవల్ల పువ్వుల సుగంధం అందంకూడా చెడిపోయింది మోహంమదం అభిమానం విడిచిపెట్టిన పండితుల విధంగా రైతులు పైరులలోనికలుపు తీసిపారేస్తున్నారు. కలియుగంలో ధర్మాల లాగున ఎక్కడా చక్రవాకాలు మొదలైన పక్షులు కానరాలేదు. హరిపాదపద్మమకరందాన్ని తాగమైమరిచి పోయిన భక్తుని మనస్సులో కామం మొదలైన దుర్గుణాలు పుట్టనట్టు వర్షంకురుస్తున్నా ఊసరక్షేత్రాలలో గడ్డిపోచైనా పుట్టలేదు. మంచిరాజును ఆశ్రయించిన జనులు వృద్ధిపొందినట్టు భూమిమీద జంతువులు సంతోషంతో అభివృద్ధి పొందుతున్నాయి. వక్షాన్ని బోధకలిగేసరికి ఇంద్రియాలు చలనంలేకుండా ఉండిపోయినట్టు మార్గస్థులెక్కడకూ కదలకుండా ఉండిపోయేరు. కులంలో దుష్టుడొకడు పుట్టేసరికి కులధర్మాలన్నీ నశించిపోయినట్టు పెద్దగాలి విసిరేసరికి మేఘాలన్నీ విడిపోతున్నాయి. సంత్సంగం దుస్సంగంమధ్యను జ్ఞానం పుట్టడం నశించడం జరిగినట్టు పెద్దాంధకారం క్రమ్మివెంటనే నిర్మలంగా సూర్యబింబం కనబడుతుంది,

## శరదృతు వర్ణన

అదుగో లక్ష్మణా! చూడు వర్షాకాలం పోయి శరత్కాలం రాగానే కల్లు పూచి ఎలా కనిపిస్తుందో? వర్షాకాలానికి వార్ధక్యం వచ్చి తల వెంట్రుకలు పండిపోయేయన్నట్టుగా ఉంది అగస్త్య నక్షత్రం ప్రకాశమానంగా ఉదయించి తోపలలో నీరంతా ఇంకజేసింది సంతోషం కలిగితే లోభగుణం నశించిపోయినట్టు నదులూ, సరస్సులూ నిర్మలమైన నీటితో ఉన్నాయి. మదం మోహం తొలగి పోగానే సజ్జనుల హృదయాలు నిర్మలంగా ఉన్నట్టూ జ్ఞానికి అంతకంతకూ మమత వదలిపోయినట్టూ నదులూ, సరస్సులూ నిర్మలమైన నీరు ఇంకిపోయి కనబడుతున్నాయి. కాలానుసారం పుణ్యం కలిగినట్టు శరత్కాలంరాగానే కాటుక పిట్టలు విలాసంగా తిరుగుతున్నాయి, నీతిమంతుడైన రాజు పరిపాలన లాగున పంకమూ, రేణువులూ లేకుండా శుభ్రంగా భూమిఉంది. మూర్ఖజనులు ధనం చెల్లిపోగానే చింత పొందేలాగున నీరు ఇంకిపోతుండడం చూచి చేపలు అడిలిపోతున్నాయి లక్ష్మణా భగవద్భక్తుడు ఆశలన్నీ విడిచిపెట్టి ప్రకాశిస్తున్నట్టు ఆకాశం మేఘాలులేకుండా నిర్మలంగా ఉంది అక్కడక్కడ ఎవరికో భక్తి అలవడ్డట్టు శరత్కాలమైనా అక్కడక్కడ వర్షాలు కురుస్తున్నాయి గొప్పభక్తి కలిగిన నాలుగు ఆశ్రమాలవారు పట్టణాన్ని విడిచి బయలుదేరినట్టు సంతోషంతో రాజులూ తాపసీ వర్తకుడూ సన్యాసి పట్నాలను విడిచి బయలుదేరి వెళ్తున్నారు. రాజు దండయాత్రకీ తపశ్శాలి తపోవనానికీ వర్తకుడు వ్యాపారానికీ సన్యాసి దేశాటనకీ శరత్కాలం వచ్చినందువ ప్రయాణమై వెళ్తున్నారు. నన్ను ఆశ్రయించిన మానవులు బాధలను పొందనట్టు లోతైన నీటిలో చేపలు సుఖిస్తున్నాయి తామరపువ్వులు ఎక్కువగా పూసి సచ్చిదానంద నిర్గుణపరమాత్మ సగుణరూపం ధరించినట్టు సరస్సులు ఎంతో రమణీయంగా కనబడుతున్నాయి. చక్కనిఝుంకారాలుచేస్తున్నాయి తుమ్మెదలు పక్షులు అనం

దంతో మధురగానాలు చేస్తున్నాయి. దుష్టుడుఇతరుల గొప్పసంపద చూచి
ఓర్వలేకదుఃఖపడ్డట్టు చక్రవాకపక్షులు రాత్రులందు దుఃఖిస్తున్నాయి. శంకర
ద్రోహులకుఎక్కడాసుఖం కలుగనట్టు చాతకపక్షులు దాహంతీరకవానకోరి
మిక్కిలివ్యాకులంతో కూస్తున్నాయి. ధన్యుడైనసజ్జనుని దర్శనంవల్ల సకల
పాపాలూనశించిపోయినట్టు పగటివేళఎండవల్ల పొందినతాపాన్ని రాత్రులందు
శరచ్చంద్రికఉపశమింపజేస్తుంది. విష్ణుదర్శనంచేసి విడువలేకుండా ఉన్న
భక్తులలాగున చకోరపక్షులు చంద్రున్నితనివి తీరకుండా చూస్తున్నాయి,
బ్రాహ్మణులకుద్రోహంచేసిన దుష్టులకులమంతా ఆమహాపాపాన్ని అనుభ
వించి భూమిమీదకనపడకుండాపోయినట్టు దోమలూ ఈగలూ మంచువల్లఅణగి
పోయేయి. సద్గురువుదొరికేసరికి సంశయాలన్నీ పోయినట్టు జంతువులన్నీ
సమూహంగావుండి శరత్కాలంరాగానే నాలుగుదిక్కులకూచెదిరిపోయేయి.

## సుగ్రీవుడు తనకార్యం మరచిపోయేడని రాముడుకోపించుట

చూడులక్ష్మణా! వర్షాకాలంపోయి శరత్కాలం వచ్చింది. ఆచంద్ర
ముఖిసీతజాడ ఎక్కడా కనబడలేదు. ఎటుపోయిందో జాడ ఏమైనా కన
బడితే లయకాలుడినైనా నిమిషంలో చంపి నా ప్రియపత్నిని తెస్తాను.
లక్ష్మణా! ప్రాణాలతో సీత ఉన్నట్లైతే ప్రయత్నించి ఎక్కడున్నా తేగ
లను. ఆ సుగ్రీవుడు రాజ్య వైభవం గొప్పసంపదా భార్యనూ పొంది
మత్తెక్కిపోయి నన్ను మరచిపోయేడు. ఏ బాణంతో వాలిని కొట్టేనో
ఆబాణంతో రేపు ఆమూర్ఖున్ని కొట్టేస్తాను చూడు, అన్నాడు. సర్వాత్ము
డైన రాముడు. గౌరీ! మహాత్ముని కృపవలన గొప్పమోహం నశించి
పోతుందో ఆబోధానిధి కలలోనైనా క్రోధాన్ని పొందుతాడా, ఇటువంటి
విచిత్రమైన చరిత్ర హరిపాదభక్తులే తెలిసికోగలరు మూఢులు ఈసటించే
దేవుని లీలలకు మోహితులైపోయి వాళ్ల స్వల్పభావాలవల్ల జగద్రక్షుడైన
రామున్ని మానవునితో పోల్చి చెపుతుంటారు. సుగ్రీవునిమీద కోపంతో

ఉన్న తామున్ని చూచి లక్ష్మణుడు చాపం ఎక్కుపెట్టి బాణాలు పట్టుకొని తేచేడు. అదిచూచి రాముడు వత్సా ! సుగ్రీవుడు మనకు సఖుడు. అందు చేత కేవలం భయమే చూపించి ఇక్కడకు వేగంగా తీసుకొనిరా మరేమీ చెయ్యకు. వెళ్లమని చెప్పేడు.

హనుమంతుడు సుగ్రీవాజ్ఞగా వానరులకోసం దూతల పంపుతూ ఉసమయాన్నే సుగ్రీవుడు రాముని కార్యం మరచిపోయేడని హను మంతుడు చింతించి సూర్యపుత్రునికి నమస్కరించి గౌరవంతో బోధించేడు. స్వామీ ! మనం రామకార్యం నెరవేర్చకుండా ఉండడం ధర్మంకాదు. అని నాలుగువిధాలుగా చెప్పేడు, అదివిని సుగ్రీవుడు భయపడి అయ్యో! మదాన్ని పెంపొందించే ఈవిషయ- మాధుర్యం జ్ఞానాన్ని నశింపజేసింది. వాయుపుత్రా ! నీవు ఇప్పుడేవెళ్లి నా ఆజ్ఞగా వానరులందరకూ దూతలను పంపించు. పదిహేను దినాలలో ఎక్కెడెక్కడ ఉన్నారో ఆ కపులందరూ నాదగ్గరకు వచ్చేలాగున చెయ్యకపోతే నాఆజ్ఞ అతిక్రమించిన వారినందరినీ శిక్షించేస్తానని నాఆజ్ఞను ప్రకటించి చెప్పిపంపు. అనగానే హనుమంతుడు దూతలను పిలిచి ఆదరంతో సత్కరించి వారికి నీతి ప్రేమా భయమూ చెప్పిపంపించేడు. వారు అతని పాదాలకు నమస్కరించి వెళ్లేరు. అప్పుడు లక్ష్మణుడు క్రోధంతో ఆపట్నానికి వచ్చేడు.

లక్ష్మణుడు క్రోధంతో కిష్కింధకు వచ్చుట అతనిముఖం చూడ గానే గొప్పభయంతో కపులందరూ పారిపోయేరు - లక్ష్మణుడు ధనుస్సు ఎక్కుపెట్టి ఇదిగో ఈపట్టణం అంతాదగ్ధం చేసేస్తాను అన్నాడు.

ఆమాటవినగానే వానరులందరూ కిచకిచలాడుతూ భయంతో పరుగెత్తి చెట్లెక్కి పోతూ కొండలమీదకి పరుగెత్తుతూ గుహలలో దాగిపోతూ గొప్ప కోలాహలం చేసేరు. అది విని అంగదుడు ఏమిటీ కోలాహలం? అని అక్కడకువచ్చేడు. అప్పుడులక్ష్మణున్ని చూచి వెంటనే అతని పాదపద్మాల మీదపడి నమస్కరించేడు. లక్ష్మణుడు అతనికి అభయహస్తమిచ్చాడు.

అప్పుడు సుగ్రీవుడు లక్ష్మణుడు కోపంతో వచ్చేడనీవిని భయంతో తొట్రు పాటు పడిపోయి హనుమంతునితో మారుతీ! నీవూ తారా వెళ్లి లక్ష్మణునికి వినయంగా బోధించి ఇక్కడకు తీసుకొనిరండి అన్నాడు. వెంటనే హనుమంతుడు తారతోకూడా వెళ్లి లక్ష్మణుని పాదపద్మాలకు వినయంతోనమస్కరించి రామునికీర్తి కొనియాడుతూ అతన్ని తీసికొనివచ్చి పాదాలుకడిగి భక్తితో పాన్పుమీదకూర్చోబెట్టి తారా హనుమంతుడూ వినయంతో అతని సేవచేస్తున్నారు. ఆ సమయంలో సుగ్రీవుడు వేగంగావచ్చి లక్ష్మణుని పాదాలు పట్టుకున్నాడు లక్ష్మణుడు అతన్ని కౌగిటిలోకి చేర్చుకున్నాడు. అప్పుడు సుగ్రీవుడు నమ్రతతో అంటున్నాడు. దేవా! విషయసమానమైన మదాన్ని కలిగించేది మరొకటిలేదు ఈ విషయసుఖాలకు ఆసక్తిచెందితే మునిమనస్సులు కూడా క్షణంలో మోహంతో పడిపోతాయి అన్నాడు లక్ష్మణుడు అతని వినయమైన మాటలకు సంతోషించి అనేకమైన నీతులు అతనికి చెప్పేడు అప్పుడు హనుమంతుడు లక్ష్మణునితో ప్రభూ! రవితనయుని ఆజ్ఞ ప్రకారం అన్ని ప్రదేశాలలో నివసించే వానరులను రమ్మని పిలవడానికి దూతలను పంపించే వచ్చేస్తారు త్వరగానే అన్నాడు.

* సుగ్రీవుడు లక్ష్మణ హనుమదంగదాదిపరివారంతో రాముని దర్శించుట

అప్పుడు సుగ్రీవుడు అంగదున్ని హనుమంతున్ని తీసుకొని సమస్త పరివారంతో లక్ష్మణున్ని సేవిస్తూ రామునిదర్శనానికి వెళ్ళేడు అత్యంత వినయంతో శ్రీరామచంద్రుని పాదపద్మాలకు శిరస్సువంచి నమస్కరించి మాధవా! గొప్పదైనసీమాయకు మోహితుడనైపోయేను. నీ సత్కృపచేత నన్ను రక్షించకపోతే ఏవిధంగా దృఢమైన భక్తున్ని కాగలుగుతాను? దేవా! అపరాధం చేసేను. గొప్పదైన నీమాయను విడిపించుకొనేశక్తి నాకేదీ? నీకృపవల్లే మాయను దాటడానికి శక్తి కలుగుతుంది నేను అన్ని కార్యాలూ చేస్తాను. చెయ్యను అనడానికి నేను స్వతంత్రున్నికాను నీ కరుణవలన ఇప్పుడు కొంచెం నాకు బోధపడుతుంది. నేను అనేసరికి ఈ

శరీరంకాదని తెలిసికోలేక దేహాభిమానినై మోహంతో పడిపోయేను. శ్రీహరీ! ఇప్పుడు ముఖ్యంగా నిన్నే శరణని వేడుకుంటున్నాను. నాఅహంకారం మదం పోగొట్టి కాపాడు. మునులూ, దేవతలూ, మనుష్యులూ కూడా నీమాయకు మోహితులైపోతుంటే నావంటి తామసజీవుడైన వానరుడు భ్రాంతిని పొందకుండా ఉండగలడా ? అభిమానమనే రాత్రియందు మెలకువ గలిగి ఉన్నవానికే తరుణుల వాడిచూపులకు మనస్సు చలించకుండా ఉండడం సాధ్యమవుతుంది. లోభపాశాలచేత కంఠానికి ఉరిపడకుండా తప్పించుకో గలిగినవాడెవడో వాడే నీతో సమానుడూ భాగ్యశాలీని. అటువంటి మహత్వం సాధనవల్లగాని ఎవరికీలభించదు.రామచంద్రా! మహేశ్వరా! శాశ్వతా! అపారమైన నీదయవలననే అది లభిస్తుంది అన్నాడు. వానరేశ్వరుడు సుగ్రీవుడు అదివిని రాముడు సోదరా! నీవు నాకు భరతునితో సమానమైన ప్రియుడవు. అని చిరునవ్వుతో సుగ్రీవా! సీతజాడ ఎలాగైతే తెలుస్తుందో ఆ ఉపాయం ఆలోచించు అన్నాడు.

* నానా దిక్కులనుండీ వానరసైన్యం వచ్చుట *

ఇంతలో గొప్ప కపిసైన్యం నానాదిక్కులనుండీ నానావర్ణాలతో పెద్ద కేకలుపెడుతూ అక్కడకువచ్చింది. ఉమా! ఆ వానరసైన్యాన్ని నేనూ చూచేను. ఆ సేనని లెక్కబెట్టబోయేవాడు శుద్ధ మూర్ఖుడే. ఎవరికిసాధ్యం ? లెక్కపెట్టడానికి? పార్వతీ! విను. అప్పుడు ఆ వానరులందరూ శ్రీరామచంద్రునికి నమస్కరించి ప్రేమతో ఓహో! ఎంత భాగ్యవంతులమో ? ఎన్నడూ ఎరుగని దిక్కులు ప్రకాశించేలాంటి మనోహరుడైన ప్రభువును చూడగలిగేం. అని పొంగిపోయి సీతా నాథుని ముఖంవైపు ప్రేమతో చూస్తున్నారు. అందరిని రాముడు కుశలప్రశ్నచేసేడు. రామవిభుడు విశ్వరూపుడు. అనంతమైన ప్రపంచాన్ని పుట్టించి రక్షించి సంహరించే ప్రభువు. తనగర్భంలో ప్రపంచాన్నంతటినీ ధరించిన ఘనుడు. అతడు ఎల్లప్పుడూ అందరి కుశలమూ పరీక్షిస్తూనే ఉంటాడు. అప్పుడు కపులందరూ అనుజ్ఞ

పొంది విలబడిఉంటే సుగ్రీవుడు వాళ్ళతో అంటున్నాడు వానరులారా! మీకూనాకూ ఈరాజశేఖరుడే ఈశ్వరుడు ఇతనికార్యం నెరవేర్చడానికి మీరందరూ సహాయపడండి. ఇతనికార్య సీతామహాదేవి. జనకరాజపుత్రిక లోకమాత సాధ్వి, రాక్షసులచేత అపహరింపబడ్డది. సమస్త భూములూ, వనాలూ దిక్కులూ దేశాలూ తిరిగి ఆమె జాడ తెలుసుకొని నెలదినాలలో రండి. అలామీరు రాకపోతే కఠినంగా శిక్షింపబడతారు. అటువంటివారికి మరణదండన తప్పదు.

దక్షిణదిక్కు తప్పించి తక్కిన అన్నిదిక్కులూ శోధించి సీతా మహాదేవి జాడ తెలిసికొనిరండి. వేగంగావెళ్లండి, న్నాడు. వారంతరూ సుగ్రీవుని ఆనతి ప్రకారం వెంటనే ఆయా దిక్కులకు బయలుదేరి వెళ్లేరు. అప్పుడు సుగ్రీవుడు హనుమంతున్నీ నలున్నీ నీలున్నీ జాంబవంతున్నీ ఇంకా ధైర్యవంతులూ బలవంతులూ బుద్ధిమంతులూ అయినవాళ్లందరినీ కుమారుడైన అంగదున్నీ దక్షిణదిక్కుకి వెళ్లమని పంపిస్తూ అంటున్నాడు.

## హనుమంతుడు మొదలైనవారు సీతను వెదకుటకు వెళ్లుట

బుద్ధిమంతులైన వానరులారా! మీరందరూ దీక్షగా అన్నిచోట్లా వెదకి రాక్షసులుచేసే తంత్రాలన్నీ చాతుర్యంతో తెలుసుకొని ప్రభుదేవిని చూచిరండి. రాముని కార్యం అశ్రద్ధచేయకండి. నరకంతో సమానమైన సంసారదుఃఖాన్ని నివారించుకోవడానికి మాయను విడిచిపెట్టి పరమాత్మసేవ చెయ్యాలి. మనంభూమిమీద పుట్టినందుకు ఐహికార్యాలన్నీ విడిచిపెట్టి రాముని భక్తితో భజించడమేఫలితం. ఎల్లప్పుడూ రామచంద్రుని పాదపద్మాలను భక్తితో సేవిస్తున్నవాడే ఘనుడూ గుణవంతుడూ భాగ్యవంతుడూను. అని బోధించగానే వారు అతనిపాదాలకు నమస్కరించి ఆజ్ఞనుపొంది రామున్ని స్మరించుకుంటూ బయలుదేరేరు. అందరికంటే వెనుక భక్తితో నమస్కరించి వెళ్తున్నా వాయుపుత్రున్ని రాముడు దగ్గరకుపిలిచి ఇలాఅను

భక్తుడని తనచేతితో అతని శిరస్సుతాకి ఆదరంతో ముద్రిక అతనిచేతికిచ్చి కుమారా ! సీతతో నాగొప్పదైన వియోగదశఅంతా చెప్పి గొప్పపరాక్రమంతోవచ్చి రావణున్నిచంపి రాముడునిన్ను తీసికొనివస్తాడు విచారించకని బోధించి వేగంగారా అన్నాడు. హనుమంతుడు భక్తితో ప్రభుపాదాలకు నమస్కరించి తన జన్మ ఫలించిందనుకొని మనస్సులో రామున్ని ధ్యానించు కుంటూ వినయంతో అనుజ్ఞపొంది వెళ్లేడు. పార్వతీ ! శ్రీరామచంద్రుడు సర్వం ఎరిగినవాడై ఉన్నా దేవకార్యం నెరవేర్చడానికి మనుష్యుని విధంగా నటన చేసేడు. అప్పుడు వానరులందరూ రామకార్యంలో లీనమైపోయిన మనుస్సులతో శరీరాలు మరచిపోయి కొండలూ గుహలూ వనాలూ సరస్సులూ అన్నీ వెదికేస్తున్నారు. ఎక్కడ రాక్షసుడు ఎదురైనా ఒక్క దెబ్బతో వానిని చంపి అనేక విధాలైన పర్వతాలూ అడవులూ వెతుక్కుంటూ వెళ్లిపోతున్నారు. అప్పుడు వారందరికీ గొప్పదాహంవేసింది. ఎక్కడా నీరు దొరకలేదు. ఎక్కడైనా మునీశ్వరుడు కనిపిస్తే సంతోషంతో అతనికి ప్రదక్షిణ చేస్తున్నారు. ఆలాగున ఆ గొప్పగొప్ప, అడవులలో తిరుగుతూ దాహం అధికంగా బాధిస్తుండగా ఓపికతో ఎంతవెదకినా నీరు దొరకక అలసిపోయి ఉండడంచూచి హనుమంతుడు వీళ్లందరూ నీరుదొరకక దాహంతో చచ్చిపోతారని ఆలోచించి ఒక పెద్దకొండ శిఖరానికి ఎక్కి నాలుగు దిక్కులూ పరికించి చూచేడు. ఒకచోట అతనికి భూ వివరం కనబడ్డది. అందులోనుండి వింతగా హంసలూ కొంగలూ చక్రవాకపక్షులూ మొదలైన జలవిహంగా లన్నీ తడిసిన రెక్కలతో వస్తున్నాయి. మరికొన్ని జలపక్షులు అందులో ప్రవేశిస్తున్నాయి. అవన్నీచూచి హనుమంతుడు అక్కడ నీరు ఉంటుందని నిశ్చయించుకొని వేగంగా కొండదిగి వచ్చేడు.

* హనుమంతుడు మొదలైనవారు స్వయంప్రభను చూచుట *

అప్పుడు హనుమంతుడు వానరులందరినీ తీసుకొని ఆ భూవివరం చేరకు వెళ్లేడు. అందరూ ఆ గుహలో ప్రవేశించేరు. అందులోకి వెళ్ల

గానే అద్భుతమైన ఒక సరస్సు దానిలో తామరపువ్వులూ ఆ పువ్వుల మక రందంకోసం తిరిగే తుమ్మెదలూ ఆ సరోవరం దగ్గరగానే పెద్ద ఉద్యానవనం దానిదగ్గర చక్కని మందిరం చూచేరు వానరులు. ఆ మందిరంలో ఒక స్త్రీ ప్రకాశమానమైన తపః పుంజంలాగుసవాళ్లకు కనపడ్డది. అప్పుడా వానరులు దూరంనుండే ఆమెకు నమస్కరించేరు. ఆమె వారినిచూచి ఎవరుమీరు? ఎందుకిలావచ్చేరు? అన్నది. అప్పుడు కపులందరూ దాహంలో బడలివచ్చిన వృత్తాంతమంతా ఆమెతో చెప్పేరు. అదివిని ఆమె ఆ సరోవరంలో నీరు త్రాగి ఆ వనంలో పండ్లన్నీ తృప్తితీరాతినిరండి అన్నది. అప్పుడు వానరు లందరూ స్నానాలుచేసి నీరు త్రాగి పండ్లు తృప్తిగాతిని ఆ తాపసురాలి దగ్గ రకు వెళ్లేరు. అప్పుడా స్త్రీ వారితో తనవృత్తాంతమంతా చెప్పి నేను లక్ష్మీ నాథుడైన శ్రీరామచంద్రుణ్ని చూడడానికి వెళ్తున్నాను. కాబట్టి మీరు అందరూ కళ్లుమూసుకుంటే ఈ భూవివరం అవతలికి వెళ్లిపోగలుగుతారు. తప్పకుండా ఆ లోకమాత జగత్పావని సీతను చూడగలుగుతారు. అని చెప్పింది. అప్పుడు వానరులందరూ ఆమె చెప్పినట్లూ చేసి సముద్రతీరానికి వచ్చేరు, ఆ తపశ్శాలినిని ఎంతోమెచ్చుకున్నారు. అప్పుడు ఆమె రాముని దగ్గరకువెళ్ళి శ్రీరామచంద్రుని పాదపద్మాలకు నమస్కరించి ఆ నీలమేఘ వర్ణుని సంతోషంతో స్తుతించింది. ఆమెకు శ్రీరామచంద్రుడు అనపాయమైన భక్తిని ఇచ్చేడు, అప్పుడుబ్రహ్మ శివుడూ ఎవని పాదపద్మాలకు నమస్క రిస్తుంటారో ఆ పరమాత్ముడైన రామచంద్రుని ఆజ్ఞశిరస్సున ధరించి ఆతపస్విని బదరికావనానికి వెళ్లిపోయింది.

* అంగదాదులు గడువుదాటిపోయినా సీతకనబడలేదని విచారించుట *

అప్పుడాసముద్రపుటొడ్డున నలుడూ జాంబవంతుడూ అంగదుడూ నీలుడూ హనుమంతుడూ మొదలైనవారు విచారిస్తూ అయ్యో! ఎంతవేగంగా గడువు పూర్తి అయిపోయింది? ఎంతశ్రమపడి వెతికినా కార్యంనెరవేర లేదు. ఏవిధంగా సీతనుచూడ గలుగుతాము? అని వికలమైన మనస్సులతో

ఉన్నారు. అప్పుడు అంగదుడు కళ్లనిండా నీరునిండిపోతుండగా అంటున్నాడు అన్నలారా ! మనం సీతమ్మను చూడకుండా వెళ్లేమంటే చావుతప్పదు సుగ్రీవునిచేత. అయ్యో ! రామకార్యం నెరవేర్చక పోవటంవల్ల భంగం వచ్చింది. అయ్యో ! నాతండ్రిపోయిన తరువాత సుగ్రీవుడు నన్నుచంపే ఉండునుగాని రామునికరుణవల్ల ఇలా జీవించిఉన్నాను. సుగ్రీవునికి నాయందు కరుణలేదు. ఎలాగైనా చంపేస్తాడు నిశ్చయం. అనిమాటిమాటికీ అంటూ కళ్లనుండి నీరుప్రవహించి పోతుండగా ఉన్నఅంగదున్ని చూచికపులందరూ కన్నుల నుండి నీరుప్రవహిస్తుండగా ఒక్కక్షణం వరకూ ఎవ్వరూమాటాడ కుండా వ్యాకులంతో ఉండిపోయేరు. అప్పుడు వానరులందరూ ధైర్యంతో ఓయువరాజా ! సీతమ్మని చూడకుండా తిరిగివెళ్లిపోయే ఊహలు ఎవరికీ లేవు. ఈ సముద్రపు ఒడ్డునఉండి సీతమ్మనివెతికే ఉపాయం ఆలోచిద్దాం. అని అందరూ ఏర్పాటుచేసుకొని విచారిస్తూ కూర్చున్నారు. అప్పుడు జాంబవంతుడు చింతిస్తున్న అంగదునితో అంటున్నాడు.

వత్సా ! అంగదా ! శ్రీరామచంద్రుడు ఈభూమి మీదఉన్న మానవులలో ఒకడనుకుంటున్నావా? అతడు నిర్గుణుడు, పరతత్వము, అందరి హృదయాలలోనూ ఉండేవాడు. అజుడు, అనంతుడు, అజేయుడు అతని సేవకులమైన మనంగొప్ప భాగ్యవంతులం దేవతలనూ బ్రాహ్మణులనూ గోవులనూ భూమినీరక్షించడానికి పరమాత్ముడు తనమాయచేత స్వేచ్ఛగా శరీరంధరిస్తుంటాడు. అతనిభక్తులు మోక్షసుఖాన్ని కూడావిడిచిపెట్టి ప్రీతితో అతన్ని ఉపాసిస్తుంటారు.

* సంపాతి వానరులనుచూచి తనకాహారం దొరికిందను కొనుట *

అనిఈవిధంగా జాంబవంతుడు అనేకమైన కథలుచెపుతుంటే అక్కడ కొండగుహలోనుండి సంపాతివిని వేగంగాపైకివచ్చి ఆకోతులనుచూచి ఆహా

ఈశ్వరుడు నాకిప్పుడు కడుపునిండే ఆహారం ఇచ్చేడు. చాలా దినాలనుండి ఆహారంలేక గొప్ప ఆకలితో ఉన్నాను. వీళ్లందరినీ తీసుకొని తింటాను. అని సంపాతి అనుకుంటుంటే ఆ మాటలు విని కపులందరూ భయంతో అనుకుంటున్నారు. నిజంగా మనకిప్పుడు మృత్యువు సమీపించింది. ఇక మనకు గత్యంతరమేమీ లేదు. అని వానరులందరూ దుఃఖిస్తూ అక్కడకు పెద్ద కొండలాగున వచ్చిన సంపాతిని చూచి లేచి నిలబడ్డారు. జాంబవంతుడు విచారిస్తూ చూస్తున్నాడు. అంగదుడు దుఃఖిస్తూ ఆహా ! ఆ జటాయువు రామకార్యం కోసం శరీరం విడిచిపెట్టి వైకుంఠ పదాన్ని పొందేడు. అతనితో సమానులైన ధన్యులెవరున్నారు? అన్నాడు. ఆ మాటలువిని సంపాతి దగ్గరకు వచ్చేడు. అతన్నిచూచి కపులందరూ భయపడిపోయి నిశ్చేష్టులైపోయి చూస్తున్నారు ఆత్రంతో. అప్పుడు సంపాతి వారికి అభయమిచ్చి జటాయువు సంగతంతా వారినడిగి సవిస్తరంగా తెలిసికొని తనకు తమ్ముడుగదా! అని విచారించి అతడు చేసిన కార్యాలూ రాముని మహిమా చాలా వర్ణించి వానరులారా ! వినండి. ఆ జటాయువు నాకు తమ్ముడు. అతనికి నేను తిలోదకాలు ఇవ్వాలి. నన్ను సముద్రం దగ్గరకు తీసుకొని వెళ్లండి. మీరు విచారించకండి. సీతమ్మను వెతికేమార్గం నేను చెపుతాను. అనేసరికి అతన్ని తీసుకొని వానరులు సముద్ర తీరానికి వెళ్లేరు. సముద్ర తీరాన్ని సంపాతి జటాయువుకి ఉత్తర క్రియలన్నీ చేసేడు.

### * సంపాతి తన వృత్తాంతం వానరులకు చెప్పుట *

అప్పుడు సంపాతి వానరులతో ఓ కపురాలా ! ఆ జటాయువూ నేనూ బాల్యంలో పందెం వేసుకొని ఆకాశవీధిని సూర్య మండలం దాకా ఎగిరేం. సూర్యుని వేడిమికి అతడు నిలవలేక తిరిగి దిగిపోయేడు. నేను మదాతిశయంచేతా దురభిమానంచేతా సూర్యునికి దగ్గరగా వెళ్లేసరికి నా రెక్కలు భగ్గున మండిపోయేయి. అప్పుడు నేను అధికమైన సంతాపంతో నేలను పడిపోయేను. నా దుస్థితి చంద్రముడనే ముని దయతో చూచి నాకు

జ్ఞానోపదేశంచేసి శరీరంమీద అభిమానం లేకుండా బోధించి త్రేతాయుగంలో శ్రీమన్నారాయణుడు రాముడై పుడతాడు. ఆతని భార్యను రాక్షసుడు ఎత్తుకొనిపోతే ఆమెను వెతకడానికి ఆ ప్రభువు దూతలను పంపుతాడు. వారి దర్శనంవల్ల నీకు మళ్లా రెక్కలు వస్తాయి. విచారించకుమని బోధించేడు. ఆ మహాత్ముని మాటలు సత్యమైనవి. కాబట్టి నేను చెప్పే విధంగా మీరు రామకార్యం చెయ్యండి. వానరులారా ! సముద్ర మధ్యాన్ని త్రికూట పర్వతం మీద లంక ఉంది. దానిని మహా బలవంతుడైన రావణుడు నిశ్శంకగా పరిపాలిస్తున్నాడు. అక్కడ అశోకవనంలో సీతాదేవి కృశించిపోయి చింతతో ధైర్యం లేకుండా ఉంది. అదిగో నాకు కనిపిస్తుంది. అపారమైన దూరదృష్టి మా వంశానికి ఉండడంచేత ఆయమ్మ అదిగో నాకు కనబడుతుంది. మీకు కనబడలేదు. నేను చాలా ముసలివాన్ని అంచేత మీకు సహాయం చెయ్యలేకపోతున్నాను. మీలో బుద్ధిమంతుడైనవాడు ఈ సముద్రాన్ని దాటగలుగుతాడు. అతడే ఈ రామకార్యం చెయ్యగలుగుతాడు. అతడీ నూరు యోజనాల దూరంగల సముద్రాన్ని అతి సులభంగా దాటేస్తాడు. మీరు ధైర్యం వహించండి. రాముని కృపచేత నా శరీరం ఇప్పుడు ఎలా మారిందో చూడండి. ఎన్ని పాపాలు చేసినవాడైనా అతని నామాన్ని స్మరించేడంటే భవసాగరాన్ని దాటిపోతాడు. అటువంటి రాముని దూతలై మీరు ధైర్యంమాని అధైర్య పడతారెందుకు? రామున్ని మనస్సులో ధారణ చేసుకొని మంచి ఉపాయం ఆలోచిస్తే మీకు శుభం కలుగుతుంది. అని చెప్పి సంపాతి రెక్కలు రావడంచేత తన నివాసానికి ఎగిరి వెళ్లిపోయేడు. పార్వతీ ! అప్పుడా కపులందరూ గొప్ప ఆశ్చర్యం పొందేరు.

### * కపి వీరులు తమతమ శక్తుల్ని తెలియజేయుట *

అప్పుడు అందరూ వేరు వేరుగా వారి వారి బలాలను గూర్చి క్రమంగా చెప్పుకున్నారు. అయినా దాటగలమో లేమో సముద్రాన్నని అందరకూ సందేహం కలిగించింది. అప్పుడు జాంబవంతుడు నేను చాలా

ముసలి వాడినై పోయేను. బలంచాలదు. భగవంతుడు వామనావతారం ధరించి నప్పుడే నేను మంచి వయస్సుతో బలంగా ఉన్నాను. బలి చక్రవర్తిని బంధించి వామనుడు విశ్వరూపంతో బ్రహ్మాండమంతా నిండిపోయేడు. అతన్ని వెయ్యి నోళ్లున్నా పొగడలేం. ఆ సమయంలో బ్రహ్మాండమయు డైన ఆ మహాత్మున్ని రెండు గడియలలో ఏడు సార్లు ప్రదక్షిణచేసి వచ్చేను. ఇప్పుడు ఆ బలసత్వాలు నాకు ఉంటే సముద్రం దాటి నిముషంలో. సీతమ్మను చూచిరానా ? అన్నాడు. అపుడు అంగదుడుఇలా అంటున్నాడు. నేను ఈ సముద్రం దాటగలను గాని తిరిగి రాలేనేమో! అని అనుమానంగా ఉంది. అనేసరికి జాంబవంతుడంటున్నాడు. అంగదుడా ! నీవు వెళ్లడానికి తగినవాడవేగాని మేమందరమూఉండి యువరాజువైన నిన్నెలాపంపుతాము? అది న్యాయంకాదు. అనిచెప్పి హనుమంతునితో అంటున్నాడు. సఖా ! వాయుపుత్రా ! నీబలం అపారమైంది. అనఘా ! తండ్రితో సమానమైన బలసత్వాలు నీకు ఉన్నాయి. నీవు జ్ఞానవంతుడవు. ప్రజ్ఞావంతుడవు. నీతి మంతుడవు. బుద్ధిమంతుడవు. గొప్ప వివేకవంతుడవు. అజ్ఞాని విధంగా మాటాడకుండా ఊరుకుంటావేమి ? పావనీ ! నీవుచెయ్యలేని కార్యంలేదు. నీవు రామపాదసేవకుడవై భూమిమీద పుట్టేవు.

* హనుమంతుడు సముద్రందాట ఉద్యమించుట *

అని తననుగూర్చి జాంబవంతుడన్న మాటలువిని హనుమంతుడు రామపాదసేవయందు నీకుప్రీతి రామకార్యం నెరవేర్చడానికే నీవుపుట్టేవు. అన్నమాటలకు శరీరం పొంగిపోతుండగా మనస్సులో శ్రీరామున్ని ధ్యానిస్తున్నాడు. అతనిశరీరం బంగారుపర్వతం లాగున ప్రకాశిస్తుండగా సంతోషంతో తనఆత్మను తనలోదర్శించి దిక్కులుచెక్కలయ్యే లాగున గొప్పసింహనాదంచేసి అంటున్నాడు, సఖులారా! ఇదిగో కొంచెమైనాశ్రమ లేకుండా ఈసముద్రాన్ని లోకమంతా బొననేలాగునదాటేస్తాను. పరివారంతో కూడా రావణునిసుదం అణగగొట్టేస్తాను. త్రికూటపర్వతల పెకలించి తెచ్చే

స్తాను. మిత్రుడా! జాంబవంతా! మంచిమాటలు నాకుఉపదేశించు. అన్నాడు ఆవాయుపుత్రుని మాటలుకుమెచ్చుకొని జాంబవంతుడు అంటున్నాడు, వత్సా! నీవువెళ్లిజానకిని చూచిరా. అప్పుడు రాముడు భుజబలంతో వానరులను సహాయంచేసుకొనివెళ్లి రావణుడు మొదలైన దుష్టరాక్షసులను సంహరించి ఆలోకమాతను సీతను తీసికొని వస్తాడు, అతనికీర్తి దేవతలూనారదుడూ మొదలైనమునులూస్తుతిస్తారు. అటువంటి రామునినిర్మలమైన కీర్తినివింటూ చదువుతూమనస్సుకి బోధించుకొని మానవులు ఎప్పటికీ తిరిగిరాని పరమ పదాన్ని పొందుతారు, ఎల్లప్పుడూ రామపాదపద్మములందు తుమ్మెదయైవాలి ఉండి అతనికీర్తిని పాడుకొంటూ రామచంద్రున్నే ధ్యానించుకొంటూ పరవ శాన్నిపొంది తులసీదాసు అనేభక్తాగ్రేసరుడు తన్మయుడై ఉంటాడు. సంసారరోగాలకు ఔషధమైన సీతానాధునికీర్తి స్త్రీలుగాని పురుషులుగాని భక్తితోవిన్నారంటే వారికి కోరినకోరిక లిస్తాడు. నీలమేఘ శ్యాముడు కోటిమన్మధ సుందరుడు పాపాలనే పక్షులకు కిరాతుని వంటిదైన దివ్యనామ మంత్రంగలవాడు. అతనిపవిత్ర నామాన్ని తనివితీరక జపిస్తూ అతని చరిత్రను వింటుండడమే నాకుశాశ్వత సుఖాన్ని ఇస్తుంది.

పద్మపత్రనేత్రా! బ్రహ్మరుద్రాదులచే నుతింపబడేచరిత్ర గలవాడా, రమానాధా! రాక్షసవైరీ! సజ్జనులనే వనానికి వసంతఋతువు వంటివాడా! ఘోరమైన సంసారమనేలతలకు కొడవలివంటివాడా! రాఘవా! సనకసనంద నాదులచే వినుతింపబడే నామం గలవాడా మారీచుడూ ఖరుడూ మొదలైన పర్వతాలకు ఇంద్రుని వంటివాడా! సూర్యవంశం అనేసముద్రానికి చంద్రుని వంటివాడా! మునులహృదయాలలో నివసించేవాడా పాపసమూహాన్ని నశింపజేసేవాడా! వేదాలచే వినుతింపబడే శీలంగలవాడా ఎల్లప్పుడూ ఇంద్ర జాలకునివలె మాయచేత లోకాలనుకల్పించేవాడా! సగుణనిర్గుణ రూపా! తరుగులేని జ్ఞానజ్యోతి అయినవాడా! పాపపాశబంధాలను విడగొట్టువాడా! అనుభవజ్ఞాన సంపన్నుల హృదయములను ఆకాశమందు ప్రకాశించువాడా! శేషశాయీ! గరుడవాహనా! శ్రీరామచంద్రా!

## నాలుగో సోపానం

గద్య:- ఇది శ్రీసీతారామచంద్ర వరప్రసాదంవల్ల భూసురులూ కౌశ్యపసగోత్రోద్భవులూ ఐన సన్యాసేశ్వర శర్మగారి తనయ రుక్మిణీనామ ధేయచేతరచింపబడ్డ వ్యావహారిక రచన తులసీరామాయణమందు కిష్కింధా కాండమనే నాలుగోసోపానం

ఓం తత్సత్

శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మార్పణ మస్తు

ఓమ్

శ్రీ వ్యావహారిక ఆంధ్ర తులసీరామాయణం

ఐదో సోపానం

# సుందరకాండ

శ్రీరామచంద్రా ! శుభకరమైన చిరునవ్వుతో కూడిన ముఖం కలవాడా! సజ్జన సమూహాన్ని రక్షించేవాడా! సమస్త ప్రపంచాన్నీ పోషించేవాడా! మేఘంవంటి కాంతిగల శరీర లావణ్యం గలవాడా! లోకాలను భరించేవాడా లక్ష్మీనాథా! అప్రమేయా! అనఘా! అవ్యయా! రామా! వేదాంత వేద్యా! కపటవేషం ధరించిన హరీ! నీకు నమస్కరిస్తున్నాను. ఓ అఖిలాంతరాత్మా! నా మనస్సులో ఇంక వేరైన చింతలేదు. ఎల్లప్పుడూ నీ పాద భక్తి నిలిచి ఉండేలాగున ప్రసాదించు. కామం క్రోధం మొదలైన దుర్గుణాలు నా మనస్సులో లేకుండాచేసి ఎల్లప్పుడూ నిన్ను సేవించుకొనే భాగ్యం నాకు కలుగజెయ్యి. గొప్ప బల పరాక్రమాలు గలవాడూ బంగారు పర్వతంలాంటి శరీరం గలవాడూ సద్గుణుడూ పండితులలో గొప్పవాడూ జితేంద్రియుడూ రాక్షస వనానికి అగ్నివంటివాడూ మహా ధైర్యవంతుడూ రామ కార్యమందు అధీనమైన హృదయం గలవాడూ దూతగా వెళ్లేవాడూ అయిన వాయు నందనునకు నమస్కరిస్తున్నాను.

### * హనుమంతుడు సముద్రం దాటుట

అప్పుడు జాంబవంతుని మనోహరమైన మాటలువిని హనుమంతుడు మనస్సులో సంతోషించి వానరులందరినీ చూచి అంటున్నాడు. అన్నలారా! పండ్లూ దుంపలూ ఆహారంగా తింటూ కష్టాలన్నీ సహించి నేను సీతాదేవిని చూచి వచ్చేవరకూ నేను వెళ్లిన తోవచూస్తూ మీరందరూ ఇక్కడ ఉండండి. తప్పకుండా కార్యసిద్ధి అవుతుంది. మనస్సులో సంతోష సముద్రం అపారంగా పొంగిపోతుంది. నిశ్చయంగా సీతను చూడగలుగుతాను నమ్మండి. అని చెప్పి అందరకూ నమస్కరించి ఆంజనేయుడు మనస్సులో

శ్రీరామచంద్రుడున్ని ధ్యానించుకొని బయలుదేరి ఆ సముద్రపు ఒడ్డున పర్వతం మీదకువెళ్లి నిలబడి పరమాత్మ్మడైన రాముని స్మరించి గొప్ప సింహనాదం చేసి రివ్వున రామబాణం లాగున ఆకాశానికి ఎగిరి పరు గెత్తేడు. బలవంతుడైన హనుమంతుడు పాదాలతో నొక్కడంవల్ల ఆ పర్వతం క్రుంగిపోయి రసాతలందాటి ఇంకా అధోలోకానికి పోయింది.

* హనుమంతుని విశ్రాంతికై సముద్రుడు మైనాకున్ని పంపుట *

అప్పుడు సముద్రుడు హనుమంతుని కుమారుడైన మైనాకున్ని పిలిచి హనుమంతుడు విశ్రమించడానికి ఆధారంగా వెళ్లమని పంపించేడు. ఆంజనేయుడు ఆ కొండమీద ఒక చెయ్యిమోపి అతనితో అంటున్నాడు. సఖా! నేను రామ కార్యదీక్షతో వెళ్తున్నాను. కాబట్టి ఇప్పుడెక్కడా విశ్ర మించకూడదు. అని మైనాకునికి నమస్కరించి హనుమంతుడు ఆకాశ మార్గంగా వెళ్లిపోయేడు. అలా వెళ్లిపోతూఉన్న ఆంజనేయుని బలమూ బుద్ధి విశేషమూ పరిశీలించడానికి దేవతలు అతని దగ్గరకు సురస అనేదాన్ని పంపేరు. ఆ సర్పాల తల్లి వాయుపుత్రున్ని చూచి ఈవేళ నాకు దేవతలు ఆహారంగా ఈ వానరుల్ని ఇచ్చేరు. బలే బాగుంది. అదిగో పారిపోతున్న అతన్ని మింగి నా ఆకలి తీర్చుకుంటాను. అని అంటున్న సురస మాటలు విని హనుమంతుడు తల్లీ! ఇప్పుడు రామ కార్యంమీద వెళ్తున్నాను. అతని భార్య సమాచారమంతా అతనితో విన్నవించి అప్పుడు వచ్చి నీ ఆకలి తీరే లాగున నీ గర్భంలో చొరబడతాను. కాబట్టి జననీ! నా మాట సత్యం నన్ను పంపు. ఇప్పుడు ఆలస్యం చెయ్యకూడదు అన్నాడు. సురస అతన్ని పోనీయకుండా యోజనం విశాలంగా నోరు చాపింది. హనుమంతుడు రెండు యోజనాలు శరీరం పెంచేడు. అప్పుడు సురస పదహారు యోజనాలు నోరు చాపింది. హనుమంతుడు ముప్పై రెండు యోజనాలు శరీరం పెంచేడు. ఈ విధంగా సురస ఎంత విశాలంగా నోరు చాపితే అంతకు రెండంతలుగా ఆంజనేయుడు తన శరీరం పెంచుతున్నాడు. ఆఖరుకి సురస

నూరు యోజనాలు నోరు చాపగానే మారితి చిన్నవాడైపోయి ఆ సురస నోటిలో దూరిపోయి తిరిగి పైకి వచ్చి సురసకు నమస్కరించి అమ్మా! నాకు సెలవియ్యి. అన్నాడు. అప్పుడు సురస పావనీ! దేవతలు నీ బుద్ధి బలం పరీక్షించమని నన్ను పంపితే వచ్చేను. నిన్ను పరిశీలించేను. మెచ్చుకున్నాను, నీవు ఎంతకైనా చాలగలవు, గొప్ప శక్తి బలం. బుద్ధి ధైర్యం గల వీరుడవు, నీవు రామకార్యం నెరవేర్చగలవు అని ఆశీర్వదించి సురస వెళ్లిపోయింది, ఆ తరువాతహనుమంతుడు సంతోషముతో వాయు వేగంగా వెళ్లిపోతూంటే నీడనుబట్టి మింగేసే సింహిక అనే రాక్షసి హను మంతున్ని మింగేసింది.

*హనుమంతుడు సింహికను సంహారించుట *

ఆప్పుడు హనుమంతుడు దాని కడుపు చించుకొని సూర్యుడు చీకటి లోనుండి పైకి వెడలివచ్చినట్టు. బయటికి వచ్చి సముద్రందాటి అక్కడ చక్కని వనం చూచేడు. ఆవనంలో చెట్లన్నీ పువ్వులతోనూ పండ్లతోనూ తుమ్మెదల తోనూ చిలుకలూ కోవెలలూ మొదలైన పక్షులతోనూ ఎంతో రమణీయంగా ఉన్నాయి. అనేక విధాలైన మృగాలుకూడా ఆవనంలో సంచ రింస్తున్నాయి. అటువంటి వనంతో కూడిన విశాలమైన ఒక పర్వతం చూచి మారుతి నిర్భయంగా ఆ పర్వతమెక్కి ఎదుటనున్న లంకాపట్నం చూస్తు న్నాడు.

* ఆంజనేయుడు పర్వతంమీదనుండి లంకాపట్నంచూచుట *

పార్వతీ! ఆంజనేయుడు ఇటువంటి అద్భుతకార్యం చెయ్యడం తన గొప్పతనంచేతకాదు, కాలున్నైనామింగే అనంతశక్తిసంపన్నుడైన రాముని ప్రతాపంవల్ల లోకంలో ఎట్టివారైనా ఎంతదుర్ఘట కార్యమైనా అవలీలగా చెయ్యగలుగుతారుసుమా అని పరమేశ్వరుడన్నాడు, ఆవిధంగా హను మంతుడు ఆగొప్పపర్వత శిఖరంఎక్కి రావణాసురుని పట్టణమంతాచూచాడు.

ఆకోట ఆకాశానికి అంటేబంగారు గోపురాలతో ఎంతోవర్ణనాతీతంగాఉంది. చుట్టూసముద్రంచేత చుట్టబడిఉంది. ప్రకాశమానమైన రత్నాలతోనూ బంగారంతోనూ కోటగోడలు నిర్మింపబడిఉన్నాయి. చక్కనిలక్ష్మీకరమైన మేడలుగల బజారువీధులూ గొప్పగొప్ప జండాలూ రధాలూ ఏనుగులూ గుఱ్ఱాలూ వీరభటులయొక్క ఆర్భాటాలూ రాక్షస వీరుల అట్టహాసాలూ అనేకరూపాలతోఉన్న దానవులూ ఇంకా ఆపట్నంలో ఉన్న నూతులూ సరోవరాలూ సెలయేళ్లూ గొప్పఉద్యానవనాలూ చూచేడు. కన్నుల పండువుగా కనిపిస్తున్నాయి. పెద్దచెట్లను అల్లుకొన్నతీగెలూ పొదరిండ్లూ విటవిటీజనులు విహారయోగ్యంగా ఉన్నాయి. దేవకాంతలూ నాగకాంతలూ గంధర్వకాంతలూ నరకాంతలూ మునుల మనస్సులనుకూడా మోహింపజేసే సౌందర్యవతులు ఆపట్నంలో ఉన్నారు. ఒకచోట కొండలంతేసి శరీరాలు గల భయంకరాకారులు మల్లులు అట్టహాసాలు చేస్తూవీరరసంతో గర్జిస్తూ యుద్ధంలో తర్జనలతో ఒకరితోఒకరు చకాచకిగా మండలాకారంగా తిరుగుతూ పోరాడుతున్నారు. ఆపట్నానికి నాలుగుదిక్కులా సింహపరాక్రమవంతులూ వికృతాకారాలు గల రాక్షసయోధులూ కావలికాస్తున్నారు. వారి చర్యలన్నీ హనుమంతుడు కొండమీద నుండిచూస్తున్నాడు. ఒకచోటగేదెలనూ ఎద్దులనూ ఆవులనూ గాడిదలనూ మేకలనూ ఒంటెలనూ గుఱ్ఱాలనూ మనుష్యులనూ ఏనుగులనూచంపి ఆమాంసాలు తింటున్న దుష్టరాక్షస సమూహాలని చూచేడు. మహాఘోరమైన పనులుచేస్తున్న వాళ్ల దుష్టత్వంఅంతాచెప్ప లేక కొంచెమే చెప్పేడు. తులసీమహాత్ముడు. అటువంటి నీచరాక్షసులు కూడా రామబాణాలనే పుణ్యతీర్థంలో శరీరాలు విడిచిపెట్టి నిర్మలమైన సుగతిని పొందగలుగుతారు. ఇకరామపాద సేవకుల మాటవేరే చెప్పాలా ?

## * హనుమంతుడు లంకిణిని నిర్జించుట *

అప్పుడు ఆపురరక్షకులను చూచిహనుమంతుడు తనమనస్సులో ఇలా నిశ్చయించుకున్నాడు. నేనీరూపంతో పురంలో ప్రవేశించడం తగదు.

సూక్ష్మమైన శరీరధరించి అతినిపుణంగా అర్ధరాత్రి సమయంలో పట్నంలో ప్రవేశిస్తాను. అనుకొని దోమంతశరీరం ధరించి రామున్ని స్మరించుకొని నమస్కరించి సగంరాత్రి గడచేవరకూఉండి లంకలోకి వెళ్లబోయే సరికి లంకిణి అనేరాక్షసస్త్రీ హనుమంతున్నిచూచి ఒరే! ఎవడవురోయ్ ? నన్ను నిరాకరించి పట్నంలో ప్రవేశిస్తున్నావు. నామహిమ ఎరగవుగాబోలు ! ఇలాంటిదొంగలు నాకెంతమంది ఆహారమైనారో ? అనేసరికి వాయు తన యుడు ఒక్కముష్టిపోటు పొడిచేడు, దానితో ఆరాక్షసిరక్తం కక్కుకొంటూ మూర్ఛిల్లి తల్లడపడి ఆబాధసహించలేక గిఱ్ఱునతిరిగి సొమ్మసిల్లి భూమి మీదపడిపోయింది. అలాపడిపోయి భూమిమీద కొంతసేపు పొర్లి మరికొంత సేపటికి తెప్పిరిల్లిలేచి భయపడుతూ హనుమంతునికి చేతులుజోడించి నమస్కరించి అంటుంది. అనఘా! పూర్వంబ్రహ్మ రావణునికి వరాలిచ్చే టప్పుడు నీపట్నంలో లంకిణి అనేరాక్షసస్త్రీ కోతిచేతఎప్పుడు నొప్పింపబడు తుందో అప్పుడు రాక్షసనాశం కలుగుతుంది. అనిచెప్పేడు. ఓహో ! వాన రోత్తమా! రామదూతవైన నిన్నుచూడగలిగిన భాగ్యంనాకు కలిగింది, ఎంత ధన్యురాలనో ? ఓపుణ్యాత్ముడా ; స్వర్గసుఖం మోక్షసుఖం త్రాసులో ఒక వైపునఉంచి సజ్జన సాంగత్యంవల్ల కలిగినసుఖంలో కొంచెం మరొకవైపునా ఉంచి తూచగా సత్సంగసుఖమే బరువౌతుంది ఆసుఖాలన్నిటికంటే. ఆహా! నేనెంతపుణ్యాత్మురాలనో గదా ! నీదర్శనం లభించింది. ఓరామభక్తా గ్రగణ్యా! నీవురామున్ని తలంచుకొని అతినిపుణతతో కార్యంనెరవేర్చుకో. రామభక్తుడవు, నీకుసాధ్యంకానిదేదీ లేదు. అనిచెప్పి హనుమంతున్ని పంపించింది లంకిణి, రామకరుణగలవారికి విషంఅమృతంగా మారిపోతుంది. శత్రువు మిత్రుడౌతాడు, సముద్రం గోవుపాదపు గుంటలా అవుతుంది. అగ్నిచల్లగా ఉంటుంది, మేరువు పర్వతం ఒకరేణువులాగున ఉంటుంది.

*హనుమంతుడు లంకలో ప్రవేశించి సీతనువెదకుట*

అప్పుడు హనుమంతుడు రామున్ని మనస్సులో తలంచుకొని చాలా చిన్న శరీరం ధరించి లంకాపట్నంలో ప్రవేశించేడు. రాక్షసుల యిళ్లన్నీ

శోధించి చూచేడు. తరువాత రావణాసురుని బంగారుమేడ చూచి అందులోకి వెళ్లేడు. అక్కడ రావణుడు హంసతూలికా తల్పంమీద హాయిగా నిద్ర పోతున్నాడు. ఆభవనం ఎన్నో చిత్రాలతో చాలా అందంగా ఉంది. ఆదంతా వెతికేడు. సీత జాడ కనబడలేదు. అప్పుడు ఆంజనేయుడు మరొక భవనం లోకి వెళ్లేడు.

### * హనుమంతుడు విభీషణునితో సంభాషించుట *

ఆ భవనంలో శ్రీరామచంద్రుని ఆయుధాలు చిత్రింపబడి కనబడు తున్నాయి. తులసీవనం ఒకటి ఆనందకరంగా ఉంది. అదిచూచి హనుమం తుడు చాలా సంతోషించి తనమనస్సులో అనుకుంటున్నాడు. ఆహా! ఏమిది? ఈలంక దుష్టరాక్షసులదిగదా ఇచ్చట సజ్జనమందిరం ఉంటుందా? అని తనలోతాను తర్కించుకుంటూ ఆ భవనంలో ప్రవేశించేడు. అంతలోనే విభీ షణుడు మేలుకొన్నాడు. ఉమా! అప్పుడు నిర్మల గుణాలుగల విభీషణుడు రామా! రామా! అని ప్రభువును స్మరిస్తుంటే ఇతడు మహాభక్తుడులా ఉన్నా డని హనుమంతుడు మనస్సులో సంతోషించి ఇతని సమాచారమంతా రహ స్యంగా తెలుసుకుంటాను. సాధు సజ్జనులవల్ల కార్య భంగం ఎప్పుడూకాదు. అనుకొని బ్రాహ్మణరూపం ధరించి ఏదో అంటుంటే విభీషణుడు అతనివైపు చూచి నమస్కరించి బ్రాహ్మణోత్తమా! నీ వృత్తాంత మేమియోనాకు తెలియజేయుమని ప్రార్థిస్తున్నాను. నిన్ను చూడగానే నాకెంతో సంతోషం కలిగింది. దేవా! నీవు శ్రీహరిభక్తులలో ఒకడవా? లేక నన్ను కరుణతో ధన్యుని చెయ్యడానికి వచ్చిన ఆర్తత్రాణ పారీణ బిరుదు వహించిన శ్రీరామచంద్రుడనే దేవుడవా? చెప్పు. అన్నాడు. అనేసరికి హనుమంతుడు అద్భుతమైన శ్రీరామచంద్రుని చరిత్రంతా చెప్పి తన పేరుకూడా చెప్పేడు. ఇద్దరూ రామభక్తులే అవుటచేత అన్యోన్య ప్రేమతో రాముని సద్గుణాలన్నీ మనస్సులో ధ్యానించుకొని సంతోషించేరు. అప్పుడు విభీషణుడు వాయు పుత్రునితో అంటున్నాడు. ఓ హనుమంతా! నా జీవనస్థితి చెబుతాను విను.

దంతాల మధ్యను మెత్తనినాలుక వాటివల్ల బాధకలుగకుండా ఎంత మెలకువగా తప్పించుకొంటుందో అవిధంగానే నేను దిక్కులేక ఈ క్రూర రాక్షసులమధ్యను ఉండి రామున్ని ధ్యానించుకుంటూ ఉంటున్నాను. ఎప్పుడు నన్ను కాపాడుతాడో? ఆ పరమకృపాసిధి. నన్ను కరుణతో రక్షిస్తాడా? నేను తామస శరీరం ధరించినవాన్ని. ఏసాధనలూ చేసిననాడను కాను. భక్తి ఎక్కువగాఉందా ? అంటే అదీ చాలదు. నన్నెలా రక్షిస్తాడో? రాముడు, ఓహో: ఆంజనేయా! నాకిప్పుడు కొంచెం ధైర్యం కలిగింది. ఏమంటే హరి కృపలేందే సజ్జన దర్శనం లభించదు. అందుచేత నిన్ను చూడగానే నామనస్సు నిండయింది, మారుతీ! నామీద ప్రభువు అనుగ్రహించడం చేతనే గదా పవిత్రమైన నీపాదదర్శనం నాకు కలిగింది, నామనస్సు నిర్మలమైంది. జన్మ ధన్యమైంది. ఈవిధంగా భక్తులసంగమం నాకు ఎల్లప్పుడూ కలిగే లాగున చెయ్యమని శ్రీహరికి నమస్కరిస్తున్నాను. అనగానే హనుమంతుడు విభీషణా! విచారించకు. విభుని స్వభావం అనుపమానమైంది, తన భక్తులను తల్లి శిశివును కాపాడినట్లు చూస్తుంటాడు. చూడు. నేనేం గొప్ప కులంలో పుట్టేనా? నీచమైన వానరజన్మ ఎత్తేను. చంచలమైన మనస్సుగల వాడిని. అన్నివిధాలా హీనున్ని, తెల్లవారేసరికి ఎవరైనా నాపేరు పలికితే వారికి ఆనాడు అన్నమైనా దొరకదు, అటువంటి అధమున్ని. అయినా నన్ను ప్రభువు గౌరవించి కృపతో చూచేడు అని రాముని గుణాలన్నీ స్మరించి శరీరం పులకరించగా ఆనంద బాష్పాలతో ఆంజనేయుడు గొప్ప సుఖాన్ని పొందేడు, ఉమా! అటువంటి శ్రీరామచంద్రుని మహాత్మ్యం తెలుసుకొని కూడా మదంచేత ఆదైవాన్ని మరచిపోయి తిరిగేవాళ్లకి ఘోరమైన దుఃఖాలు కలుగకుండా ఉంటాయా? పార్వతీ! ఈ విధంగా హనుమంతుడు శ్రీరామచంద్రుని గుణాలన్నీ వర్ణించి సాటిలేని మహాసుఖాన్ని అనుభవించేడు, విభీషణుడుకూడా విని అపరిమితానందంపొంది హనుమంతునితో సీత వృత్తాంతమంతా చెప్పేడు. అదివిని హనుమంతుడు అన్నా! విభీషణా! రాముని కాంతయైన సీతామతల్లిని చూచి వస్తాను. అంటే దానికి తగిన ఉపాయాలన్నీ విభీషణుడు చెప్పేడు.

*ఆంజనేయుడు అశోకవనంలో సీతనుచూచుట*

అప్పుడు పవమాన తనయుడు విభీషణున్ని సెలవడిగి మునుపటి లాగుననే సూక్ష్మమైన శరీరంధరించి సీతాదేవిఉన్న అశోకవనంలోకి వెళ్లేడు. అక్కడ అశోకవృక్షం కిందసీతాదేవి కృశించిపోయిన శరీరంతో తలవెంట్రుకలన్నీ ఒకేజడలాగున అల్లుకొని అంటుకుపోయి ఉండగా శిరస్సువంచుకొని తననాధుని సద్గుణాలన్నీ తలంచుకుంటూ శరీరం నిండా మట్టితో మహావ్యాకులంతో చింతిస్తుంది. ఆవిధంగా ఉన్నసీతామహా దేవిని హనుమంతుడు చూచేడు. చూచిమనస్సులోనే ఆతల్లికి నమస్కరించేడు. ఆలోకమాత రాత్రినాలుగు జాములూ కూర్చొనిరాముని గుణాలుస్మరించు కుంటూ దీనంగా దుఃఖంతో కాలంగడుపు తుంది. ఆమెచూపుతన పాదాల వైపూ మనస్సురాముని పాదాలయందూ నిలిపిఉన్నది. అట్టిస్థితిలో ఉన్న జననిని చూచి ఆంజనేయుడు గొప్పదుఃఖాన్ని పొందేడు. అప్పుడు బాగా చిగురించి ఉన్నఆచెట్టెక్కి ఆకులచాటున దాగియుండి మహాపరాక్రమశాలి యైన ఆవాయునందనుడు ఇప్పుడు ఏమిచేయడమా ? అనిఆలోచిస్తున్నాడు. ఆసమయానికే రావణుడు రాక్షసస్త్రీలను వెంటబెట్టుకొని మదాంధుడై అక్కడకు వచ్చేడు.

*రావణుడు సీతతో దుర్భాషలాడి భయపెట్టుట*

వచ్చిసీతాదేవిని చూచి అనేక విధాలుగా భోధించి సామదాన భేద దండోపాయాలతో భయపెట్టి ఓచపలాక్షీ! నాచతురత్వమంతాచూడు. నా ఐశ్వర్యంచూడు నాబలంచూడు. నీవు ఏదికోరినా తక్షణం నెరవేరుస్తాను. చారుముఖీ ! రామున్ని గురించిఎందుకలా విచారిస్తావు ? నామాటలు ఆదరంతోవిను. మండోదరీ మొదలైన సుందరవతులు ఎందరోనా కాంత లున్నారు, వారందరినీ ఆనందంతో నీకుదాసీలుగా చేస్తాను, పద్మముఖీ! నేనుప్రతిజ్ఞచేసి చెప్పేను. ఏదీ నావైపు ఒకమారుచూడు. అన్నాడు. అప్పుడు వైదేహి శ్రీరామచంద్రున్ని మనస్సులో తలంచుకొని గడ్డిపోచచేతితో

పట్టుకొనిదానితో చెపుతున్నట్టుగా రావణుడు వినేలాగున అంటుంది. ఓరీ శఠా! మిణుగురు పురుగుకాంతికి తామరపువ్వు వికసిస్తుందా ? నిశాచరా ! దుష్టా ! శ్రీరామచంద్రుని బాణాగ్నిచవి చూడక ఇలాజల్పాలాడుతున్నావు. దుర్మార్గా! రామలక్ష్మణులు లేనిసమయంలో కుక్కవిధంగా నన్నుదొంగిలించుకొని వచ్చేవు. ఛీ! దుష్టుడా! నీకుసిగ్గులేదు. ఓరిమదాంధా ! అగ్గిపురుగులాంటి నీవు ప్రకాశమానమైన సూర్యునివంటి శ్రీరామచంద్రునితో సమానవవుతావటరా ? నీచరాక్షసా! దురాత్మా ! అన్నది, అపరుషమైన మాటలువిని రావణుడు పదిముఖాలూ ఎఱ్ఱబడగా మహాక్రోధంతోవరలోనుండి కత్తితీసి ఓకాంతా! కన్నుగానకుండా నన్నునిరాకరించి అనరానిమాటలాడుతున్నావు. కాబట్టి ఇదిగో ఈ నాణాడియైన ఖడ్గంతో నీశిరస్సు ఖండించేస్తాను. తెలిసిందా ? విను. వామాక్షీ! నామాటమన్నించితివా సరే లేక నోటికివచ్చినట్టూ వదరేవంటే నాకత్తివేటుతో నీకుచావుసిద్ధం అనగానే సీత ఓరీ దశకంధరా ! ఖలుడా! దుష్కృతీ ! వినరానాప్రతిజ్ఞ మదించిన ఏనుగు తొండాలలాగునా సుందరమైన నీలితామరపువ్వుల దండలులాగున ప్రకాశించే రాక్షసాంతకుడైన శ్రీరామచంద్రుని బాహువులు నాకంఠాన్ని అలంకరించాలి. లేదా నీవాడియైన ఖడ్గమైనా అలంకరించాలి, ఇదే నాప్రతిజ్ఞ. రామవియోగ దుఃఖంతో ఉన్ననాకు నీకత్తి శీతలంగానే కనబడుతుంది. నిస్సంశయంగా నాశిరస్సుఖండించి ఈతాపమంతా శమింపజెయ్యరా మూఢా ! అన్నది. అది విని రావణుడుకత్తితో పొడిచేస్తాను సీతపైపువెళ్లే సరికి మండోదరి అడ్డం వచ్చి అనేకవిధాలుగా మంచిమాటలు చెప్పింది. అప్పుడురావణుడు రాక్షసస్త్రీలతో అంటున్నాడు. ఓకాంతలారా ! వినండి. ఇదిగో ఈమెకు నాపైని అనురాగంకలిగేలాగున రాత్రుంబగళ్లూ బోధించండి. నెలరోజులు చూచి వినకపోయినట్టయితే అప్పుడు ఈమెను చంపేస్తాను. అనిచెప్పిరావణుడు వెళ్లిపోయేడు, అప్పుడా రాక్షసస్త్రీలు జానకిని అనేకవిధాల వికృతాకారాలతో భయపెడుతున్నారు.

*త్రిజట స్వప్న వృత్తాంతం*

అందులో త్రిజట అనేరాక్షసస్త్రీ రామపాదభక్తి కలది, కాబట్టి ఆమె తన స్వప్నాన్ని రాక్షసస్త్రీ లందరికూ వినిపించి బోధచేసింది, చెలులారా! నేనుకలగన్నాను వినండి. సీతనుద్వేషించక సేవించండి, వానరులు లంకలో ప్రవేశించి రాక్షసులనందరినీ యుద్ధంలో చంపేసినట్లూ రావణాసురుడు చేతులూ తలలూ నరకబడినగ్నంగా గాడిదమీద కూర్చొని కుయ్యోమొర్రో అంటూ దక్షిణదిక్కుగా వెళ్లిపోతున్నట్లూ విభీషణుడు లంకారాజ్యం ఏలుతున్నట్లూ లంకాపట్టణంలో అందరూ రామునికిజై రామునికిజై అని కోలాహలంగా అంటున్నట్లూ శ్రీరామచంద్రుడు ఆదరంతో సీతనుపిలిపించి నట్లూ కలగన్నాను. సకియలారా! నాస్వప్నం అబద్ధంకాదు. తప్పకుండా నాలుగు రోజులలో జరుగుతుంది. అని త్రిజట చెప్పగానేవిని ఆరాక్షసస్త్రీ లందరూ భయపడిపోయి వెంటనే సీతాదేవి పాదాలమీద పడిపోయియేరు, అప్పుడు వారందరూ త్రిజట బోధలన్నీ విని కొంతసేపటికి సీతాదేవికి దూరంగా వెళ్లిపోయేరు,

*సీత రామవిరహాగ్నికి సహించలేక దుఃఖించుట*

అలా అందరూ దూరంగా వెళ్లిపోనిచ్చి జానకి తన మనస్సులో అనుకుంటుంది, ఈ కఠినరాక్షసుడు నెలరోజులలో నన్ను చంపుతానన్నాడు అంతవరకూ రామ విరహంతో భరించలేను, అని విచారిస్తూ త్రిజటను చూచి ఆమె తన కోమలమైన చేతులు జోడించి ఓజననీ: నీవు మృదువైన మనస్సుగలదానవగుటచేత నాతోకూడా దుఃఖాన్ని పంచుకున్నావు. తల్లీ, నేన్నీ భరించరాని వియోగంతో బ్రతుకలేను. కాబట్టి ఏవిధంగానైనా ఈ శరీరం విడిచిపెట్టే ఉపాయం ఆలోచించు. అమ్మా! వేగంగా కొన్నికట్టెలను తెచ్చి చితిపేర్చి అగ్నిహోత్రం అంటించు నామేలుకోరి తల్లీ! నాకోసం శ్రమపడు. కర్ణశూలాలలాంటి మాటలు విని సహించలేను అన్నది.

*త్రిజట జానకిని ఓదార్చుట*

అదివిని త్రిజట సీతాదేవి పాదపద్మాలు చేతితో పట్టుకొని అమ్మా! పరాత్పరుని రాణీ! నీవు విచారించడానికి పనిలేదమ్మా! సకల చరాచరాలకూ ప్రభువూ శక్తులన్నింటికీ శక్తి నిచ్చేవాడూ అయిన రఘురామచంద్రుడు రాక్షసులను సంహారించి వేగంగా నిన్ను తీసుకొనివెళ్ళిపోతాడు. విచారించకు. తల్లీ. అర్ధరాత్రి సమయమవుటచేత ఇప్పుడెక్కడా అగ్ని ఉండదు. అని త్రిజట సీతాదేవిని ఓదార్చి ఇంటికి వెళ్ళిపోయింది. అప్పుడు సీతాదేవి తనలో ఇలా అనుకుంటుంది. అయ్యో! విధి ప్రతికూలమైనపుడు అగ్నిమాత్రం ఎలా దొరుకుతుంది.? ఈకష్టం గట్టెక్కడం ఎలాగు! అయ్యో! అదిగో ఆకాశంమీద ఎన్నో నిప్పులు కనబడుతున్నాయి. కాని ఒక్క నక్షత్రమైనా భూమిమీద పడదు. ఆహా! చంద్రుడు ఎంతో వేడిగా అగ్నిలా కనబడు తున్నాడు. అయినా అగ్ని కొంచెమైనా కురియకుంటుంది, భాగ్యహీనురాలికి కోరిన వస్తువు లభిస్తుందా? ఓ అశోకవృక్షమా! నీకిదే నమస్కరిస్తున్నాను నా శోకాగ్ని పోగొట్టి నీపేరు సార్థకం చేసుకో. నీ చిగుళ్ళు ఎఱ్ఱని అగ్నిలా కనబడుతున్నాయి. ఓ వృక్షమా! ఆ అగ్నికొంచెం ఇచ్చి కృపతో శరీర విముక్తిని చెయ్యి. అని రామ విరహంతో దుఃఖిస్తున్న జానకిని చూచి వాయుపుత్రుడు క్షణమొక కల్పంలాగున గడపి హృదయంలో అధికమైన విచారంతో ఆ అశోకవృక్షంమీదనుండి రాముడిచ్చిన ముద్రిక జారవిడిచేడు.

*హనుమంతుడు సీతయెదుట నిలచుట*

అది చూచి జానకి ఓహో! అశోకవృక్షం అగ్ని ఇచ్చింది. అని తన మృదువైన చేతితో దానిని తీసింది. అద్భుతపడిపోయింది. ఆ ముద్రిక పైని తననాథుని నామాక్షరాలు ఉండడంచూచి ఆశ్చర్యపడి ఆనంద విషా దాలు రెండూ ఒక్కసారిగా బయలుదేరగానే సీత ఈవిధంగా తన మన స్సులో ఆలోచిస్తుంది. ఆహా! ఏమి యీ అద్భుతం. శ్రీరామచంద్రుడు అజేయుడు. అతన్ని జయించేవారెవరూలేరు. ఆవిభుని ముద్రికను రాక్షసు

లెవరూ మాయచేత కల్పించలేరు. ఇదంతా సత్యమా? లేక మాయా? అయ్యో! తెలుసుకోలేక పోతున్నాను. ఆశ్చర్యంగా ఉంది, అని యీవిధంగా సీతాదేవి చింతిస్తుంటే చెట్టుపైనుండి హనుమంతుడు రాముని గుణాలన్నీ వర్ణిస్తున్నాడు. ఆ వర్ణన సీతాదేవికి అమృత సమానంగా వినబడి దుఃఖ మంతా విడిచిపెట్టి సావధానంగా వింటుంది. అప్పుడు వాయుపుత్రుడు సీత మనస్సుకి ఇంపుగా ఆమె నాథుని చరిత్ర అంతాగట్టిగా చెప్పేడు. అదివిని సీత అన్నా! నీవెవరో నాకు తెలియదు. నాకు ఎంతో సంతోషకరమైన మాటలు చెవులకు చల్లగా వినిపిస్తున్నావు. సోదరా! నీవెవరో నా యెదుట కనబడవా? అన్నది, అనగానే మారుతి వినయంగా నమస్కరిస్తూ ఆమె ఎదుట నిలబడ్డాడు. జానకి ఆశ్చర్యంతో కూర్చొబడిపోయింది. అప్పుడు హనుమంతుడు అంటున్నాడు. అమ్మా! జానకీ! నేను కరుణానిధియైన రాముని దూతను. నామాట సత్యం. నీకు ఆనవాలుకోసం ఈముద్రిక తీసి కొని వచ్చేను, అనగానే సీతాదేవి అయితే సోదరా! మీరు వానరులుగదా! మీకు వారికీ స్నేహం ఎలాకలిగింది? అంతా సవిస్తరంగా చెప్పవా? అన్నది. అప్పుడు ఆంజనేయుడు జరిగిన సమాచారం అంతా తెలియ చెప్పేడు. సీతాదేవి అంతావిని మనస్సులో సమ్మకం కలిగి త్రికణ శుద్ధిగా ఇతడు రాముని బంటని నిశ్చయించుకొని పరమానందంతో శరీరం పులకరింపగా ఆనంద బాష్పాలతో ఆంజనేయునిచూచి అంటుంది. అన్నా! భరించలేని విరహ సముద్రంలో మునిగి పోతున్న నాకు నీవు ఓడవైనావు. గుణాకరా! కృపా సముద్రుడూ ఖర విరోధీ అయిన శ్రీరామచంద్రుడూ పరది లక్ష్మణుడూ క్షేమంగా ఉన్నారా? నా నాథుడు అతికోమలమైన మనస్సుగలవాడు, గొప్ప కృపగలవాడు. ఈసమయంలో నాయందింత కఠినతపూనడానికి కారణమేమి? కపీంద్రా! సహజంగా సేవకులకు సుఖాన్నిచ్చే ప్రభువు. అన్నా! అతడు ఒకవేళ యందైనా నన్ను తలంచుకుంటాడా? ఉన్నసంగతి అంతావేగంగా చెప్పు. తండ్రీ! ఆసౌందర్య మనోహరశ్యామల కోమల మూర్తిని నా కన్నులు చల్లబడేలాగున మళ్లా చూడగలుగుతానా? ఆ మంచి సమయం

నాకెప్పుడు కలుగుతుంది ? అని ఇంకమాటాడలేక కంటనీరునింపుతూ హా! మనోహరా ! మునివందితా ! ధైర్యవిహారా ! సత్కృపాసముద్రా ! రామచంద్రా ! రఘువల్లభా ! నన్ను పూర్తిగా మరచిపోయేవా ! నీపాద దాసిని. ఎల్లప్పుడూ నీపాదధ్యానంతో ఉన్నదానను. అనివిరహంతో వ్యాకుల పడుతున్న సీతనుచూచి హనుమంతుడు వినయంగా అంటున్నాడు.

## * హనుమంతుడు సీతకు రామసందేశము చెప్పుట *

జననీ ! శ్రీరామచంద్రుడు తమ్మునితోకూడా క్షేమంగాఉన్నాడు, కానికేవలం నిన్నుగురించే దుఃఖిస్తుంటాడు తల్లీ ! నీవుమాత్రం జీవితాన్ని విడిచిపెడతా నని తలంచకమ్మా ! నీయందు శ్రీరామచంద్రునికి రెండింతలు ఎక్కువ ప్రేమఉన్నది, జననీ ! రామునిసందేశం చెవుతున్నానువిను. అని గద్గద స్వరంతో కన్నులనిండా నీరునిండిపోగా హనుమంతుడు అంటున్నాడు. తల్లీ నీకాంతుడు నీతోఇలా చెప్పమన్నాడు. ఓసఖీ! నిన్నువిడిచి దుఃఖిస్తున్నాను. నాకంతావిపరీతంగా కనపడుతుంది; మృదువైన చిగుళ్లు అగ్నిలా కనిపిస్తు న్నాయి. రాత్రులు కాలరాత్రులాగున్నాయి, చంద్రుడు వేడిగా సూర్యుని విధంగా కనిపిస్తున్నాడు, పద్మవనం వాడియైన బల్లేలలాగున కనిపిస్తుంది. మేఘాలువర్షం కురుస్తుంటే మరిగిన నూనెకురుస్తున్నట్టు ఉంది. ముదితా ! ఇంతకుముందు నాకేవైతే సౌఖ్యప్రదంగా ఉండేవో అవేఇప్పుడు బాధాకరంగా ఉన్నాయి, గాలివిసిరితే మదించిన సర్పశ్వాసలాగున ఉంటుంది. కాంతా ! మనస్సులో ఉన్నదుఃఖం ఎవరితోనైనా చెప్పుకుంటే కొంతతగ్గినట్టుంటుంది. ఎవరితోచెప్పుకుంటాను ? నలినాక్షీ ! నాలోనేనే సహించు కుంటున్నాను ? చెలీ! నాదుఃఖంఎవరెరుగుదురు? మనప్రేమతత్వంనాకొక్కనికేతెలిసియుండ టంచేత నామనస్సులోనేనిలిచిఉంది. ప్రేయసీ నామనస్సెల్లప్పుడూ నీదగ్గరనే ఉంటుంది. నాప్రేమరసంనీకే తెలుసును, అని చెప్పిన రామసందేశం అంతా విని జానకిప్రేమరసంలో మునిగిపోయి శరీరంమరచిపోయింది. ఆమెను చూచి వాయుపుత్రుడు ఓ తల్లీ! రాముని దేవీ! లోకపావనీ ! అమ్మా !

నీమనస్సులో ధైర్యం నిలబెట్టు. నామాటవిని అధైర్యాన్ని విడిచిపెట్టు. జననీ! నీనాథుని బాణాగ్నిలో ఈరాక్షస సమూహమంతా మిడతలై పడిపోక తప్పదు. ఈనీచరాక్షస సమూహమంతా రామబాణాగ్నిలోపడి చచ్చిందనే తలంచి నీవుస్థిరమైన ధైర్యంతోఉండు. కానిభయపడకమ్మా! నీవృత్తాంతం అంతావిన్నాడంటే రాముడు ఆలస్యంచెయ్యడు ఏమాత్రమూను. భూపుత్రీ! ఇన్నెందుకు? రామప్రభువు యొక్కతీవ్రమైన బాణాగ్ని అనే సూర్యోదయం అయిందంటే రాక్షససమూహం అనే అంధకారం నశించిపోకుండా ఉండగలదా? జననీ! జగత్పావనీ! నిన్ను ఇప్పుడే రామచంద్రుని సన్నిధానానికి తీసుకొని పోగలను. కాని రాముని ఆజ్ఞపొందలేదు. తల్లీ! శ్రీరామపాదసాక్షిగా చెపుతున్నాను. ఇకకొంచెంరోజులు ధైర్యం నిలబెట్టుకో, అప్పుడువానరసైన్యంతో కూడా నీనాథుడువచ్చి ఈశ్వరుడు త్రిపురాసురులనువలె ఈరాక్షసులనందరినీ సంహరించి నిన్ను తప్పకుండా తీసికొనివెళ్లిపోతాడు. అమ్మా! అతనికీర్తి మూడు లోకాలలోనూ నేర్పరులైనవారూ నారదుడూ స్తుతిస్తారు.

* ఆంజనేయుడు సీతకు తనమహారూపము చూపుట *

అని హనుమంతుడు చెప్పగానే సీత పుత్రా! వానరులందరూ నీలాగే ఉంటారా? ఈరాక్షసులు మహాబలవంతులుగదా వాళ్లతో మీరెలా యుద్ధం చెయ్యగలరని నాకు సందేహంతోస్తుంది. అనేసరికి హనుమంతుడు సీతాదేవి చూచేలాగున తన శరీరం పెద్దదిగా పెంచేసేడు. మేరుపర్వతం లాగున శరీరంపెంచి భయంకర మహావీరుడై కనిపించేడు. అదిచూచి జానకిఅప్పుడు నమ్మి కుమారా! చాలును. ఇప్పుడునాసంశయం తీరిపోయింది. మునుపటి వలె నీసూక్ష్మరూపం మళ్లాధరించెయ్యి. అన్నది. మారుతి మునుపటిలాగునే సూక్ష్మరూపంధరించి జననీ! శ్రీరామచంద్రుని కృపఉంటే చిన్నపామైనా గరుత్మంతున్ని మింగగలుగుతుంది. మా కోతిజాతికి మనోబలాలూ బుద్ధి బలాలూ తక్కువైనప్పటికీ అవిభుడేగదా అన్నిబలాలూ ఇచ్చేవాడు. అన్నాడు. అనగానే ఆవినయం ఆనమ్రత ఆప్రతాపం ఆభక్తి చూచి సీతాదేవి

సంతోషించి తనస్వామికి భక్తుడని పుత్రా ! నీవు శీలమూ భక్తిబలమూ కలవాడవూ జన్మలేని వాడవూ రోగంలేని వాడవూ గుణనిధివీఅయి మూడు లోకాలలోనూనీకీర్తి నానాధునికీర్తి వలెనే వ్యాపించునుగాక! కుమారా!శ్రీరామ విభుడు నిన్ను అపారకృపతో పాలించునుగాక! నీవుసంతోషమైన మనస్సుతో సంసారసుఖాన్ని విడిచిముక్తి సుఖాన్ని పొందెదవుగాక! అనిఆశీర్వదించింది. రాముని అపారకరుణ నీయందుండునుగాక! అన్న మాటవినగానే హనుమంతుడు ఉప్పొంగిపోయి సీతాదేవి పాదపద్మాలకు అనేకసార్లు శిరస్సువంచి నమస్కారించి అపారమైన భక్తితో అమ్మా! నేను అతికృతార్థుడనయ్యేను. నీ ఆశీర్వాదం అమోఘమైంది. అందుచే నాకు శుభంకలిగింది.

### * హనుమంతుడు అశోకవనం పాడుచేయుట *

అని తల్లీ! నాకు ఆకలిగొప్పగా ఉంది. చెట్లనిండా మంచిపండ్లు ఎన్నో ఉన్నాయి. తీసికొని తింటాను, అన్నాడు. అతన్నిచూచి జానకి అంటుంది. కుమారా ! ఈవనానికి కాపలాగా రావణుని ఆజ్ఞపై అనేకమంది ఘోరరాక్షసులు కనిపెట్టుకొని ఉన్నారు. వాళ్లకంటనీవు ఎందుకుపడాలి ? అన్నది. అంటే అమ్మా ! నాకువాళ్లభయంలేదు. నీవుసమ్మతించి అనుజ్ఞ యిచ్చేవంటే నేనుపండ్లు తినివస్తాను. అనేసరికి సీత అతని బుద్ధి బలానికి మెచ్చుకొని పుత్రా ! రామపాదపద్మాలు ధ్యానించుకొని పండ్లుతిను అన్నది. హనుమంతుడు సీతఅనుజ్ఞ పొందేనుగదా ! అని సంతోషంతో ఆమెపాదాల చివరనున్న భూమికి నుదురంటేలాగున నమస్కరించి వనంలో ప్రవేశించేడు. అన్నిచెట్లూ శోధించి మంచిమంచిపండ్లన్నీ తిని పనిపూని అన్నిచెట్లూవేళ్లతో కూడా పెకలించి పారేసేడు. అదిచూచి అక్కడకాపలా ఉన్న రాక్షసులు అతన్ని ఎదిరించి కొంతమంది అతనిచే చంపబడ్డారు. మఱికొందరు అతని చేత దెబ్బలుతిని నిలువలేక పారిపోయి రావణునితో చెప్పేరు, ఓరాక్షసేంద్రా ! ఎవడోగొప్పవానరుడు మన అశోకవనంలో చొరబడి పండ్లన్నీ తిని చెట్లన్నీ ఊడదీసి పారాసేడు. మేమందరం ఎదిరించి పోరాడేం కొంత

మందిని చంపేసేడు. అని చెప్పగానే రావణుడు క్రోధంతో కొందరు రాక్ష
సులను పిలిచి పంపించేడు. వారందరూ రావడంచూచి హనుమంతుడు వాళ్ల
గుండెలు బద్దలై పోయేలాగున గొప్పబొబ్బపెట్టి వాళ్లను నిర్జీవులుగా చేసే
స్తుంటే కొందరువేగంగావెళ్లి రావణాసురునితో చెప్పేరు. అప్పుడు రావణుడు
వేగంగా తనకుమారుడైన అక్షున్ని పంపించేడు.

* హనుమంతుడు అక్షయకుమారున్ని పరిమార్చుట *

అప్పుడు అక్షయకుమారుడు మహాబలశౌర్యాలతో రాక్షససమూహాన్ని
వెంటబెట్టుకొని కోతిని గెలవడానికని వడిగావచ్చేడు. వాడురావడం చూచి
ఒకచెట్టుపట్టుకొని వాడినిమొత్తి హనుమంతుడు దిక్కులుమారు మ్రోగే
లాగున సింహనాదంచేసేడు. తరువాతరాక్షస సైన్యాన్నికొట్టగానే కొందరు
నోటరక్తంకక్కుకుంటూ కొందరుగుండాపిండీ అయిపోయి చచ్చేరు. మిగిలిన
వారుపారిపోయి రావణునితో చెప్పేరు. రావణుడు క్రోధంతో కొడుకు
చచ్చిపోయేడన్న వార్తవిని మనస్సులో గొప్పదుఃఖం పొంది మేఘనాథుడు
అనేతన కుమారున్నిపంపి కుమారా ! నీవువెళ్లి ఆకోతిని చంపకుండా కట్టి
ఇక్కడకు తీసుకురా ఇంత అద్భుతమైన కోతిఎక్కడి నుండి వచ్చిందో
చూడాలి. అన్నాడు. అదివిని మేఘనాదుడు సైన్యంతో కూడా సోదరున్ని
కోతిచంపేసిందన్న క్రోధంతో బయలుదేరి వెళ్లేడు.

* హనుమంతుడూ ఇంద్రజిత్తూ యుద్ధం చేయుట *

అప్పుడు హనుమంతుడు ఆరాక్షస కుమారున్నిచూచి వీడెవడోవీరుడు
వచ్చేడనిమొగం ఎఱ్ఱబారగా దిగ్గజాలు తల్లడిల్లేలాగున పెద్దనాదంచేసిహుంక
రించి ఒకపెద్ద చెట్టుతీసి దానితో మేఘనాదుని రథంవిరగగొట్టి తక్కిన
యోధులను తోకతోనేలను పడగొట్టి మరికొందరిని చేతులతోగుద్ది మహా
ఉగ్రుడై పరాక్రమంచూపిస్తూ పాదాలతో కొందరిని పట్టిచంపేస్తూ మహా
ధైర్యంతో అయిదునిమిషాలలో ఆసైన్యమంతటినీ భూదేవికి బలిచేసేడు,

తరువాత ఇంద్రజిత్తుతో యుద్ధానికిబయలుదేరేడు. ఇద్దరూ మదించినఏనుగు లలాగున పోరాడుతున్నారు. హనుమంతుడు ఇంద్రజిత్తును ఒక గుద్దుగుద్ది చెట్టెక్కి కూర్చున్నాడు. ఇంద్రజిత్తు ఆగుద్దుతోసొమ్మసిల్లి పెద్దకొండలాగున భూమిమీద పడిపోయేడు. అలామూర్ఛపోయి ఒక్కక్షణంలో తేరిలేచి అనేక మైన మాయలు పన్నేడు. ఎన్నిచేసినావాయుపుత్రుని గెలువలేకపోయేడు.

* హనుమంతుడు బ్రహ్మాస్త్రానికి లోబడుట *

ఎన్నితంటాలుపడ్డా ప్రయోజనంలేక ఇంద్రజిత్తు చివరకుబ్రహ్మాస్త్రం హనుమంతుని మీదవేసేడు. అప్పుడు ఆంజనేయుడు మనస్సులో ఇలాఅను కున్నాడు. నేనిప్పుడు ఈఅస్త్రానికి వశంకాకపోతే బ్రహ్మాస్త్ర మహిమ వ్యర్థమైపోతుంది. అందుకు ఆ అస్త్రమహిమ నిలబెట్టాలనుకొని ఆ అస్త్రానికి లోబడి క్రిందపడిపోతూ కొంతమందిరాక్షసులను చంపేసేడు. అప్పుడు ఇంద్రజిత్తు కపిమూర్ఛపోయిందని సంతోషించి దగ్గరకువచ్చిప్రేమతంతో నాగ పాశాలతోకట్టి హనుమంతున్ని తండ్రిదగ్గరకు తీసుకొనివెళ్లేడు, ఇదిగో ! తండ్రీ ఇంతమందినిచంపిన కోతినాకు దొరికింది, అన్నాడు. భవానీ ! విను ఏవిభుని పవిత్రమైన నామాన్ని స్మరించినంత మాత్రాన్ని భవబంధాలన్నీ తెగిపోయి జ్ఞానులుసుఖిస్తారో ఆమహాత్ముని దూతప్రియభక్తుడు బంధింప బడడం కార్యపరత్వం పూనికాని అనఘుడైన రామునిదూతకు బందముందా? ఆకపివరున్ని బంధించి ఇంద్రజిత్తు తీసికొని వస్తున్నాడని దైత్యులందరూ వేడుకతో చూడడానికి వీధులునిండిపోయేరు, ఈకోతి ఎంతమందిరాక్షసులను చంపేసింది ! అమ్మయ్యో ! ఎంత పెద్దకోతి ? అని ఆశ్చర్యంతో చూస్తున్నారు.

* హనుమంతుడు రావణుని కొలువు కూటములో ప్రవేశించుట *

ఆవానర నాథున్ని చూడడానికి రావణుని కొలువులోనికి వచ్చిన రాక్షసమూహాన్ని లెక్కపెటడానికి శక్యంకాదు. అప్పుడుఇంద్రజిత్తు హను

మంతున్ని రావణుని సభాభవనంలోకి తీసుకొనివచ్చేడు. ఆసభావైభవ మంతా ఆంజనేయుడు చూచేడు. ఎంతో వర్ణనాతీతంగాకనబడ్డది. దేవతలూ దిక్పాలకులయీ అతిభయంతో నిలబడిచేతులు జోడించుకొంటూ నమ్రతగా సింహాసనం మీదకూర్చున్న రావణునికినమస్కారిస్తున్నారు. రాక్షసులందరూ ముఖాలు చిట్లించుకొని తనవైపుచూస్తున్నా అవేవీలెక్క చెయ్యకుండా హనుమంతుడు సర్పాలనుచూచి నిశ్శంకగా దగ్గరకువెళ్లే గరుత్మంతుని లాగున దుష్టరాక్షసులచేత సేవింపబడుతున్న రావణునివగ్గరకు వెళ్లినిలబడ్డాడు, ఆ కపివరున్నిచూచి రావణుడు హేళనగా మాట్లాడి మహాగర్వంతో అనరాని మాటలన్నీ ఆడివెంటనే అక్షయకుమారుని జ్ఞాపకంవచ్చి కొంతసేపు దుఃఖపడి వెంటనే ఔరా! వానరా! నీవెవడవురా? దుష్టా ! నాపట్టణంలో ప్రవేశించి కొంచెమైనా భయంలేకుండా చెట్లన్నీపెరికివనం పాడుచేసేవు. ఓరి వానరా! నీకింతతెగువ ఎవరిబలంవల్ల కలిగిందిరా ? శఠుడా నన్ను ఇంతకుముందు నీవుఎరుగవుగాబోలును, తులువా! నిన్నుచూడగా నిర్భయుడి లాగున కనిపిస్తున్నావు. నాఉగ్రం నీకింకాతెలియదు. దురాత్మా ! అసుర భటులనందరినీ ఏఅపరాధంచూచి చంపేవురా ? ఖలుడా ! నీకు ప్రాణభీతి లేదటరా ? అన్నాడు అప్పుడు దనుజనాయకునితో హనుమంతుడిలా అంటున్నాడు.

* హనుమంతుడు రావణునికి హితోపదేశం చేయుట *

వినరా మూఢా ! రావణా ! కుమతీ ! ఏ విశ్వేశ్వరుని బలంచేత మాయ ఈ బ్రహ్మాండమంతటినీ తయారు చేస్తుందో బ్రహ్మవిష్ణుమహేశ్వర్లు ఏవరిమాయా బలంచేత సృష్టిస్థితి సంహారాలు చేస్తున్నారో ఎవని బలంవల్ల ఆదిశేషుడు ఈ భూమినంతటినీ శిరస్సుమీద చక్కని పువ్వు లాగున ధరించినాడో లీలకోసం అనేకమైన అవతారాలతో నటిస్తున్న ప్రభు వెవడో ఏ విభుడు శివకోదండాన్ని నీవంటి ఖలులైన రాజులందరి మదాల వదలి పోయేలాగున అవలీలగా విరచి సీతను పాణిగ్రహణం చేసికొన్నాడో

నీ వంటి దుష్టులకు ఏ విభుడు ఉపదేశంచేస్తాడో ఏ ఘనుడు ఖరదూషణ త్రిశిరులను చంపి కీర్తిని పొందేడో ఏ విభుడు గొప్పబలవంతుడైన వాలిని ఒక్క బాణంతో కొట్టేడో ఏ పరాత్పరుని బలంవల్ల నీకు అన్నిలోకాలూ గెలువడానికి శక్తికలిగిందో ఏ మహాపురుషుని ప్రియభార్యను నీవు ఎత్తుకు వచ్చేవో ఆ పరమపురుషుని దూతనని తెలిసికోరా అసురాధమా! నీ ప్రభావమంతా నాకుతెలుసునురా నీవు కార్తవీర్యార్జునునితో యుద్ధం చెయ్యడం వాలితో పోరి నీవు పొందిన గౌరవం అంతా నాకు తెలుసునురా అనేసరికి రావణుడు అవేవి లెక్కచెయ్యకుండా ఒక నవ్వునవ్వేడు. అప్పుడు హనుమంతుడు రాక్షసనాయకా! విను నాకు ఆకలి అవుటచేత పండ్లు తిన్నాను. కోతినౌటచేత నా స్వభావాన్ని బట్టి చెట్లు ఊడదీసేను, శరీరం అంటే అందరకూ ప్రియమే. అందుచేత నన్నుకొట్టడానికి వచ్చిన వాళ్లను నేనుచంపేను అప్పుడు నీ కొడుకు నన్నుకట్టి నీ దగ్గరకు తీసుకొని వచ్చేడు, నేను ప్రభు కార్యంమీద వచ్చేను గనుక పట్టుబడిపోయికూడా సిగ్గుపడలేదు, అసురనాథా! విను అభిమానం విడిచిపెట్టి చేతులు జోడించి నీకు బోధిస్తున్నాను. నీకులం నిలబెట్టాలనే బుద్ధి నీకుంటే భ్రమను విడిచిపెట్టి శ్రీరామచంద్రుున్ని భజించు సకలదేవతలనూ రాక్షసులనూ ఇంకా ఈ చరాచరాలన్నింటినీ ఒక్కముద్దగా మింగి త్రేన్చగల కాలం ఎవనిభయానికి భయపడుతుందో ఆ భగవంతునితో విరోధం మాని నామాటవిని సీతామతల్లిని ఆయనకిచ్చి శరణువేడుకో. శ్రీరామచంద్రుడు పరమకరుణాసముద్రుడు. భక్తరక్షకుడు, నీవు శరణు అన్నావంటే నీవు చేసిన అపరాధమంతా మరచిపోయి నిన్ను తప్పకుండా రక్షిస్తాడు. రాక్షసేంద్రా! రాముని పాదపద్మాలు ఎల్లప్పుడూ మనస్సులో నిలుపుకొని విశ్రాంతిగా సుఖంగా లంకారాజ్యం ఏలుకో దైత్యనాయకా! నిర్మలమైన పులస్త్యవంశం అనే శరత్కాల చంద్రునిలో కళంకానివై పోకు. రాక్షసరాజా! ఎన్నిభూషణాలు ధరించినా చీరలేని స్త్రీకి శోభలేనట్టుగా రామనామంలేని మాటకే అందంలేదు. విలువాలేదు. అసురనాయకా! మదమూ మోహమూ విడిచిపెట్టి నీ మనస్సులో ఆలోచించుకో. వర్షానికి

కాలువలు ప్రవాహంగా పారి వానపోగానే ఎండిపోయినట్లు రామవిముఖు లకు సంపదా పైభవం అన్నీ విఫలమైపోతాయి. రాక్షసరాజా ! నేను ప్రతిజ్ఞ చేసిచెపుతున్నాను, విను. రామునితో విరోధం పొందిన దుష్టుల్ని రక్షించడానికి ఎవరూలేరు వెఱ్ఱివాడవై ఆ కృపానిధికి అపకారంచేసేవు. నిన్ను బ్రహ్మవిష్ణుమహేశ్వరులైనా కాపాడలేరు. ఇంకేంచేస్తావో ? నీవు తమోగుణంవల్ల కలిగిన మోహంచేత పొందిన దురభిమానాన్ని విడిచిపెట్టు. శ్రీరామచంద్రమూర్తిని కరుణాసముద్రుణ్ని పావనమూర్తిని సేవించి అపాయంలేని సౌఖ్యాన్ని పొందు, అని భక్తివివేకమూ వైరాగ్యమూ కలి గించే మాటలతో హితంచెప్పగానే గొప్పఅహంకారంతో నవ్వి రావణుడు ఆహాహా ! ఈ వేళ మాకు గొప్ప జ్ఞానియైన కోతిగురువు దొరికేడు, నీతి బోధించడానికి ఇంతమంచి గురువు ఇంకెక్కడదొరుకుతాడు ? ఏదో పూర్వజన్మ సుకృతంవల్ల దొరికేడు. అని ఎగతాళి చేస్తూ హనుమంతునితో అంటున్నాడు. ఔరా ! ఖలుడా ! నీకు మృత్యువు దగ్గరయే నాకు ఉపదేశించ డానికి బయలుదేరేవు. అనేసరికి హనుమంతుడు అంటున్నాడు. దనుజా ! నీవు అన్నది వ్యతిరేకంగా అవుతుంది, నీ మనస్సంతా చెడిపోయింది, అనగానే ఆ మాటలువిని రావణుడు గొప్ప క్రోధంతో పీడిని తీసికొనివెళ్లి చంపెయ్యండి. అని భటులకు ఆజ్ఞాపించేడు. వెంటనే భటులు ఆంజనేయున్ని చంపేస్తామని వచ్చేరు. ఆసమయంలో విభీషణుడు మంత్రులతో కూడా అక్కడకు వచ్చి అన్నగారికి వినయంతో నమస్కరించి దేవా ! దూతను చంపడం నీతికాదు. మరేదైనా శిక్ష చెయ్యడం మంచిది. అన్నాడు. రాక్షసు లందరూ ఔను, అదేమంచిది అన్నారు. అనగానే నవ్వి రావణుడు రాక్ష సులతో అంటున్నాడు.

* హనుమంతు తోకకాల్చమని రావణుడు భటులకాజ్ఞాపించుట *

భటులారా ! అంగభంగంచేసి ఈకోతిని పంపించెయ్యడమే మంచి! కోతులకు అన్ని అవయవాలలోనూ తోక మిక్కిలి ప్రియమైంది.

మీరు అందరూ వస్త్రాలన్నీ నూనెలో ముంచి వీడి తోకనిండాచుట్టి అగ్గి ముట్టించి వదిలెయ్యండి. ఈ ఖలుడు తోకకాలిపోయి వెళ్ళి తన ప్రభువుతో చెప్పుకుంటాడు. అప్పుడు అతన్ని ఇక్కడికి తీసుకొస్తాడు ఈ తుచ్ఛుడు గొప్పవాడని చెప్పినవాని గొప్పతనమంతానేను చూస్తాను అన్నాడు. అది విని హనుమంతుడు మనస్సులో నవ్వుకున్నాడు. నాకు శారదాదేవి సహాయ మైంది. అనుకున్నాడు. అప్పుడు ఆమూఢ దానవులందరూ రావణుని ఆజ్ఞ విని సంతోషంతో బట్టలన్నీ తెచ్చినేతిలోనూ నూనెలోనూ ముంచి హను మంతుని తోకకు చుడుతుంటే అతడు తనతోకను పెద్దదిగా పెంచేసేడు. ఎన్ని నూనెగుడ్డలు చుట్టినా చాలకుంటున్నాయి. లంకాపట్నంలో ఉన్న నూనె నెయ్యీ అంతాతెచ్చి బట్టలన్నీ తడిపి చుట్టినా చాలలేదు. అంత పెద్ద దిగా తోకపెంచేడు, ఇంకా ఏ సందుగొందులలో ఉన్నవస్త్రాలన్నీ తెచ్చి తోకనిండా చుట్టేసేరు. ఆ వినోదం చూడడానికి మహానందంతో పౌరులం దరూ వచ్చి అతని తోకను కాళ్లతో తన్ని ఎన్నో పరిహాసాలు చేసేరు. అప్పుడు దానవులందరూ వాద్యాలతో హనుమంతున్ని వీధులన్నిటిలో తిప్పి తీసికొనివచ్చి సంతోషంతో అతని తోకకు నిప్పు అంటించేరు.

* లంకా దహనము *

అప్పుడు హనుమంతుడు తనతోక పెద్దమంటలతో ఉండడం చూచి శరీరంచిన్నదిగా చేసికొనిరివ్వున ఒకబంగారుమేడ మీదకిఎగిరేడు. అదిచూచి స్త్రీలందరూ భయపడిపోతున్నారు. అప్పుడుహరి ప్రేరేపనవల్ల నలభై తొమ్మిది గాలులూ ఒక్కసారిగానే విసిరేయి. హనుమంతుడు ఆకాశమంత ఎత్తుపెరిగిపోయి అట్టహాసంచేస్తూ గొప్పసింహ నాదంచేసేడు. శరీరం ఎంత పెద్దదైనా తేలికగాఉండడంచేత ఎగురగలుగుతున్నాడు. ఒకఇంటి మీదనుండి మరొకయింటిమీదకూ దానిమీదనుండి మరొకమేడమీదకూ దాటేస్తున్నాడు. దానితోమేడలన్నీ అంటుకొని ఆకాశమంతపొడుగుమంటలుమండేయి,పార్వతీ! ఆలంకాపట్నంలో ఇళ్లూమేడలూఅన్నీ అగ్నిహోత్రానికి ఆహుతిఅయిపోయి

నాయి. ఆవిధంగా పట్టణంఅంతా భస్మమైపోతుంటే రాక్షసులందరూ భయంతో అన్నా! తండ్రీ! తల్లీ! ఓకాంతామణీ! పిల్లలారా! అంటూ ఆర్తనాదాలతో బట్టలు జారిపోతుండగా తలవెండ్రుకలు విడిపోతుండగా పరుగెత్తేరు. ఇలా నానావిధాలుగా నానా దిక్కులకు చెదిరిపోయి రాక్షసులు అయ్యో! ఇంక మనలను రక్షించేవారెవరు ? అమ్మయ్యో ! ఆకోతి కోతికాదురా బాబూ ! ఈశ్వరుడో ? బ్రహ్మో ? విష్ణువో ? అయి ఉండాలి, అని దుఃఖ పడుతూ దిగులుచేత పెదవులెండిపోయి పిల్లలనూభార్యలనూ ముందుంచుకొని ఊరవతలకు పారిపోయేరు. గొప్పపొగతో చుట్టబడి దారికనబడక కొంతమంది రాక్షసులు మంటలోపడిచచ్చేరు, ఈవిధంగా పట్టణమంతా కాలిపోతుంటే చూస్తూఏమి చెయ్యలేక అలానిబడిపోయేరు. రాక్షసులందరూను, సాధు జనులకు అపకారంచేసిన ఫలితం ఈవిధంగా పరిణమించింది. విభీషణుని మేడతప్ప తక్కినలంకా పట్టణమంతా బూడిదైపోయింది. ఆంజనేయుడు ఈవిధంగా లంకాపట్నాన్నంతటినీ దహించేసేడు. అగ్ని ఏ పరమాత్ముని వల్లపుట్టిందో ఆపరమాత్ముని దూతకుఅగ్ని చల్లగాఉంది. ఉమా! ఈవిధంగా రాక్షసుల పురమంతా పాడుచేసి మారుతి మేరుపర్వతంలాగున సముద్రంలో గభీమని దుమికేడు.

* ఆంజనేయుడు రామునికి ఆనవాలిమ్మని సీతను వేడుట *

అప్పుడు హనుమంతుడు తోకసముద్రంలో ముంచిశాంతిని పొంది మళ్లా సూక్ష్మరూపంధరించి జానకిదేవిముందర చేతులు జోడించుకొని నిల బడ్డాడు. అలానిలబడి అమ్మా ! నేనుశ్రీరామ చంద్రుని సన్నిధానానికి వెళ్లిపోతున్నాను, తల్లీ ! నీవుఏదైన ఆనవాలు ఇయ్యవా ? అన్నాడు. అప్పుడు సీత తనచూడామణిని ఇచ్చింది.హనుమంతుడు సంతోషంతో అందు కున్నాడు. అప్పుడుసీత కుమారా ! నాకాంతునికి నమస్కరించేనని చెప్పి నామాట ఇలాచెప్పు, ప్రభూ ! నీవుపూర్ణకాముడవు దీనరక్షకుడవు, గాబట్టి ఆబిరుదు నిలవబెట్టుమన్నానని ప్రభువుతోచెప్పు, నాబాధలు నివారించు

మన్నానని స్వామితో విన్నవించు: నాడుఇంద్రపుత్రుని చరిత్రజ్ఞాపకార్థం చెప్పేనని నానాధునితోచెప్పు. అతనిఅప్రతి హతమైన ప్రతాపాన్ని తలంచి ధైర్యంతో ఉన్నానని చెప్పు, నాధా! గుణాఢ్యా! ఒకనెల దినములలో నీవు రాకపోతేసర్వం చెడిపోతుంది, ప్రాణాలతో సీతనుచూడడానికి వీలుండనిచెప్పు వత్సా! ఎలాసహించి ఈప్రాణాలు నిలబెట్టుకోగలనో నీవేచెప్పు, కుమారా! నీవువచ్చేవుగనుక నామనస్సు కొంచెంచల్లబడ్డది, నీవుఇప్పుడు వెళ్లిపోతానంటున్నావు,ఇక నాకు రాత్రేదో పగలేదోతెలియదు.అనివ్యాకులం పొందుతున్న జానకీదేవికి ధైర్యంచెప్పి ఆమెపాదాలకు నమస్కరించి ఆజ్ఞపొంది వెళ్లి పోయేడు.

* మారుతి సముద్రందాటి అంగదాదులను కలియుట *

అప్పుడు హనుమంతుడు రాక్షసస్త్రీల గర్భాలుపగిలి పోయేలాగున గర్జిస్తూ సముద్రతీరానికి వెళ్లికొండ మీదకుఎక్కి రామదర్శనంచెయ్యాలన్న తొందరతో రామబాణంలాగున ఆకాశానికి రివ్వున ఎగిరిగొప్ప నాదంచేస్తూ సముద్రందాటి మహావేగంగా వెళుతున్నాడు, అలావస్తున్న ఆంజనేయున్ని చూచి వానరులందరూ ఉప్పొంగిపోయి అతనిముఖంలో ఉన్న తేజస్సూ ప్రసన్నతా చూచి సీతాదేవిని చూచే వస్తున్నాడని సంతోషంతో మళ్లాకొత్త జన్మలెత్తేమన్నట్టు అంగదుడూ మొదలైన వానరులందరూ తోకలెత్తుకొని ఆనందతాండవం చేసేరు. హనుమంతుడు దగ్గరకు రాగానే అందరూకలిసి రామదర్శనానికిబయలుదేరేరు. దారిలో హనుమంతుడు లంకా ప్రయాణవార్తలన్నీ చెపుతుంటే సంతోషంతోవింటూ నవ్వుకుంటూ వానరు లందరూ మధువనంలో ప్రవేశించేరు.

అంగదాదులు మధువనం పాడుచేస్తున్నారని
సుగ్రీవునికి వనపాలకులు చెప్పుట *

అప్పుడు అంగదుని ఆజ్ఞచొప్పున వానరులందరూ ఆతోటలోని తియ్యని పండ్లన్నీతిని విలాసంగా తోటఅంతటా తిరుగుతుంటుంటే వన

పాలకులు వారిని ఆటంక పరిచేరు. అప్పుడా వానరులందరూ చెంగునఎగిరి వారినితన్ని గుద్దిపారదోలేసేరు. వాళ్లుఅక్కడ నిలవలేక ఏడుస్తూ వెళ్లి సుగ్రీవునితో చెప్పేరు. మహారాజా! యువరాజుగారు బలవంతంగా వనంలో చొరబడి తనతోఉన్న వానరులచేత పండ్లతోఉన్న చెట్లనన్నింటినీ పాడు చేయించేసేరు, మేము ఆటంకపరిస్తే మామీద తిరుగబడికొట్టి తరిమేసేరు. అనిచెప్పగానే సుగ్రీవుడు అయితేవాళ్లు రామకార్యం సానుకూలం చేసుకొని వచ్చేరు, అలాకాకపోతే అంతధైర్యంతో వనంపాడుచెయ్యరు. అని సంతోషించి ఆలోచిస్తుంటే అక్కడకు నలుడూ నీలుడూ అంగదుడు హనుమంతుడూ మొదలైన వారందరూవచ్చేరు. వచ్చి శిరస్సులువంచి సుగ్రీవుని పాదాలకు నమస్కరించేరు. సుగ్రీవుడు వారిని ప్రేమతోచూచి క్షేమంగా వచ్చేరా ? అన్నాడు, అప్పుడువారందరూ ప్రభూ! నీపాదదర్శనం క్షేమంగా చెయ్యగలిగేం రామునిసత్కృపవల్ల, వెళ్లినకార్యం పూర్ణంగా నెరవేరింది. ఈ హనుమంతుడే సీతా మహాదేవిని చూచివచ్చేడు. అని చెప్పేసరికి సుగ్రీవుడు హనుమంతున్ని చాలా గౌరవించేడు.

* సుగ్రీవుడు హనుమంతుడు మొదలైనవారితో రామలక్ష్మణుల దర్శించుట *

అప్పుడు వారందరినీ తీసికొని సుగ్రీవుడు రామసన్నిధికి వెళ్లేడు, వారినిచూచి రాముడుసంతోషించేడు. హైమవతీ ! హనుమంతుడు సీతను చూచివచ్చేడని సర్వాంతర్యామియైన రామునికి తెలియదా ? ఇవన్నీ లీలలు సుమా, అప్పుడుస్ఫటిక శిలావేదికపై రామలక్ష్మణు లిద్దరూ కూర్చొని ఉండగా వానరులందరూ వారిపాదపద్మాలకు నమస్కరించేరు. వారినిచూచి రాముడుప్రేమతో క్షేమవార్తలడిగేడు. అప్పుడువానరులు ఓ శ్రీమద్రామచంద్రా! నీఅనుగ్రహంవల్ల సకలశుభములూ చేకూరేయి అన్నారు. జాంబవంతుడు రామున్నిచూచి రఘువల్లభా ! నీవు ఎవరిని కృపతో చూస్తావో వారు శుభాలను పొంది నిత్యసుఖాన్ని పొందకుండా ఉంటారా ? నీ కరుణ పొంది దేవతలూ మునులూ నరులూ ప్రసన్న మనస్సులతో నిన్ను స్తోత్రాలు చేస్తారు. నీకరుణకన్నా శుభం మరొకటిలేదు. ఓ కరుణానిధీ ! నీ కృపా

మహిమవల్ల వెళ్లిన పనంతా అయింది. ఈ కపులందరిలో రత్నంలాంటి హనుమంతుని పరాక్రమం శేషుడైనా వర్ణించలేడు. ఆహనుమంతుడే సీతా మాతను చూచివచ్చేడు. అని అక్కడ జరిగిన వృత్తాంతమంతా చేప్పేడు. రాముడు సంతోషించి హనుమంతున్ని కౌగలించుకొని సంతోషంతో వత్సా! జానకి అక్కడ ఏ విధంగాఉంది? ఆ సమాచారమంతా చెప్పు అన్నాడు.

*హనుమంతుడు సీతవృత్తాంతము రామునితోవిన్నవించుట*

అప్పుడు హనుమంతుడు అంటున్నాడు. కరుణానిధానా ! ఆతల్లి ఎల్లప్పుడూ మనస్సులో నీనామజపంచేస్తూ నీపాదపద్మదర్శనంకోసం ఎదురు చూస్తూ ప్రాణాలు నిలబెట్టుకొనిఉంది. నేను వచ్చేటప్పుడు ఇదిగో అన వాలుగా తన చూడామణిని ఇచ్చింది. అనిచెప్పి ఆ చూడామణిని రాముని చేతికి ఇచ్చేడు. రాముడు అది చూచి ప్రేమతో వక్షాన్ని చేర్చుకున్నాడు. అప్పుడు మారుతి దేవా ! ఆ తల్లి కండ్లనిండా నీరునింపుకొని నాతోకొన్ని మాటలు చెప్పింది ప్రభూ ! ఇదిగో విన్నవిస్తున్నాను. పావనీ ! నీవునాకు సోదరసమానుడివిగనుక నాకుమారుగా తమ్మునితోకూడా ఉన్న నానాథుని పాదపద్మాలు పట్టుకొని నామాటలుగా ఈవిధంగా అనుమని ఆ మాత చెప్పింది. దేవా! దీనబాంధవా ! నీ భక్తుల తాపాన్ని హరింప చేసేవాడా ! నా ఆత్మనాథా ! త్రికరణశుద్ధిగా మీ పాదకమలములందు రక్తిగలదానను. నాయందు ఏ అపరాధం ఎంచి ఇలావిడిచిపెట్టి ఊరకున్నారు? నాయందు ఒక్కదోషం ఉంది. అదేమనగా మిమ్ము ఎడబాసినప్పటికీ ఈ ప్రాణ వాయువులను మాత్రం ఇంకా విడిచిపెట్టకుండాఉన్నాను. నాథా ! ఆ అప రాధం నాకున్నలది. వెడలిపోబోతున్న ప్రాణాలను మీ పాద దర్శనాపేక్ష చేత అవే నిలబెడుతున్నాయి. ప్రాణనాథా ! మీ విరహాగ్నికి నాశరీరం దూది అయిపోయింది. శ్వాసవాయువై క్షణంలో మండిపోవును గాని మీ దర్శనం కోరి నీరుప్రవహింపజేస్తూ కన్నులు ఆపుతున్నాయి. నాథా ! మీ దాసురాలిపై అనాదరణ చేయవద్దు. అని ప్రార్థించేనని చెప్ప మన్నది. అనిచెప్పి హనుమంతుడు శ్రీరామచంద్రా! ఆ జానకీదేవియొక్క

ఆపద గొప్ప దుస్సహంగా ఉంది. ఇక చెప్పలేను ఆ అమ్మ నిముషం ఒక కల్పంలా గడుపుతుంది కాబట్టి ఆర్తశరణ్యా ! వేగంగావెళ్లి అదుష్టులను సంహరించి తల్లిని తీసుకువస్తే మంచిది. అని హనుమంతుడు చెప్పగానే సుఖనిధానమైన రాముడు సీతదుఃఖం విని కండ్ల నీరు తుడుచుకుంటూ వత్సా ! మారుతీ ! త్రికరణ శుద్ధిగా నన్ను నమ్మిన భక్తులకు కలలోనైనా దుఃఖమున్నదా ? అనగానే హనుమంతుడు అంటున్నాడు. స్వామీ! ఎల్లప్పుడూ నిన్ను కొలువని వారికి దుఃఖమేకలుగుతుంది. నిన్ను స్మరించని వారికి శోకమేకాక సౌఖ్యమెలా వస్తుంది? దేవా ! ఆ రాక్షసుల మధ్య నీభక్తికి అంతరాయం వస్తుందని తల్లి భయపడిపోతుంది. రామప్రభూ ! రాక్షసులనగా నీకేపాటి? ఆలస్యంచెయ్యకుండా వాళ్లను చంపి లోకమాతను తీసుకువస్తే మంచిది. లోకేశ్వరా ! అనగానే శ్రీరామచంద్రుడు అంటున్నాడు. అన్నా నీ వంటి ఉపకారి భూమిమీదా దేవలోకంలోకూడా మరొకడు లేడు. నీకునేనే విధంగా ప్రత్యుపకారం చెయ్యగలను ? గొప్పపరాక్రమ శాలివి. మారుతీ ! నీదగ్గర నా మనస్సు ఓడిపోయింది. నీ ఋణం తీర్చుకోలేనని నామనస్సులో అనుకుంటున్నాను. అని పులకిత శరీరంతో కన్నీటితో చూస్తున్నాడు. హనుమంతుడు రాముని మాటలువిని సంతోషంతో రామునివైపు చూస్తూ పాదపద్మాల మీదపడిపోయి దేవా ! నీ దాసున్ని నన్ను కాపాడు. అన్నాడు. శ్రీరామచంద్రుడు మాటిమాటికీ ఆంజనేయున్ని లేవనెత్తాలని చెయ్యిచాపుతుంటే మారుతి భక్తిపారవశ్యంతో లేవడానికి ఇష్టపడలేదు. అప్పుడు రాముడు అతని శిరస్సుమీద తన చేతిని ఉంచేడు. అటువంటిస్థితి తలంచుకొని శంకరుడు భక్తిలో మునిగిపోయి కొంత సేపటికి మనస్సు సావధానంచేసుకొని తరువాతి చరిత్రఅంతా పార్వతితో చెపుతున్నాడు. భరద్వాజా! విను.అని యాజ్ఞవల్క్యమహాముని చెపుతున్నాడు.

అప్పుడు రాముడు హనుమంతున్ని లేవదీసి కౌగలించుకొని సంతోషముతో దగ్గరకూర్చోబెట్టుకున్నాడు. ఆలా దగ్గరకూర్చోబెట్టుకొని అన్నా ! రావణుడు పాలిస్తున్న అభేద్యమైన ఆ లంకాపట్టణాన్ని ఎలాకాల్చేవు ? చెప్పుమని అడిగేడు. అప్పుడు అభిమానం కొంచెమైనాలేకుండా హనుమంతుడు

తనదేవుడు ప్రసన్నతగా ఉన్నాడని ఆతని పాదపద్మాలు చేతితోపట్టుకొని ఇలా చెపుతున్నాడు. శ్రీరామచంద్రా! వానరులు వేడుకగా కొమ్మకొమ్మకీ దాటుతుంటారు గాని ఏపరాక్రమకార్యాలు చెయ్యగలరు? గొప్పదైన నీ ప్రతాపంవల్లనే సముద్రం దాటగలిగేను. బంగారు మేడలతోనున్న పట్టణం అంతా దహించేసేను. వనమంతా పెకలించిపారేసి రాక్షసభటులను చంపేసేను. రామా! ఇందులో నాగొప్పతనం ఏమీలేదు. నీకరుణారస ప్రభావమే దీనికికారణం. నీకరుణకలిగిందంటే గడ్డిపోచైనా మేరుపుపర్వతంతో సమానమవుతుంది. బలహీనుడైనా బలవంతుడైపోతాడు. పరమజడుడైనా నీకటాక్షం ఉంటే పండితుడైపోతాడు. ఇనకులతిలకా! వెయ్యేందుకు? నీకటాక్షలక్ష్మి వరించిన సుకృతవంతుడు చెయ్యలేనిపనిలేదు. నీప్రభావం వల్ల దూదైనా బడబానలాన్ని కాల్చేస్తుంది. దేవా! సుఖకరమైన భక్తినాకు ఎడతెగకుండా నీయందు ఉండేలాగున ప్రసాదించు. అన్నాడు. రాముడు వత్సా! అలాగే ఇచ్చేను. అన్నాడు. పార్వతీ శ్రీరామచంద్రుని గొప్పస్వభావాన్ని ఎరిగినవారు ఆమహాత్ముని భజనమాని ఇహపర సుఖాలను కోరడానికి ఇష్టపడతారా? దేవీ! ఈప్రసంగం ఎవరు మనస్సులో తలంచుకొని ధ్యానిస్తారో వారు తప్పకుండా రామపాదభక్తులై సుఖిస్తారు. భవానీ! అప్పుడు రాముని యొక్క కరుణతోకూడిన మాటలువిని వానరులందరూ జై జై శ్రీరామా, జై సీతారామా, జై జగదభిరామా, జై సచ్చిదానందరూపా, అని వినుతించేరు.

*సుగ్రీవుడు వానరసైన్యాన్ని పిలిపించుట*

అప్పుడు శ్రీరామచంద్రుడు సుగ్రీవున్ని పిలిచి అన్నా! రాక్షస పట్టణానికి ప్రయాణవార్తచెప్పి వానరులందరికీ ఆజ్ఞఇయ్యి. సన్నాహంతో వేగంగా బయలుదేరి రండనిచెప్పు అన్నాడు, అదివిని దేవతలు ఆకాశం నుండి రామునిపైపు పుష్పవర్షం కురిపించి మనస్సులు చల్లబడగా ఇండ్లకు వెళ్లిపోయేరు. అప్పుడు సుగ్రీవుని ఆజ్ఞప్రకారము మహాబలవంతులైన కపులందరూ వారివారి సైన్యాలతోకూడా అక్కడకువచ్చేరు. భల్లూకాధిపులందరూ వారిసైన్యాలతో వచ్చేరు. ఆసైన్యాలన్నీ భూమిఈనేసినట్టు పెద్ద సముద్రంలాగున నిండిపోయేయి. ఈవిధంగా సుగ్రీవునిసైన్యమంతా వచ్చి

రాముని పాదపద్మాలకు శిరస్సులువంచి నమస్కరించి పెద్ద భయంకరమైన ధ్వనులుచేస్తూ కిచకిచలాడుతూ వినోదాలు చేస్తున్నారు. రాముడు ఆ సంపూర్ణ సేనని సంతోషంతో చూచేడు, రాముని కృపాబలంవల్ల రెక్కలతోవున్న పర్వతాలలాగున కపులందరూ మహాబలాన్నిపొంది తిరుగుతున్నారు. సమస్త లోకాలకు క్షేమాన్నిచ్చి కాపాడే హరి తన సేవకులకు బలమియ్యడా? అప్పుడు కపులందరూ ఎప్పుడువెళ్తాం? ఎప్పుడు లంకాపట్టణమంతా చిందర వందరచేస్తాం? అని కోలాహలంగా పరుగులెత్తుతున్నారు.

## రామలక్ష్మణులు వానరసైన్యంతో లంకపై దండెత్తుట

అప్పుడు శ్రీరామచంద్రుడు సంతోషంతో ప్రయాణం సాగించేసరికి శుభసూచకంగా మంచిశకునాలు కనబడ్డాయి. శుభకరుడైన శ్రీరామచంద్రుడు బయలుదేరుతుంటే శుభశకునాలకేం లోపం? శ్రీరామచంద్రుడు ప్రయాణ మయ్యేసరికి అక్కడ సీతకు ఎడమ అవయవాలన్నీ అదిరేయి. శుభశకునాలు కనబడ్డాయి రావణునికి అశుభశకునాలు కనబడ్డాయి. ఆ వానరసైన్యాలూ భల్లూకసైన్యాలూ మహాపరాక్రమంతో చేతులతోకొండలు పైకెత్తుతూ చెట్లుపెల్లగించి పట్టుకుంటూ శరీరాలు ఉప్పొంగుతుండగా ఆకాశానికి ఎగిరి భూమికిదిగుతూ భూమి చలించిపోయేలాగున అంతటా తిరుగుతూ సింహనాదాలు చేసేసరికి దిగ్గజాలు బెదరిపోయి ఘీంకారాలు చేస్తున్నాయి, భూమిఅల్లల్లాడి పోతోంది. కొండలు గడగడలాడిపోతున్నాయి సప్త సముద్రాలూ కలిగిపోయేయి. సూర్యుడూ చంద్రుడూ దేవతలూ మునులూ కిన్నరులూ సిద్ధులూ నాగులూ దుఃఖాలుతీరి పట్టరానిసంతోషాన్ని అనుభవించేరు. వానరవీరులందరూ మూకలుగాకూడుకొని పండ్లుగీటుకుంటూ తోకలు మీదకెత్తుకుంటూ ఒకరినొకరు గిలిగింతలు పెట్టుకుంటూ దాటుకుంటూ ఎగతాళి చేసుకుంటూ జయజయధ్వనులు చేస్తూ రాముని గుణకథలు భక్తితో చెప్పుకుంటూవెళ్తుంటే ఆశబ్దం చెవులుపగులుతువుగా ఆకాశానికి ముట్టి పోయింది. గంతులు వేస్తున్న కపిసైన్యంయొక్క భారం భరించలేక మాటిమాటికీ శేషుడు స్మృతితప్పిపోయి సోలి పడిపోతున్నాడు. అది

కూర్మంవీపుమీద. అదెట్లుందనగా అమృతసమానమైన శ్రీరామచంద్రుని ప్రయాణకథఅంతా ఆదిశేషుడు ఆదికూర్మం వీపుపెంకుమీద తనకోరలతో విషమనే సిరాతో వ్రాస్తున్నాడన్నట్టుంది. ఈ ప్రకారంగా రఘురామచంద్రుడు సైన్యమంతటితో సముద్రతీరానికివెళ్ళేడు,

* మండోదరి రావణునికి హితోపదేశం చేయుట *

అక్కడ వానరులందరూ అంతటా తిరుగుతూ చెట్లెక్కి పండ్లుతింటూ కనుపించిన చెట్లూ లతలూ విరిచిపారేస్తూ ఇష్టానుసారం సంచరిస్తున్నారు. హనుమంతుడు లంకాపట్నం కాల్చి వెళ్లినప్పటినుండి రాక్షసులు భయపడిపోయి దీనంగా ఉన్నారు. అయ్యో! రాక్షసవంశ లక్ష్మిపోయింది. ఇక ఆయువు కూడా తీరిపోతుందని ప్రతి యింట్లోనూ స్త్రీలూ పురుషులూ ఊహించుకొని దుఃఖిస్తున్నారు. ఎవని దూత ఇంత చక్కని పట్నాన్ని ధ్వంసం చేసేనేడో ఆ విభుడే వస్తుంటే ఇంక మనకి శుభం ఎలా కలుగుతుంది? అని పురజనులందరూ అనుకుంటుంటే దూతికలు విని మండోదరితో చెప్పేరు. ఆమె చాలా విచారించి భర్త దగ్గరకు వెళ్ళి వినయంగా చేతులు జోడించి నమస్కరించి నాథా! మీ మేలుకోరి చెప్తున్నాను, నామాట వినండి. లక్ష్మీనాథుడైన రామునితో విరోధం పొందకూడదు. నేను చెప్పినమాట అన్నివిధాలా మంచిదని మనస్సులో యోచించి రాజ్యం సుఖంగా పరిపాలన చెయ్యండి. ప్రాణేశ్వరా! అతనిదూత చేసిన పరాక్రమ క్రియలను వినేసరికి రాక్షసస్త్రీల గర్భాలు జారి పోతున్నాయి. అటువంటి లోక ప్రభువైన ధానవాంతకుని దేవిని వెంటనే నామాటవిని మంత్రులచేత అతని దగ్గరకు పంపించేయండి. అతడు తప్పు పట్టకుండా మిమ్మలను బ్రతుకజేస్తాడు. మీ వంశమనే పద్మవనాన్ని చెరపడానికి మంచుకురిసే రాత్రిలాగున భువనేశ్వరియైన సీతాదేవి ఈ పురానికి వచ్చింది. ప్రాణనాయకా! ఆమెను రామునికివ్వి శరణనక పోతే ఆ శివుడూ బ్రహ్మకూడా మీకు శ్రేయస్సుకలుగ జేయలేరు. జీవితేశ్వరా! నామాట వినండి. రాముని శరణు పొందితేనే మీకు బ్రతుకుకలుగు

తుంది. నాథా! రాముని బాణాలనే పాములు రాక్షసులనే కప్పలను మింగ డానికి రాకముందే అందరిక్షేమం కోరినట్లైతే వేగంగా ఆ ప్రయత్నం చెయ్యండి. మనోహరా! న్యాయమైన నామాటలు మనస్సులో నిలిపి మిమ్మ లనూ నన్నూ వంశాన్నీ కాపాడండి. అన్నది. ఆమాటలకు రావణుడు నవ్వి మండోదరితో అంటున్నాడు. చెలీ! స్త్రీలు నిజంగా అధైర్యవతులు• వట్టినే భయాన్ని పొందుతుంటారు, కోమలీ! శుభసమయంలో భయ మెందుకు? చెలీ! వానరసైన్యం వచ్చిందంటే రానియ్యి. ఈ రాక్షసులందరూ కమ్మగాతిని హాయిగా బ్రతుకుతారు. పద్మముఖీ! లోకపాలకు లందరూ ఎవనికి భయపడి ధైర్యాలులేక కంపంపొందిపోతారో అతని భార్యవై ఉండీ భయపడితే ఎంత హాస్యంగా ఉంటుంది? అని నవ్వుతూ ప్రేమతో ఆమెను కౌగలించుకొని భయపడకనిచెప్పి అభిమానంతో కొలువులోకి వెళ్లిపోయేడు. మండోదరి ఇక ఎలాగైనా నానాథునికి బ్రహ్మ ప్రతికూలుడయ్యేడని చింతిస్తుంది.

## * రావణుడు మంత్రులతో ఆలోచించుట *

అప్పుడు రావణుడు సభలో కూర్చుని మంత్రులారా! కోతులమూక వచ్చి సముద్రానికి అవతల ఒడ్డునఉన్నదట. ఇప్పుడు మనకర్తవ్యమేమో చెప్పండన్నాడు. 'మంత్రులు రావణాసురునితో నవ్వుతూ అంటున్నారు. దేవా! పూర్వం సురాసురుల నందరినీ శ్రమలేకుండా గెలిచిన మనకు ఈ నరులూ వానరులూ అనగా ఒకలెక్కా? స్వామీ! మూడు లోకాలవారూ నీకే మ్రొక్కుతుంటే నిన్నెదిరించి ఎవడైనా నిలువగలడా? అని మంచిమాట లాడగానే వారిమాటలు నమ్మి తనదురభిమానాన్ని మరింత పెంపొందించి వచ్చే ఆపదను తెలిసికోలేకపోయేడు. ఉమా! మంత్రీ వైద్యుడూ గురువూ స్వాభిమానంతో మంచి మాటలాడినా అదివిన్న వారు చెడిపోతారు. మంత్రి వలని రాజ్యం వైద్యునివల్ల శరీరం గురువువల్ల ధర్మం భయంగాని ఆశ గాని కలిగి సలహా చెప్పేవారైతే తప్పక చెడిపోతాయి. కాబట్టి నిస్సంశ

యంగా మోమాటం లేకుండా నీతి బోధించే పండితుల మాటలనే వివేక వంతులు నమ్ముతారు.

* విభీషణుడు రావణునకు హితోపదేశం చేయుట *

అప్పుడు విభీషణుడు ఇదే మంచి సమయం అని వచ్చి అన్నగారికి శిరస్సువంచి నమస్కరించి ఆజ్ఞతీసుకొని ఆసనంమీద కూర్చుని దేవా! నన్నడిగితే కపటంలేకుండా నీకుమేలు కలిగే పద్ధతి చెపుతాను విను. అనేకమైన సుఖాలూ శుభాలూ కీర్తి వైభవం పొందాలంటే పరస్త్రీని చవితినాటి చంద్రుడిలాగున విడిచిపెట్టాలి. అలా చెయ్యకపోతే దురవస్థ పొందవలసి వస్తుంది. నమ్మ నామాట. ఎవడైనాసరే ఈ పద్నాలుగు భువనాలూ ఏకఛ్ఛత్రంగా ఏలగల సమర్థుడైనా క్రూరుడై జీవద్రోహంచేస్తే ఎలా మనగలుగుతాడు? అట్టి జీవద్రోహి సమస్త సద్గుణాలు గలవాడైనా లేశమాత్రంలోభేచ్ఛ వాడి కున్నట్టయితే వాడిని ఉత్తముడని అనరు, కాబట్టి స్వామీ! కామత క్రోధం మదం లోభం నరకలోకానికి మార్గాలు. వాటినివిడిచి పెట్టి రామున్ని సేవించు. సాధుజనులందరూ సేవించినట్టు నీవూ అతన్ని సేవించి శరణుపొందు, అతడు మానవుడుకాడు రాజకుమారుడూ కాడు. శ్రీరామవిభుడు లోకరక్షకుడు. అతడు కాలునికి కాలుడు. పరబ్రహ్మం. అజుడు అనామయుడు అక్షరుడు భగవంతుడు. వ్యాపకుడు. జగదంతర్యామి సర్వ సాక్షి పరుడు. వేదాంతవేద్యుడు. అజితుడు. అగుణుడు ఆదిమధ్యాంత రహితుడు. దేవా! ఆరడు బ్రాహ్మణులకూ గోవులకూ భూమికీ దేవతలకూ మేలుచెయ్యడంకోసం ఈభూమిమీద మానవుడై పుట్టి లీల నడిపిస్తున్నాడు. కాని అతడు జన్మలేనట్టి ఈశ్వరుడు. దుష్టులను శిక్షించేవాడు. సజ్జనులను రంజింపజేసేవాడు. వేదపద్ధతిగా సద్ధర్మం నిలబెట్టడానికి అవతారమెత్తేడు. కాబట్టి అగ్రజా! అతనితో విరోధంమాని అతనికి శిరస్సువంచి నమస్కరిస్తే శుభం కలుగుతుంది. రామప్రభువు పరమదయాసముద్రుడు. శ్రీప్రభూ! నామాటలువిని వైదేహిని అతనికిచ్చి శరణని ప్రార్థించు. ఎంత పాపాత్ముడూ లోకద్రోహి అయినప్పటికీ శరణన్నవారిని అతడు

విడువడు. అతికృపాళుడు. అతనినామం తాపత్రయాన్ని నశింప జేస్తుంది. రాక్షసేంద్రా! మాటి మాటికీ నీపాదాలకు నమస్కరించి విన్నవించుకుంటు న్నాను. నీవు అభిమానం మదం మోహం విడిచిపెట్టి కోసలాధిపతియైన శ్రీరామచంద్రుణ్ని సేవించు. అనఘుడైన పులస్త్యమౌని తన శిష్యులను పంపించి ఇలా నీతో చెప్పమన్నాడు. దనుజాధీశ్వరా! ఆసంగతి వెంటనేనీకు విన్నవించేను. నీసోదరుణ్ని నీమేలుకోరేవాణ్ని కనుక నేను హితోపదేశం చేసినట్టూ చెయ్యి. నీకు శుభం కలుగుతుంది. అన్నాడు. అతనిమాటలు రావణుని మంత్రులలో పెద్దవాడైన మాల్యవంతునికి మంచివనిపించి రావ ణునితో అంటున్నాడు. రాక్షసేంద్రా! నీతమ్ముడైన విభీషణుడు తెలివిగల వాడూ విద్యా భూషణుడూ అవుటచేత అతని మాటప్రకారం చెయ్యడం మంచిదే అనగానే దశముఖుడు మహా రౌద్రంతో ఎవడురా అక్కడ? ఈ శత్రువు లిద్దరినీ అవతలికి తరిమేయి. అన్నాడు. అదివిని మాల్యవంతుడు అక్కడ ఉండకుండా ఇంటికి వెళ్లిపోయేడు. విభీషణుడు మళ్లా చేతులు జోడించి నమస్కరించి అంటున్నాడు. నిశాచరేంద్రా! విను. అందరిమనస్సు లలోనూ సద్బుద్ధీ దుర్బుద్ధీ కలిసే ఉంటాయి. అందులో దుర్బుద్ధి అణిచి సద్బుద్ధి ఎక్కువగా ఉన్నవానికి శుభం కలుగుతుంది. దుర్బుద్ధిని సద్బుద్ధిని అణచేసేదంటే వానికి ఆపద కలుగుతుందని వేదశాస్త్ర పురాణాలు ఎల్ల ప్పుడూ చాటి చెబుతున్నాయి. అసురనాథా! నీలో దుర్బుద్ధే ఎక్కువై ఉండడంచేత నీమంచి నీకు చెడ్డలా కనిపిస్తుంది. నీ హితులే నీకు శత్రు వులులా కనిపిస్తున్నారు. అయ్యయ్యో! ఈరాక్షసకులానికి కాలరాత్రి యైన సీతమీద నీకింత ప్రీతి ఎందుకు కలిగింది? అన్నా! నీపాదాలు పట్టుకొని ప్రార్థిస్తున్నాను. నామాట్టచెల్లించి సీతను రామునికిఇచ్చిశరణువేడు, అందు వల్ల నీకు శుభంకలుగుతుంది, హాని తప్పిపోతుంది. నీధర్మమాఅనిరాక్షస వంశమంతా ఆనందంతోబ్రతుకుతుంది. వినునామాటఅబద్ధంకాదు.అన్నాడు.

* రావణుడు విభీషణుని తన్నుట *

అప్పుడు నీతియుక్తంగా చెప్పిన విభీషణుని మాటలను రావణుడు విని మహాక్రోధంతో లేచి ఓరీ విభీషణా! ఏం అంతజంకులేకుండా పరుష

వచనాలు పలుకుతున్నావు? ఇదిగో నీకు మృత్యువు దగ్గరపడ్డది. అని హుంకరించి ఓరి పలువా! నా పోషణవల్ల బతుకుతూ శత్రుపక్షంగా చెపుతున్నావటరా! ఈ పద్నాలుగులోకాలలోనూ నన్ను జయించగలవాడెవడో చెప్పరా! దుష్టా! నా పట్టణంలో ఉండి ఆ మునులను ప్రేమిస్తున్నావటరా? నీవుకూడాపోయి ఆతపసులలో కలిసి నీతులుచెవుతుండు. అని రావణుడు పళ్లుబిగించి గట్టిగా విభీషణుని కాలుతో తన్నేడు. అవిధంగా తన్నగానే మహా గుణవంతుడైన విభీషణుడు అన్నపాదాలు ప్రసన్నముఖంతో పట్టుకున్నాడు. పార్వతీ! సజ్జనుల ఘనత ఇదే వారికి కీడుచేసినవారికైనా మేలేచేస్తారు. అప్పుడు విభీషణుడు అన్ననుచూచి అగ్రజా! నీవు పెద్దవాడవు. తండ్రితో సమానుడవు. నన్ను తన్నేవు. మంచిదే అయినా మరొకసారిచెపుతున్నాను. రామున్ని సేవించు నీకు గొప్ప శుభం కలుగుతుంది, ఇదిగో నీ కృపవల్ల ఇప్పుడే నేనా శ్రీరామచంద్రున్ని శరణువేడుకోవడానికి వెళ్లిపోతున్నాను.

*విభీషణుడు మంత్రులతోకూడా శ్రీరామచంద్రుని ఆశ్రయించుట*

అనిచెప్పి ఆకాశమార్గంగా తన మంత్రులతోకూడా వెడుతూ అందరినీ చూచి అంటున్నాడు. ఓ సభాసదులారా! రాముడు సత్యనిర్ణయుడు. దుర్మార్గ ప్రవర్తనులైన ఈ సభలో ఉన్నవారందరూ కాలవంచితులు. కాబట్టి ఇక మీరు నన్ను నిందించకండి. నేనిప్పుడే ఆ ఆర్తరక్షకున్ని శరణువేడికోడానికి వెళ్లిపోతున్నాను. ఇకనేను చెప్పవలసిందేదీలేదు. దైవకృతాన్ని ఎవరూ ఆపలేరు. అంటూ వెళ్లిపోయేడు. భవానీ! అప్పటినుండీ లంకలో రాక్షసులందరికీ ఆయువులు తక్కువై పోతున్నాయి. సాధుసజ్జనులకు అవమానంచేస్తే శుభాలన్నీ నశించిపోవా? అప్పటినుండీ దశకంఠుని వైభవం తగ్గిపోతుంది, విభీషణుడు మహా సంతోషంతో వెళుతూ ఆఅరణ్యంలో గౌతమపత్ని ఏమహాత్మునిపాదస్పర్శవల్ల పవిత్రురాలైందో? ఆ మహాత్ముని పాదపద్మాలు ఈవేళ చూడగలుగుతాను. ఆహా! ఎన్నాళ్లకు నాకు ఇట్టి భాగ్యం కలిగింది! సేవక జనులకు అఖండ సౌఖ్యాన్ని

ఇచ్చే పాదపద్మాలను ఆశ్రయిస్తాను. ఓహో! నేనెంత సుకృతవంతున్ని బంగారులేడివెంట అరణ్యంలో పరుగెత్తిన స్వయంప్రకాశుని పాదపద్మాలను చూచి నేను ధన్యున్ని అవుతాను. శివుని మానస సరోవరంలో ఏ మహాత్ముని పాదాలు పద్మాలలాగున శోభిస్తున్నాయో ఆ పాదపద్మాలు చూడ గలుగుతాను. భరతుడు ఎల్లప్పుడూ మనస్సులో ధ్యానిస్తుండే పాదపద్మాలను ఈ నాటికి చూచేభాగ్యం నాకుకలిగింది. ఏ పాదపద్మాలు శంభుడు ఎల్లప్పుడూ శిరస్సున ధరించే గంగకు పుట్టినిల్లో ఆ పాదపద్మాలను చూచి సుఖించగల భాగ్యం నాకీనాటికి అబ్బింది. బలి చక్రవర్తిని మూడుఅడుగుల భూమి ఇమ్మని అడిగి భూమీ ఆకాశం నిండిపోయిన బ్రహ్మాండనాయకుని పాద పద్మాలను నా పూర్వజన్మ సుకృతంవల్ల చూడగలుగుతాను. ఏ పరమ పురుషుని సుందరమైన పాదాలను మనస్సులో నిలుపుకొని సిద్ధులు పరమ పదాన్ని పొందుతున్నారో ఆ పాదపద్మాలను చూడగలిగే భాగ్యాన్ని పొంద గలిగేను. అనిమనస్సులో ఉప్పొంగిపోతూ వేగంగాసముద్రందాటి వెళ్లేడు, ఇంతలో వానరులు అతన్నిచూచి శత్రువుయొక్క దూత అనుకొని అక్కడ నిలబెట్టి సుగ్రీవునితోచెప్పేరు. అతడు రామునితో స్వామీ! రావణునితమ్ముడు వచ్చేడు. అని చెప్పేరు. అదివిని రాముడు ప్రియమిత్రా! నీ ఉద్దేశమేమి? చెప్పు, అన్నాడు, సుగ్రీవుడు రామచంద్రా! రాక్షసమాయలు తెలియవు వాళ్లకామరూపులు. అందుచేత తెలిసికోలేము. మనమర్మం తెలిసికోడానికే వచ్చిఉండవచ్చును మనకు శత్రువుతమ్ముడు. కాబట్టి పట్టిబంధించడమే మంచిదనిపిస్తుంది. అని సుగ్రీవుడు చెప్పగానే రాముడు విని సెబాస్, అదే నీతి పద్ధతి. నీ తలంపు మంచిదే. కాని చెలికాడా! నా ప్రతిజ్ఞ విను. నన్ను శరణనివచ్చిన శత్రువునైనా నేను భయం పోగొట్టి రక్షిస్తాను. ముద్దు బిడ్డను తల్లి కాపాడే విధంగా, అనగానే హనుమంతుడు ఆహా! ప్రభువు ఎంతదయగలిగిన వాడని సంతోషించి భక్తిపరవశుడై పోయేడు. శత్రువని తలంచి శరణన్నవాన్ని విడిచిపెట్టినవాడు పామరుడు. గొప్పపాపాత్ముడ వాడే. వాన్నిచూస్తే పాపంకలుగుతుంది. నూటయేభై లక్షల బ్రహ్మహత్యల

చేసినవాడైనా శరణనివస్తే అతన్ని విడవను. శరణని నాదగ్గరకు వచ్చిన జనులకు కోటిజన్మాలలో చేసిన ఘోరపాపాలన్నీ నశించిపోతాయి. సూర్య పుత్రా! పాపబుద్ధిగలవారికి నా భజనయందు ఇష్టమే పుట్టదు. ఈ విభీష ణుని మనస్సు దుష్టమైందైతే నాదగ్గరకు ఏ కారణంచేత వస్తాడు? ఇతడి యందు కపటం ఉన్నట్టు కనపడలేదు. ప్రియమిత్రా! ఒకవేళ రావణుడు మనమర్మం తెలుసుకోడానికి తమ్ముణ్ని పంపేడనుకుందాం. అలా అయినా భయంలేదు. లోకంలో రాక్షసులందరినీ లక్ష్మణుడొక్కడే నిమిషంలో వధించగలడు. ఈ సుగుణుడు అలాకాక భయంతో శరణు పొందడానికేవస్తే అతని భయం పోగొట్టి కాపాడతాను. ప్రేమతో ప్రాణసమానంగా చూస్తాను. అని నవ్వుతూ ఈ విభీషణుని బుద్ధి ఈ రెండు విధాలలో ఎలా ఉన్నా మేలే. ఇక్కడకు తీసుకురా. అనగానే జై ఇనకులతిలకా! అని కపులం దరూ అంగదుడూ హనుమంతునితో వెళ్లి ఆ వినయసంపన్నుడైన విభీష ణున్ని దగ్గరకు నడిపించుకొని రాముని సన్నిధానానికి వచ్చేరు.

* విభీషణుడు రామున్ని శరణువేడుట. *

అప్పుడు విభీషణుడు కన్నులపండువుగా సూర్యవంశ రత్నాలూ మంగళాకారులూ ప్రకాశమానమైన ముఖాలుగలవారూ అయిన రామలక్ష్మ ణులనుచూచి సంతోషంతో శరీరం పొంగిపోతుండగా ఎఱ్ఱ పద్మాలలాంటి విశాలమైన కన్నులుగలమూర్తి నీలమేఘశ్యాము నీ భక్తజనుల ఆర్తిని పోగొట్టేవాన్నీ నిశ్చేష్టుడై రెప్పవేయకుండాచూచి ఆనందంతో శరీరం గగుర్పాటుచెందగా ధైర్యంతో వినయంగా అంటున్నాడు. మునిజనరక్షకా నేను రాక్షసాధిపుడైన రావణుని తమ్ముణ్ని, ప్రభూ! సహజంగాపాపానికి మూలమైన తామసశరీరంగలవాడిని. గుడ్లగూబ ఎప్పుడూ చీకటినే మంచి దనికోరునట్లు నేనుతామసబుద్ధిగలవాడిని. విశ్వేశ్వరా! సంసారభయనివారణా! నీయొక్కసత్కీర్తివిని ఓ దీనావనా! సుఖనిధానా! నీ పాదపద్మాలను ఆశ్ర యించినాను. దేవా! నన్నుకృపతో రక్షించు. శరణుశరణు. అని విభీషణుడు రాముని పాదపద్మాలనుపట్టుకొని భూమిమీదపడి సాష్టాంగంగానమస్కారం

చేసేడు, కరుణాధాముడైన రాముడు సంతోషంతో అతన్ని లేవదీసి కౌగలించు
కొని అతని వినయమైన మాటలకు మెచ్చుకొని లక్ష్మణునితో సమానంగా
తనదగ్గర కూర్చోబెట్టుకున్నాడు. అప్పుడు రాముడు ప్రేమతో లంకేశ్వరా!
దురాత్ముల మధ్యనున్న నీకూ నీ మంత్రులకూ క్షేమమేనా? నీ పరిజను
లందరకూ క్షేమమా? మిత్రా! ఆ దుష్టమండలిలో రాత్రింబగళ్ళూ ధర్మనిర్వ
హణం ఎలా చేస్తున్నావు? నీవు నీతికోవిదుడవని అనుకుంటున్నాను. మంచి
మనస్సుగలవారికి దుష్టులసంగంలో జీవించేకంటే నరకంలో ఉన్నా కొంచెం
మేలనిపిస్తుంది. అనేసరికి విభీషణుడు శ్రీరామునితో వినయంగా అంటు
న్నాడు, ఓ రఘురామచంద్రా! కరుణాసముద్రా! భక్తచకోరచంద్రా!
నీ పాదస్పర్శనంవల్ల నా భయం నివారణ అయింది. సంతోషం కలిగింది.
దేవా! నన్ను గౌరవించి నీ భక్తునిగా చేసుకున్నావు. శ్రీనాథా! జీవులు
శోకానికి ఉనికి పట్టయిన కామక్రోధాదులను ఎంతవరకూ విడిచిపెట్టరో
అంతవరకూ ఎలా సుఖాన్ని పొందగలుగుతారు? వారికి కలలోనైనా
విశ్రాంతి ఉండదు. ఎవరి మనస్సుతో చాపనిషంగాలు ధరించిన రామ
చంద్రుడు నివసించడో వారి మనస్సుల్లో మదం మత్సరం లోభం మోహం అభి
మానం నివసించి ఉంటాయి. మమత అనే రాత్రియందు చీకటిలో ద్వేషం
రాగం అనే గుడ్లగూబలు హాయిగా ఉంటాయి. హరియొక్క గొప్ప
ప్రతాపం అనే సూర్యోదయం అయేవరకూ జీవులయొక్క హృదయాలలో
అవి హాయిగా నివసించి ఉంటాయి. ఓ రామచంద్రా నీ పాదదర్శనంవల్ల
సుఖ సమ్యేను. పాపహీనమైన సంసారభయం తీరిపోయింది. కష్టం తొలగి
పోయింది. నాథా! నేను రాక్షసున్ని అధమస్వభావంగల వాన్ని మంద
మతిని. ఎప్పుడూ ఏ శుభకర్మలూ చెయ్యలేదు. ఏ స్వరూపాన్ని ధ్యానంలో
మునులు నిలుపలేరో ఆ నిర్మలమూర్తివైన నీవు నన్ను ప్రసన్న మన
స్సుతో వక్షానికి అదుముకున్నావు. ఏమి నా భాగ్యము. ఇనవంశమణీ!
కృపాసముద్రా! రామచంద్రా! సౌఖ్యరససముద్రా! శివుడూ విధాతా
సేవించే నీ పాదపద్మాలను భక్తితో చూసేను. కృపాక్షా! నీవు ఎవరిని అ...

కూలంగా చూస్తావో వానికీ తాపత్రయా లేవీ బాధించవు అవ్యయానందనిధీ ! అనివినయంతో అంటున్న విభీషణున్నిచూచి శ్రీరామ చంద్రుడు అంటు న్నాడు. సఖా ! నా స్వభావం విను. నీ మీదనున్న ప్రేమచేత వివరంగా చెపుతున్నాను, కాగభుశుండి మునీ పార్వతీ పరమేశ్వరులూ నా స్వభావం బాగా ఎరుగుదురు. ఈ భూమిమీద చరా చరాలన్నిటికీ ఆపదకతిగించే మహాపాపాత్ముడైనా నన్నేగతి అని శరణు వేడితే వానిమదం అభిమానం కపటం మొదలైన సకల దుర్గుణాలూ పోగొట్టి సాధుమనస్సుగల వానినిగా చేస్తాను. తల్లిదండ్రులూ భార్యాబిడ్డలూ బంధువులూ అనేమమతమాని ఈ శరీరం ధనం ఇల్లూ తనవనే భ్రమ మానేసి నాపాదాలను మనస్సులో నిలిపి ఎల్లప్పుడూ ఎవడు ధ్యానిస్తుంటాడో వాడే ఘనుడు. సమదర్శి అనబడతాడు. సంకల్పాలు లేనివా సంశయం లేనివాడూడూ శోకం సంతోషం లేనివాడూ నా పాదభక్తికల్గవాడూ అయిన వానిహృదయంలో ఎల్లప్పుడూ లోభివాని మనస్సులోధనం నివసించి ఉన్నట్టునేనునివచించిఉంటాను. మిత్రా! నీవంటి సజ్జనులునాకుప్రియులు. వారిని కాపాడడానికే నేను శరీరం ధరిస్తుంటాను. తక్కినవారి ప్రార్థనలూ నమస్కారాలూ నేను పాటించి అవతరించను ! ఇతరులకు మేలు చేసేవారూ దృఢమైన వ్రతనియమంగలవారూ రూపం లేని పరబ్రహ్మాన్ని అర్చించేవారూ బ్రాహ్మణ పాదసేవకులూ నాకు ప్రాణ ప్రియులు. సఖా! లంకేశ్వరా ! ఇప్పుడుచెప్పిన సుగుణాలు చాలామట్టుకు నీయందున్నాయి. అందుచేతనే నాకు పరమప్రియుడవైనావు. అన్నాడు. అనగానే కపులంధరూ జై కరుణా సనాధా ! అనివినుతించేరు, అమృత సమానమైన రాముని మాటలు విని విభీషణుడు తృప్తినిపొంది మాటి మాటికీ రాముని పాదపద్మాలమీదపడి అపారమైన భక్తిని పట్టలేక శరీరం పులకరించగా ఆనందబాష్పాలతో గొప్పదైన గద్గద కంఠంతో దేవా ! చరాచర ప్రపంచనాథా! ప్రణతపాలా! సమస్త జనహృదయాంతర్యామీ ! నా హృదయంలో పూర్వజన్మవాసనఏదో కొంత ఉండడంచేత అదే నీ పాద భక్తి అనే నదిగా ఇప్పుడు ప్రవహించింది, పరమకరుణాకరా ! అన్నాడు,

*శ్రీరామచంద్రుడు విభీషణున్ని లంకకు పట్టాభిషిక్తుని చేయుట*

ఆ తరువాత విభీషణుడు శ్రీరామభద్రా ! కరుణాసముద్రా ! శివునికి అత్యంత ప్రియమైన నీ పాదభక్తి ఎల్లప్పుడూ నాకు నిలిచేలాగున చెయ్య, అనేసరికి రాముడు తథాస్తు. అని అప్పుడు సముద్ర జలం తెప్పించి విభీషణున్ని ఆదరంతోచూచి విభీషణా ! నా దర్శనం అమోఘమైంది. ఊరికేపోదు. నీమనస్సులో ఇచ్ఛలేకపోయినా లంకాపట్టణాన్ని నీవు సుఖంగా ఏలుకో అనిచెప్పి అతనికి శ్రీరామచంద్రుడు పట్టాభిషేకంచేసేడు. అప్పుడు ఆకాశంమీదనుండి దేవతలు పుష్పవర్షం కురిపించి ఎంతదయాసముద్రుడు శ్రీరామచంద్రుడు ! అని సంతోషించేరు, శ్రీరామచంద్రుడు రావణుని క్రోధాగ్నినుండి తప్పించి విభీషణునికి రాజ్యలక్ష్మిని ఇచ్చేడు, రావణుడు తన పదితలలనూ అర్పించేసి శివునివల్ల పొందిన ఐశ్వర్యమంతటినీ అతి సులభంగా రాముడు అతని తమ్మునికి ఇచ్చేడు. అటువంటి శ్రీ రామచంద్రున్ని భజింపక ఇతర దైవాలను భజించేవారు, కొమ్ములూ తోకా లేని రెండుకాళ్లతో నడిచే పశువులు. అప్పుడు శ్రీరామచంద్రునితో సమానుడైన సజ్జనరక్షకుడు లేడని వానరులందరూ సంతోషించేరు- ఆ సమయమున సర్వజ్ఞుడూ సర్వసాక్షీ సర్వాత్మా సర్వేశ్వరుడూ రాక్షసవంశనాశకుడూ మానవరూపం ధరించిన శ్రీమన్నారాయణుడూ లోకనాథుడూ ఐన శ్రీరామచంద్రుడు మృదువుగా అంటున్నాడు.

*శ్రీరామచంద్రుడు సుగ్రీవ విభీషణులతో మంత్రాలోచనచేయుట*

ఓ వానరులారా ! ఓ సూర్యపుత్రా ! ఓ విభీషణా ! ఈ సముద్రం పెద్దపెద్ద చేపలతోనూ మొసళ్లతోనూ పాములతోనూ తాబేళ్లతోనూ కూడి గొప్ప గొప్ప కెరటాలతో గంభీరంగా దాటడానికి శక్యంకాకుండాఉంది. మనమిది ఎలాదాటి వెళ్లగలుగుతాము? అన్నాడు, అనగానే విభీషణుడు అంటున్నాడు, దేవా ! సర్వ చరాచరాలకూ నాథుడివు నీకీసముద్రం ఒక లెక్కా? నీ బాణాగ్నికి సప్తసముద్రాలూ ఇంకిపోవా? ఐనప్పటికీ ముందుగా వినయంతోవేడుటయే మంచిది. మీకులానికి గురువైన సముద్రున్ని అధి

గితే దానికి ఉపాయం అతడే చెపుతాడు. ఆ తరువాత దాటి వెళ్లవచ్చును. అన్నాడు. అప్పుడు రాముడు సోదరా ! నీ వన్నది. బాగానే ఉంది, దైవసహాయం ఉంటే ఎటువంటి పనైనా చెయ్యవచ్చును, అన్నాడు, ఆమాట లక్ష్మణునికీ నచ్చక స్వామీ ! ధైర్యహీనులకు ఇతరదైవాల సహాయంగాని నీ కంటె దైవ మెవరు? దేవా ! నీవు క్రోధాన్ని చూపిస్తే ఈ సముద్రం ఇంకిపోదా? అని లక్ష్మణుడనగానే రాముడు నవ్వి ధైర్యంతో చూస్తుండు అలాగే చేస్తాను. అనిచెప్పి శ్రీరామచంద్రుడు సముద్రం దగ్గరకు వెళ్లి దర్భలు పరచుకొని సముద్రునికి మొక్కుతూ కూర్చున్నాడు,

* శుకసారణులు వానరులకు చిక్కి లక్ష్మణునిచే విడిపింపబడుట *

విభీషణుడు లంకాపట్టణాన్ని విడిచిపెట్టి వచ్చిన వెంటనే రావణుడు రాముని దగ్గరకు ఇద్దరు చారులను పంపేడు. వారు సంతోషంతో వచ్చి శ్రీరామచంద్రున్ని చూచి అక్కడివృత్తాంతమంతా తెలిసికొని మెచ్చుకొని కోతిరూపాలు ధరించి రాముని గుణాలు వర్ణిస్తూ అతిభక్తితో రామున్ని కీర్తిస్తూ పరాకున మాయను మరచిపోయి నిజరూపాలతో కనబడగానే వానరులందరూ చూచి వీరు రావణుని దూతలని వారినిపట్టుకొని కట్టి సుగ్రీవుని దగ్గరకు తీసికొనివచ్చేరు. సుగ్రీవుడు వారికి అంగభంగంచేసి విడిచిపెట్టండని చెప్పేడు. కపులందరూ వారిని కట్టి సైన్యమధ్యాన్ని తిప్పి అనేక విధాలుగా కొట్టి బాధిస్తుంటే ఎంతోదీనంగా మొఱ్ఱపెట్టేరు. ఎంత ఏడ్చినా విడువలేదు. అందుకు వారుభయపడి వానరులారా! మాకూ ముక్కు చెవులూ కొయ్యకండి. అలాచేసేరంటే రామునితోడే. అన్నారు. ఆమాటలు లక్ష్మణుడు విని ఆ వానరులందరినీ తనదగ్గరకు పిలిచేడు. ఆ వానరులందరూ ఆ రాక్షసదూతలను తీసుకొనివచ్చి లక్ష్మణునిదగ్గర నిలబెట్టేరు. వారిని చూచి లక్ష్మణుడు నవ్వి దయతో విడిపించేడు. అలా విడిపించి వాళ్లను పిలిచి వాళ్లచేతికి ఒక పత్రిక ఇచ్చి ఇది రావణుని చేతికిచ్చి ఓరీ కులఘాతుకా! ఈ పత్రికలో రాముని తమ్ముని మాటలున్నాయి. చదువుకో, అనండి. ఇంకా ఆ మూర్ఖునితో నా సందేశం ఇలా చెప్పండి. ఓరీ ఖలుడా ! నీవు

వేగంగా సీతాదేవిని తీసుకొనివచ్చి రామచంద్రున్ని శరణువేడకపోతే నీకు కాలం దగ్గర పడ్డాదని చెప్పండి, అని చెప్పేడు. ఆ దూతలు లక్ష్మణుని పాదాలకు నమస్కరించి అతనిసద్గుణాలు కీర్తించుకొంటూ వెళ్లిపోయేరు.

## శుకసారణులు రావణునితో రామవానరసైన్య వృత్తాంతంచెప్పుట

శుకసారణులు వెళ్ళి రావణుని పాదాలకు నమస్కరించి నిలబడ్డారు. వారిని చూచి దశముఖుడు ఫక్కునవవ్వి శుకా! అలాచూస్తావేం మీ క్షేమ వార్తా అక్కడి వింతలూ చెప్పవేమీ? చావుదగ్గరైన ఆ విభీషణుని వృత్తాంతం చెప్పు. ఆశతుడు అనుభవిస్తున్న రాజ్యాన్ని విడిచిపెట్టి పోయేడు, ఆ అభాగ్యుడు మనకు ఎప్పుడైనా ఆహారంలో పురుగే అవుతాడు. సరే. కాల ప్రేరేపణ వల్ల తెలివిలేకుండా వస్తున్న ఆ భల్లూక కపిసైన్యాల వార్తలు చెప్పు, మెత్తని మనస్సుగల ఆ సముద్రుడు రక్షకుడై ఉండబట్టి బ్రతుకగలుగుతున్నారు, ఆ రాజ తపసులు. నా భయానికి తపించిపోతున్న ఆ అన్నదమ్ములిద్దరి సంగతంతా చెప్పు. ఆరాజకుమారులు ఇప్పుడు ఇక్కడకు వస్తారా? నా ప్రతాపం విని భయంతో వెనుక తిరిగి పోతారా? శత్రుసైన్యయొక్క బలతేజాలు ఎటువంటివో చెప్పవేమి? శుకా! నిన్ను చూడగా చలించిన మనస్సుతో ఉన్నట్టు కనబడుతున్నావు. అనగానే శుకుడు రావణునితో అంటున్నాడు, దేవా! జరిగిన సంగతంతా చెపుతాం కృపతో విను: ప్రభూ! మీ తమ్ముడైన విభీషణమహారాజుగారు వెళ్ళి శ్రీరామ చంద్రున్ని దర్శించి శరణనగానే రాముడు కపులందరూ వినుతించేలాగున అతనికి లంకారాజ్యపట్టాభిషేకం చేసేడు. మేమువెళ్లి గూఢంగా అక్కడ తిరుగుతుంటే వారుతెలిసికొని సుగ్రీవుని ఆజ్ఞప్రకారం వానరులందరూ మమ్ములను పట్టి కట్టి కొట్టి బాధిస్తూ ముక్కులూ చెవులూ కొయ్యడానికి సిద్ధపడ్డారు, అప్పుడుమేము రామునిమీద ఒట్టు అన్నాం. అదివిని లక్ష్మణుడు మమ్ములను విడిపించేడు. దేవా! అడిగేవుగనుక చెపుతున్నాం రామసైన్యాన్ని వర్ణించడానికి నూరుకోట్ల నోళ్లు ఉన్నా చాలవు, వానర భల్లూక సైన్యాలలో ఘోరమైన వికార రూపాలుగల బలవంతులు

ఎందరో ఉన్నారు. అప్పుడు ఇక్కడకి వచ్చి మీ పుత్రున్ని చంపి పట్టణాన్ని కాల్చినవాని బలం ఇంకా తక్కువే ఇంకా అక్కడ లెక్కలేనంతమంది యోధులు ఎందరో ఉన్నారు. మదించిన ఏనుగులలాంటి బలంగలవారు క్రోట్ల కొలదీ అక్కడవున్నారు, అతికఠినమైన శరీరాలతో అనేకమైనరంగులతో ద్వివిదుడూ నీలుడూ మైందుడూ నలుడూ దధిముఖుడూ అంగదుడూ జాంబవంతుడూ మొదలైన పరాక్రమవంతులు గొప్ప సాహసంతో ఆకాశానికి అంటేలాగున దాటి భూమికంపించిపోయేలాగున కొండలు చేతులతోపట్టుకొని నాట్యాలాడుతున్నారు, సుగ్రీవునితో సమానమైన బలవంతులు కోట్లకొలదీ ఉన్నారు. వారిని లెక్కపెట్టడం ఎవరికీ శక్యంకాదు. రాక్షసేశ్వరా కపివీరులందరూ రోషంతో చేతులుచరచిరాముని ఆజ్ఞలేదని ప్రయత్నం ఆపేరుగాని లేకపోతే ఈ భూమండలమంతా నాలుగు సముద్రాలలో ముంచేసి ఆ సముద్రాలలో నీరంతాతాగేసి ఉందురు. ఏవిధంగానైనా సముద్రాన్ని ఇంకించగల సమర్ధులు. కొండలన్నీ ఏరితెచ్చి సముద్రాన్ని పూడ్చేసి అయినాసరే లంకా పట్టణానికి రాగలరు. ఆవానరులందరూ రావణున్ని పటుకొని మర్థించి ధూళిలో కలిపేస్తాం అంటున్నారు. మహా ఉగ్రంగా గర్జిస్తున్నారు. లంకా పురాన్ని మింగేస్తాం అన్నంత నిర్భయులై ఉన్నారు, ఆ సైన్యాన్ని మొనగాడు శ్రీరామచంద్రుడు. కాబట్టి వారు నూరుకోట్ల కాలులనైనా జయించగలరు. దేవా! రాముని తేజోబలాలను నూరువేలమంది శేషులైనా వర్ణించలేరు, ఒక బాణంతో నూరుసముద్రాలనైనా రాముడు ఇంకింపజేస్తాడు. అయినప్పటికీ నీతిమంతుడవుట చేత ఈ సముద్రంఎలాదాటడం? అని విభీషణ మహారాజుగారిని అడిగేడు. ప్రభువు కరుణగలవాడు గనుక ముందుగా విరోధానికి చొరబడడు. అని శుకుడు చెప్పేసరికి రావణుడు పెద్దనవ్వు నవ్వి అటువంటి వాడు కాబట్టే కోతుల సహాయం కోరుకున్నాడు. ఎటువంటి అధైర్యవంతుడు కాకపోతే విభీషణుని మాటలు వింటాడా? ఓరీ శుకా! మూఢా! శత్రుబలం ఇప్పుడునాకు బాగా బోధపడ్డదిరా. వాళ్లను ఘనతచేసి అబద్ధాలాడకురా. ఆ విభీషణున్ని మంత్రిగా చేసుకున్నవారికి జయమెలా లభిస్తుంది? అనగానే

శుకునికి కోపం వచ్చి ఇదేసమయమని పత్రికతీసి స్వామీ! ఇదుగో లక్ష్మణుడు మీకిచ్చేడు. అని అందించేడు. అది రావణుడు ఎడమచేతితో అందుకొని నవ్వుతూ మంత్రిని పిలిచి ఆ పత్రిక చదువుమన్నాడు. అతడిలా చదువుతున్నాడు. ఓరీ! శఠా! దురదృష్టవంతుడవై కులమంతటిని నాశనం చేసికోకు. అన్యాయంగా శ్రీరామునితో విరోధంపొంది నీవు శరణన్నా శివుడుగాని విధాతగాని శ్రీమన్నారాయణుడుగాని నిన్ను రక్షించరురా దుష్టా! అభిమానం విడిచిపెట్టి భక్తితో శ్రీరామచంద్రుని పాదాలమీదపడి వేడికోరా పాపాత్మా! అలాచెయ్యకపోతే తొందరగావచ్చి అగ్నిలోపడే మిడతలాగున చస్తావు. నీవంశమంతా నశించిపోతుంది. అని మంత్రి చదివేడు. అదివిని రావణుడు మనస్సులో భయపడ్డా పైకి పదిముఖాలలోనూ చిన్న నవ్వు కనపడేలాగున అంటున్నాడు. ఆతపసులు ఇద్దరిలో చిన్నవాడనేమాటలు చూడగా భూమిమీద పడిపోయి ఆకాశాన్ని చేతితో పట్టుకుంటాననే అవివేకి మాటలులాగున ఉన్నాయి. అనగానే శుకుడు రావణునితో అంటున్నాడు. నేమచెప్పినదంతా నిజం దేవా! సహజాభిమానం విడిచిపెట్టి కోపగించకుండా రోషముద్వేషమూ మాని శ్రీరామచంద్రున్ని శరణు వేడితే కోమల హృదయంగల రాముడు తక్షణం రక్షిస్తాడు. కాబట్టి అధిపా! సీతాదేవిని రామునికి ఇచ్చేసి అంటుండే సమయంలో ఆఖలునికి కోపంవచ్చి ఆ శుకిన్ని కాలుతో తన్నేడు. తన్నగానే శుకుడు రావణునికి నమస్కరించి గుణధాముడైన రాముని దగ్గరకు వెళ్లి అంతా విన్నవించి భక్తితో నమస్కరించి తన పూర్వపుణ్య వశంచేత ఒకముని రూపాన్ని పొందేడు. పార్వతీ! పూర్వం అగస్త్యుని శాపంవల్ల రాక్షస జన్మాన్ని పొంది. ఇప్పుడు రాముని దర్శనం వల్ల ఆకల్మషమంతాపోయి ప్రభువు పాదపద్మాలకు అనేకసార్లు మ్రొక్కి తన ఆశ్రమానికి వెళ్లిపోయేడు. రాముడు సముద్రున్ని దారి ఇమ్మని అడిగి అప్పటికి మూడురోజులయింది, కాని జడమైన సముద్రుడు అది లెక్కచెయ్యలేదు.

* సముద్రుడు రాముని శరణువేడుట *

అప్పుడు పరమాత్ముడైన రాముడు కోపంతో అంటున్నాడు. భయం లేకుండా ఎప్పుడైనా భక్తి ప్రీతి పుట్టవు లక్ష్మణా! ఏదీ ధనస్సు ఇలాతే అగ్నిబాణంతో ఈ సముద్రాన్ని ఇంకించేస్తాను. ఎప్పుడూ లోభి వానిదగ్గర నీతి మూర్ఖుని దగ్గర వినీతి కపటంగల వానిదగ్గర ప్రేమా మమకారం గల వానిదగ్గర జ్ఞానం తత్వ బోధచేసే కథలు ఉపదేశించడం క్రోధంగల వాడికి ఇంద్రియ నిగ్రహం గురించి బోధించడం కామంగల వాడికి విష్ణుకథలు చెప్పడమూ ఇవన్నీ చవిటినేలను విత్తనాలు జల్లితే ఎంతనిష్ఫలమో అలాగే ఫలితంలేకుండా పోతాయి, అనిచెప్పి కోదండంపట్టుకొని ఎక్కు పెట్టేడు. బాణం సంధించేసరికి సముద్రదగర్భంలో మంటలు బయలుదేరేయి. అందులో మొసళ్లూ తాబేళ్లూ మొదలైన జలజంతువులన్నీ మహా భయం పొందిపోతుంటే సముద్రుడు తెలిసికొని అభిమానం విడిచిపెట్టి వేగంగా బంగారు పళ్లెంతో అమూల్యరత్నాలు పట్టుకొని బ్రాహ్మణవేషంతో రాముని సన్నిధికి వచ్చి వినయంగా నిలబడ్డాడు. నీచుడెప్పుడైనా నీతివంతంగాచెపితే అభిమానం విడిచి పెట్టడు. నీరెంతపోసి పెంచినా అరటిచెట్టు ' నరికితేగాని ఫలమివ్వదు: గొప్ప భయంచేత ఇంక చస్తాను అనిపించితేగాని దుష్టుడు లొంగడు. అవిధంగానే సముద్రుడు రామ బాణానికి భయపడివచ్చి శ్రీరామ చంద్రుని రెండుపాదాలూ రెండుచేతులతో పట్టుకొని మాధవా! గొప్పమదం చేత నేనుచేసినఅపరాధం సహించాలి. దేవా! బ్రహ్మాది దేవతలచేతనుతింప బడే వాడా! ఈపంచ భూతాలు జడస్వరూపాలు. వీటిని ప్రపంచ సృష్టికి ఆధారంగాచేసి నీమాయ నీఆజ్ఞవల్ల ఈ ప్రపంచమంతా సృష్టించింది. అని గ్రంథాలన్నీ చెపుతున్నాయి. శ్రీహరీ! నీఆజ్ఞతప్పకుండా అనుకూలంగా తిరిగినవాడు పరమ సుఖాన్ని పొందుతాడు. నీరజాక్షా! నాకు మంచిబోధ చేసేవు, దేవా! ఇదినీకే చెల్లుతుంది మద్దెలా పశువూ స్త్రీ శూద్రుడూ తాడ నానికే అర్హులు. హరీ! నీపరాక్రమానికి నేను ఇంకి పోదునుగాని అందువల్ల నాకు గొప్పతనంలేదు. పరమపురుషా! ప్రభునిఆజ్ఞ అమోఘమని శ్రుతులు

చెపుతున్నాయి, ప్రభూ! నీయిష్టప్రకారం చెయ్యి. అని వినయంతో అన్న మాటలకు రాముడు నవ్వుతూ ఓవసధివరేణ్యా! ఈ వానర సమూహమంతా ఏవిధంగా ఆవలిఒడ్డు చేరగలుగుతుందో ఆ ఉపాయం నీవేచెప్పు. అన్నాడు. అప్పుడు సముద్రుడు అధిపా! నీకు తెలియనిదిలేదు. అయినా నలుడూ నీలుడూ అనే సోదరకపులు చిన్నతనంలో ఋషివరునిచేత వరం పొందేరు. వారు కొండలు పట్టుకొని నీటిలోవేస్తే అవి నీటిమీద తేలిఉంటాయి. దేవా! నీ మహత్వం మనస్సులో నిలుపుకొని నేనుకూడా నాశక్తికొలదీ సహాయం చేస్తాను. స్వామీ! ఈవిధంగా సేతువు కట్టించి నీకీర్తి ముజ్జగాలూ నిండి పోయేలాగున చెయ్యి. ప్రభూ! ఇప్పుడు నీవెత్తిన బాణాన్ని నాకు ఉత్తర దిక్కున ఉన్నజనులు మహాదుష్టులు కాబట్టి వారిపై ప్రయోగించు అన్నాడు. అదివిని రణధీరుడైన రాముడు సముద్రుని హృదయ తాపాన్ని చల్లార్చేడు. శ్రీహరి పౌరుషాన్నీ బలాన్నీ తలంచుకుంటూ సముద్రుడు పరవశాన్ని పొందేడు. పార్వతీ! అప్పుడు సముద్రుడు రఘురాముని పాద పద్మాలకు శిరస్సువంచి నమస్కరించి భక్తితో పద్మాక్షా! మునివంద్యా! అని నుతించి ఆజ్ఞపొంది వెళ్లిపోయేడు. కలిదోషాలను నివారించే పవిత్రమైన ఈ చరిత్ర కీర్తిమంతుడైన శ్రీ తులసీదాస మహాకవి చెప్పేడు. రామ విభుని సచ్చరిత్ర వింటే నిత్యసుఖం కలుగుతుంది. సంశయాలూ దుఃఖాలూ నశించి పోతాయి. సకలమైన ఆశలూ విడిచిపెట్టి ఓ మందమైన మనసా జానకీనాథుని గుణగానంఎల్లప్పుడూ చేస్తుండు. దుష్టత్వం అభిమానం విడిచి పెట్టు. పవిత్రమైన రామగుణగానం సకల శుభాలనూ ఇస్తుంది. శ్రద్ధగా విన్నట్టయితే ఈ సంసార సముద్రాన్ని ఓడలేకుండానే దాటగలుగుతాం. దేవా! త్రిగుణాతీతా! స్వయంప్రకాశా! మునిహృదయాలలో విహరించే వాడా! వేదాంతవేద్యా! అప్రమేయా! జగదాధారా! జగదాకారా! వికారదూరా! నిఖిలేశా! భక్తమందారా! సర్వాత్మకా! సర్వసాక్షీ! కరుణాసముద్రా! సీతా నాథా! సూర్యచంద్రులు నేత్రాలుగా గలవాడా! రాక్షసవిపక్షా! సూర్యవంశమణీ! బ్రహ్మచేత శివునిచేతా నమస్కరింపబడే పాదపద్మాలు గలవాడా! సాక్షి

దేవిచేత జపింపబడే నామంగలవాడా! శమమూ మొదలైన సాధనాలచేత సాధించి పొందదగిన వాడా? కరుణా సముద్రా! శరణాగత వత్సలా! సౌఖ్యనిధీ నీకు నమస్కారం.

గద్య :- ఇది శ్రీ సీతారామచంద్ర వరప్రసాదంవల్ల భూసురులూ
కాశ్యపస గోత్రోద్భవులూ ఐన సన్యాసేశ్వర శర్మగారి
తనయ రుక్మిణీ నామధేయచేత రచింపబడ్డ వ్యావ
హారిక వచన తులసీ రామాయణమందు
సుందరకాండ మనే ఐదో సోపానం

ఓం తత్సత్.

శ్రీ సీతారామ చంద్ర పరబ్రహ్మార్పణ మస్తు.

ఓమ్

# శ్రీ వ్యావహారికాంధ్ర తులసీ రామాయణం

## ఆరవ సోపానం. లంకాకాండ

శ్రీమంతమూ శుభకరమూ అయిన స్వరూపంగలవానికి భీకరరాక్షసులనే వనానికి అగ్నిహోత్రం లాంటివానికీ శుభచరిత్రగలవానికీ శోకంపోగొట్టేనామంగలవానికీ సీతారామునికీ శివునిచే వినుతింపబడేవానికీ పాపనాశకునికీ రాజరూపం ధరించిన దేవదేవునికీ కాలమనే మదించిన ఏనుగుకీ. సింహంలాంటివానికీ నిర్వికారునికీ నిరాకారునికీ మాయాతీతునికీ కనకాంబరునికీ సనకాదులచేత నమస్కరింపబడేవానికీ ఎల్లప్పుడూ భక్తితోనమస్కరిస్తున్నాను. శుభకరమైన తెల్లనిశరీరం గలవానికీ పులితోలు వస్త్రంగా గలవానికీ సర్పాలు భూషణాలుగా గలవానికీ ఆకాశగంగకు నాథుడైనవానికీ కలికల్మషాల్ని నశింపజేసేవానికీ మన్మథునికి విరోధిఅయినవానికీ గౌరీదేవికి భర్తయైనవానికీ కాశీనివాసుడైనవానికీ భక్తజన కల్పవృక్షమై మహావిష్ణువునకు స్నేహితుడై సజ్జనులను అనుగ్రహించి అలభ్యమైన కైవల్యపదాన్ని ఇచ్చేవానికీ ఖలులను దండించేవానికీ నమస్కరిస్తున్నాను. ఆపార్వతీనాథుడు నాకు కృపతో సౌఖ్యములిచ్చి కాపాడునుగాక ! ఓ చంచలమైన మనస్సా ! నిముషములూ గడియలూ దినములూ వారాలూ పక్షాలూ మాసాలూ ఋతువులూ అయనాలూ సంవత్సరాలూ యుగాలూ మన్వంతరాలూ కల్పాలూ కూడా రామవిభునికి బాణాలు, కాలమేవిల్లు, అటువంటి శ్రీరామచంద్రుని ఎల్లప్పుడూ సేవించు. దుర్గుణాలన్నీ విడిచిపెట్టి అతన్ని భజించు, ఎల్లప్పుడూ విషయసుఖాలుకోరి అవే శుభాన్ని కలిగిస్తాయని తలంచి చెడిపోకు,

### * శ్రీరాముని ఆజ్ఞప్రకారం వానరులు సేతువును కట్టుట. *

అప్పుడు పరమేశ్వరుడు అంబికాదేవితో ఇలాచెపుతున్నాడు. గిరిజా! రామవిభుని చరిత్రవిను, అప్పుడురాముడు సముద్రుని మాటలువిని సుగ్రీ

వునితో అంటున్నాడు, మిత్రమా ! ఇకఆలస్యమెందుకు ? సైన్యాన్నంత టినీ పిలిచిసముద్రం దాటడానికి అనుకూలంగా సేతువుకట్టు మని చెప్పు. అన్నాడు. అప్పుడు జాంబవంతుడు చేతులుజోడించి భక్తితో శ్రీరామచంద్రా! నీనామం అనేసేతువుమీద జనులందరూ ప్రయాణంచేసి భయంకరమైన సంసారసాగరాన్ని శ్రమ లేకుండా దాటిపోగలరు. అది ఎంత సేపు ? అన్నాడు. అది విని హనుమంతుడు అంటున్నాడు, రఘురామ చంద్రుని ప్రతాపం అనే బడాబాగ్ని చేత ఈసముద్రం ముందే ఇంకి పోయింది. కాని శత్రువుల భార్యలకంటినీటిచేత మళ్లానిండిపోయింది. అందు చేతనే ఈనీరు ఉప్పగాఉంది. అన్నాడు. అతనియుక్తికి అందరూ సంతోషించేరు. అప్పుడునలుడూ నీలుడూ అనే అన్నదమ్ములను జాంబవంతుడు పిలిచి కథఅంతా చెప్పి రాముని ప్రతాపం తలంచుకొని మీరు ఈ సముద్రంపైని సేతువుకట్టండి, రామున్ని స్మరించడంవల్ల శ్రమలేకుండా పనినెరవేరుతుంది. అనిచెప్పి సైన్యంఅంతటినీ చూచి ఓభల్లూక వానరవీరులారా ! నావిన్నపం వినండి, మనస్సులో శ్రీరామచంద్రుని పాదాలను నిలుపుకొని సంతోషంతో ఆటలాగున చెట్లూకొండలూ తెచ్చినలునికీ నీలునికీ అందీయండి. అని చెప్పగానే ఆసైన్యమంతా రామప్రతాపానికీ జై అంటూకెవ్వునకేక పెడుతూ ఆడుకుంటూ పాడుకుంటూనవ్వుకుంటూ కేరుకుంటూ రామున్ని మనస్సులలో ధ్యానించు కుంటూ దూరంగా వెళ్లిగొప్ప గొప్పచెట్లూ కొండలూ శ్రమలేకుండా పువ్వుల లాగునపెకలించి తెస్తున్నారు, అవినలుడూ నీలుడూ అందుకొని చక్కగా సేతువు కడుతున్నారు.

### * శ్రీరామచంద్రుడు శివలింగ ప్రతిష్ఠ చేయుట *

అప్పుడు శ్రీరామచంద్రుడు ఆసేతువు కట్టడంచూచి నవ్వి ఈభూమి ఉత్తమమైన మహిమగలది. దీనిగొప్పతనాన్ని నుతింపశక్యంకాదు. కాబట్టి ఇక్కడమూడు లోకాలను పావనంచేసే పార్వతీనాధున్ని స్థాపించాలని నాకు వేడుకపుట్టింది అన్నాడు. అదివిని సుగ్రీవుడు సంతోషించి దూతలను

పంపి మునీశ్వరులందరినీ పిలిపించేడు. వారిఆజ్ఞపొంది రాముడు అక్కడ శివలింగప్రతిష్ఠచేసేడు. అప్పుడురాముడు అంటున్నాడు. నాకుమూడు లోకాలలోనూ శివునివంటి ప్రియుడులేడు, శివద్రోహులైన వారు నాభక్తులనిపించుకున్నా ఎన్నడూ వారునన్నుపొందలేరు. నరకాన్నే అనుభవిస్తారు,నాకుద్రోహులై శివభక్తులైనవారూ శివద్రోహులైనాకు భక్తులైనవారూ ఒక కల్పంవరకూ కష్టా లనుభవిస్తూ నరకాన్నిపొందుతుంటారు. ఈరామేశ్వరుని దర్శనం ఎవరు భక్తితోచేస్తారో వారుజన్మాంతాన్ని విష్ణులోకాన్ని పొందుతారు, ఎవరైతేభక్తితో గంగానదిలో జలంతెచ్చి ఈశివునికి అభిషేకం చేస్తారో వారు సాయుజ్యముక్తిని పొందుతారు. ఏకోరికలూ లేకుండా ఈశంకరున్ని సేవించినవారికి ఈపినాకపాణి నాపాదభక్తిని కలుగజేస్తాడు. ఈ సేతుదర్శనం చేసినవారు శ్రమలేకుండా భవసాగరాన్ని దాటగలుగుతారు. అనిరాముడు చెప్పగానే అందరూ సంతోషించేరు. శివునికి నమస్కరించి మునులు వారి ఆశ్రమాలకు వెళ్లిపోయేరు. హైమవతీ ! శ్రీరామచంద్రుడు భక్తరక్షణ పరాయణుడు అనిచెప్పితరువాయి కథచెపుతున్నాడు, అప్పుడు శ్రీరామచంద్రుని కరుణవలన నలుడూ నీలుడూ సముద్రంమీద చక్కని సేతువుకట్టేరు. వారికీర్తి అన్నిలోకాలలోనూ వ్యాపించిపోయింది. రాళ్లు నీటిలోమునిగి పోవడమేకాకుండా వాటినిఆధారపడ్డ వాటినికూడా ముంచేస్తాయి అటువంటి కఠినశిలలు ఓడలవిధంగా నీటిమీదతేలిపోయేయంటే ఆసముద్ర మహిమా ? లేక రాళ్లగుణమా ? కాకకపుల ప్రవీణతా ? అదేదీకాదు. గొప్పదైన శ్రీరామచంద్రుని ప్రతాపంవల్ల రాళ్లుసముద్రం మీదతేలేయి. అటువంటి రామున్ని విడిచిమందబుద్ధులు ఇతరదైవాలను సేవిస్తారు. దృఢంగాసేతువు తయారైంది, శ్రీరామచంద్రుడు మనస్సులో చాలాసంతోషించేడు. వానరులందరూ సంతోషంతో గర్జిస్తూ ఆడేరు.

* రామలక్ష్మణులు పరివారంతో సముద్రాన్ని దాటుట

అప్పుడు కరుణానిధియైన రాముడుసేతువు మీదపాదం పెట్టేడు. సముద్రాన్ని చూచేడు, రామసందర్శనానికి ఆనీటిలో నివసించే జంతువులు

సంతోషంతో వచ్చినిలబడ్డాయి. నూరుయోజనాల విరివిగల శరీరాలతో తాబేళ్లూ మొసళ్లూ పాములూ చేపలూ ఎన్నోవచ్చేయి. వాటినిమింగే అంత పెద్ద జలజంతువులు కూడా సముద్రంలోనుండి లేచివచ్చేయి. అటువంటి జడజంతువులైన సహజవిరోధాలు లేకుండా ప్రేమతో రామున్నిచూస్తూ సుఖంగా నిలబడ్డాయి. అప్పుడు అవి నీరేమాకు ప్రాణాధారం అనేసంగతి కూడా మరచిపోయేయి. అప్పుడువానర సైన్యమంతాకదిలింది. సంతోషంతో ఆటలాడుకుంటూ సేతువుమీద నుండికొందరూ ఆకాశమార్గంగా పక్షులలా ఎగిరికొందరూ శ్రీరామచంద్రున్ని చూస్తూ సముద్రంలో చలనం లేకుండా నిలబడియున్న జంతువులమీద నుండి గంతులు వేస్తూకొందరూవెళుతున్నారు. ఆవినోదమంతాచూస్తూ రామలక్ష్మణులు నవ్వుకొంటూ వెళుతున్నారు. ఈ విధంగా సంతోషంతో సైన్యమంతటితో శ్రీరామచంద్రుడు ఆవలి ఒడ్డు చేరేడు. ఆవానరసైన్యాన్ని వర్ణించడానికి శక్యంకాదు, అప్పుడు రాముడు వానరులను పిలిచి మీరందరూ వెళ్లి వేడుకగా పండ్లుకంద మూలాలూ ఆకలి తీరాతినిరండి. అని ఆజ్ఞయిచ్చేడు. ఆవానరులూ భల్లూకాలూ రామాజ్ఞ ప్రకారం వడివడిగా పరుగెత్తి వెళ్లేరు. అదిపండ్లు పండేఋతువు కాకపోయినా శ్రీరామునికి సహాయపడడానికి చెట్లన్నీ మంచి పండ్లతోనిండిఉన్నాయి. ఆపండ్లన్నీ ఆకలితీరా కోతులూ ఎలుగుబంట్లూ తిన్నారు. పండ్లుతిని కొమ్మలు ఊపేస్తూ రావణునిపట్టణంలోకి కొండలు విసురుతూ అటూ ఇటూతిరుగుతున్నరాక్షసులను నిలబెట్టి ఒకగడియ ఆడించి ముక్కులూ చెవులూ కొరికి రాముని కీర్తివాళ్లకు తెలియజేసి ఇకపోయి మీదిక్కైన రావణునితో చెప్పుకొండి అంటున్నారు. ఆరాక్షసులు ముక్కులూ చెవులూపోయి దుఃఖిస్తూ దీనంగా వెళ్లిరావణునితో చెప్పేరు. రామలక్ష్మణులు సముద్రంపై వంతెన కట్టి వానరసైన్యంతో కూడా సముద్రం దాటి లంకాపట్నం దగ్గరకువచ్చేరన్న సంగతివినగానే భయంతో రావణుడు అంటున్నాడు. ఏమీ నిజంగా ఆ మానవులు ఆజలనిధిని ఆవారినిధిని ఆఉదధిని ఆసముద్రాన్ని వంతెనవేసి దాటివచ్చేరా? ఆ ఆ అని మనస్సులో వ్యాకులపడుతూ అదిపైకి తెలియ

కుండా నవ్వుతూ వెంటనే భయంచేత మతిపోయిచూస్తూ అలాకొంత సేపుండి అప్పుడు రావణుడు అంతఃపురంలోకి వెళ్లేడు.

## * మండోదరి రావణునికి హితోపదేశం చేయుట *

మండోదరి శ్రీరామచంద్రుడు సేతువుకట్టి సముద్రం దాటివచ్చేడన్న సంగతి విని నాథుని చెయ్యిపట్టుకొని మందిరంలోకి తీసికొనివెళ్ళి పాదాలకు నమస్కరించి వినయంగా అంటుంది. నాథా! కోపించక నాప్రార్థన వినండి. బుద్ధిబలంతో ఆలోచించి జయించగలిగినవారితో విరోధం పొందితే సరిపోతుంది. కాని రామునితో విరోధం మంచిదికాదు, రామునికీ మీకూ చాలా అంతరువుఉంది. అతి బలవంతులైన మధుకైటభులను సంహరించిన దేవుడతడు. రామునికీ మీకూ సూర్యునికీ మిణుగురుపురుగుకీ ఉన్నంత అంతరువు ఉంది. ఇప్పుడు భూభార నివారణకోసం ఆదేవుడే రాముడై పుట్టేడు. అతడు కేవల నరుడుకాడు. హిరణ్యకశిప హిరణ్యాక్షులను బరిమార్చిన అవ్యయుడు. బలిచక్రవర్తిని బంధించిన ప్రభువు. కార్తవీర్యార్జునుని జయించిన దేవుడు. ఆప్రధాన పురుషునితో విరోధంమాని జీవించడం మంచిది. హృదయేశ్వరా! అతని పాదాలకు నమస్కరించి తప్పుచేసేనని సీతాదేవిని అతనికి సమర్పించి ఈలంకారాజ్యమంతా కుమారునికిఇచ్చి అడవికివెళ్ళి రామున్ని భజించుకుంటే మనకు శ్రేయస్సు కలుగుతుంది. మనోహరా! రాముడు దీనదయాళుడు కాబట్టి తప్పక మిమ్ములను రక్షిస్తాడు. దుష్టమైన పులి అయినా ఎదుటపడగానే వాళ్ళను చంపదు. చేయవలసిన పనులన్నీ మీరు చేసేరు. దేవదానవులనూ ఇంకా చరాచరాలన్నింటినీ బాహుబలంచేత జయించేరు. మహావైభవంతో లంకాపట్టణాన్ని పరిపాలించేరు. రాజులకు ఈనాలుగవ అవస్థలో వనవాసం మంచిదని సజ్జనులు చెపుతారు. అందుచేత మనం వనవాసానికివెళ్ళి మనలను పుట్టించి పెంచి లయంచేసే రామున్ని భజించవచ్చును. ప్రాణనాథా! నమస్కరించిన జనులను రక్షించేవాడూ గుణరహితుడూ అయిన శ్రీరామచంద్రుని మమకారం

విడిచి భజించండి. ఎవనికోసం మునులు జితేంద్రియులై జపాలుచేస్తారో ఎవనికోసం రాజులు రాజ్యాలువిడిచిపెట్టి వైరాగ్యంతో ప్రకాశిస్తుంటారో ఆశ్రీరాముడు ఆ ఆర్తరక్షకుడు మిమ్మ్మ కరుణించడానికే ఇక్కడకువచ్చేడు. నాథా! నావిజ్ఞప్తి ఇష్టపడితే పవిత్రమైన మీకీర్తి మూడు లోకాలలోనూ నిండిపోతుంది. అని కన్నీరుకారుస్తూ శరీరం వణకిపోతుండగా రావణుని పాదాలు రెండుచేతులతో పట్టుకొని నాథా! నాబొట్టు నిలపండి అంటూ గట్టిగా ఏడ్చింది. అప్పుడు రావణుడు ఆమెను లేవదీసి తన ప్రతాపం ఇలా చెపు తున్నాడు. ఇంతీ! వ్యర్థంగా ఎందుకు భయపడతావు? . నాతో సమానమైన వీరుడు ఎవడున్నాడు! దిక్పాలు లందరినీ గెలిచేను. సురాసురులూ నరులూ నాకు వశులు, చెలీ! భయపడకు. అని అనేకవిధాలుగా చెప్పి రావణుడు వెళ్ళి సభలో కూర్చున్నాడు? మండోదరి అంతఃపురంలో విచారిస్తూ కూర్చుని చివరకిలా ఊహించింది. నాపతి కాలవశుడవుటచేతనే ఇంత అభి మానం ఎక్కువై పోయింది. అనుకుంటూ ఇక లాభంలేదు అనిచింతిస్తుంది. అప్పుడు రావణుడు సభలో మంత్రులతో అంటున్నాడు.

## * రావణుడు మంత్రులతో ఆలోచించుట *

మంత్రులారా ! శత్రువులతో ఏ విధంగా యుద్ధం చెయ్యాలో మీరు ఊహించండి అన్నాడు. అదివిని మంత్రులంటున్నారు. రాక్షసేశ్వరా! మాటిమాటికీ ఈ విధంగా అడగడం ఎందుకు? భయంఅక్కరలేదు. దానవ నాథా ! ఆభల్లూకాలూ కపులూ మనకు ఆహారమైపోతారు. మీరేమీ విచారించ నక్కరలేదు, అని మంత్రులు చెప్పగానే ప్రహస్తుడులేచి చేతులు జోడించి రావణునితో అంటున్నాడు. రాజా ! ఈ మంత్రులకు బుద్ధితక్కువ అగు టచేత నీ ముఖమెదుట ఈ విధంగా ఇచ్చకాలాడుతున్నారు. నీతి తప్పి నడవగూడదు. దేవా ! మునుపొక వానరుడువచ్చి సాహసంతో పట్టణ మంతా కాల్చేసేడు. అతనిచరిత్ర అందరూ మనస్సులలో ఇప్పటికీ వినుతి స్తూనే ఉంటారు. భయంచేతా నీ దగ్గర ముఖప్రీతికి పైకి యథార్థంచెప్పరు.

అప్పుడు ఈ బింకాలు పలికేవారందరికే ఆకలవుటలేదుకాబోలు. అతన్ని మింగకుండా ఎందుకుపోనిచ్చేరో ? రాక్షసనాథా ! ఈనీతిపద్ధతిని వింటే మీకు మొదటసంతోషంగానే ఉండి తరువాత దుఃఖం కలుగుతుంది. వినోదంగా సముద్రంమీద సేతువుకట్టి దాటివచ్చి సువేలాచలంమీద విడిచియున్న ఆ రామలక్ష్మణులను మనుష్యులని వాళ్లను పట్టి మింగేస్తామనీ అసురనాథున్ని పొంగించడానికి చెడిపోయే సంగతి తెలియక లేనిపోని మాటలు చెప్పడం మీకుమంచిదికాదు. సోదరులారా! ఇక చాలు ఊరుకోండి అన్నాడు.

## * ప్రహస్తుడు రావణునికి నీతిచెప్పుట *

ఆ తరువాత ప్రహస్తుడు రావణునితో రాక్షసనాథా ! ఆదరంతో నామాటవిను. నామనస్సు అధైర్యానికి ఉనికపట్టి ఇలాచెపుతున్నాననుకోకు. ముఖప్రీతి మాటలు చెప్పేవారు చాలామంది ఉంటారు. మంచిమాటలు చెప్పేవారూ అదివినేవారూ తక్కువగానే ఉంటారు, నిశాచరేంద్రా ! ఇదిగో నేనుచెప్పే నీతి శ్రద్ధగావిను. దేవా ! ముందుగా రాముని దగ్గరకు ఒక దూతను పంపించు. తరువాత సీతాదేవిని అతనికి ఇచ్చి అతన్ని సేవించు, అంతేకాని మరే ఉపాయంచేతా ఇక సాధ్యంకాదు. రామలక్ష్మణులు సంతోషించి ఆమెను తీసికొని వెళ్లిపోతే యుద్ధంచెయ్యనక్కరేలేదు. అలా వెళ్లకపోతే అప్పుడు పంతంతో నిలబడి యుద్ధంచెయ్యడం మంచిది. రాక్షసేశ్వరా! ఈనానీతిబోధ విన్నట్టయితే నీవు ఉభయలోకాలలోనూ కీర్తిని పొందుతావు. అనిచెప్పగానే రావణునికి కోపంవచ్చి ఓరి దుర్మతీ ! నీకు ఎవడురా ఈ దుర్బుద్ధులన్నీ బోధించేడు ? దుష్టా ! నీవు కుమారుడవని ఇంతవరకూ ఏమో చెపుతావని విన్నాను. గొప్ప పటిమగల వెదురుపొదలో నిస్సారమైన దర్భగడ్డి పుట్టినట్టు గొప్ప ప్రతాపంగల నావంశంలో పుట్టేవేమిరా? అని ఇంకా పరుషవాక్యాలెన్నో ఆడుతుంటే విని ప్రహస్తుడు కాలవశుడైన వానికి మందు విషమైపోయినట్టు నీ మంచికోసం చెప్పినమాటలు నీకెలా యిష్టపడతాయి? అనిచెప్పి అక్కడ నిలవకుండా ఇంటికి వెళ్లిపోయేడు. సాయంకాలమైంది రావణుడుకూడా ఇంటికి వెళ్లిపోయేడు.

*రావణుడు లంకాపుర గోపురభవనంలో కొలువుచేయుట*

అప్పుడు రావణుడువెళ్లి గోపురం చివరనున్న విచిత్ర భవనంలో కొలువుదీర్చి కూర్చున్నాడు. కిన్నరులు అతని గుణాలు పాడుతున్నారు. వీణా స్వనాలూ మురజ రవాలూ వేణుగానాలూ తాళధ్వనులూ మృదంగ వాద్యాలూ ఎంతో చక్కగా వినిపిస్తున్నాయి. ప్రవీణతతో అప్సరసలు అనేక విధాలుగా నాట్యాలాడుతున్నారు. ఆ సమయంలో రావణుడు శిరస్సు మీద శత్రువులు ఉన్నారన్న మాటమరచిపోయి నూరుగురు దేవేంద్రుల వైభవాన్ని అనుభవిస్తూ మైమరచిపోయి కూర్చున్నాడు.

*రాముడు రావణుని పదిగొడుగులను మండోదరి కర్ణాభరణాలను పడవేయుట*

అప్పుడు సువేలాచలంమీద వానరసైన్యంతోకూడా శ్రీరామచంద్ర ప్రభువు సంతోషంగాఉన్నాడు. లక్ష్మణుడు ఎత్తూతెలుపూ రమణీయమూ అయిన ఆ పర్వతశిఖరాన్ని విశాలమైన చోట కృష్ణాజినం పువ్వులూ చిగుళ్లూ పరచి ఒకరమ్యమైన ఆసనం ఏర్పరచేడు. దానిమీద మూడులోకాలనూ మాయచేత నటింపజేసే రామవిభుడు సుగ్రీవుని ఒడిలో శిరస్సుఉంచి కూర్చున్నాడు. ఎడమపక్క కోదండం కుడిపక్కఅమ్ములపొదీ ప్రకాశిస్తు న్నాయి. చేతులతో బాణాలను సరిచేస్తున్నాడు. ఆ శ్రీరామచంద్రుని చెవిదగ్గర విభీషణుడు మంత్రరహస్యం చెపుతున్నాడు. భాగ్యశాలు లైన హనుమంతుడూ అంగదుడూ రామవిభుని పాదాలు ఒత్తుతు న్నారు లక్ష్మణుడు రామునివెనుక భాగాన్ని వీరాసనం వేసుకొని కూర్చు న్నాడు. అతని మొలను అమ్ములపొదీ చేత శరశరాసనాలూ ప్రకాశిస్తు న్నాయి. ఈ విధంగా సువేలాచలం మీద శ్రీరామ చంద్రుడు ఉన్నస్థితి తలంచుకొని ధ్యానంలో ఎవరు లీనమై పోతారో వారిజన్మమే భూమిమీద ఉత్తమజన్మ. అప్పుడు తూర్పుదిక్కున ఉదయించే చంద్రున్నిచూచి రాముడు అందరితోనూ ఇలా అంటున్నాడు. అదిగో చూచేరా చంద్రుడు

నిర్భయంగా సింహంలాగున కనిపిస్తున్నాడు. అతడు ఉదయపర్వత గుహలో నుండి వచ్చి ఆకాశం అనే అరణ్య వీధులలో తిరిగి అంధకారం అనే మదపుటేనుగుల కుంభస్థలాలను పగులగొట్టి పరాక్రమంతో బయలుదేరి వస్తున్నాడు. ఈ నక్షత్రాలన్నీ ముత్యాలులాగున ప్రకాశించి రాత్రి అనే స్త్రీకి హారాలలాగున కనిపిస్తున్నాయి, అని ప్రభువు చంద్రున్ని వర్ణించి ఏదీ మీరందరూ మీకు తోచినట్టుగా ఆ చంద్రునిలో ఉన్న నల్లనిమచ్చను వర్ణించండి అన్నాడు. అప్పుడు సుగ్రీవుడు అంటున్నాడు. శ్రీరామచంద్రా! చంద్రుడనే అద్దమందు భూమియొక్క నీడ నల్లగా కనిపిస్తుంది అన్నాడు. ఇంకొక వానరుడు అంటున్నాడు రామచంద్రా! రాహువు ఈ చంద్రున్ని పట్టుకున్నప్పుడు గట్టిగా కొట్టడాన్ని చంద్రుని హృదయం కమలిపోయి మచ్చలా కనిపిస్తుంది. అన్నాడు. మరొకడంటున్నాడు దేవా! బ్రహ్మ రతీదేవి ముఖాన్ని చెయ్యడానికి చంద్రునిలో సారం తీయడాన్ని చంద్రుని మధ్య రంధ్రంపడిపోయి దానిలోనుండి ఆకాశం నల్లని మచ్చలా కనిపిస్తుంది. అన్నాడు. అదివిని రాముడంటున్నాడు. ఈ చంద్రునికి విషం కూడా ఒకసోదరుడే. అందుచేత ఆవిషాన్ని తన వక్షాన్ని చేర్చుకొని విరహ జనుల్ని ఆవిష కిరణాలచేత బాధపడు తుంటాడు అన్నాడు. అదివిని హనుమంతు డంటున్నాడు. శ్రీరామచంద్రా! చంద్రుడు కూడా నీకు దాసుడే అగుటచేత నీలమేఘచ్ఛాయగల నీ మూర్తిని హృదయంలో నిలుపుకోవడంచేత నల్లగా మచ్చ కనిపిస్తుంది అన్నాడు. అతని మాటలకు రాముడు నవ్వేడు. అప్పుడు రాముడు దక్షిణదిక్కుగా చూచి అంటున్నాడు. విభీషణా! ఆదిక్కువైపు చూచేవా? మేఘాలూ ఉరుములూ నిండిపోయేయి. మెరుపులు మెరుస్తున్నాయి. వడగళ్లు వానపడ్తుందేమో? అన్నాడు. అప్పుడు విభీషణుడు మహాత్మా! కాదు లంకాపట్టణం గోపురశిఖరంలో ఒకమేడ ఉంది దానిలో రావణుడు వినోద సభ చేస్తున్నాడు. ఆమేఘాల్లాగున కనపడేవి అతని గొడుగులు. అవి మేఘవర్ణంతో ఉన్నాయి. ఆమెరుపులలా కనబడేవి మండోదరి కర్ణ భూషణాలు. అక్కడ వాయించే మృదంగాలూ మొదలైన

వాద్య ధ్వనులే ఉరుముల్లా వినబడుతున్నాయి. అనగానే రాముడు నవ్వి వాని దురభిమానం అణగగొట్టడానికి ధనస్సు ఎక్కుపెట్టి ఒక్కబాణంతో ఆ రాక్షసుని పది గొడుగులూ పద్ది రత్నకిరీటాలూ మండోదరి శ్రవణభూష ణాలూ భూమిమీద రాలిపోయేలాగున కొట్టేడు. సభవారందరూ చూచే లాగున అవన్నీ రాలిపోయేయి. రాముని బాణం తిరిగివచ్చి అమ్ములపొదిలో ప్రవేశించింది ఆ వినోదం చేసేసి. ఈ రహస్యం ఎవరికీ తెలియదు. ఆ రావణుని సభలోని వారందరూ గొడుగులూ కిరీటాలూ కర్ణభూషణాలూ పడి పోవడం చూచి సంశయంతో అనుకుంటున్నారు. ఇప్పుడు భూకంపం రాలేదు. గాలి అయినా విసరలేదు. ఎందుకు పడిపోయేయో కారణం తెలియదు. ఏవైనా అస్త్రశస్త్రాలైనా కనపడవు. ఈ ఘోరమైన దుశ్శకునం వల్లతప్పక కీడు కలుగుతుంది అంటూ విచారిస్తున్నారు. సభవారందరూ ఇలా అనడం విని రావణుడు చిరునవ్వుతో అంటున్నాడు. ఓ సభాసదులారా! మీరు భయ పడకండి. నాతలలన్నీ తెగిపోయినప్పుడే నాకు శుభంకలిగి నప్పుడు కిరీటాలు పడిపోయేసరికి అపశకునం అంటారెందుకు? మీరందరూ ఇళ్లకు వెళ్ళి సుఖంగా పరుండండి. అన్నాడు. అప్పుడు వారందరూ అతని సెలవుపొంది వెళ్లిపోయేరు. మండోదరి కర్ణభూషణాలు పడిపోయేయని మరింత కలత చెంది ముఖకాంతి తగ్గిపోగా కంటినీరు తుడుచుకుంటూ చేతులు జోడించి రావణునితో అంటుంది.

### * మండోదరి రావణునికి హితోపదేశం చేయుట *

ప్రాణనాథా! నా ప్రార్థనవిని రాముడు నరుడనే తలంపుమాని అత నితో విరోధం పొందవద్దు. అతడు. అఖిలజగాలకూ నాథుడు. అతనితో వైరమూ పంతమూ పనికిరాదు. శ్రీరామచంద్రుడు విశ్వరూపుడు. రఘు వంశమణి పద్నాలుగులోకాలూ అతని అవయవాలుగా కల్పింప బడ్డాయని వేదాలు వర్ణిస్తుంటాయి. అతని పాదాలు పాతాళలోకం, శిరస్సు సత్యలోకం ఇతర అవయవాలన్నీ తక్కినలోకాలు. అతని భ్రుకుటీ విలాసమే భయం

కరమైన కాలుడు. తలవెంట్రుకలు మేఘాలు. సూర్యచంద్రులు కన్నులు. దిక్కులు చెవులు. అశ్వినీ దేవతలు ముక్కురంధ్రాలు, రాత్రులూ పగళ్లూ నిమిషాలు. నిట్టూర్పు వాయువు అని శ్రుతులు చెపుతున్నాయి. వేదాలు మాటలు. లోభం పెదవి. దంతాలు యమధర్మరాజు. చిరునవ్వు మాయ. దిక్పతులు భుజాలు. ముఖం అగ్ని. వరుణుడు జిహ్వ, సృష్టి స్థితిలయాలు పనులు. వనస్పతులు రోమాలు. కొండలు ఎముకలు, నదులు నాడులు. కడుపు సముద్రం క్రింది ఇంద్రియాలన్నీ నరకలోకం. ఈవిధంగా వ్యాపించి యున్న కేశవునికి శివుడు అహంకారం. బ్రహ్మబుద్ధి మహత్తత్వం చిత్తం ఈవిధంగా సకలచరాచరలలోనూ నివసించి యున్నవాడు శ్రీరామ చంద్రుడు. జగదేకరక్షకుడు. ప్రాణప్రియా! అతనితో విరోధంపొందవద్దు. అతన్ని భక్తితో సేవించి నా సౌభాగ్యాన్ని నిలబెట్టండి. అని చెప్పిన భార్య మాటలకు నవ్వి రావణుడు ఆహాహా! బలవంతమైన మోహం యొక్క మహిమ. స్త్రీల స్వభావాలూ కవులు ఇలా వర్ణించేరు. చంచల స్వభావం, అబద్ధాలాడడం, గొప్పసాహసం, మాయా, భయమూ, అపరిశుభ్రతా, దయ లేకపోవడం, అవివేకం ఈ ఎనిమిది అవగుణాలూ వనితలకు ఉండే స్వభావాలని చెప్పేరు. అందుచేత శత్రువుయొక్క ఆకారాన్ని ఎంతో అభివర్ణించి చెప్పేవు. ఆతరువాత నాకుగొప్ప భయాన్ని ఉపదేశించేవు. మదిరాక్షీ! నీ చతురత నాకు తెలిసింది. ఈమిషపెట్టి ఇప్పుడు నామహిమనే పొగడి చెప్పేవు. నీ గూఢమైన మాటలు నాకు సుఖంగానే వినిపిస్తున్నాయి. భయాన్ని పోగొట్టేయి అన్నాడు. మండోదరి అదివిని అయ్యో! నావిభుడు కాలవశుడౌటచేత మనస్సు భ్రమజెందిపోయింది. అని మనస్సులో నిశ్చయం చేసుకుంది. ఈ విధంగా దశముఖుడు రాత్రల్లా వినోదించి సూర్యోదయం అయేసరికి నిశ్శంకగా మదాంధతతో ఎప్పటిలాగునే వెళ్లి సభలో కూర్చున్నాడు. మేఘం అమృతం వర్షించినా వేము పూయదు పండదు. ఎన్ని వందల బ్రహ్మలు గురువులై బోధించినా మూర్ఖునిమనస్సుకి బోధకలుగదు.

*అంగదుని రాయబారం*

అప్పుడు తెల్లవారగానే శ్రీరామచంద్రుడు మంత్రులందరినీ పిలిచి ఇప్పుడు మనకర్తవ్యం ఏమో ఆలోచించి చెప్పండి. అన్నాడు. అనగానే జాంబవంతుడు రాముని పాదపద్మాలకు నమస్కరించి సర్వజ్ఞా! సకల హృదయవాసీ! శ్రీరామా! నాకుతోచిన మంత్రాలోచన చెపుతున్నాను విను. అంగదున్ని రావణుని దగ్గరకు దూతగా పంపిస్తే బాగుంటుంది. అన్నాడు. అందరూ అదిబాగుందన్నారు. అప్పుడు రాముడు అంగదున్ని పిలిచి ఓకుమారా! అంగదా! నీవు బలానికీ బుద్ధికీ గుణాలకూ గొప్ప నిపుణత గలవాడవు, కాబట్టి నీవులంకాపట్నానికి వెళ్లిశత్రువుకు మేలు కలిగే లాగునా మనకార్యం నెరవేరేలాగునా వానికిచెప్పు. నీవుచతురబుద్ధిగల వాడవు, నీకునీతి బోధించనక్కరలేదు, నానిమిత్తం వెళ్లికార్య సాఫల్యం చేసికొనిరా, అనగానే అంగదుడు ప్రభువుయొక్క ఆజ్ఞశిరస్సున ధరించి నమస్కరించి నిలబడి దేవా! నీవుఎవరినికృపాదృష్టితోచూస్తావో అతడే గుణ నిధి అవుతాడు, ఈకార్యంనాచేతచేయించి నన్ను కృతకృత్యున్ని చెయ్యాలని కరుణచూపించేవు. అని శరీరంపులకరించగా అంగదుడు ఆనందంతో ఉప్పొంగిపోయేడు. గౌరీ! అప్పుడుఅంగదుడు శ్రీరాముని పాదపద్మాలకు నమస్కరించి కపులందరకూ మ్రొక్కిరాముని ఘనతమనస్సులో నిలుపుకొని ఆనందంతో వెళ్లేడు. అతడుసహజంగా సంశయంలేనివాడు యుద్ధంలోధీరుడు రామభక్తుడు. వీరుడుసాహసంగలవాడు. అతడులంకా పట్నంలోకి వెళ్లేసరికి ఆటలాడుకుంటూ రావణునికొడుకు ఒకడు కనిపించేడు. అప్పుడు వారిద్దరూ మాటా మాటా అనుకొని అంగదున్నిచూచి మండిపడి రావణుని కొడుకు అంగదున్ని తన్నడానికి కాలెత్తేడు, ఆకాలుపట్టుకొని అంగదుడుగిరగిరతిప్పి నేలనువేసికొట్టేడు. అప్పుడుఅక్కడ ఉన్నరాక్షసులు భయపడిపోయిఆవీరుని దగ్గరనిలువలేక పారిపోయేరు.. రావణునికొడుకు చచ్చేడని ఒకరితో ఒకరు చెప్పుకోకుండా భయంచేత ఎరిగికూడా ఎరగనట్టు ఊరుకున్నారు, పూర్వం మనపట్నం కాల్చినపరాక్రమవంతుడు మళ్లావచ్చేడు. అమ్మయ్యో! అంటూ

పురంలోగొప్ప కోలాహలం అయిపోయింది. అయ్యో! మళ్లావిధిపం చెయ్య దలంచేడో అనిమహాభయంతో రాక్షసులందరూ అంగదుడు అడగకపోయినా దారిచూపించేస్తున్నారు. అంగదుడు ఎవరివైపు చూస్తేవారు ఎండిపోతున్నారు.. అతడు రామచంద్రుణ్ని స్మరించుకుంటూ రాక్షససభలోకివెళ్లి అటూ ఇటూ చూస్తూనిలబడ్డాడు. మదించినఏనుగులాగున అంగదుడుచూస్తూ ఒక రాక్షసుని పిలిచినేను వచ్చినట్టుగా మీరాజుతోచెప్పి రమ్మన్నాడు, వాడువెళ్లిచెప్పగానే విని రావణుడు నవ్వి ఇలాతీసుకురా! అదెక్కడికో తెలిసికోవాలి అన్నాడు. రావణుని ఆజ్ఞప్రకారం వాడువచ్చి అంగదుణ్ని తీసుకొనివెళ్లేడు, అప్పుడు ప్రాణంతోఉన్న అంజన పర్వతమేమో అన్నట్టు నల్లని శరీరంగలవాడూ మదమత్తుడూ పెద్దవృక్షాలవంటి చేతులూకొండ శిఖరాలలాంటి శిరస్సులూ తీగెలలాంటి రోమాలూ పెద్దకొండగుహల లాంటిముక్కు రంధ్రాలూ చెవులూ గలవాడూ అయినరాక్షస నాథుణ్ని ఆ ఆస్థానంమధ్యన అంగదుడు చూచేడు, చూచిసంశయం లేకుండాధైర్యపరాక్రమాలతో సభలోప్రవేశించే సరికి సభలోని వారందరూ అతన్నిచూచి లేచినిలబడ్డారు, అదిచూచి రావణుడు క్రోధంపొందేడు, అప్పుడు అంగదుడు మదించినఏనుగుల మధ్య చొరబడే సింహంపిల్లలాగున సభలోకివెళ్లి రాముని ప్రతాపం స్మరించుకొని నమస్కరించుకొని నిర్భయంగా సభలోకూర్చున్నాడు. పార్వతీ! అప్పుడు రావణుడు అంగదుణ్ని చూచిఓకపీ ! నీవు ఎవడవు? అన్నాడు. అనగానే అంగదుడు దశాశ్యా! నేనురఘురామునిదూతను, నాతండ్రీనీవూ స్నేహితులని తెలిసి నీమేలుకోరిన వాడనౌటచేత నీకు కొంచెంబుద్ధి చెప్పాలని వచ్చేను. రావణా! నీవుఘనుడైన పులస్త్యుని వంశంలోపుట్టేవు. శివుణ్నిభక్తితో పూజించేవు. బ్రహ్మచేతవరాలు పొందేవు, దేవతలనూ దిక్పతులనూ యుద్ధంలో జయించేవు, అఖిలకార్య ధురంధరుడవు, రాజ్యాభిమానంచేతనో మోహావశుడవయో లోకమాతనుతెచ్చేవు, సరే, ఇప్పుడు నేను చెప్పేబుద్ధి విను, నీకుశుభం కలుగుతుంది, దనుజనాథా! రాముడు అపరాధాన్ని కృపతో క్షమిస్తాడు, కనుకనీవునోటిని గడ్డికరచుకొని గొడ్డలిమెడమీద వేసుకొనిపరి

వారంఅంతటిలోనూ నీభార్యాసహితంగా సీతాదేవినీముందు నడిపించి రామ చంద్రుని సన్నిధానానికి పద. అలావెళ్లి భయాన్నినిడిచిపెట్టి ఓప్రణతజన పాలా! సనకాదులచేత పూజింపబడేవాడా! హరీ! దీనరక్షకా! నన్నుకాపాడు. నన్నుకాపాడు, అనివేడుకున్నావంటే నీకుఅభయంఇస్తాడు. నీఆర్తవచనాలు విని కనికరంతో చూస్తాడు. నీకుసౌఖ్యంకలుగుతుంది, అనగానేవిని రావణుడు ఓరికోతికుఙ్ఞా! నోరుసరిచేసుకొనిమాటాడరా, నన్నుదేవద్వేషిని అనితెలిసికో మూర్ఖా! నిన్నూనీతండ్రినీ నేనెరుగనురా మీపేర్లేమిరా? ఏసంబంధంవల్ల నీ తండ్రితోనాకు స్నేహమైందిరా? చెప్పరా, అన్నాడు, అదివిని పరాక్రమ వంతుడైన అంగదుడు రావణా! నేనుఅంగదుడు అనేవాన్నివాలికుమారున్ని నీవుపూర్వం మాతండ్రిని కలుసుకొనేఉంటావు. జ్ఞాపకంతెచ్చుకో, అనగానే రావణుడు సంశయిస్తూ ఔను. వాలి అనే వానరుడు ఒకడుండేవాడు. వాడి కొడుకువటరా? ఓరినీచుడా! అయితేకులం చెరపడానికి అగ్నిహోత్రుడిలాగ పుట్టేవురా. అందుచేతనే దీనులైన తపసులకు దూతవైనావు, నిన్నుకన్న కడుపు జారిపోకఎందుకు నిలిచిందిరా? ఒరే! వాలిఇప్పుడు క్షేమంగాఉన్నాడా? ఎక్కడఉన్నాడు? అనేసరికినవ్వి అంగదుడు రావణా! పదిదినాలు ఆగేవంటే అతన్నికలుసుకొని సఖునిక్షేమం అడుగుదువులే, రామవిరోధికి క్షేమం ఎలా కలుగుతుంది? అంతా అతనివల్ల తెలుసుకుంటావు, మూఢా! ఏమన్నావు.? నేనుకులంచెరపడానికి పుట్టేనా? నీవుకులాన్ని రక్షించడానికి పుట్టేవా? ఇరవై చెవులూ ఇరవైకన్నులూ ఉన్నాయినీకు, ఏంలాభం? చెవిటివాడూ గుడ్డివాడూ కూడా నీలాఅనరు. ఓరిచెనటీ! శివుడూబ్రహ్మాది దేవతలూ ఎవనిపాదసేవ కోరుతుంటారో అతని దూతనై ఉండిన్నీనేను అన్వయంపాడు చేసేనటరా ? నీచా! అటువంటిబుద్ధి నీకుకలిగినందుకు పటేలుమని నీహృదయం పగిలిపో దేమిరా? పాపాత్ముడా! మొండికెత్తికూర్చున్న నీకుమంచి బోధ ఎలాతల కెక్కుతుందిరా? నీకు శుభం ఎలాకలుగుతుందిరా? అని అంగదుడు ఆడే పరుష వచనాలకు దశముఖుడు కండ్లెఱ్ఱచేసి ఓరీ ఖలా! నీతి ధర్మం ఆలో చించి కఠినమైన నీమాటలకు సహిస్తున్నాను. అన్నాడు. అప్పుడు అంగదుడు

ఓరినీచుడా నీశీలధర్మాలన్నీ ఎరుగుదును. పరస్త్రీలను భోగించుకొని వచ్చినప్పుడే తెలిసింది. దూతను రక్షించడంనీతి అంతకుముందే తెలిసింది. ఓరిధర్మపరుడా! మునిగిపోనవేమిరా! మూఢా! నీచెల్లెలి ముక్కూ చెవులూ పోయినప్పుడు చూచిధర్మం ఆలోచించే కాబోలు క్షమించేవు. నీధర్మశీలం అంతా ప్రపంచంలో వెలిగిపోతుందిరా, నేనుభాగ్యశాలి నవుటచేత నీదర్శనం లభించింది. అధమా! దురాత్మా అనేసరికి రావణుడు ఓరీ! జడజంతువైన కోతిగాడా! వ్యర్థంగా జల్పాలాడకు. ఇవిగో నాబాహువులుచూడు. ఇవిలోక పాలకులనే చంద్రులకు రాహువులలాంటివి. దేవతలు అనే పర్వతాలకు వజ్రాయుధాలు. ఇంకాఆకాశం అనేసరస్సులో నాచేతులనే పద్మాలుండి ఒక హంసలాగున వెండికొండని శివునితో కూడా పైకెత్తేయి, అదినీమనస్సులో ఆలోచించుకో ఒరే! నాతోసమానమైన వీరుడు మీసైన్యంలో ఒకడైనా ఉన్నాడటరా ? ఓరివనచరా ? భార్యావిరహంచేత మీస్వామి బలహీనుడై పోయేడు. అతనితమ్ముడూ దుఃఖితుడూ మలినమనస్సు గలవాడూను. నీవూ సుగ్రీవుడూ ఆసైన్యమనే నదికిఒడ్డుననున్న వృక్షాలలాటివారు. ఇకమాకులానికి కళంకంతెచ్చిన నాసోదరుడు అధైర్యానికిపెద్ద. ఇకమంత్రైన జాంబవంతుడు ముసలివాడు. ఎలామీరు ఆలోచనలేకుండా యుద్ధానికిబయలుదేరేరు ఇంకా శిల్పనైపుణ్యం కలిగి నీలుడూ నలుడూఉన్నారంటే వాళ్ళుబలహీనులు ముందుగా వచ్చిమాపట్టణం కాల్చినవాడు ఒక్కడే కొంచెంబలవంతుడు, అనేసరికి పక్కననవ్వి అంగదుడు అంటున్నాడు. అసురనాథా! నిజంగా బలవంతుడవైన నీపట్నాన్ని ఒకకోతి కాల్చేసిందా? అబ్బే అలాఎవరైనా అనగలరా? వినగలరా? ఓరివెఱ్ఱిదానవుడా ! నీవుఎవనినైతే బలవంతుడని చెప్పేవో అతడే సుగ్రీవున్ని కొలిచేకపులలో చిన్నదూత, రాజుఎక్కడకు పంపితే అక్కడకు ఎన్నోసార్లు వెళుతుంటాడు. అతడుఅట్టే సాహసవీరుడు కాడు. అతన్ని మేము ఇక్కడివార్తలు తెలిసికొని రమ్మనిపంపితే వచ్చేడు. రాక్షసరాజా! అతడురాముని ఆజ్ఞలేకుండా నీపురాన్ని కాల్చి రావడంచేత భయపడి సుగ్రీవుని దగ్గరకు రాకుండా ఏకొండ గుహలోనో, దాగున్నాడు.

ఓరినీచుడా నీశీలధర్మాలన్నీ ఎరుగుదును. పరస్త్రీని దొంగిలించుకొని వచ్చినప్పుడే తెలిసింది. దూతను రక్షించడంనీతి అంతకుముందే తెలిసింది. ఓరిధర్మపరుడా! మునిగిపానవేమిరా! మూఢా! నీచెల్లెలి ముక్కూ చెవులూ పోయినప్పుడు చూచిధర్మం ఆలోచించే కాబోలు క్షమించేవు. నీధర్మశీలం అంతా ప్రపంచంలో వెలిగిపోతుందిరా, నేనుభాగ్యశాలి నవుటచేత నీదర్శనం లభించింది. అధమా! దురాత్మా అనేసరికి రావణుడు ఓరీ! జడజంతువైన కోతిగాడా! వ్యర్థంగా జల్పాలాడకు. ఇవిగో నాబాహువులుచూడు. ఇవిలోక పాలకులనే చంద్రులకు రాహువులలాంటివి. దేవతలు అనే పర్వతాలకు వజ్రాయుధాలు. ఇంకాఆకాశం అనేసరస్సులో నాచేతులనే పద్మాలుండి ఒక హంసలాగున వెండికొండని శివునితో కూడా పైకెత్తేయి, అదినీమనస్సులో ఆలోచించుకో ఒరే! నాతోసమానమైన వీరుడు మీసైన్యంలో ఒకడైనా ఉన్నాడటరా ? ఓరివనచరా ? భార్యావిరహంచేత మీస్వామి బలహీనుడై పోయేడు. అతనితమ్ముడూ దుఃఖితుడూ మలినమనస్సు గలవాడూను, నీవూ సుగ్రీవుడూ ఆసైన్యమనే నదికిఒడ్డుననున్న వృక్షాలలాటివారు. ఇకమాకులానికి కళంకంతెచ్చిన నాసోదరుడు అధైర్యానికిపెద్ద. ఇకమంత్రియైన జాంబవంతుడు ముసలివాడు. ఎలామీరు ఆలోచనలేకుండా యుద్ధానికిబయలుదేరేరు ఇంకా శిల్పనైపుణ్యం కలిగి నీలుడూ నలుడూఉన్నారంటే వాళ్ళుబలహీనులు ముందుగా వచ్చిమాపట్టణం కాల్చినవాడు ఒక్కడే కొంచెంబలవంతుడు, అనేసరికి పక్కననవ్వి అంగదుడు అంటున్నాడు. అసురనాథా! నిజంగా బలవంతుడవైన నీపట్నాన్ని ఒకకోతి కాల్చేసిందా? అబ్బే అలాఎవరైనా అనగలరా? వినగలరా? ఓరివెట్టిదానవుడా ! నీవుఎవనినైతే బలవంతుడని చెప్పేవో అతడే సుగ్రీవుని కొలిచేకపులలో చిన్నదూత, రాజుఎక్కడకు పంపితే అక్కడకు ఎన్నోసార్లు వెళుతుంటాడు. అతడుఅట్టే సాహసవీరుడు కాడు. అతన్నిమేము ఇక్కడివార్తలు తెలిసికొని రమ్మనిపంపితే వచ్చేడు. రాక్షసరాజా! అతడురాముని ఆజ్ఞలేకుండా నీపురాన్నికాల్చి రావడంచేత భయపడి సుగ్రీవుని దగ్గరకు రాకుండా ఏకొండ గుహలోనో, దాగున్నాడు.

వాలునిచేత గుఱ్ఱాలసాలలో కట్టబడిఆటకోసం ఆబాలుడుకొడుతుంటే మొఱ్ఱ పెట్టే ఆరావణుని బలిచక్రవర్తి కరుణతో విడిపించేడని విన్నాను. అసురే శ్వరా! ఆరావణుడు బలవంతుడవైన నీవా ? మరొకడా ? తరువాత ఒక రావణున్ని కార్తవీర్యార్జునుడు చూచిఒకజంతువును పట్టుకున్నట్టు పట్టుకొని వినోదంగా ఇంటికి తీసికొనిపోతే అతన్నిపులస్త్యముని దయతోవిడిపించేడని విన్నాను, నీవుఅతడివేనా? లేకపరొకడవా? రాక్షసేంద్రా! ఇంకొక రావణా సురున్ని గురించిచెప్పడానికి సంకోచిస్తున్నాను. వాలిచంకలో ఇమిడిపోయి మిడతలాగున నలిగిపోయేడా రావణాసురుడని అందరూ చెప్పుకుంటుంటారు. ఇంతమంది రావణాసురులలో నీవెవడవో సత్యంచెప్పి నాసందేహం తీర్చు. అన్నాడు అంగదుడు, అదివిని రావణుడు ఓరి శఠా! వినరా. ఎవని బాహు బలాన్ని కైలాసపర్వతం ఎరుగునో అటువంటి సాటిలేని బలవంతుడినైన రావణున్నిరానేను. ఓరిచపల మర్కటా! శిరస్సులనే పువ్వులతో పూజ చేస్తే మెచ్చి వరాలిచ్చిన శంభుడు ఎరుగునురా నాగొప్పశూరత్వం. నాచేతులతో నాశిరస్సులు నరికి ఆశిరస్సులనే తామరపువ్వులతో ఎన్నోసార్లు మహేశ్వ రున్ని పూజించేనురా, నాబాహుబలందిక్పతులకు తెలుసునురా: ఆదిజ్ఞాపకం వచ్చి ఇప్పుడుకూడా వారుమనస్సులలో తపించిపోతుంటారురా. విసరా! నావక్షస్థలం యొక్క కఠినత్వం దిగ్గజాలకే తెలుసును. పరాక్రమంతో నేను వెళ్లివాటితో డీకొనేసరికి ఆఏనుగులు తెల్లనిదంతాలతో వచ్చి నాతోపోట్లాడ గానే ఆదంతాలు నావక్షానికితాకి ముక్కముక్కలై భూమిమీద పడిపోతుం డేవి. తెలిసిందా? చిన్నఓడమీద మదించిన ఏనుగుఎక్కినట్టు ఈభూమి ఎవనినడకవల్ల అల్లలాడిపోతుందో అటువంటి జగద్విదితమైన ప్రతాపవంతు న్నిరానేను. ఓరిమిథ్యాప్రలాపీ! ప్రతాపవంతుడైన రావణున్నిరానేను. నా ప్రసిద్ధివిని యుండలేదటరా ? నరులను గొప్పచేసి నాదగ్గర చెపుతున్నావు. అనేసరికి అంగదుడికి కోపంవచ్చి తిన్నగామాట్లాడరా అధమా! దురభిమానీ! నిన్నుకట్టి ఈడ్చిన కార్తవీర్యుడి భుజాలనే వనానికి ఎవనిపరశువు అగ్ని హోత్రమైందో ఎవనికుఠారం సముద్రమై రాజులందరినీ ముంచేసిందో

అటువంటి మహాత్ముడైన పరశురాముడే రాముని సందర్శన మాత్రాన్న గర్వాన్నీ అభిమానాన్నీ విడిచిపెట్టేసేడు అతనిదర్శనంవల్లే అభిమానం వదలిపోతుంది. అటువంటి ప్రభువును మానవుడంటావురా? అభాగ్యుడా! రాముడు మానవుడా? మన్మధుడు ఒకవిలుకాడా? గంగానది ఒకయేరా? కోరికలన్నీ ఇచ్చేకల్పవృక్షం ఒకచెట్టా? కామధేనువు భూమిమీద ఒకఆవు వంటిదా? అన్నదానం అన్నిదానాల వంటిదా? అమృతం ఒకరసమా? గరుత్మంతుడు ఒకపక్షి? శేషుడు సాధారణమైన పామా? చింతామణి ఒక రాయా? వైకుంఠం అన్నిలోకాలవంటిదా? ఓరిమందబుద్ధీ! శ్రీరామపాద భక్తి దొరకడంకంటే గొప్పలాభం మరేదైనా ఉన్నదటరా? ఓరిపాపాత్ముడా! నీగర్వాన్ని చంపి నీఅభిమానాన్ని అణగగొట్టి తోటలతాపెరికి నీసైన్యాన్ని చంపి నీపురాన్ని కాల్చినీపుత్రున్ని సంహరించిన హనుమంతున్ని సాధారణ మైన ఒకకోతి అని తలంచుతున్నావురా? మూఢుడా! నామాటవిని కృపా సముద్రుడైన శ్రీరామచంద్రున్ని మనసారా సేవించకపోయి నట్టయితే ఆబ్రహ్మశివుడూ కూడా నిన్ను కాపాడలేడురా. దురాత్మా! వ్యర్థంగా దురూక్తులాడకు రామునితో విరోధంవల్ల నీశిరస్సులు పడిపోతాయి. ఇదే నీకుఫలితం. నీమనస్సులో ఆలోచించుకో. అప్పుడు నీతలకాయలు వానరులూ భల్లూకాలూ బంతులలాగున పట్టుకొని ఆడతారు. రామునికి కోపంవస్తే బాణాలు కుప్పలు కుప్పలుగా వచ్చి పడతాయి. ఎందుకు ఇలా దుర్భాషలాడ తావు? ఇదంతా తలంచుకొని అభిమానం విడిచిపెట్టి రాముణ్ణి సేవించు, అన్నాడు. ఆ మాటవినగానే రావణుడు మండుతున్న అగ్నిలో నెయ్యి పోసినట్టు మండిపడి ఓరి వానరా! ఈ చరాచర జీవలోకాలన్నింటినీ పరా క్రమంచేత గెలిచేను. ఇంద్రుని జయించిన నాకుమారుడున్నాడు. యుద్ధంలో అతి భయంకరుడైన నా తమ్ముడు కుంభకర్ణుడున్నాడు. ఆ ప్రసిద్ధికెక్కిన వారినీ నన్నూ జయించే వీరుడు ఈ లోకంలో లేడు. నీచమైన కోతులతో స్నేహంచేసి సముద్రంపై వంతెన కట్టడం ఒక మహత్వమా? ఎన్నో పక్షులు సముద్రాన్ని సుఖవుగా దాటేస్తాయి. అయితే అవన్నీ వీరత్వంగల

ఎనా? ఒర వానరా! నా భుజ సముద్రాలు బలం అనే నీటితో నిండి ఉన్నాయి. దేవతలూ నరులూ మొదలైన శూరులందరూ అందులో మునిగి పోతారు. ఈ లోతైన ఇరవై సముద్రాలూ ఎవరూ దాటలేరు, నా భుజ సముద్రాలలో దిక్పాలకులచేత నీరు నింపించేను. అటువంటి నా దగ్గర రాజుల కీర్తిని వినిపిస్తావురా మూర్ఖా! సిగ్గులేక నీవు వర్ణించి చెపుతున్న స్వామి రణధీరుడే అయితే నా దగ్గరకు దూతనెందుకు పంపుతాడు? మంచి మాటలాడి శత్రువులను బతిమిలాడుకోవడం సిగ్గు కాదా? కైలాస పర్వతాన్ని ఎత్తిన నా చేతులు చూచి అప్పుడు నీ ప్రభువు మహత్వం పొగడు. రావణునితో సమానమైన వీరుడు ఎవడున్నాడురా? ఈ రాక్షసేశ్వరుడు తన చేతులతో తన శిరస్సులు నరికి ఎన్నోసార్లు అగ్నిలో హోమం చేసేడు. దీనికి సాక్షి శివుడే, అటువంటి నన్ను కోతులూ మనుష్యులూ జయిస్తారా? ఆ కపాలాలు అగ్నిలో కాలిపోతుంటే ఆ నుదుట బ్రహ్మ వ్రాసిన వ్రాత చూచేను. నాకు నరునిచేత మృత్యువని వ్రాసి ఉంది. అదంతా అసత్యం అని నవ్వేను. ముసలివాడైన బ్రహ్మ మతితప్పిపోయి అలా వ్రాసేడు, కాని నేను భయపడలేదు. నాయెదుట బలవంతుడూ శూరుడూ ఎవడూ లేడు. నీవు సిగ్గూ మర్యాదా విడిచిపెట్టి ఒక నరున్ని బలవంతుడూ శూరుడూ అని స్తుతిస్తావెందుకు? ఓరి మర్కటా! హీన బుద్ధీ! అన్నాడు. ఆ మాటలు విని అంగదుడు ఓరీ! పంక్తికంఠా! నీతో సమానమైన సిగ్గుగలవాడు లోకంలో ఒకడూలేడు. నీవే సిగ్గుగలవాడవు. నీ సుగుణాలన్నీ నీ నోటితోనే స్తుతించుకుంటున్నావు, నీతలకాయలు ఆహుతి చెయ్యడం కొండ భుజాలతో ఎత్తడం మనస్సులో బాగా నాటిపోవడంచేత మళ్లా మళ్లా ఇరవైసార్లు చెప్పినావు. కాని దుర్మార్గుడా! ఏ భుజ బలంవల్ల కార్తవీర్యునిచేతా వాలిచేతా బలిచక్రవర్తిచేతా సన్మానం పొందేవో ఆ భుజబలం చెప్పక దాచేస్తున్నావేమి? సరిగా నాకు సమాధానం చెప్పరా మందమతీ! శిరస్సులు నరుక్కున్నవాడు గొప్పవీరుడేనా? ఇంద్రజాలకుడూ నెత్తికోతలవాడూ శరీరమంతా కోసుకుంటారే. అయితే వాళ్లూ వీరులే అన

వచ్చును. మోహంచేత మిడతలు అగ్నిలో పడిపోతాయి. గొప్పబరువులు గాడిదలు మోస్తాయి. అవన్నీ శూరులే అనవచ్చునా? నీమనస్సులో ఆలోచించరా నీచబుద్ధీ! ఈ అధిక ప్రసంగంమాని నా మాటవిను. నీ దురభిమానం విడిచిపెట్టు. నేను దౌత్యం చెయ్యడానికి రాలేదు. రాముడు నన్ను పంపేటప్పుడు ఇలా అన్నాడు. నక్కని చంపితే సింహానికి కీర్తిరాదు. ఆ దుష్ట రాక్షసుడికి నీతి బోధించుమని చెప్పేడు. ఆ విభుని మాటలు మనస్సులో ఉంచుకొని నీవెన్ని పరుషాలాడినా సహించేను. లేకపోతే రావణా! ఇప్పుడే నీ శిరస్సులు నరికేసి సీతాదేవిని తీసికొని వెళ్లిపోదును. దుష్టుడా! ఒంటరిగా ఉండడం చూచి పరస్త్రీని దొంగిలించుకొనివచ్చేవు. నీ సామర్థ్యం ఎరుగుదును. నీవు రాక్షసరాజువు గాబట్టి కావరంచేతా గర్వంచేతా నిన్ను నీవు కానకుంటున్నావు. నేను రామసేవకుడనూ దూతనూ అవుటచేత స్వామి సెలవు పొందలేదని సంశయిస్తున్నానుగాని లేకపోతే నీ లంకా పట్టణం అంతా పాడుచేసి నిన్ను పట్టుకొని బలంతో నేలనువేసికొట్టి నీ భటులందరినీ చంపి నీ స్త్రీలందరినీ సీతాదేవినీ తీసుకొని వేగంగా వెళ్లిపోదును. కాని అలాచేస్తే నాకు గొప్పదనంకాదు. చచ్చినదాన్ని చంపడం శౌర్యం అనిపించుకోదు. నీవు మందబుద్ధివి. కల్లుతాగి మత్తెక్కి ఉన్నావు. లోభివి కామవశుడివి. కేవలం దరిద్రుడివి. మూఢుడివి, క్షుద్రుడివి. మిక్కిలి ముదిసినవాడివి. ఎల్లప్పుడూ రోగానికి వశుడవైనవాడివి క్రోధివి. పశుసమానుడివి హరివిముఖుడివి.

వేదాలకూ సజ్జనులకూ విరోధివి శరీరాన్ని పోషించుకొనేవాడివి. పాపానికిగనివి. భేదధర్మసుడివి. ప్రియంలేని మాటలాడేవాడివి. అసత్యం పలికేవాడివి. అతి దుష్టుడివి. పరనిందాపరుడివి. కరుణలేనివాడివి. స్థిరబుద్ధి లేనివాడివి. వివేకంలేని కార్యాలయందు ఆసక్తి కలవాడవు: దుర్నయుడివి. ఎల్లప్పుడూ హింస చేసేవాడివి. తేజంలేనివాడివి. ఇటువంటి నీలాంటి గుణాలన్నీ ఉన్నవారిని అందరినీ జీవన్మృతులనే అంటారు. అటువంటి శవాలనిచూస్తే పాపం కలుగుతుంది. ఆపాపం శ్రీరామ నామం జపిస్తేనే

గానివోదు. అది ఆలోచించి నిన్ను చంపలేదు. నాకు కోపం పుట్టేలాగున చెయ్యకు. అనేసరికి రావణుడు క్రోధంతో పెదవికరచి చెయ్యిచాపి అంటున్నాడు. ఔరా వానరుడా ఏమిరా చావుకోరుతున్నావు ఇప్పుడు? నోరుచిన్నదీ మాట పెద్దదిగా ఉంది. ఎవని బలం చూచుకొనిరా ఈ పరుషాలాడుతున్నావు? నీ ప్రభువుకి బలమూ బుద్ధీ తేజమూ ప్రభావం ప్రతాపం కూడా లేవు. చాలాఅధైర్యవంతుడు, భయంగలవాడు గుణం మానం మర్యాదలేనివాడు కాబట్టే అతన్ని తండ్రి అరణ్యానికి పంపేసేడు. ఆ అడవిలో కష్టాలకుతోడు భార్యావిరహం ఒకటొచ్చింది. రాత్రింబగళ్లూ సుఖం ఎరుగడు. అటుపైని నాభయం ఒకటి బాధిస్తుంది అలాంటి మనుష్యులు ఎంతమందో మాకు ఆహారమై పోతుంటారనితెలుసుకో, అతనిబల శౌర్యాలు ఇంక నాతో చెప్పకు. అన్నాడు. రావణుడు రామనింద ఎప్పుడుచేసేడో అప్పుడు అంగదుడు మహాక్రోధం పొందేడు. విష్ణునిందా శివనిందావింటే గోవును చంపినంతపాపం, బుద్ధిమంతుడు ఆదివిని సహించలేడు. అంగదుడు క్రోధంతో పండ్లుగీటుకుంటూ ముఖం ఎఱ్ఱబడగా భుజాలుచాచి భూమిమీద గట్టిగా ఒక గుద్దుగుద్దేడు. ఆదెబ్బకు భూమఊగి పోయింది. సభలోని వారందరూ చాపచుట్టగా పడిపోయి భయంతో ఎటోపారిపోయేరు. రావణుడు కూడా పడిపోయివెంటనే లేచిసర్దుకొని కిరీటాలు పడిపోతే కొన్నితీసికొని తలల మీద పెట్టుకొన్నాడు. కొన్నికిరీటాలు తీసి అంగదుడు రాముడి పాదాలదగ్గర పడేలాగున విసిరేడు. అదిచూచి వానరులు పగలే చుక్కలు రాలేయని భయపడి పారిపోయేరు. రావణుడు ఆయుధాలు పంపేడేమో అని కొందరు అనుకున్నారు, అదిచూచి రాముడునవ్వి భయపడకండి,చుక్కలూ రాలలేదు. పిడుగులూ పడలేదు. రాహుకేతువులనే గ్రహాలూకావు, అంగధుడుపంపించిన రావణుని కిరీటాలవి. అనగానే వాయుపుత్రుడు ఆకాశానికిఎగిరి అవితీసికొని వచ్చి రాముని పాదసన్నిధిని పెట్టేడు. అవి సూర్యకిరణాల లాగున ప్రకాశిస్తున్నాయి. ఆవినోదమంతా వానరులూ భల్లూకాలూ ఆశ్చర్యంతో చూచేరు. అక్కడరావణుడు క్రోధంతో ఈకోతినిపట్టుకొనిచంపండిఅన్నాడు. అంగదుడు

మూఢుడా! ఎక్కడనేర్చుకున్నావురా? ఇలాంటిప్రలాపాలు వాలి ఇలాంటివి ఎరగడు. ఆ తపసులను చేరి ఇలాంటి వన్నీ నేర్చుకున్నావు అన్నాడు. అనేసరికి అంగదుడు ఔను వాచాలుడినేగా ఇప్పుడు నీ వది జిహ్వాలూ పెకలిం చెయ్యకపోవడంచేత అనిచెప్పి అంగదుడు మహాకోపంతో రాముని ప్రతాపం స్మరించుకొని ప్రతిజ్ఞపూని ఆసభలో తనపాదాన్ని గట్టిగామోపి ఒరే! ఇప్పుడు నాపాదం కదలప గలిగేవంటే సీతాదేవిని ఓడిపోయిరాముడు తిరిగివెళ్లిపోతాడు, అన్నాడు. అదివిని దశముఖుడు రాక్షసభటులతో వీడి కాలుపట్టుకొని భూమిమీదపడదోసెయ్యండి అన్నాడు. అనగానే ఇంద్రజిత్తు మొదలైన యోధులందరూ సంతోషంతో లేచి ఆతనిపాదం కొంచెమైనా కదల్చలేక సిగ్గుపడి కూర్చున్నారు. రక్కస రాక్షసులందరూ ఎంతబలం చూపి ఏ ఉపాయంచేసినా ప్రయోజనం లేకపోయింది ఎందరుఅసురవీరులు న్నారో అందరూ ప్రయత్నించి నిఫలమనోరధులై పోయేరు. గరుత్మంతా! మోహం అనే వృక్షాన్ని పెకిలిద్దామని ఊహించుకున్నను యోగుల లాగున చేతగాక అందరు రాక్షసులూ ఊరుకున్నారు. కోటివిఘ్నాలు వచ్చినా సజ్జ నుని నీతికి చలనంలేనట్టు అంగదుని పాదం కొంచమైనా కదలకుండా స్తం భంలా నిలబడి ఉండిపోయింది ఆలా రాక్షసులందరూ ఓడిపోవడం వాన రుడు ఎగతాళి చెయ్యడంచూచి రావణుడు దురభిమానంతో అంగదుని పాదం కదపడానికి వెళుతుంటే నిశాచరా:నాకాలు పట్టుకుంటే నీకేం లాభం? రాముని పాదం పట్టుకుంటే బ్రతుకుతావు అన్నాడు. అదివిని రావణుడు సంకోచించి తిరికి వెళ్లిపోయేడు. అతని శ్రీఅంతాచెడిపోయింది. మధ్యాహ్న సమయంలో చంద్రుని లాగున తేజస్సంతా నశించిపోయింది. అప్పుడు సకల సంపదలూ పోయినట్టు శిరస్సువంచుకొని సింహాసనంమీద కూర్చున్నాడు శ్రీరామ విముఖుడైనవానికి ఏవిధంగా మనశ్శాంతికలుగుతుంది?తాపత్రయం వలజడిపెట్టేస్తుంటే వానికి సుఖం ఎలాకలుగుతుంది? పార్వతీ రాముని కను బొమల విలాసంమాత్రాన్నే ఈప్రపంచం అంతాపుట్టి పెరిగినశిస్తుంది గడ్డి పోచ వజ్రమైపోతుంది, వజ్రంగడ్డిపోచై పోతుంది అటువంటి ప్రభువు

యొక్క దూత ప్రతిజ్ఞను ఎవరైనా భంగంచెయ్యగలరా? ఇంకా అనేక విధా లుగా నీతులన్నీ చెప్పేడు. అంగదుడు కాలం సమీపించడంచేత రావణుడు ఒకటైనా లెక్కచెయ్యలేదు. అంగదుడు శత్రువుయొక్క మదాన్ని అణగ గొట్టి రాముని మహిమా కీర్తి తెలియజేసి ఇప్పుడెందుకులే. నిన్ను యుద్ధ భూమిలో ఆడించి అడించి మొత్తుతాను. ఇప్పుడు గొప్పలెందుకు చెప్పడం? అన్నాడు. అంగదుడు లంకలో ప్రవేశించగానే రావణుని కొడుకు ఒకన్ని పట్టిచంపేడుగదా! ఆసంగతి ఇప్పుడుతెలిసి రావణుడు దుఃఖించేడు. అంగ దుని ప్రతిజ్ఞవిని రాక్షసులు అతిభయంతో వ్యాకులం పొందేరు. ఈవిధంగా అంగదుడు శత్రుబలాన్ని మర్దించి సంతోషంతో శరీరం పులకరించగా వేగంగావెళ్లి రాముని పాదపద్మాలు పట్టుకున్నాడు.

## మండోదరి రావణునికి హితోపదేశం చేయుట

అప్పుడు సాయంకాలమైంది. రావణుడు విచారిస్తూ అంతఃపురానికి వెళ్లిపోయేడు — మళ్లామండోదరి చేతులుజోడించు ఇలాబోధించింది. నాథా! ఈదుర్బుద్ధి విడిచిపెట్టి బాగామనస్సులో ఆలోచించండి. రామునితోయుద్ధం చెయ్యడం మంచిదికాదు. మీరు అతని తమ్ముడుగీచిన గీటైనా దాటలేరు. ఆవిభుని దూతయైన వానరుడువచ్చి తోటలో చొరబడి కావలి వాళ్లనిచంపి ఆ చక్కని వృక్షాలన్నీ ఊడదీసి పారేసిఅక్షయకుమారున్ని చంపేసి పట్నం కాల్చి వెళ్లిపోయేడుగదా! అప్పుడు మీబలశౌర్యాలన్నీ ఎక్కడకుపోయేయి? మీ రా పరమాత్ముని యుద్ధంలో గెలవగలరా? స్వామీ నామనవి చిత్త గించి వ్యర్థమైన మాటలనకుండా మనస్సులో ఆలోచించి రాముడు మాన వుడని మాత్రం అనుకోకండి. అతడు లోకనాథుడు. అతని బాణంయొక్క మహిమ మారీచుడెరుగును. మీమనస్సు నిర్మలతలేక అతని బోధవిన్నారు కాదు, నాథా! ఆనాడు జనకునిసభలో ఎంతో మంచి రాజులూ బలవంతులైన మీరూకదల్పలేని శివధనుస్సును రాముడువిరిచి సీతనువరించేడు గదా! అప్పుడు ఎందుకు అతనితోయుద్ధంచేసి అతన్ని గెలిచేరుకారు? ఇంద్రపుత్రు

కిరీటాలూ ఎలానాదగ్గరకు విసిరేవు? నీకు అవి ఎలా దొరికేయి? చెప్పమన గానే అంగదుడు రాముని చూచి సర్వజ్ఞా! అవి కిరీటాలా? అలాకనిపిస్తు న్నాయి కాని సామదాన భేదదండాలనే రాజు రక్షించవలసిన నాలుగు ఉపా యాలతో కూడి గుణాలు నాలుగున్నూ నీతిధర్మాలకు అవి నాలుగుమార్గా లని వేదాలు చెపుతాయి అవి తన మనస్సులో వివరంగా ఆలోచించి తెలిసికొని సమస్తలోకాధిపతివని తమంతట తాము అవే మీపాదపద్మాసన్ని ధికి వచ్చేసేయి ప్రభూ! రావణుడు ధర్మరహితుడూ కాలవశుడూ అని సద్గుణాలన్నీ వానిని విడిచి పెట్టి నీదగ్గరకు వచ్చేసేయి, అని చతురతగా అంగదుడు చెప్పిన మాటలు విని రాముడు నవ్వుమొగంతో చూస్తున్నాడు. అప్పుడు అంగదుడు లంకలో జరిగిన సమాచారమంతా చెప్పేడు. అదంతావిని రాముడు మంత్రులందరినీ పిలిచి లంకనాలుగుద్వారాలలోనూ మనబలం ముట్టడించేయేర్పాట్లు చేయండనగానే సుగ్రీవుడూ విభీషణుడూ జాంబవం తుడు బుద్ధిచాతుర్యంతో ఆలోచించి వానరబలాన్నంతటినీ నాలుగు భాగా లుగా విభజించి తగిన సేనానాయకులను నియమించేరు.

## వానరులు లంకను ముట్టడించుట

అందరూ రాముని స్మరించుకొని అతని ప్రతాపబలాలకి సంతోషిస్తూ విజృంభించి సింహనాదాలుచేస్తూ భక్తితో శ్రీరామచంద్రునికి నమస్కరించి మహాధైర్యంతో కొండలు చేతులతో పట్టుకొని భూమి చలించి పోయేలాగున బయలుదేరేరు. జై రఘువంశపతీ జై కోసలాధిపతీ అని కొండలు ప్రతిధ్వనించే లాగున అంటూ కపులూ భల్లూకాలూ మహాపరాక్రమంతో రాక్షసుల కోటము ట్టడించేరు. లంకనాలుగువెక్కులావానరులుముట్టడించి భేరీలు వాయిస్తున్నట్టుగా ధంధణమనే శబ్దాలనోటితోనే చేస్తూ రామునకు జయమగుగాక లక్ష్మణు నకు జయమగుగాక సుగ్రీవునకు జయమగుగాక అనేశబ్దాలు ఆకాశం ముట్టిపోయేయి. అతి బలవంతులైన భల్లూక నాయకులూ వానరనాయకులూ ఆకాశంబద్దలైపోయేలాగున రాక్షసుల గుండెలు ఝల్లుమనేలాగున సింహ

కిరీటాలూ ఎలానాదగ్గర విసిరేశు? నీకు అవి ఎలా దొరికేయి? చెప్పమ గానే అంగదుడు రాముని చూచి సర్వజ్ఞా! అవి కిరీటాలా? అలాకని పిస్తున్నాయి కాని సామదాన భేదదండాలనే రాజు నకుండవలసిన నాలుగు ఉపాయాలతో కూడిన గుణాలు నాలుగున్నూ నీతిధర్మాలకు అవి నాలుగుమూలవి వేదాలు చెపుతాయి అవి తన మనస్సులో వినరంగా ఆలోచించి తెలిసికొని సమస్తలోకాధిపతివని తమంతట తాము అవే మీపాదపద్మాసన్నిధికి వచ్చేసేయి ప్రభూ! రావణుడు ధర్మరహితుడూ కాలపశుడూ ఆ సద్గుణాలన్నీ వానిని విడిచి పెట్టి నీదగ్గరకు వచ్చేసేయి, అని చతురతో అంగదుడు చెప్పిన మాటలు విని రాముడు నవ్వుమొగంతో చూస్తున్నాడు అప్పుడు అంగదుడు లంకలో జరిగిన సమాచారమంతా చెప్పేడు. అదంతా విని రాముడు మంత్రులందరినీ పిలిచి లంకనాలుగుద్వారాలలోనూ మనబలం ముట్టడించేయేర్పాట్లు చేయండనగానే సుగ్రీవుడూ విభీషణుడూ జాంబవంతుడు బుద్ధిచాతుర్యంతో ఆలోచించి వనచరబలాన్నంతటినీ నాలుగు భాగాలుగా విభజించి తగిన సేనానాయకులను నియమించేరు.

## వానరులు లంకను ముట్టడించుట

అందరూ రాముని స్మరించుకొని అతని ప్రతాపబలాలకి సంతోషిస్తూ విజృంభించి సింహనాదాలుచేస్తూ భక్తితో శ్రీరామచంద్రునికి నమస్కరించి మహాధైర్యంతో కొండలు చేతులతో పట్టుకొని భూమి చలించి పోయేలాగున బయలుదేరేరు. జై రఘువంశపతీ జై కోసలాధిపతీ అని కొండలు ప్రతిధ్వనించేలాగున అంటూ కపులూ భల్లూకాలూ మహాపరాక్రమంతో రాక్షసుల కోటను ముట్టడించేరు. లంకనాలుగు పక్కలా వానరులుముట్టడించి భేరీ వాయిస్తూ పెట్టుగ ధ్వనమనే శబ్దాలు నోటితోనే చేస్తూ రామునకు జయమగుగాక లక్ష్మణునకు జయమగుగాక సుగ్రీవునకు జయమగుగాక అనేశబ్దాలు ఆకాశం ముట్టిపోయేయి. అతి బలవంతులైన భల్లూక నాయకులూ వానరనాయకులు ఆకాశంబద్దలైపోయేలాగున రాక్షసుల గుండెలు ఝల్లుమనేలాగున సింహ

కాళ్లుపట్టుకొని గిరగిరతిప్పి భూమిమీదవేసి కొడుతున్నారు. రాక్షసభటులు పారిపోతున్నారు ఇదేనట్రా మీపౌరుషం? అని సంతోషంతో మల్లచరచిపిలుస్తూ గద్దిస్తూ ఆహారమైన ప్రతాపంతో కోటగోడలపైకిఎక్కి ఆమేడలమీద తిరుగుతూ రామునికీర్తిపాడుతున్నారు భక్తులకు ఎటువంటికార్యమైనా క్రీడలాగే ఉంటుంది. కపులందరూ ఒక్కొక్కరాక్షసున్ని పట్టుకొని మేడమీదనుండి గుభీమని క్రిందికి దుమికేసరికి అడుగున రాక్షసుడూ మీదను వానరుడూ పడుతున్నారు. పార్వతీ! శ్రీరామవిభుని ప్రతాపంవల్ల వానరులు రాక్షసులను ఇలాబాధిస్తున్నారు. అప్పుడు బలవంతులైన వానరులు మళ్లాకోటమీదకెక్కి శ్రీరామచంద్రుని జై అంటూ దిక్కులు ప్రతిధ్వనించే లాగునా పరుగెత్తేరు. పెద్దగాలికి ఎగురగొట్టబడ్డ మేఘాలలాగున రాక్షసబలమంతా పారిపోయింది లంకాపురంలో హాహాకారాలు ఎక్కువవైనాయి. స్త్రీలు బాల బాలికలూ పెద్దరోదనాలు చేస్తున్నారు. అందరూ రావణున్ని నిందిస్తున్నారు. అప్పుడు రావణుడు తనసైన్యమంతా పారిపోయిందని విని క్రోధంతో వారందరినీ పిలిచి మరికొంతమందిని తోడిచ్చి జయపొంది రమ్మని పంపించేడు. యుద్ధానికివెళ్లనన్నవాన్ని ఈకత్తితో తలనరికేస్తానన్నాడు. కావ్వేక్కలాగున తిని భోగాలన్ని అనుభవించి నా ధనం తిని నాకు సహాయం చెయ్యమంటే మీకంత కష్టంగా ఉందా! తుచ్ఛులారా! చూడండి ఏపనిచేస్తానో? అనగానే ఆఉగ్రమైన మాటలకు త్రుళ్లిపడి ఆవీరులందరూ సిగ్గుతో వీరుడైనవాడు యుద్ధంలో చస్తేనేమంచిది. అనుకొని ప్రాణాలమీద ఆశలం వదులుకొని యుద్ధానికి బయలుదేరేరు. ఒకరినొకరు పిలుచుకొని అనేకమైన ఆయుధాలు పట్టుకొని నిలబడ్డారు. కపులనూ భల్లూకాలనూ శూలాలూ పరిఘాలూ పట్టుకొని కొడుతున్నారు. పార్వతీ అప్పుడువానరులూ భల్లూకాలూ రాక్షసులను గెలువగలశక్తిగలవారై ఉండికూడా భయపడి పరుగెత్తేరు. రామునిలీలలు మహాఅద్భుతంగాఉంటాయి. హనుమంతుడేడీ? అంగదుడేడీ నలుడూ నీలుడూ ద్వివిదుడూ ఎక్కడఉన్నారు. అని అందులో ఒకడు అరచేడు, అప్పుడు సైన్యమంతా ఎగిరిపోయిందని హనుమంతుడు విన్నాడు

కాళ్లుపట్టుకొని గిరగిరతిప్పి భూమిమీదవేసి కొడుతున్నారు. రాక్షసభటులు
పారిపోతుంటే ఇదేనట్రా మీపౌరుషం? అని సంతోషంతో మల్లచరచిపిస్తూ
గద్దిస్తూ అపారమైన ప్రతాపంతో కోటగోడలపైకిఎక్కి ఆమేడలమీద తిరు
గుతూ రామునికీర్తిపాడుతున్నారు భక్తులకు ఎటువంటికార్యమైనా క్రీడలాగే
ఉంటుంది. కపులందరూ ఒక్కొక్కరాక్షసున్ని పట్టుకొని మేడమీదనుండి
గుభీమని క్రిందికి దుమికేసరికి అడుగున రాక్షసుడూ మీదను వానరుడూ
పడుతున్నారు. పార్వతీ! శ్రీరామవిభుని ప్రతాపంవల్ల వానరులు రాక్షసు
లను ఇలాబాధిస్తున్నారు. అప్పుడు బలవంతులైన వానరులు మళ్లాకోటమీద
కెక్కి శ్రీరామచంద్రుని జై అంటూ దిక్కులు ప్రతిధ్వనించే లాగునా
పరుగెత్తేరు. పెద్దగాలికి ఎగురగొట్టబడ్డ మేఘాలలాగున రాక్షసబలమంతా
పారిపోయింది. లంకాపురంలో హాహాకారాలు ఎక్కువవైనాయి. స్త్రీలు బాల
బాలికలూ పెద్దరోదనాలు చేస్తున్నారు. అందరూ రావణున్ని నిందిస్తున్నారు.
అప్పుడు రావణుడు తనసైన్యమంతా పారిపోయిందని విని క్రోధంతో
వారందరినీ పిలిచి మరికొంతమందిని తోడిచ్చి జయం పొంది రమ్మనిపంపిం
చేడు. యుద్ధానికివెళ్లనన్నవాన్ని ఈకత్తితో తలనరికేస్తానన్నాడు. కొవ్వె
క్కేలాగున తిని భోగాలన్ని అనుభవించి నాధనం తిని నాకు సహాయం
చెయ్యమంటే మీకంత కష్టంగా ఉందా! తుచ్ఛులారా! చూడండి ఏపని చే
స్తానో? అనగానే ఆకఠినమైన మాటలకు త్రుళ్లిపడి ఆవీరులందరూ సిగ్గుతో
వీరుడైనవాడు యుద్ధంలో చస్తేనేమంచిది. అనుకొని ప్రాణాలమీద ఆశలు
దులుకొని యుద్ధానికి బయలుదేరేరు. ఒకరినొకరు పిలుచుకొని అనేకమైన
యుధాలు పట్టుకొని నిలబడ్డారు. కవ్వలనూ భల్లూకాలనూ శూలాలూ పరి
ఘాలూ పట్టుకొని కొడుతున్నారు. పార్వతీ అప్పుడువానరులూ భల్లూకాలూ
రాక్షసులను గెలవగలశక్తిగలవారై ఉండికూడా భయపడి పరుగెత్తేరు.
రాముని లీలలు మహాఅద్భుతంగాఉంటాయి. హనుమంతుడేడీ? అంగదుడేడీ
నలుడూ నీలుడూ ద్వివిదుడూ ఎక్కడఉన్నారు. అని అందులో ఒకడు అరి
చేడు. అప్పుడు సైన్యమంతా ఎగిరిపోయిందని హనుమంతుడు విన్నాడు.

పొందేరు. శ్రీరామచంద్రుని మనస్సు మృదువైందవటచేత విరోధంతో నైనా వన్నేస్మరించేరని తన పరమపదాన్ని ఆరాక్షసులకు ఇచ్చేడు పార్వతీ! ఆ కరుణాసముద్రుడైన శ్రీరామచంద్రునితో సమానమైన దైవం మరొకడు లేడు. అతన్ని సేవించని మందమతులు అభాగ్యులు. అప్పుడు వానరులతో రాముడంటున్నాడు. వానరులారా! అంగదుడూ హనుమంతుడూ రాక్షసుల కోటలో చొరబడ్డారు. మీరు సహాయంగా వెళ్లండి. అంటుండేసరికి శత్రువులను జయించి సాయంకాలమైనదని హనుమంతుడూ అంగదుడూ సుఖంగా రామునిదగ్గరకు వచ్చేరు. వచ్చి రాముని పాదపద్మాలకు నమస్కరించేరు వారినిచూచి రాముడు సంతోషించి కరుణతో చూచేసరికి వారిశ్రమంతన్నీ పోయి సుఖించేరు. అప్పుడు సాయంకాలం అవుటచేత రాక్షసులకు బలం ఎక్కువై రావణునకై జై అనుకుంటూ పదిదిక్కులూ అదిరిపోయేలాగున ధ్వనులుచేస్తూ రామునిపై సైన్యంతో పోరాడడానికి పరాక్రమంతో వచ్చేరు. అప్పుడు వానరులు సంరంభంతో పండ్లు గీటుకుంటూ రాక్షసులమీదికి బయలుదేరేరు. రెండుసైన్యాలకూ పెద్దయుద్ధం జరిగింది. అప్పుడు అతికాయుడూ అకంపనుడూ వాళ్లబలాలు కనబడకుండా దాని మాయవన్నేరు. నిమిషంలో అంతా చీకటైపోయింది. రాళ్లూ రక్తమూ వర్షంకురుస్తుంది. పదిదిక్కులా అంధకారం ఆవరించుకొనిపోవడంచేత వానరులకు ఒకరికొకరు కనిపించ లేదు. ఆ రీతితో ఒకరినొకరు పిలుచుకుంటున్నారు ఆమర్మమంతా శ్రీరామ చంద్రుడు ఎరుగును గనుక అంగదున్నీ హనుమంతున్నీ పిలిచి ఆమర్మ మంతా చెప్పేడు అదివిని కపులందరూ కోపంతో మళ్లావెళ్లేరు ఉమా! అప్పుడు శ్రీరామచంద్రుడు నవ్వుతూ ఆగ్నేయబాణంవేసేరు. ఎక్కడి చీకటి అక్కడపోయింది పార్వతీ! జ్ఞానోదయం అయ్యేసరికి సకల సంశయాలూ పోయినట్లు అంధకారమంతా క్షణంలో పోయింది. అప్పుడు వానరులు సంతోషించి పరాక్రమంతో యుద్ధానికి బయలుదేరేరు. అంగదుడూ హను మంతుడూ సింహనాదాలు చేసేసరికి రాక్షసులందరూ భయంతో పారిపో యే . ఆపారిపోతున్న వారిని పట్టుకొని పరాక్రమంతో భూమిమీద వేసి

పొందేరు. శ్రీరామచంద్రుని మనస్సు మృదువైందవటంచేత విరోధంతో
నైనా తన్నే స్మరించేరని తన పరమపదాన్ని ఆ రాక్షసులకు ఇచ్చేడు పార్వతీ!
ఆ కరుణాసముద్రుడైన శ్రీరామచంద్రునితో సమానమైన దైవం మరొకడు
లేడు. అతన్ని సేవించని మందమతులు అభాగ్యులు. అప్పుడు వానరులతో
రాముడంటున్నాడు. వానరులారా! అంగదుడూ హనుమంతుడూ రాక్షసుల
కోటలో చొరబడ్డారు. మీరు సహాయంగా వెళ్లండి. అంటుండేసరికి శత్రువు
లను జయించి సాయంకాలమైనదని హనుమంతుడూ అంగదుడూ సుఖంగా
రామునిదగ్గరకు వచ్చేరు. వచ్చి రాముని పాదపద్మాలకు నమస్కరించేరు
వారినిచూచి రాముడు సంతోషించి కరుణతో చూచేసరికి వారిశ్రమంతన్నీ
పోయి సుఖించేరు. అప్పుడు సాయంకాలం అవుటచేత రాక్షసులకు బలం
ఎక్కువై రావణునకు జై అనుకుంటూ పదిదిక్కులూ అదిరిపోయేలాగున
ధ్వనులుచేస్తూ రామునిపై సైన్యంతో పోరాడడానికి పరాక్రమంతో వచ్చేరు.
అప్పుడు వానరులు సంరంభంతో పండ్లు గీటుకుంటూ రాక్షసులమీదికి ఉరుకులు
దేరేరు. ఉభయసైన్యాలకూ పెద్దయుద్ధం జరిగింది. అప్పుడు అతికాయుడూ
అకంపనుడూ వాళ్ల బలాలు కనబడకుండా దాని మాయపన్నేరు. నిమిషంలో
అంతా చీకటైపోయింది. రాళ్లూ రక్తమూ వర్షం కురుస్తుంది. పదిదిక్కులా
అంధకారం ఆవరించుకొని పోవడంచేత వానరులకు ఒకరికొకరు కనిపించ
లేదు. ఆ రీతిలో ఒకరినొకరు పిలుచుకుంటున్నారు ఆమర్మమంతా శ్రీరామ
చంద్రుడు ఎరుగునుగనుక అంగదున్నీ హనుమంతున్నీ పిలిచి ఆమర్మ
మంతా చెప్పేడు అదివిని కపులందరూ కోపంతో మళ్లావెళ్లేరు ఉమా!
అప్పుడు శ్రీరామచంద్రుడు నవ్వుతూ అగ్నేయబాణంవేసేరు. ఎక్కడి చీకటి
అక్కడపోయింది పార్వతీ! జ్ఞానోదయం అయేసరికి సకల సంశయాలూ
పోయినట్లు అంధకారమంతా క్షణంలో పోయింది. అప్పుడు వానరులు
సంతోషించి పరాక్రమంతో యుద్ధానికి బయలుదేరేరు. అంగదుడూ హను
మంతుడూ సింహనాదాలు చేసేసరికి రాక్షసులందరూ భయంతో పారిపో
యే . ఆపారిపోతున్న వారిని పట్టుకొని పరాక్రమంతో భూమిమీద వేసి

కొడుతున్నారు. కొంతమందినిపట్టుకొని సముద్రంలోకి విసిరేస్తున్నారు. వాళ్లను మొసళ్లూ తిమింగలాలూ మింగేస్తున్నాయి. ఈ విధంగా రాక్షస భటులుకొందరు చచ్చేరు. కొంతమంది గాయాలుపడ్డారు. కొందరుపట్టణంలోకి పారిపోయేరు. ఈవిధంగా శత్రువులను జయించి రాక్షసులు పారిపోవడం చేత నాలుగుపైపులా లంకను ముట్టడించిన వానరులందరూ శంఖధ్వనులతో సమానంగా గర్జిస్తూ రాత్రి అయిపోయిందిగదాఅని రామునిసన్నిధికి వచ్చేరు. భవానీ! రాముడు వారినందరినీ ప్రేమతో చూచేసరికి వారిశ్రమలన్నీ పోయేయి. అప్పుడు అందరూ విశ్రాంతితో సుఖించేరు.

## మాల్యవంతుడు రావణునకు హితోపదేశము చేయుట

అప్పుడు లంకాపట్టణంలో దశముఖుడు మంత్రులనుపిలిచి యుద్ధంలో చచ్చిన భటులను గురించి చెప్పి కోతులచేత సగంసైన్యం పోయింది గనుక 'ఇక మనం ఏంచెయ్యాలో చెప్పుమని అడిగేడు. అప్పుడు మంత్రులందరిలో చతురత గలవాడూ పెద్దవాడూ అయిన మాల్యవంతుడనే రావణుని తాత అంటున్నాడు. అసురనాయకా! నీవు సీతను అపహరించితెచ్చింది మొదలు తెంపులేని అపశకునాలు కనిపిస్తున్నాయి, కాబట్టి నామాటవిను. వేద శాస్త్ర పురాణాలన్నీ ఏమహాత్ముని వినుతిస్తుంటాయో ఆ సర్వాత్ముడైన మహావిష్ణువే శ్రీరామచంద్రమూర్తి, అతనితో విరోధం పొందినవారెవరూ సుఖంపొందలేదు. హిరణ్యాక్షుడూ హిరణ్యకశిపుడూ అతనిచేతనే చచ్చేరు. పూర్వం మధుకైటభులు అతనిచేతే చంపబడ్డారు. ఆపరమాత్ముడు భూభార నివారణకోసం అవతారం ఎత్తేడు, శ్రీరామచంద్రుడు మానవుడుకాడు,అన్ని లోకాలికీప్రభువు, కాలస్వరూపుడు, దుష్టులనే అరణ్యానికి అగ్నిహోత్రుడు, సర్వాంతర్యామి, సజ్జనరక్షకుడు, కరుణానిధి, శరణాగతవత్సలుడు, పర మాత్ముడు, శివుడూ బ్రహ్మ మొదలైన వారిచేత పూజింపబడే పాద పద్మాలు గలవాడు. గొప్ప పరాక్రమం గలవాడు నీల మేఘశ్యాముడు, అతనితో విరోధం పనికిరాదు. కాబట్టి అతనికి సీతాదేవిని సమర్పించి

ఆ దీన శరణ్యున్ని శరణు వేడు. అతడు కరుణతో నిన్ను కాపాడు తాడు, అని బోధించేడు. ఆ మాల్యవంతుని మాటలు శూలాలలాగున చెవులకు నాటి రావణుడు గొప్ప రోషంతో ఓరి నిర్భాగ్యుడా! దూరంగాపో, మూఢా! ముసలివాడవని క్షమించేను, బతికిపోయేవు, పో ఎప్పుడూ నీవు నాకంటికి కన బడకు, అన్నాడు. ఇక వీడికి ఎంతబోధించినా ప్రయోజనంలేదు వీడెలాగైనా రాముని క్రోధాగ్నిలో మిడత అయిపోక తప్పదు, అనుకుంటూ మాల్య వంతుడు అక్కడినుండి లేచివెళ్లిపోయేడు. అప్పుడు మేఘనాథుడు అంటు న్నాడు, రేపు నేను ఒక వింత చేస్తాను మీరందరూచూడండి. ఇప్పుడు అది కొద్దిగా చెప్పడమెందుకు? గొప్పగా అప్పుడే చేసి చూపిస్తాను, అన్నాడు.

## రెండవనాటి యుద్ధం

ఆ కుమారుని మాటలువిని రావణుడు మెచ్చుకొని అతన్ని ఒడిలో కూర్చోబెట్టుకున్నాడు, ఇంతలో తెల్లవారింది. వానరులు నాలుగు దిక్కులా కోటద్వారాల దగ్గర పరాక్రమంతో శత్రుభయంకరులై యుద్ధసన్నాహంతో వచ్చి ముట్టడించేరు. లంకలో గొప్ప కోలాహలమైంది. ఆయుధాలు పట్టు కొని రాక్షసవీరులు బయలుదేరేరు. కోటబురుజులెక్కిపోయి రాక్షసులందరూ కోటఅవతలనున్న వానరులమీదకు కొండలూ పెద్దపెద్దరాళ్లూ విసరు తున్నారు, అవి పెద్దపిడుగులు పడ్డట్టుభయంకరంగా పడతున్నాయి, వానరులు క్రోధంతో వాటికి భయపడి కూడా తగ్గిపోకుండా వేగంగా రాక్షసులు విసరిన పర్వతాలు అందుకొని కోటపైకి విసిరేస్తున్నారు. ఆరాళ్లదెబ్బలకు ఎక్క డున్న రాక్షసులక్కడే చితికి ముద్దయిపోయేరు, అప్పుడు వానరులు మళ్లా కోట ముట్టడించేరనివిని మేఘనాథుడు విల్లూశరాలూపట్టుకొని భేరీవాద్యఘో షంతో వేగంగా కోటదిగి కపిసైన్యం దగ్గరకువచ్చి ఏదీ ఆకోసల చక్ర వర్తులు? ధన్వులు, భువన విఖ్యాతులు, ఎక్కడ ఉన్నారు? సుగ్రీవు డెక్కడ? ద్వివిదుడెక్కడ? నలనీలులెక్కడున్నారు? మహాబలవంతులైన అంగదుడూ హనుమంతుడూ నెక్కడున్నారు? అన్నగారికి ద్రోహియైన

విభీషణుడెక్కడున్నాడు? వాడినిప్పుడు తప్పకుండా వధించేస్తాను, అంటూ అతికఠినమైన బాణం ఒకటి సంధించి మేఘనాథుడు మహా క్రోధంతో నారి లాగివదిలేడు. ఆ బాణం ఎన్నో బాణాలై కుప్పలుకుప్పలుగా రెక్కలున్న పాములలాగున వస్తున్నాయి, వాడియెదుట నిలువలేక వానరులూ భల్లూ కాలూ నాల్గు దిక్కులకూ పరుగెత్తేరు. మేఘనాథుడు మహాపరాక్రమంతో పదేసిబాణాలు తొడిగి వానరులమీద వేస్తుంటే కపులూ భల్లూకాలూ వశం తప్పిపోయి అలాఉండిపోయేరు, అప్పుడు మేఘనాదుడు జయంకలుగు తుందన్న సంతోషంతో దిశదిశలూ ప్రతిధ్వనించేలాగున సింహనాదం చేసేడు. అప్పుడు హనుమంతుడు తనసైన్యంయొక్క అవస్థచూచి క్రోధంతో ఒక పర్వతం పెకలించుకొని వచ్చి కో అనికేకవేస్తూ మేఘనాథునిపైకి విసిరేడు. వాడుపెద్ద పర్వతం వస్తుందని చూచి రథాన్నీ గుఱ్ఱాలనీ సారధినీ విడిచిపెట్టి వాడొక్కడే ఆకాశానికి ఎగిరిపోయేడు. హనుమంతుడు ఎంత పిలిచినా ఎదుటికి రాకుండా రామునిదగ్గర అనేకవిధాలుగా ప్రలాపాలాడు తున్నాడు, ఎన్నో అస్త్రశస్త్రాలు వాడు రామునిమీద వేస్తుంటే వాటినన్ని టినీ రాముడు అవలీలగా కొట్టిపారేస్తున్నాడు. రామునియొక్క గొప్ప అద్భుతమైన ప్రతాపానికి అవమానపడి ఆమూఢుడు అనేక మాయలు పన్నేడు, గరుత్మంతునికి పాముని చూపించి భయపెట్టినట్టు శివుడూ విధాతా ఎవని మాయకు వివశులైపోతారో ఆ జగద్విభుని యెదుట దుష్టుడైన మేఘనాథుడు తన మాయను చూపించబోయాడు. అల్పులకృత్యములు ఈ విధంగానే ఉంటాయి. అప్పుడు వాడు ఆకాశంమీదకు ఎగిరి నిప్పులు కురిపించేడు, నల్లని శరీరాలతో ఉన్న పిశాచాలు నృత్యం చేస్తూ చంపండి, ముక్కలు ముక్కలుగా కోసెయ్యండి, అంటూ రక్తం, మలం, వెంట్రుకలూ, ఎముకలూ, వర్షంలా కురిపించేయి. పెద్దపెద్ద రాళ్లు వర్షంలా పడిపోతున్నాయి, గొప్ప అంధకారం అయిపోయింది. అదిచూచి కపులు ఇటువంటి మాయవల్ల అందరూ చస్తారు, అనుకుంటుంటే రాముడు ఆ కౌతుకమంతా చూచి నవ్వుతూ వానరులు భయపడుతున్నారని

ఒక బాణంవేసి ఆ మాయను పోగొట్టేసేడు. అప్పుడు సూర్యోదయం అయ్యేసరికి చీకటి నశించి పోయినట్టు రామబాణం చేత రావణ పుత్రుని మాయంతా అణగిపోయింది. అప్పుడు రాముడు కరుణతో చూచేసరికి వానరులూ భల్లూకాలూ మహా బలవంతులయ్యేరు. అప్పుడు లక్ష్మణుడు శ్రీరామచంద్రుని ఆజ్ఞనుపొంది రోషంతో ధనుర్బాణాలు ధరించి అంగదుడూ మొదలైన వానరులతో కలిసి పరాక్రమంతో వెళ్లేడు. రాక్షసవీరులందరూ అస్త్రశస్త్రాలు పట్టుకొని మేఘనాథునికి సహాయంగా వచ్చేరు. కపులందరూ శ్రీరామచంద్రునికి జై అంటూ కొండలూ చెట్లూ పట్టుకొని రాక్షస భటుల మీద వేస్తున్నారు, రెండు సైన్యాలకూ అప్పుడు ద్వంద్వయుద్ధమైంది, రెండుపక్షాల వీరులకు జయకాంక్ష మనస్సులలో ఉంది. వానరులు రాక్షసులను తన్నుతూ గుద్దుతూ కరుస్తూ చేతులతో చరుస్తూ పట్టుకొని చంపండని అరుస్తు తలలు నరకండీ భుజాలు పెకలించండీ అని నానావిధాలుగా చేసే ధ్వనులు నాలుగు దిక్కులా నిండి పోయేయి. చచ్చిన రాక్షసుల దేహాలు శిరస్సులు లేకుండా వడివడిగా పడిపోతున్నాయి. ఉమా! ఆ వినోదంచూస్తూ ఆకాశంమీద దేవతలు ఒకప్పుడు ఆశ్చర్యం ఒకప్పుడు ఆనందం పొందుతూ ఇలాంటి యుద్ధం ఎప్పుడూ చూడలేదని అనుకుంటున్నారు, పల్లంగా ఉన్నస్థలాలలో రక్తం విశేషంగా నిండిపోయి ధూళి అంతా ఎగిరివచ్చి దానిమీద పడడం చేత ఆరక్తం నివురు కప్పిన నిప్పులా కనిపిస్తుంది. యుద్ధంలో వీరులైన కపులయొక్కా రాక్షసుల యొక్కా గాయాలుపడ్డ శరీరాలు కొత్తగా పూచిన మోదుగు చెట్లలాగున కనిపిస్తున్నాయి.

## లక్ష్మణ మూర్ఛ

అప్పుడు లక్ష్మణుడూ మేఘనాథుడూ గొప్ప ఆయుధాలతో యుద్ధానికి తలపడ్డారు. ఇద్దరూ బలవంతులే. ఒకరి నొకరు గెలవలేకపోతున్నారు. అప్పుడు కపటంతో ఇంద్రజిత్తు ఒక చమత్కారం చేసేడు.

అప్పుడు ...... షేని చంపేడు. తరువాత రథం విరుగగొట్టేడు. అనేక బాణాలు వేసి మేఘనాథుని నొప్పించి ప్రాణావశిష్టుణ్ని చేసేడు. అప్పుడు ఇంద్రజిత్తు అయ్యో! చిక్కులో పడి పోయానే ఇతడు ఎలాగైనా ఇక చంపేస్తాడు. అని అనుమానపడి వీర ఘాతిని అనే శక్తి బాణం లక్ష్మణుని వక్షానికి గురిచూచి వేసేడు. దానితో తేజోవంతుడైన లక్ష్మణుడు మూర్ఛపడిపోయేడు. అప్పుడు భయం తీరి మేఘనాథుడు దగ్గరకు వెళ్ళేడు. సౌమిత్రిని కదల్పలేకపోయేడు నూరు కోట్లమంది మేఘనాథునితో సమానులైన. రాక్షసభటులుకూడా లక్ష్మణున్ని ఎత్తలేక సిగ్గుపడిపోయేరు. ఆ అనంతమూర్తిని భూమిని భరించే శేషావ తారుని జగదీశ్వరుని తమ్ముడైన వానిని ఎత్తడానికి ఎవరికి శక్యమౌతుంది? భవానీ! ఎవని కోపాగ్నికి పద్నాలుగు లోకాలూ భస్మమైపోతాయో మనుష్యులూ దేవతలూ చరాచరాలూ ఏ విభుని సేవచేస్తుంటారో ఆ అనంతున్ని ఎవరైనా జయించగలరా? రామ విభుని కరుణ ఎవరిపైని ఉంటుందో వారే ఈ కౌతూహలక్రీడా రహస్యాన్ని తెలిసికో గలుగుతారు. ఇంతలో సాయంకాలమైంది. రెండు పక్షాలవారూ తిరిగి వెళ్ళిపోయిన తరువాత సర్వవ్యాపకుడూ బ్రహ్మమూ అజితుడూ భువనేశ్వరుడూ ఐన శ్రీరామచంద్రుడు లక్ష్మణుడు ఎక్కడున్నాడు? అని అడుగగానే హను మంతుడు తీసికొనివెళ్ళి యుద్ధభూమిలో పడియున్న లక్ష్మణున్ని చూపించేడు.

## హనుమంతుడు సంజీవకరణిని తెచ్చుటకు వెళ్ళుట

శ్రీరామచంద్రుడు తమ్మున్నిచూచి గొప్ప దుఃఖం పొందేడు అప్పుడు జాంబవంతుడు లంకాపట్టణంలో సుషేణుడు అనే వైద్యుడున్నాడు ఎవరైనా వెళ్ళి అతన్ని తీసుకొనిరండి అన్నాడు. అనగానే హనుమంతుడు సూక్ష్మరూపంతో లంకా పట్టణంలోకి వెళ్ళి ఇంటితోకూడా అతన్ని తీసికొని వచ్చి రాముని యెదుట ఉంచేడు. అప్పుడు సుషేణుడు రాముని పాదపద్మా

లకు నమస్కరించి ఔషధం పేరూ ఆ ఔషధం ఉండే కొండపేరూ వర్ణించి చెప్పి హనుమంతునితో మారుతీ! నీవువెళ్ళి ఔషధం తీసికొని రా. అనేసరికి నమస్కరించి రాముని పాదపద్మాలు మనస్సున నిలుపుకొని అతడు వెళ్ళేడు.

## రావణునకు కాలనేమి నీతి చెప్పుట

హైమవతీ! ఈ రహస్యమంతా రావణునితో ఒకదూత చెప్పేదు. వెంటనే రావణుడు కాలనేమి యింటికి వెళ్ళి అతనితో నీ వెలాగైనా ఆంజనేయుడు సంజీవకరణి తేవడానికి వెళ్ళే తోవలో ఉండి అతన్ని వెళ్ళకుండా ఆపెయ్యాలి అన్నాడు. అదివిని కాలనేమి దానవేంద్రా! నీవు చూస్తుండగానే లంకాపట్టణమంతా కాల్చిన పరాక్రమవంతుణ్ని ఎవరైనా ఆపగలరా? వద్దు, అలాంటి సాహసం చెయ్యవద్దు. అని ఎంత నెత్తి మొత్తుకొని చెప్పినా వినని రావణున్ని చూచి కాలనేమి ఓ రాక్షసేశ్వరా! వ్యర్థమైన ప్రగల్భాలు చెప్పక ఆ శ్రీరామచంద్రమూర్తిని భక్తితో సేవించు. సుఖం కలుగుతుంది. అహంకార మమకారాలను విడిచిపెట్టు. ఈ మహా మోహాం అనే రాత్రిలో నీవు నిద్ర మేలుకొని సర్వలోకేశ్వరుడైన శ్రీరామచంద్రుని భజించు. కాలసర్పాన్నైనా మింగగల అతన్ని నీవు గెలవలేవు అన్నాడు. అనగానే రావణుడు కళ్ళెఱ్ఱజేసి చూస్తున్నాడు. ఆ దుష్టుణ్నిచూచే కాలనేమి తనలో వీడు మహా దుర్మార్గుడు, వీడికి ఎంత బోధించినా ఇంక లాభంలేదు. ఈ దుష్టునిచేత చచ్చేకంటే రామదూతచేత చస్తేనే మంచిది. అనుకొని వెంటనే వెళ్ళి హనుమంతుడు వచ్చేదారిలో మాయపన్ని ఒక మందిరం ఒక సరోవరం చక్కని పుష్పవనం తయారుచేసుకొని మహా మునిలాగున పద్మాసనం వేసుకొని కూర్చున్నాడు.

## ఆంజనేయుడు కాలనేమిని చూచుట

అప్పుడు వాయుపుత్రుడు అదొక ఋష్యాశ్రమం అనుకొని అందులో ప్రవేశించి అక్కడ రామదూతని మోహింపజెయ్యాలని ఉన్న ఆ మాయ

మునిని చూచి శిరస్సువంచి నమస్కారించేడు. భవానీ! అప్పుడు ఆ రాక్షస ముని రాముని గుణాలన్నీ పొగడి మారుతీ! ఇప్పుడు గొప్ప యుద్ధం రామునికీ రావణునికీ జరుగుతుంది. గెలుపు రామునిదే. సోదరా! నాకు దివ్యదృష్టి ఉండడంచేత ఇక్కడనుండే చూస్తున్నాను అన్నాడు. హనుమంతుడు అదివిని మంచిదేకాని కొంచెం మంచినీళ్ళు ఉంటే ఇమ్మన్నాడు. మాయాముని తన కమండలం ఇచ్చేడు. ఇంతకొంచెం నీటితో నాకు దాహం తీరదన్నాడు హనుమంతుడు. అపుడు కపటముని మారుతీ! అదిగో అక్కడ సరోవరం ఉంది వెళ్ళి స్నానంచేసి తృప్తిగా దాహంతీరా నీరు తాగిరా, నీకు జ్ఞానోపదేశం చేస్తాను అన్నాడు. అది విని హనుమంతుడు ఆ సరోవరంలో దిగేసరికి పెద్ద మొసలివచ్చి అతని పాదం పట్టుకుంది. అతడు వ్యాకులంపొంది వెంటనే ఆ మొసలిని చంపేసేడు. అప్పుడు ఆ మొసలి ఒక చక్కని స్త్రీగా మారిపోయి ఆకాశమార్గంగా విమానంమీద వెళ్ళిపోతూ ఆంజనేయునితో ఓ అనఘా! నేను మునిశాపంవల్ల పొందిన పాపం అంతా నీ దర్శనంవల్ల పోయింది, ఇప్పుడు నా పూర్వరూపాన్ని పొందేను. నేను అప్సరసను; నీవు ఇప్పుడు చూచిన ముని రాక్షసుడు సుమా నేను నిజం చెప్పేను. అని చెప్పి, ఆ దేవకాంత వెళ్ళిపోయింది. అది విని హనుమంతుడు ఆ రాక్షసునియొద్దకు వెళ్ళేడు.

## హనుమంతుడు కాలనేమిని వధించుట

అప్పుడు వాయుపుత్రుడు మాయాముని రూపంతో ఉన్న కాలనేమిని చూచి ఓ ఋషీ! నాకు మంచి మంత్రం ఉపదేశిస్తావుగదూ, ఇదిగో గురు దక్షిణ ముందు తీసికో, అంటూ తోకతో వానిమెడ చుట్టిబిగించి లాగేసరికి సొమ్మసిల్లిపోయి గుడ్లుపైకి ఊడి నిజరూపాన్ని పొంది రామా! రామా! అంటూ ప్రాణాలు విడిచి పెట్టేడు కాలనేమి. పార్వతీ! అది విని హనుమంతుడు సంతోషంతో వెళ్ళి ఆ పర్వతం చూచి ఔషధం ఎక్కడ ఉందో? అని వెదకి ఏమో ఇందులో సుషేణుడు చెప్పినమంద

ఏదో అతడే వెతుకుకొని తీస్తాడు, అని ఆ పర్వతాన్నే పెకలించి ఎత్తుకొని ఆకాశానికి ఎగిరి వేగంగా పోతున్నాడు.

## భరతుడు హనుమంతున్ని రాక్షసుడనుకొని పడవేయుట

ఆ రాత్రివేళ చీకటిలో అయోధ్యమీదుగా రివ్వున ఎగిరి పోతున్న హనుమంతున్ని చూచి భరతుడు వీడు ఎవడో రాక్షసుడని అనుమానించి మొనలేని బాణం అతనిమీద వేసేడు, అదితగిలి హనుమంతుడు రామా! రఘునాయకా! శ్రీరామా! అని తలంచుకుంటూ భూమిమీద పడి మూర్ఛ పోయేడు, అప్పుడు భరతుడు తనకు ప్రియమైన మాటలు వినబడగానే దగ్గరకు వెళ్లి వికలుడై పడియున్న హనుమంతున్ని చూచి లేవదీసి. కౌగలించుకొని అతనికి తెలివి రావడానికి ఎన్నో ఉపాయాలుచేసి తెలివి రాకపోగానే భరతుడు ముఖం వెలవెల పోతుండగా దుఃఖంతో అంటున్నాడు. నన్ను రామ విముఖున్ని చేసిన విధియే ఇప్పుడు గొప్ప ఆపద కలుగజేసేడు. నేను మనోవాక్కాయాలతో రామభక్తి మాయ లేకుండా చేస్తున్నట్టయితే ఆ రాముడు నాయందు అనుకూలుడై ఉంటే ఓ ప్లవగపుంగవా ! ఇప్పుడే నీ శ్రమ అంతాతీరి లేచెదవుగాక! అన్నాడు.

## హనుమంతుడు లేచి భరతునకు రామవృత్తాంతం చెప్పుట

ఆ మాటలు వినగానే సీతా నాథునికి జై అని హనుమంతుడు లేచేడు. అప్పుడు అతన్ని భరతుడు ప్రేమతో కౌగిలించుకున్నాడు. శరీరం పులకరించి ఆనంద బాష్పాలురాలేయి. అప్పుడు భరతుడు పట్టరానంత ఆనందంతో రామున్ని స్మరించుకుంటూ అంటున్నాడు, తండ్రీ! సౌఖ్యనిధానమైన శ్రీరామచంద్రుడూ లక్ష్మణుడూ సీతాదేవి సుఖంగా ఉన్నారా? చెప్పుమనే సరికి మారుతి సంగ్రహంగా కథ అంతా చెప్పేడు. అదివిని భరతుడు మనస్సులో చాలాదుఃఖించి అనుకుంటున్నాడు అయ్యయ్యో! విధీ నేను భూమిమీద ఎందుకు పుట్టేను? ప్రభువుకి ఒక పనికైనా ఉపకరించేను కాను

కుమాళ్ళూ, భార్యలూ, ధనమూ పరివారమూ, ఇల్లూ ఈ ప్రపంచంలో వస్తూ పోతూ ఉంటాయికాని నీవంటి సోదరుడు ఇకెక్కడ దొరుకుతాడు? సోదరా! కనులు విప్పి చూడవా? వత్సా! నిన్ను ఎడబాటుచేసి ఆ ఈశ్వరుడు నన్ను బ్రతికించినట్టయితే రెక్కలు లేని పక్షీ, మణిపోయిన సర్పమూ, తొండము పోయిన యేనుగూ దుఃఖించినట్లు నేను దుఃఖిస్తుంటాను. తమ్ముడా! భార్యకోసం ప్రియమైన అనుజుల్ని పోగొట్టుకొని ఏముఖంపెట్టుకొని నేను అయోధ్యకు వెళ్తాను? ఈ అపకీర్తి నేనెలా సహిస్తాను? అయ్యో! భార్య హాని అంత గొప్పదికాదు ఇప్పుడు లోకనిందా భ్రాతృశోకంకూడా భరించ వలసి వచ్చింది. వత్సా! నేనెలా సహించగలను? నీవు నాకు ప్రాణసమాన మైనవాడవు గనుక మీతల్లి సర్వవిధాలా సుఖప్రదున్నీ హితున్నీ అనినన్ను నమ్మి వాచెయ్యి పట్టుకొని నిన్ను నాకు అప్పగించింది. తమ్ముడా! మాటాడ వేమి? నేను వెళ్ళి మీఅమ్మతో ఏమని చెప్పతాను! నన్ను ఓ దార్చవా? అని చింతలన్నీ పోగొట్టే దేవుడు మనుష్యుని విధంగా అవురనియేడ్చేడు. ఆపద్మాలలాంటి కన్నులనుండి నీరు కారేలాగున దుఃఖించేడు. పార్వతీ! ఆ అఖండుడైన భువనభర్త తనవారియందు వాత్సల్యం తెలియ జేయడానికి నరుని విధంగా లీల చూపించేడు. ఆ ప్రభువు దుఃఖించూచి కపులందరూ వ్యాకులం పొందేరు. ఆ సమయంలో కరుణారసంలో వీరరసం వచ్చినట్టు ఔషధాల కొండతో హనుమంతుడు వచ్చేడ్లు. అతి కృతజ్ఞతతో శ్రీరామచంద్రుడు అంజనేయున్ని చూచేడు. అప్పుడు సుషేణుడు ఆ ఔషధాలను తీసికొని లక్ష్మణునికి చికిత్స చేసేడు.

## లక్ష్మణుడు మూర్ఛతేరి లేచుట

వెంటనే లక్ష్మణుడు సంతోషంతో లేచి కూర్చున్నాడు. శ్రీరామ చంద్రుడు అతన్ని వేగంగా కౌగిలించుకొన్నాడు. కపులూ భల్లూకాలూ మహా సంతోషం పొందేరు. అప్పుడు హనుమంతుడు సుషేణున్ని ఇంటితో కూడా యథాస్థానాన్ని ఉంచేసి వచ్చేడు.

కుమాళ్ళూ, భార్యలూ, ధనమూ పరివారమూ, ఇల్లూ ఈప్రపంచంలో వస్తూ పోతూ ఉంటాయికాని నీవంటి సోదరుడు ఇకెక్కడ దొరుకుతాడు? సోదరా కనులు విప్పి చూడవా? వత్సా! నిన్ను ఎడబాటుచేసి ఆఈశ్వరుడు నన్ను బ్రతికించినట్టయితే రెక్కలు లేని పక్షీ, మణిపోయిన సర్పమూ, తొండము పోయిన యేనుగూ దుఃఖించినట్లు నేను దుఃఖిస్తుంటాను. తమ్ముడా భార్యకోసం ప్రియమైన అనుజున్ని పోగొట్టుకొని ఏముఖంపెట్టుకొని నేను అయోధ్యకు వెళ్తాను? ఈ అపకీర్తి నేనెలా సహిస్తాను? అయ్యో! భార్యా హాని అంత గొప్పదికాదు ఇప్పుడు లోకనిందా భ్రాతృశోకంకూడా భరించ వలసి వచ్చింది. వత్సా! నేనెలా సహించగలను? నీవు నాకు ప్రాణసమా మైనవాడవు గనుక మీతల్లి సర్వవిధాలా సుఖప్రదున్నీ హితున్నీ అనినన్ను నమ్మి వాచెయ్యి పట్టుకొని నిన్నునాకు అప్పగించింది. తమ్ముడా! మాటాడ వేమి? నేను వెళ్ళి మీఅమ్మతో ఏమని చెప్పుతాను! నన్ను ఓ దార్చువా అని చింతలన్నీ పోగొట్టే దేవుడు మనుష్యుని విధంగా అపురనియేడ్చేడు ఆపద్మాలలాంటి కన్నులనుండి నీరు కారేలాగున దుఃఖించేడు పార్వతీ! ఆ అఖండుడైన భువనభర్త తనవారియందు వాత్సల్యం తెలియ జేయడానికి నరుని విధంగా లీల చూపించేడు. ఆ ప్రభువు దుఃఖించుట కపులందరూ వ్యాకులం పొందేరు. ఆ సమయంలో కరుణారసంలో వీరరసం వచ్చినట్టు ఔషధాల కొండతో హనుమంతుడు వచ్చేడు. అతి కృతజ్ఞతతో శ్రీరామచంద్రుడు ఆంజనేయున్ని చూచేడు. అప్పుడు సుషేణుడు ఔషధాలను తీసికొని లక్ష్మణునికి చికిత్స చేసేడు.

## లక్ష్మణుడు మూర్ఛతేరి లేచుట

వెంటనే లక్ష్మణుడు సంతోషంతో లేచి కూర్చున్నాడు. శ్రీరామ చంద్రుడు అతన్ని వేగంగా కౌగిలించుకొన్నాడు. కపులూ భల్లూకాలూ మహా సంతోషం పొందేరు. అప్పుడు హనుమంతుడు సుషేణున్ని ఇంటి కూడా యథాస్థానాన్ని ఉంచేసి వచ్చేడు.

## రావణుడు కుంభకర్ణుని మేలుకొలుపుట

ఆ సమాచారమంతా విని రావణుడు అతి దుఃఖంతో పదితలలూ మొత్తుకొని వ్యాకులం పొంది పొంది ఆ దుష్టుడు కుంభకర్ణుని దగ్గరకు వెళ్ళి గాఢ నిద్రలోనున్న అతన్ని లేపడానికి ఎన్నో ప్రయత్నాలు చేసేడు. అప్పుడు కుంభకర్ణుడు మేలుకొన్నాడు. కాలం శరీరం ధరించిందన్నట్టు కుంభకర్ణుడు పెద్ద నిట్టూర్పుతో లేచి రావణున్నిచూచి అన్నా! అదేమి నీ ముఖాలన్నీ వాడి కళతప్పిపోయి ఉన్నాయి? అని అడిగేడు. రావణుడు జరిగిన కథ అంతా చెప్పేడు. తాను సీతను ఎత్తుకొనిరావడం, పెద్ద వానరుడువచ్చి లంకంతా కాల్చివేయడం, కొడుకులు చచ్చిపోవడం శ్రీరామ చంద్రుడు అక్కడకు రావడం కపులందరూ రాక్షసులను చంపేయడం మహా యోధులందరూ మరణించడం అంతా చెప్పేసరికి అయ్యో! ధైర్య వంతులైన వీరులు, దేవాంతకుడూ నరాంతకుడూ అకంపనుడూ అతి కాయుడూ మహోదరుడూ దుర్ముఖుడూ మొదలైన వీరులందరూ పోయి నారా? అని కుంభకర్ణుడు దుఃఖపడి అయ్యో! దుర్మతీ! ఎంతపని చేసేవురా దుష్టుడా! లోకమాతను దొంగిలించుకొనివచ్చి నీకు శుభం కావాలంటే ఎలా వస్తుంది? ఇంత దుష్కార్యంచేసి ఇప్పుడు నన్నెందుకు లేపేవు? అన్నా! ఇప్పుడైనాసరే అభిమానాన్ని విడిచిపెట్టి రామచంద్రుని భజించేవంటే నీకు మేలు కలుగుతుంది. నామాట నిశ్చయం. ఆ రాముడు మనుష్యుడను కున్నావా? అయ్యో! ఎంత తెలివిలేనివాడవు? అయ్యయ్యో! అజ్ఞానంచేత ఎంత దుష్కార్యం చేసేవు. అసురేశ్వరా! ఈ సంగతంతా ముందే చెప్పేవుగావు. సకల దేవతలకూ ప్రభువూ శివునిచేతా విధాతచేతా పూజింప బడేవాడైన జగద్రక్షకునితో విరోధం తెచ్చుకున్నావు. అయ్యో! నాకు నారద మహాముని జ్ఞానోపదేశం చేసేడు. అది నీకు చెప్పలేదు. ఇప్పుడు సమయం మించిపోయింది.

## కుంభకర్ణుడు యుద్ధానికి వెళ్ళుట

అన్నా ! ఇకయేమన్నా ప్రయోజనంలేదు. కాబట్టి ప్రేమతో నన్ను అంకమందు చేర్చుకో. ఆ జగజ్జీవనప్రదుడూ ఇనకుల శేఖరుడూ మూడు తాపాలను పోగొట్టేవాడూ సాటిలేని సౌందర్యం గలవాడూ అయిన శ్రీరామచంద్రుడ్ని చూచి కన్నులుగల భాగ్యం సఫలం చేసుకుంటాను. అనిచెప్పి రాముని రూపం మనస్సులో స్మరించుకొని ప్రేమలో మునిగి పోయి ఒక్కక్షణం తన్మయుడై అలా ఉండిపోయేడు. భవానీ! కుంభ కర్ణుని భక్తి ఏం తక్కువైందా? అప్పుడు కోటి కల్లుకుండలూ చాలా ఎనుపోతుల మందలూ రావణుడు అక్కడకు తెప్పించేడు. ఆ ఎనుబోతు లను కడుపునిండా తిని ఆ కల్లంతా తాగి పిడుగు పడ్డంత ధ్వనితో అరచి తన వెంటను సైన్యమేదీ లేకుండానే కోటదాటి యుద్ధభూమికి సంతోషంతో వెళ్ళేడు కుంభకర్ణుడు.

## కుంభకర్ణ విభీషణులు సంభాషించుకొనుట

అతన్నిచూచి విభీషణుడు వచ్చి పాదాలకు నమస్కరించి తన పేరు చెప్పేడు. అదివిని కుంభకర్ణుడు తమ్ముణ్ని లేవనెత్తి కౌగిలించు కొని రామభక్తుడని అతన్ని చాలామెచ్చుకున్నాడు. అప్పుడు విభీషణుడు చిన్నన్నతో ఇలా చెపుతున్నాడు. అన్నా! నేను మంచిమాటలతో నీతి బోధిస్తే దానికి ఆగ్రహించి రావణుడు నన్ను తన్నేడు. వెంటనే నేను విచారిస్తూ అక్కడనుండి రామునియొద్దకు వచ్చేసేను. నా దీనత్వం చూచి భక్తరక్షకుడైన శ్రీరామచంద్రుడు నన్నాదరించేడు. అప్పటినుండి ధైర్య ముతో ఇక్కడ ఉన్నాను. అనేసరికి కుంభకర్ణుడు నా ప్రియమైన తమ్ముడా! ఆ రావణునికి మంచిచెపితే ఇష్టపడుతుందా? కాలవశునికి ఎంత బోధించినా మంచిదారి కనిపించదు. కనుక దానికోసం విచారిస్తే ప్రయోజనం లేదు. విభీషణా! నీవు ధన్యుడవు, వంశభూషణుడవు.

తమ్ముడా! శ్రీరామచంద్రుడున్ని శరణుపొంది కులాన్ని పూజ్యంగా చేసేవు. నీవు ధన్యుడవు. ధన్యుడవు. మహాధన్యుడవు. సోదరా! నిష్కపటంతో రామున్ని భజించు. ఇప్పుడు ఇక్కడనుండి నీవు దూరంగా వెళ్ళిపో నేను కాలవశుడనై యున్నాను. అందుచేత నాకు నావారూ పైవారూ అనే విచక్షణ ఉండదు అన్నాడు. అదివిని విభీషణుడు అన్నకు నమస్కరించి రాముని దగ్గరకు వెళ్ళి శ్రీరామచంద్రా! యుద్ధానికి రణ ధీరుడైన కుంభకర్ణుడు వచ్చేడు. అనిచెప్పేడు:

## కుంభకర్ణుని యుద్ధం

అప్పుడు కపులందరూ ఆ వృత్తాంతం విని చెట్లూ కొండలూ పెకలించి తెచ్చి కిచకిచమని ధ్వనిచేస్తూ ఆ కుంభకర్ణునిమీద విసిరేరు. కోట్లకొలదీ కొండలు తెచ్చి వానరులు విసిరినా కదలలేదా రాక్షసుడు. మదించిన యేనుగు జిల్లేడుకాయలతో కొడితే కదలనట్టు చలనంలేకుండా నిలబడ్డాడు. అప్పుడు హనుమంతుడు అతన్ని పిడికిటితో పొడిచేడు. ఆపోటు గట్టిగా తగిలి వ్యాకులంతో కుంభకర్ణుడు క్రందపడి దీనంగా చేతులతో నెత్తి మొత్తుకున్నాడు. వెంటనేఅతడులేచి హనుమంతున్ని కొట్టేడు. హనుమంతుడు ఆదెబ్బకు మూర్ఛపోయేడు. ఆతరువాత కుంభకర్ణుడు నలున్నీ, నీలున్నీ ఇంకా వానరభటు లందరినీ భల్లూకవీరుల్నీ భూమిమీద పడగొట్టి చెలరేగి పరాక్రమం చూపించేడు. అతని యెదుట నిలవలేక వానర బలమంతా భయంతో పారిపోయింది. అప్పుడు అంగదుడూ సుగ్రీవుడూ మొదలైన యోధులందరినీ కుంభకర్ణుడు మూర్ఛపొందించి సుగ్రీవున్ని చంకలో పెట్టుకొని లంకలోకి పారిపోతున్నాడు. పార్వతీ! ఆ ఇనవంశ శేఖరుడు ఆమహా విష్ణువు. ఆశ్రీరామచంద్రుడు మానవునివిధంగా లీలచూపించేడు. గరుత్మంతుడు కొంచెంసేపు పాములమధ్య క్రీడ చూపించినట్టు, కాలాన్ని అంతటినీ ఒక్క త్రుటిలో బొమముడిపాటుచేతనే మ్రింగగల అవ్యయుడైన శ్రీరామచంద్రునికి ఇటువంటి యుద్ధాలు ఒకలెక్కా? శ్రీరామచంద్రుడు

తన నిర్మలమైన కీర్తిని స్థలింపజేయడానికీ జనులందలూ అతని పవిత్ర చరిత్ర కీర్తించి గానంచేసి సంసారసముద్రాన్ని సులభంగా దాటడానికీ ఈ ప్రకారం విచిత్రమైనలీల చూపిస్తుంటాడు. ఇంతలో హనుమంతుడు మూర్ఛతేరి సుగ్రీవుడేదని వెతుకుతున్నాడు. అక్కడ కుంభకర్ణుడు సుగ్రీవున్ని ఎత్తుకొని లంకలోకి పోతుండగా కొంత సేపటికి సుగ్రీవుడు తెప్పరిల్లి క్రోధంతో కుంభకర్ణుని ముక్కూ చెవులూ కొరికి మహా లాఘవంతో ఆకాశానికి ఎగిరిపోయేడు. అది చూచి కుంభకర్ణుడు మళ్ళా సుగ్రీవుని పట్టుకొని వాని పాదాలందుకొని భూమిమీదికి విసిరేసేడు. ఆ విధంగా భూమిమీదపడి వడిగాలేచి కుంభకర్ణున్ని పడగొట్టి సుగ్రీవుడు రాముని యొద్దకు వచ్చి జై కరుణాసముద్రా! జై శ్రీరామచంద్రా! అని అతిసంతోషంతో రామున్ని వినుతించేడు. అప్పుడు కుంభకర్ణుడు ముక్కూచెవులూ పోయి క్రోధంతో మళ్ళా వచ్చేడు. మొదటే వాడు మహాభయంకరంగా ఉన్నాడు. ఇప్పుడు ముక్కూ చెవులూ పోయి వికృతాకారంతో రక్తం ప్రవాహంగా పారుతుండగా యుద్ధభూమికి వచ్చేసరికి చూచి కపులూ, భల్లూకాలూ మహాభయాన్ని పొందేరు. పార్వతీ? జై రఘుకులమణీ! అని కపులందరూ సంతోషంతో కొండలూ రాళ్ళూ తెచ్చి ఆరాక్షసుని మీద విసిరేరు. అప్పుడు కుంభకర్ణుడు క్రోధంతో కాలునివిధంగా యుద్ధభూమిలో నిలబడి కోట్లకొలది వానరులను మింగేస్తున్నాడు. మిడతలు కొండ గుహల్లోదూరినట్లు వనచరులు వాడినోటిలో దూరిపోతున్నారు. కొంతమంది వానరులను తన శరీరంమీద పెట్టి నలిపేస్తున్నాడు. కొంత మందిని నేలనురాచి ధూళిలో కలిపేస్తున్నాడు. ఆ రాక్షసుడి నోట్లో నుంచీ ముక్కురంధ్రాలలో నుంచీ చెవులలోనుంచీ భల్లూకాలూ, కపులూ బయటికివచ్చి పారిపోతున్నారు. యుద్ధంలో మదమత్తుడైన కుంభకర్ణుడు ప్రపంచమంతా మింగేస్తాడన్నట్లు విజృంభిగి పోతున్నాడు. కపి వీరులందరూ వాడిని చూచి భయపడిపోయి రమ్మని పిలిచినా రాకుండా పారిపోతున్నారు; కుంభకర్ణుడు కపిసైన్యాన్ని చిందర వందర చేసేసేడని విని రాక్షసులు

సంతోషంతో వచ్చేరు. అదిచూచి రాముడు తమ్మునితో లక్ష్మణా! సుగ్రీవుడూ విభీషణుడూ నీవూ ఈ రాక్షస సైన్యాన్ని పారదోలండి. నేను వెళ్ళి ఆ కుంభకర్ణుని బలం ఏపాటో చూస్తాను అని చెప్పి కోదండం అమ్ములూ పట్టుకొని వెళ్ళి ధనుస్సు ఎక్కుపెట్టి టంకారధ్వని చేసేసరికి ఆ శబ్దానికి రాక్షసులు చెవుడు పడిపోయేరు. అప్పుడు రాముడు లక్ష్యం జూచి బాణాలు విడిచేసరికి రాక్షస భటులందరూ తెగి పడిపోయేరు. కొందరి కాళ్ళూ కొందరి తలలూ కొందరి మూతులూ కొందరి కడుపులూ కొందరి గొంతుకలు తెగిపోయి ముక్క ముక్కలై పోయేరు. మరి కొంతమంది నూరేసి ముక్కలై పోయి కొంతమంది గాయాలతో యుద్ధ భూమిలో పడిపోయేరు. మరి కొంతమంది అవయవాలు తెగిపోయినా ధైర్యంతో మళ్ళీలేచి యుద్ధం చేస్తున్నారు. రాముని బాణాలు తగిలి రాక్షసవీరులు గర్జిస్తూ సహించలేక పారిపోయేరు. కొన్ని తలలులేని మొండేలు పట్టుకోండి పట్టుకోండి కొట్టండి కొట్టండి అని ఇటూ అటూ పరుగెత్తేయి. అప్పుడు రాముని శరాలు క్షణంలో ఆ పిశాచాలన్నింటినీ చంపేసి వచ్చిరాముని అమ్ములపొదిలో దూరిపోయేయి మాయన్నీ బ్రహ్మంలో కలిసిపోయినట్టు, అప్పుడు రాక్షసులందరూ నశించిపోవడం చూచి క్రోధంతో కుంభకర్ణుడు ఒక పెద్ద కొండ పెకలించి తెచ్చివానరుల మీదవేసేడు. రాముడు చూచి ఆకొండ గుండైపోయేలాగున కొట్టేసేడు. వెంటనే అనేక బాణాలు కుంభకర్ణుని మీద వేసేసరికి నల్లని మేఘంలో మెరుపులలాగున వాడి నల్లని శరీరంలో ఆ బాణాలు వెళ్లిగుచ్చుకొనిపోతున్నాయి. అంజనా చలం మీద గైరికధాతు ప్రవాహాలో అన్నట్టు కుంభకర్ణుని శరీరం నిండా రక్తధారలు ప్రవహించిపోతున్నాయి. అలా కుంభకర్ణుడు అలసిపోనిచ్చి వానరులందరూ అతని యెదుటికి వెళ్లేరు. వాళ్లను చూచి నవ్వి భూమి ఆకాశం దిక్కులూ నిండిపోయేలాగున అరచి కోట్లకొలదీ భల్లూకాలనూ వానరులనూ భూమిమీద వేసికొట్టి రాక్షసరాజైన రావణునికి జై అని పెద్ద కేకవేసేడు. తోడేలును చూచి మేకలు భయపడి పారిపోయినట్టు

కపులూ భల్లూకాలూ ఆ వికృతాకారున్ని చూచి పారిపోయేరు. భవానీ! రాముని విలాసం జ్ఞానులకేగాని ఇతరులకెలా తెలుస్తుంది?

## కుంభకర్ణ వధ

అప్పుడు వానరులందరూ ఈ రాక్షసుడు మాపాలిటి అగ్నిహోత్రం లాగున ఉన్నాడని ఓ కరుణా సముద్రా! దీనులైన భక్తులకు సంతోషము కలిగించువాడా! నీకు నమస్కరించువారి ఆపదలను పోగొట్టువాడా! సీతామనోహరా! సద్గుణశీలా! శ్రీరామచంద్రా! అని భయంతో తన్ను వేడుకుంటున్న వానరులను చూచి రాముడు ధనుర్బాణాలు సవరించుకొని సైన్యాన్నంతటినీ తనవెనుక నుండుమని దిక్కులు పిక్కటిల్లే లాగున ధనుష్టంకారము చేస్తూ గొప్పఉగ్రుడై ఆ రాక్షసుని ముందరకు వెళ్ళేడు. వెళ్లి సాటిలేని ఉగ్రమైన బాణాలు వాడి శరీరంలో చొరబడే లాగున వేసేసరికి వాడు ప్రళయాంతకుడిలాగున మండిపడుతూ కాళ్ళతాకుడికి భూమీ పర్వతాలూ అల్లలాడిపోయేలాగున పరుగెత్తిపోయి ఒక పర్వతం పెకలించుకొనివచ్చి రామునిమీద వెయ్యడానికి రాగానే ఆ పర్వతంతోకూడా వాడిభుజం నేలపడేలాగున రాముడు కొట్టేసేడు. మళ్ళా వాడు రెండవచేతితో మరొకకొండ పెకలించుకొని వచ్చేసరికి రాముడు మరొక బాణంతో ఆ చెయ్యి మొదటికి తెగి భూమిమీద పడేలాగున కొట్టేసేడు అప్పుడు రెండుచేతులూపోయి కుంకర్ణుడు యుద్ధభూమిలో రెక్కలులేని పెద్దకొండలాగున మూడులోకాలూ మింగేస్తాడేమో అన్నంత ఉగ్రంతో శ్రీరామునివైపు కండ్లు ఎఱ్ఱజేసి చూచేడు. పెద్ద ఉరుములాగున బొబ్బలుపెడుతూ కొండగుహలాగున నోరుతెరుస్తూ రామచంద్రున్ని మింగేయడానికి పరుగెత్తి వస్తున్నాడు. అదిచూచి దేవతలు ఆకాశంమీద నుండి భయంతో హా! పరమేశ్వరా! అంటూ పలవించేరు. శర్వాణీ! సుపర్వులలా తల్లడిల్లిపోతుంటే మునిజనదేవ శరణ్యుడు రాముడు ఆ ఘోర రాక్షసుని నోరంతా బాణాలువేసి నింపేసేడు. అలా నోటినిండా

బాణాలు నిండిపోయినా కుంభకర్ణుడు మహాధైర్యంతో ఆ బాణాల దెబ్బకు భూమిమీద పడిపోకుండా నల్లని అమ్ములపొదిలాగున తన మీదికి వస్తున్న ఆ కుంభకర్ణున్ని చూచి రాముడు కోపంతో తీవ్రమైన బాణం వేసి వాని శిరస్సు ఖండించేసేడు. ఆ శిరస్సు ఘోరున వెళ్లి రావణాసురుని ముందరపడ్డది. అది చూచి రావణుడు భయంతో మణిపోయిన సర్పం లాగున దుఃఖించేడు. భవానీ! ఆ కుంభకర్ణుని మొండెం భూమి కుంగి పోయేలాగున పరుగెత్తుతుంది. అప్పుడు రాముడు ఆ మొండేన్ని రెండు ముక్కలుగా బాణంతో తెగవేసేడు. అప్పుడు ఆ రెండు ముక్కలూ ఆకాశమునుండి భూమిమీద పడే రెండు పర్వతాల లాగున భూమిమీద పడ్డాయి. ఆ పాటుకి ఒకక్షణంవరకూ భూమి జవజవ కంపించిపోయింది. ఆ కళేబరం ముక్కలు పడడంవల్ల కొంతమంది వానరులూ భల్లూకాలూ రాక్షసులూ భూమిమీద అణిగిపోయేరు. అప్పుడు కుంభకర్ణునిలోని దివ్య తేజస్సు రామునిలో కలిసిపోయింది. అది చూచి దేవతలూ మునులూ ఆశ్చర్యపడ్డారు. అప్పుడు నారదుడు వచ్చి శ్రీరామదేవున్ని చూచి వీర రసంతో ఉన్న ప్రభువుయొక్క గుణాలన్నీ వర్ణించేడు. దేవతలు పుష్ప వర్షం కురిపించి దుందుభులు మ్రోగించేరు. అప్పుడు నారదుడు దేవా! ఈ దుష్టులను వేగంగా సంహరించు. అఖిలలోకేశా! శ్రీరామా! ఆదిదేవా! అని వినుతించి వెళ్లిపోయేడు. దేవతలందరూ శ్రీరామచంద్రున్ని స్తుతించి వెళ్లిపోయేరు. ఆ యుద్ధ భూమిలో శ్రీరామచంద్రుడు ప్రకాశిస్తున్నాడు. చెమట బిందువులతోనున్న పూర్ణచంద్రునిలాంటి ముఖంతో ఎఱ్ఱతామరపూలవంటి కన్నులయొక్క ప్రకాశం దిక్కులను వెలిగిస్తుండగా రక్తచిహ్నాలతో కూడిన శరీరం మాణిక్యాలూ నీలమణులూ కలిసియున్నట్టు ప్రకాశిస్తుండగా చాపబాణాలుధరించిన చేతులు ఎంతో అందంగా కనిపిస్తుండగా వానరులూ భల్లూకాలూ పరివేష్టించి ఉండగా యుద్ధ భూమిలోనున్న శ్రీరామచంద్రుని సౌందర్యం వర్ణించడానికి వెయ్యినోళ్ళుగల శేషునికైనా శక్యంకాదు. అని తులసీదాసు అన్నాడు. పార్వతీ! అథ

ముడూ పాపాలకి ఉనికిపట్టూ అయిన కుంభకర్ణ రాక్షసుడికి కూడా శ్రీరామచంద్రుడు కరుణతో తన పరంధామాన్ని ఇచ్చేడు. మందులైన జనులు ఆ ప్రభువుని సేవించడానికి ఇష్టపడరు. అప్పుడు సాయంకాలం అవుటచేత సైన్యాలు రెండూ మరలిపోయేయి. ఆవేళ యుద్ధంలో వానర భల్లూకాలకు శ్రమ ఎక్కువైపోయింది. శ్రీరామచంద్రుని కరుణాలోకనం వల్ల ఆ శ్రమ అంతా తగ్గిపోయి వారందరూ ఎప్పటివలెనే బలం ఉత్సాహం పొందేరు. ఈ విధంగా యుద్ధంలో పగటివేళలందూ రాత్రి వేళలందూ ఎందరో రాక్షసులు చస్తున్నారు. తనగొప్పతనం తానే పొగడు కుంటే సుకృతమంతా నశించిపోయినట్టు రావణుని అవివేకంచేత అందరు రాక్షసులూ నశించిపోయేరు. అప్పుడు రావణుడు కుంభకర్ణుని శిరస్సు వక్షానికి అదుముకొని అనేకవిధాలుగా ఏడ్చేడు. ఆ కుంభకర్ణుని బలపరా క్రమాలు వర్ణిస్తూ స్త్రీలు గుండెబాదుకొని ఏడుస్తుంటే మేఘనాథుడు అక్కడకు వచ్చి తండ్రి దుఃఖం మాన్పడానికి అనేకమైన కథలుచెప్పి జనకా! నా ప్రతాపం రేపు చూపిస్తాను. ఇప్పుడు గొప్పచెప్పడం ఎందుకు? అన్నాడు.

## మేఘనాదుడు మరల యుద్ధానికి వెళ్లుట

ఇంకా తండ్రిని పిలిచి ఇలా అన్నాడు. నేను నాఇుష్టదైవాన్ని ప్రార్థిస్తేనాకు ఒక రథమూ గొప్ప బలమూ ఇచ్చేడు. అది నీవు ఎప్పుడూ చూడలేదు. కాబట్టి రేపటి యుద్ధంలో దాన్ని ఉపయోగించి నా పరాక్రమ ప్రతాపాలన్నీ చూపిస్తాను. అని మహాగర్వంతో చెపుతున్నాడు. ఇంతలో తెల్లవారింది. కపులు కోట నాలుగువైపులా చుట్టేసేరు. అప్పుడు రణ ధీరులైన రాక్షసభటులూ కాలునితో సమానులైన భల్లూక వీరులూ వానర వీరులూ ఒకరి నొకరు జయించాలని కోరి యుద్ధం చేస్తున్నారు. వైన తేయా! ఆ యుద్ధం వర్ణించడానికి శక్యంకాదు. అంటూ కాగభుశుండి మహాముని గరుత్మంతునితో చెపుతున్నాడు. అప్పుడు ఇంద్రజిత్తుమాయా

రథంమీద కూర్చుని ఆకాశానికి ఎగిరి అక్కడి నుండి పెద్ద అట్టహాసం చేస్తూ పెద్ద బొబ్బపెట్టేసరికి కపులందరూ భయపడి పోయేరు. ఇంద్రజిత్తు ఆకాశంమీద నుండి శక్తి కృపాణం కులిశం అస్త్రశస్త్రాలూ పరశువులూ శూలాలూ పరిఘలూ పాషాణాలూ వర్షంలాగున కురిపించేస్తున్నాడు. పది దిక్కులా బాణాలు నిండిపోయేయి. మఘకార్తిలో మేఘాల లాగున చాలా వర్షం కురిసేస్తుంది. పట్టుకొండీ పట్టుకొండీ కొట్టండీ కొట్టండీ అనే ధ్వనులు అపరిమితంగా వినబడుతున్నాయి. కాని ఆ కొట్టే వాడెవడో కనపడలేదు. కపులందరూ పర్వతాలూ చెట్లూ పట్టుకొని ఆకాశంమీదకి పరుగెత్తి రాక్షసుడు కనపడకపోవడంచేత శత్రువును పట్టుకోలేక విచారిస్తూ తిరిగి భూమిమీదకి వచ్చేస్తున్నారు. ఇంద్రజిత్తు ఎత్తు పల్లాలుగా ఉన్నస్థలాలలోనూ కొండగుహలలోనూ అన్ని దిక్కులలోనూ తన మాయాబలంచేత బాణాలు నింపేస్తున్నాడు. అది ఒక బాణపంజరం అయిపోయింది. వానరులందరూ దేవేంద్రుని చెరలో చిక్కిపోయిన మందర పర్వతంలాగున ఎక్కడికీ పోలేక వ్యాకులం పొందుతున్నారు. హనుమంతుడూ నీలుడూ నలుడూ మొదలైన మహాబలవంతులు కూడ అమ్మో ఏం చెయ్యగలం? అని చింతిస్తున్నారు. మరియు ఆ మేఘనాథుడు లక్ష్మణుని మీదా అంగద సుగ్రీవ విభీషణుల మీదా అపరిమితంగా బాణాలువేసి శ్రీరామచంద్రుని మీద కూడా అమ్ములు ప్రయోగించేడు.

## శ్రీరామచంద్రుడు నాగపాశబద్ధుడౌట

ఈ విధంగా రామునిమీద బాణాలు వేసేసరికి అవి పాములై వచ్చి రాముణ్ని తాకేయి. వెంటనే పరమాత్ముడైన శ్రీరామచంద్రుడు నాగపాశబద్ధుడైపోయేడు. అనంతుడూ అవికారీ స్వతంత్రుడూ అయి కూడా వినోదప్రియుడగుడచేత నటుని విధంగా కపట చరిత్ర నడుపుతుంటాడు, ఉమా! మాయకు వశుడుకాక పోయినా వశుడైనట్టుగా

నటిస్తున్నాడు. అప్పుడు దేవతలు చాలాభయం పొందేరు. రామునిమహత్వం తెలిసికోలేక అతనిస్థితి చూచి భీతిల్లిపోయేరు. అతని నామం స్మరించి నంత మాత్రాన్నే మునులందరూ భవబంధరహితులైపోతుంటే ఆ విశ్వనాధుడైన విభునికి బంధముందా ? యుద్ధం రమణీయంగా నడవడానికి తానుకూడా నాగపాశబద్ధుడైనట్టు నటించేడు. సగుణుడైన శ్రీరామచంద్రుని చరిత్ర బుద్ధిబలంచేత తర్కిస్తే తెలియదు. విరాగులైనవారు మాత్రమే సూక్ష్మబుద్ధితో అతని మహిమ తెలిసికొని తర్కించడం మాని భక్తిభావంతో సేవిస్తారు.

## జాంబవంతుడు ఇంద్రజిత్తుని మూర్ఛనొందించుట

అప్పుడు మేఘనాధుడు సైన్యం అంతటినీ వ్యాకులం పొందింప చేసి మేఘాల చాటునుండి వెడలివచ్చి కనబడుతూ దుర్భాషలాడుతున్నాడు. అది విని జాంబవంతుడు కోపంతో ఓరి నీచుడా! నిలు నిలు అన్నాడు. అనగానే ఇంద్రజిత్తు క్రోధంతో ఓరి మూఢుడా! నీవు ముసలివాడవని కనికరించి విడిచి పెట్టేనురా, అందుకు ఇలా వదరుతున్నావా? అని మూడు మొనల ఆయుధాన్ని జాంబవంతునిమీద ప్రయోగించేడు. దాన్ని జాంబవంతుడు వేగంగా అందుకొని ఇంద్రజిత్తువక్షంమీద గుచ్చేడు. వెంటనే వాడు గిర్రున తిరిగి భూమి అదిరిపోయేలాగున పడ్డాడు. ఆ వెంటనే జాంబవంతుడు వాడి పాదాలు పట్టుకొని గిరగిర త్రిప్పి నేలనువేసి కొట్టేడు. ఈవిధంగా జాంబవంతుడు తన బలాన్ని తెలియజేసి వరబలంచేత వాడు చావకపోవడంచేత వాడిని తీసి లంకలో పడేలాగున విసిరేడు.

## గరుత్మంతుడు రాముడు మొదలైనవారిని నాగపాశాలనుండి విడిపించుట

అప్పుడు నారదుడు పరమేశ్వరుడైన శ్రీరామచంద్రునియొద్దకు గరుత్మంతున్ని పంపించేడు గరుత్మంతుడు తన రెక్కల గాలికి కొండలుకూడా

ఎగిరిపోయేలాగున వచ్చి ఆమాయపాముల నన్నింటినీ మింగేసేడు. వానరు లందరూ సంతోషించేరు. మాయ అంతా వదలిపోయి కపులు రాక్షసులను చెట్లతోనూ రాళ్ళతోనూ గోళ్ళతోనూ, కొండలతోనూ, కాళ్ళతోనూ కొట్టి తన్ని బాధిస్తుంటే వాళ్ళు కోటదాటి లంకలోకి పారిపోయేరు.

## వానరులు ఇంద్రజిత్తు యజ్ఞాన్ని పాడుచేయుట

అప్పుడు ఇంద్రజిత్తు మూర్ఛతేరి తండ్రినిచూచి సిగ్గుపడ్డాడు. నేను ఈప్రపంచంలో అజేయుడననే పేరుపొందేలాంటి యజ్ఞం చేస్తానని నిశ్చ యించుకొన్నాడు. వెంటనే ఒక కొండగుహలోకి వెళ్ళి యజ్ఞదీక్షలో కూర్చున్నాడు. ఆమర్మం విభీషణుడు తెలుసుకొని రామునితో దేవా! ఖలు డైన ఇంద్రజిత్తు జయాన్నికోరి అపవిత్రమైన యజ్ఞం ఒకటి మొదలు పెట్టేడు. వాడు గొప్ప మాయావి. ఆ యజ్ఞాన్ని నెరవేర్చాడంటే ఇక వాడిని ఎవరూ జయించలేరు అన్నాడు అదివిని శ్రీరామచంద్రుడు వెంటనే మహాబలవంతులైన అంగదుడూ మొదలైనవారిని పిలిపించి అన్నలారా మీరందరూ లక్ష్మణునితో కూడావెళ్ళి ఆ ఇంద్రజిత్తు యజ్ఞాన్ని ధ్వంసం చేసెయ్యండి. దేవతల భయం చూస్తే నాకు దుఃఖం కలుగుతుంది. లక్ష్మణా! నీవు వెళ్ళి వాన్ని సంహరించు ఓ జాంబవంతా! విభీషణా ! సుగ్రీవా. మీరు ముగ్గురూ సైన్యంతో కూడా ఉండాలనీ ఆజ్ఞాపించేడు. వెంటనే లక్ష్మణుడు మొలను అమ్ములపొది అమర్చుకొని ధనుర్బాణాలు సవరించుకొని రాముని ప్రతాపం హృదయంలో నిలుపుకొని రణధీరుడూ వారింపశక్యంకాని బలంకల వాడూ ఐన ఆసౌమిత్రి మేఘగంభీరరవంగలమాటలతో ఇలాఅన్నాడు.ఇదిగో ఈవేళ నేనా రాక్షసుణ్ణి వధించకుండావస్తే రామప్రభువుకి సేవకున్నే కాను వాడికి వందమంది శివులు సహాయంగా వచ్చినా వాన్ని తప్పక చంపేస్తాను స్వామితోడు అంటూ రాముని పాదపద్మాలకు నమస్కరించి హనుమదాది సైన్యంతో లక్ష్మణుడు బయలుదేరి వెళ్లేడు. అప్పుడు వానరులందరూ ఇంద్ర జిత్తుచేసే యజ్ఞం దగ్గరకు వెళ్లి చూసేరు. ఇంద్రజిత్తు మహాదీక్షతో

అగ్నిలో రక్తమూ ఇంకా హేయమైన పదార్థాలూ పెద్దపెద్ద ఎనుబోతులూ వేఃస్తుంటే వేగంగావెళ్లి ఆ యజ్ఞమంతా ధ్వంసంచేసి పారేసేరు. ఎన్నిచేసినా వాడు దీక్షలోనుండి లేవలేదు. అప్పుడు వాన్ని అందరూ ఒక్క పెట్టున స్తోత్రాలు చేసేరు. అయినా వాడు లేవలేదు. అప్పుడు వానరులందరూ వాడిజుత్తు పట్టుకొని ఈడ్చి భూమిమీద పడవేసి బాగా తన్నితన్ని లక్ష్మణుడున్నచోటికి వేగంగా పారిపోయేరు. అప్పుడు వాడు కోపంతో ఒక శూలంపట్టుకొని తొందరగా వస్తుంటే చూచి అంగదుడూ హనుమంతుడూ వాడిని కొండలతోనూ చెట్లతోనూ మొత్తేరు. ఇంద్రజిత్తు వాళ్ళనిద్దరినీ శూలంతో పడగొట్టి మహాజ్వాలలతో ఉన్న ఆ శూలాన్ని లక్షణునిమీద విసిరేడు. లక్ష్మణుడు దాన్ని రెండుముక్కలయే లాగున బాణంతో కొట్టేడు అప్పుడు అంగదుడూ హనుమంతుడూ లేచి పిడికిళ్ళతో చాలాసేపు కొట్టి విసిగిపోయేరుగాని కొంచెమైనా వాడికి దెబ్బ తగలలేదు. చంపినా చావకుండా ఉన్న ఆ శత్రువును చూచి అంగదుడూ హనుమంతుడూ తిరిగిపోయేరు. అప్పుడు ఆ రాక్షసుడు చీత్కారం చేస్తూ కాటుడేమో అన్నట్టు వస్తున్నాడు అదిచూచి లక్ష్మణుడు భయంకరమైన అస్త్రం వాడిమీద ప్రయోగించేసరికి వాడు మాయమైపోయి అనేక వేషాలతో యుద్ధం చేస్తున్నాడు. అంతలోనే వచ్చి కనపడుతున్నాడు వెంటనే మాయమైపోతున్నాడు. అదిచూచి కపులు ఈ రాక్షసుడు అజేయుడని భయపడ్డారు. అప్పుడు లక్ష్మణుడు మహాగ్రహంతో ఈ పాపాత్ముణ్ని ఇంతవరకూ ఆడించేను. ఇక ఆలస్యం ఎందుకు? ఈ దుష్టున్నిచూచి సహించను. అని నిశ్చయించుకొని,

## లక్ష్మణుడు ఇంద్రజిత్తును సంహరించుట

శ్రీరామచంద్రుని ప్రతాపం మనస్సులో తలంచుకొని బాణం సంధించి రాక్షసుని వక్షాన్ని గురిచూచి వేసేడు. అది వాడి గుండెమీద బాగా నాటింది. గుండెపగిలివాడు చచ్చేసమయంలో మాయ అంతా వదలి

పోయింది. ఏడీ రాముడు ఎక్కడ? లక్ష్మణుడెక్కడ?వారిని ఎదుర్కోవాలని అంటూ ప్రాణాలు విడిచిపెట్టేసేడు. ఆదంతా అంగదుడూ హనుమంతుడూ చూచి రాక్షసుడపైనా నీ తల్లి ధన్యురాలు అని మేఘనాథున్ని ప్రశం సించేరు. అప్పుడు హనుమంతుడు వాని కళేబరం తీసికొనివెళ్ళి లంకా ద్వారం దగ్గరపెట్టేడు. దేవతలూ గంధర్వులూ వాని మరణవార్తవిని ఆకాశవీధిని విమానాలతో అక్కడికి వచ్చేరు. పుష్పవర్షం కురిపించి దుందుభులు వాయించి ఆనందంతో రాముని కీర్తి పాడేరు. జై లక్ష్మణా! జై అనంతా! భూమికి ఆధారమైనవాడా అని స్తుతించి వెళ్ళిపోయేరు. అప్పుడు లక్ష్మణుడు సైన్యంతోకూడా రాముని దగ్గరకు సంతోషంతో వెళ్ళేడు. పార్వతీ! అప్పుడు కుమారుడైన మేఘనాధుడు చచ్చిపోయేడన్న వార్తవిని రావణుడు గొప్పదుఃఖంతో ధైర్యంవిడిచి భూమిమీదపడి మూర్ఛపొందేడు. మండోదరి కుమార్తున్ని తలంచుకొని తలంచుకొని అనేకవిధాలుగా గుండె బాదుకొని ఏడ్చింది. అప్పుడు లంకానగరంలో ఉన్నవారందరూ గొప్ప వ్యాకులంపొంది ముందు ఏమివస్తుందో తెలుసుకోకుండా కష్టాలు తెచ్చి పెట్టిన రావణుని నిందించేరు. అప్పుడు రావణుడు ఈభూమిమీద ఉన్న సమస్తరూపాలూ నశించిపోయేవే. ఎందుకు విచారించడం? అని అనేక విధాలుగా స్త్రీలకు బోధించేడు రావణుడికి దుర్విషయాలు ఎంత ఇష్టమై నప్పటికీ ఇతరులకు జ్ఞానోపదేశమే చేసేడు. ఈవిధంగా చెప్పేవారేగాని చేసేవారు సాధారణంగా తక్కువగా ఉంటారు. ఆప్పుడు రాత్రి గడచిపోయి తెల్లవారింది. వానరులూ భల్లూకాలూ వచ్చి లంక నాలుగుద్వారాలయొద్ద పరివేష్టించి యుద్ధసన్నద్ధులై ఉన్నారు. అప్పుడు రావణుడు రాక్షస భటు లను పిలిచి మీలో యుద్ధానికి వెనుకదియ్యకుండా నిలబడలేని వారందరూ ఇప్పుడేపొండి అనుజ్ఞయిచ్చేను అన్నాడు .

## రావణుడు యుద్ధానికి వెళ్ళుట

యుద్ధ సమయంలో పారిపోవడం మంచిదికాదు నాభుజబలమే చాలు నని నమ్మి యీయుద్ధం ఇంతవరకూ వృద్ధిపొందించేను. ఏశత్రువుకైనా

జవాబు చెప్పగలను అనిచెప్పి వాయువేగంగా పరుగెత్తగల గుఱ్ఱాలు పూన్చిన బంగారు రథంపై ఎక్కి తూర్యారావాలూ, భేరీలు మ్రోగుతుండగా సైన్యమంతా వెనుక బయలుదేరి వస్తుండగా నల్లని చీకటికమ్మిన గాలివాన లాగునవెళ్లేడు. ఆరాక్షససైన్యం అంతటికీ అపశకునాలు కనబడ్డాయి. గొప్ప భుజబలం గర్వంగల రావణుడు అది లెక్కచెయ్యలేదు. చేతులలోనుండి ఆయుధాలు జారిపోయాయి కారణం లేకుండా రథాలలో ఉన్నవాళ్ళు పడి పోయేరు. ఏనుగులూ, గుర్రాలూ చీదరగొట్టుకుంటూ భ్రమపొంది అక్కడక్కడికి పారిపోతున్నాయి. నక్కలూ గద్దలూ ఘోరంగా అరిచేయి. కుక్కలు మొరిగి ఏడిచేయి, గుడ్లగూబ యమదూతలాగున భయంకరంగా అరిచింది. రావణుని గొడుగు విరిగిపోయింది. ఇలాంటి దుశ్శకునాలు ఎన్ని కనబడ్డా గర్వంచేతా దురభిమానంచేతా దుష్టుడైన రావణుడు కొంచెమైనా లెక్కచెయ్యలేదు. ఇతరులకు ద్రోహంచేసేవాడూ కామవశుడూ శ్రీరామ విముఖుడూ ఎప్పుడూ శ్రేయస్సు పొందలేడు అటువంటివానికి కలలోనైనా విశ్రాంతి ఉండదు.

సంపదలు తొలగిపోయి లోకనిందా అపకీర్తి కూడా కలుగుతాయి. అసురసైన్యమంతా చతురంగబలంతో నడుస్తుంది. అనేకమైన రంగులతో జండాలు ఆకాశంనిండి పోయేయి. రథాలూ వాహనాలూ వర్షాకాలమేఘాలలాంటి ఏనుగుల సమూహాలూ నడుస్తున్నాయి. అనేకమైన రంగులుగల బాణాసనాలు ధరించిన యోధులు యుద్ధంలో శౌర్యమూ అనేకమాయలెరిగిన వారూ అయి ఉన్నారు. దిగ్గజాలు వణకిపోయేయి. సముద్రాలు కలగిపోయేయి. పర్వతాలు చలించిపోయేయి. గొప్పవిచిత్రమైన సేన ప్రకాశించింది. ఈ విధంగా మహావీరుడైన రావణుని సైన్యం అపరిమితమైన వీరవసంతుని సైన్యంలాగున వచ్చింది. ధూళి ఆకాశం ముట్టిపోయి సూర్యున్ని కప్పేసింది, గాలికదలలేదు. భూమి కంపించి పోయింది, గొప్ప చీకటైపోయింది. ప్రళయ కాలమేఘాలలాగున యుద్ధభేరీలూ తూర్యాలు ధ్వనిస్తున్నాయి. వీరులు ఉత్సాహంతో యుద్ధా

నికి సిద్ధపడుతున్నారు. తమతమ బలాలు చెప్పుకొని సింహనాదాలు చేస్తూ అతిసులభంగా భువనాలన్నీ మేమేజయించేస్తామని పలుకుతూ చెలరేగిపోతున్న రాక్షసభటులను చూచి రావణుడు ముందుగా మీరు వానరులనూ భల్లూకాలనూ యుద్ధంలో చంపెయ్యండి ఆ నరుల నిద్దరినీ నేను పరిమారుస్తాను. అని చెప్పి సైన్యంతో కూడా రామునికి ఎదురుగా వెళ్లేడు. కపుఃు అది తెలిసికొని శ్రీరామచంద్రునికి జై అంటూ పరాక్రమంతో ఆకాశానికి ఎగిరి భయంకరంగా రాక్షస సైన్యంతో యుద్ధానికి మొదలు పెట్టేరు. కపులూ భల్లూకాలూ వీర త్వంతో గోళ్లూ దంతాలూ కొండలూ చెట్లూ ఆయుధాలుగా చేసుకొని యుద్ధభూమిలో రావణుడనే మదించిన ఏనుక్కి సింహమైన మా రఘురామచంద్రునికి కోటి మన్మథుల సౌందర్యంగల వానికి జయ మగు గాక ! అని రాముని కీర్తి వర్ణిస్తుంటే ఆ ధ్వని సముద్రఘోషం లాగున పది దిక్కులందూ నిండిపోయింది. రెండు సైన్యాలలోనూ జయజయధ్వనులు బయలుదేరెయి. వానరులు సమస్తలోకేశ్వరుడైన శ్రీరామచంద్రుని కీర్తి మహిమా వర్ణిస్తుంటే రాక్షసులు రావణుని ధైర్యం పరాక్రమం వర్ణిస్తున్నారు. ఒక వానరుడూ ఒక రాక్షసుడూ ఇలా ఇద్దరేసి ద్వంద్వయుద్ధాలు చేస్తున్నారు. రావణుడు రథంమీదున్నాడు రామునికి రథంలేదని విభీషణుడు మనస్సులో అధైర్యంపొంది రామునికి నమస్క రించి దేవా! నీకు కవచమూ పాదరక్షలూ రథంకూడా లేవు. బలవంతు డైన ఆ శత్రువును ఎలా గెలువగలవు? అన్నాడు. అదివిని రాముడు అంటున్నాడు. మిత్రుడా! చెపుతానువిను. దేని వల్ల జయంకలుగుతుంతో అదేరథం. శౌర్యధైర్యాలు రథచక్రాలు. శీలమూ సత్యమూ ధ్వజపతా కాలు. క్షమా కరుణా సమత్వం అనే తాళ్ళతోకట్టిన దమమూ బలమూ వివేకమూ పరులకు మేలుచేయడమూ అను గొప్పసుగుణములే గుఱ్ఱాలు. ఈశ్వరభజనే సారథి. వైరాగ్యమే డాలు. సంతోషమే ఖడ్గం. దాన గుణమే పరశువు. గొప్పబుద్ధియే శక్తి. జ్ఞానమే ధనస్సు. శమమూ

యమనియమాలూ మొదలైనవి అపరిమితమైన బాణసమూహాలు. చలనంలేని నిర్మలమైన మనస్సే అమ్ములపొది. మమత్వం భేదబుద్ధీ లేకుండా గురువునూ బ్రాహ్మణులనూ పూజించడమే కవచము. వీటితో సమానమైన సాధనాలేవీ లేవు. సఖా! ధర్మం అనేరథం ఎవరికి ఉంటుందో వారికి గెలవడానికి శత్రువేలేడు. ధీరమతి గలిగిన మిత్రా! ఈ ప్రపంచ రూపమైన ప్రకృతియే ఎంతైనా గెలవలేని శత్రువు. ధర్మమనే రథంలో ఉన్నవాడే ఆ ప్రకృతి రూపమైన మాయ అనే శత్రువును జయించ గలుగుతాడు అన్నాడు. ఆ మాటలువిని విభీషణుడు సంతోషంతో ప్రభు పాదపద్మాలు పట్టుకొని వినయంతో దేవా! ఈ మిష చేత నాకు చక్కని ఉపదేశం చేసేవు కరుణానిధీ! అన్నాడు. రాక్షసులకూ వానరులకూ అప్పుడు ఘోరయుద్ధం జరిగిపోతుంది. రావణునికి జై అని రాక్షసులూ, రామచంద్రునికి జై అని వానరులూ యుద్ధంచేసేస్తున్నారు. పార్వతీ! అప్పుడు బ్రహ్మమొదలైన దేవతలూ మునులూ సిద్ధులూ సంతోషంతో విమానాలలో ఆకాశంనుండి చూస్తున్నారు. పార్వతీ! అప్పుడు మనం కూడా వాళ్ళతో కలిసి చూస్తున్నాం. శ్రీరామ చంద్రుని నటనంతా అని గౌరితో శంభుడు చెపుతున్నాడు. రెండు పక్షాల యోధులూ బలంతో పోరాడుతున్నారు. విజయశీలురైన కపులందరూ రామ బలాన్ని పొంది గొప్ప ఆవేశంతో అసురభటులను మించిపోతున్నారు. వానర రాక్షస వీరులలో ఒకన్నొకడు పిలుచుకొని యుద్ధంచేసి ఒకన్నిమరొకడు చంపేస్తున్నాడు ఇంకొకడు మరొకన్ని నొప్పిస్తున్నాడు. ఇలా కపులూ అసురులూ కొట్టుకొంటూ నరుక్కుంటూ పడదోసుకుంటూ శత్రువుల తలలు పడగొట్టి కడుపులుచింపేసి చేతులు ఊడబెరికేసి గర్జిస్తూ కాళ్ళు పట్టుకొని భూమిమీదకొట్టి పైకి విసిరేస్తూ రెండుతెగలవారూ గొప్పయుద్ధంచేస్తూంటే భల్లూకభటులు రాక్షసభటులను పట్టుకొని భూమిలో పాతిపెట్టి మీద ఇసుక కప్పేస్తున్నారు. యుద్ధంలో పరవశులైన వానరవీరులనుచూస్తే క్రోధంతో ఉన్న యముళ్లేమో అనిపిస్తుంది. ఈవిధంగా కపులు క్రోధంతో రాక్షస

వీరులను కాళ్ళతో తన్నుతూ చేతులతో గుద్దుతూ గుండెలు చీల్చుతూ గర్వం నిర్మూలమైపోయేలాగున చేస్తూ చంపుతూ సింహనాదాలు చేస్తూ వెక్కిరిస్తూ గోళ్ళతో రక్కుతూ పండ్లతో కరుస్తూ చెంపకాయలు కొడుతూ నానావిధ బాధలూ పెడుతున్నారు. ఒక్కొక్క రాక్షసుణ్ని పట్టుకొని మెడలు తెంపేస్తున్నారు. గుండెలు బద్దలు చేసేస్తున్నారు. ఈ విధంగా రణరంగంలో గిరిచరులైన వానరసేన మిక్కిలి భయంకరంగా కనపడుతుంది. ఇంకా రాక్షస వీరుల పొట్టలుచీల్చి వానరభటులు పేగులులాగి హారాలుగా మెడలో వేసుకొని రక్తంతో తడిసిన భయంకర శరీరాలతో ఎన్నోరూపాలుపొందిన నరసింహస్వామిలాగున ఆ సమయంలో కనబడుతున్నారు. అప్పుడు ఆ వానర వీరులందరూ ఒక్కసారిగా శ్రీరామచంద్రుని ఉద్దేశించి గడ్డిపోచను వజ్రం చేసి వజ్రాయుధాన్ని గడ్డిపోచగా మార్చగల దేవాధిపా! సద్గుణసహితా! గుణరహితా! ఎన్నడానికి శక్యముకానివాడా! నీకు జయమగుగాక అన్నారు. అప్పుడు రావణుడు తనబలమంతా విరిగి పారిపోవడంచూచి మహాగర్వంతో ఇరవై చేతులతో పదిధనుస్సులూ పదిసాయకాలూ పట్టుకొని రథంమీద కూర్చొని వెళ్తూ మరలండి మరలండి అని తన భటులను పిలుస్తూ వస్తూండడం చూచి వనచరులు ఆనందంతో కిచకిచలాడుతూ ఎదురుగావెళ్ళి వానిమీద చెట్లూ కొండలూ రాళ్ళూ ఒకేసారిగా పదేసీ వందేసీ వెయ్యేసీ పదివేలేసీ లక్షేసీ పదిలక్షలేసీ కురిపించేసరికి ఆ కఠినమైన రావణుని శరీరానికి తగిలి అవన్నీ ముక్కలు ముక్కలుగా విరిగి భూమిమీద పడిపోయేయి. చెట్లన్నీ గుండైపోయేయి. కాని రణధీరుడైన రావణుడు కొంచెమైనా చలించకుండా యుద్ధభూమిలో తన రథం తెరిపిలేకుండా ముందుకి వడిగా పోనిచ్చేడు. అలా వెళ్లేసరికి కోతులదండు వానిమీదపడింది. రావణుడు ఆ వానరు లందరినీ నొప్పించేలాగున కొట్టేడు. ఆవానరులందరూ దుఃఖిస్తూ అంగదుడా! హనుమంతుడా! మమ్ములను కాపాడండి ఓ రామచంద్రా! ఆర్తశరణ్యా! పాహి పాహి, ఈదుర్మార్గుడైన రావణుడు మమ్మల్ని చంపుకు తింటున్నాడు యముడిలాగున అంటూ పారిపోతుంటే ఇరవై చేతు

లతో బాణాలను సంధించి వానరులమీద వేసేడు. అవి సర్పాలలాగున ఎగిరి తగిలేయి. రావణుని బాణాలు భూమి ఆకాశం దిక్కులూ నిండిపోయేయి. కపులందరూ నిలువలేక పారిపోయేరు. అప్పుడు ఆ సైన్యంలో గొప్పకోలాహల మయింది. కపులూ భల్లూకాలూ దుఃఖంతో కరుణానిధీ! సీతాపతీ! దీనశరణ్యా! భక్తపరిపాలనా! శ్రీహరీ! అని మొఱపెట్టేరు. అది చూచి లక్ష్మణుడు ధనుర్బాణాలు పట్టుకొని శ్రీరామచంద్రుని పాదపద్మాలకు నమస్కరించి వేగంగా వెళ్ళి రావణుని చూచి ఓరి ఖలుడా! వానరసేన లెందుకురా కొడతావు? నన్నుచూడు నేను నీకు కాలున్నిసుమా అన్నాడు, అది విని రావణుడు ఓరీ! నాకొడుకుని చంపిన నీచుడా! నిన్ను చంపాలనే వెతుకుతుంటే ఇక్కడ దొరికేవురా ఇదిగో ఇప్పుడు నిన్నుచంపి ప్రశాంతత పొందుతాను అని తీక్షణమైన బాణాన్ని వేసేడు. దాన్ని నూరుముక్కలు చేసేడు లక్ష్మణుడు అప్పుడు రావణుడు కోటి ఆయుధాలు ప్రయోగించేడు. వాటి నన్నిటినీ లక్ష్మణుడు నువ్వుగింజలంతేసి ముక్కలుచేసి క్రోధంతో బాణాలు వేసి రావణుని గొప్పరథాన్ని పగులగొట్టి సారధిని చంపేసేడు అంతటితో ఊరుకోకుండా రావణుని పదితలలమీదా పది వేలబాణాలు సూర్యతేజస్సుతో సమానమైనవి వేసేడు.అవి గొప్ప వింతగా కొండ గుహలలోదూరే సర్పాలలాగున ఆశిరస్సులలో ప్రవేశించేయి. పార్వతీ! ఇంకా కఠోరమైన నూరు బాణాలు రాక్షసుని వక్షస్థలాన్ని తాకేలాగున వేసేడు .వెంటనే రావణుడు మూర్ఛిల్లి భూమిమీదపడి కొంతసేపు అలా ఉండిపోయి అప్పుడు మూర్ఛ తేరి లేచి మహారోషంతో బ్రహ్మదత్తమైన ప్రచండశక్తిని లక్ష్మణుని మీద ప్రయోగించేడు.

## రావణుని శక్తి ప్రయోగంవల్ల లక్ష్మణుడు మూర్ఛపొందుట

అది లక్ష్మణుని వక్షంమీద తగిలి మూర్ఛచెంది పడిపోయేడు. అప్పుడు రావణుడు దగ్గరకువచ్చి అతన్ని ఎత్తాలని చూచేడుకాని కొంచమైనా కదల్పలేక మనస్సులో చాలా సిగ్గుపడిపోయేడు. ఎవని శిరస్సుమీద అన్ని లోకా

లతోకూడిన బ్రహ్మాండం అంతా ఒకపరమరేణువు లాగున ధరింపబడిఉందో ఆమహాత్ముని ఎత్తడానికి ఎవరికి శక్యమవుతుంది? ఆ మూఢుడైన రావణుడు అతడు త్రిభువనేశ్వరుడని తెలియక ఎత్తడానికి వెళ్ళి సిగ్గుపడ్డాడు. ఇదంతా చూచి హనుమంతుడు రావణున్ని "తినమైన మాటలతోనొప్పిస్తూ దగ్గరకు వెళ్లేసరికి అతని వక్షంమీద రావణుడు ఒక గుద్దుగుద్దేడు. దానికి హనుమంతుడు మోకరిల్లిపడి ధైర్యవంతుడగుటచే వెంటనేలేచి గొప్పపిడికిటి పోటుతో రాక్షసుని గుండె బద్దలయ్యేలాగున కొట్టేడు. వజ్రాయుధం దెబ్బకు పడిపోయే కొండలాగున అసురుడు నేలపడిపోయి కొంతసేపటికి లేచి హనుమంతుని బలాన్ని గొప్పగా వర్ణించేడు. అప్పుడు మారుతి ఓరీ! రాక్షసుడా! నిన్ను మళ్ళా ప్రాణాలతో లేవనిచ్చిన నాబలం ఏపాటిరా? అని లక్ష్మణున్ని తీసుకొని రాముని దగ్గరకు వెళ్ళిపోయేడు.

## లక్ష్మణుడు మూర్ఛతేరి లేచుట

అప్పుడు రాముడు సోదరా! ఇదేమి? నీకీవికారమ ముంటుందా నీ మనస్సులో ఆలోచించుకో కాలున్నైనా ఇట్టే మింగగలవాడవు దేవతలను రక్షించేవాడవు. నీకేవికారంలేదు. అనగానే లక్ష్మణుడు లేచి కూర్చున్నాడు. అప్పుడు ఆ శక్తిబాణం ఆకాశమార్గంగా వెళ్ళిపోయింది. సౌమిత్రి చాపబాణాలు ధరించి రావణుని యెదుటికివెళ్ళి రథాన్ని సారథినీ పడగొట్టి నూరుబాణాలు వేసి రావణున్ని కొట్టేసరికి వాడు భూమిమీద పడిపోయేడు. పార్వతీ రావణుడు అలా పడిపోగానే మరొక సారధి కొత్తరథం తెచ్చి ఆ రాక్షసరాజుని దానిమీద వేసికొని లంక లోనికి వెళ్ళిపోయేడు. అప్పుడు ప్రతాపవంతుడైన లక్ష్మణుడు వచ్చి భక్తితో రామునికి నమస్కరించేడు. అప్పుడు లంకలో రావణుడు మూర్ఛతెలిసి ఒక యజ్ఞం చెయ్యడానికి ఆలోచించేడు. అజ్ఞాని అవుట చేత ఆ మూర్ఖుడు ఆ యజ్ఞంచేసి రామున్ని ఇంకాగెలవగలననే తలంచుతున్నాడు.

## వానరులు రావణుని యజ్ఞం పాడుచేయుట

ఆ రహస్యమంతా విభీషణుడు తెలిసికొని శ్రీరామచంద్రునితో దేవదేవా! పద్మనేత్రా! దుష్టుడైన రావణుడు ఇప్పుడు ఒకయజ్ఞం చెయ్యడానికి పూనుకున్నాడు. అది సిద్ధించిందంటే ఆ అభాగ్యుణ్ని వధించడానికి శక్యం కాదు. కాబట్టి ఆ యజ్ఞాన్ని పాడుచేయుమని వానరులను పంపిస్తే మంచిది అన్నాడు. అనగానే రాముడు వానరులనూ భల్లూకాలనూ పంపించేడు. ఆ వానరులందరూ రావణునియజ్ఞం చెరిచేద్దామని సంతోషంతో దుముకుతూ వెళ్లి లంకలో చొరబడి రావణుని భవనంలో ప్రవేశించి వాడు యజ్ఞం చేస్తుండడం చూడగానే ఆ రాక్షసునిమీద పట్టరాని కోపంవచ్చింది అప్పుడు అంగదుడు ఓరీమూఢా! యుద్ధభూమిలో నిలవలేక పారిపోయి సిగ్గులేక ఇక్కడ కొంగజపం చేస్తున్నావా? అని వాడినొక్క తన్నుతన్నేడు. అలాతన్నినా ఆ రాక్షసుడు కొంచెమైనా చలనం లేకుండా కన్నులు విప్పైనా చూడలేదు. అందుకు వానరులందరూ కోపంతో వాణ్ని కరవడం తన్నడం చేసేరు. ఇంకావాడు కదలలేదు. అప్పుడు అంగదుడూ మొదలైన వానరులందరూ అంతఃపురంలో ప్రవేశించి స్త్రీలు జుత్తులు పట్టుకొని వాళ్ళ మొత్తోమని ఏడుస్తుంటే ఆ రావణుడి దగ్గరకు ఈడ్చి తీసికొని వచ్చేరు. అదిచూచి రావణుడు క్రోధంతో ప్రళయాంతకుడిలాగున లేచి పదిముఖాలు ఎఱ్ఱబారిపోయేయి. చేతులు చాపేడు. క్రూరంగా వానరులను పట్టుకొని నేలనువేసి కొడుతున్నాడు. ఇంతలో కొందరు వానరులూ భల్లూకాలూ ఆ యజ్ఞం అంతా ధ్వంసం చేసేసేరు. ఇలాయజ్ఞం పాడుచేసి వానరులూ భల్లూకాలూ అందరూ రాముని సన్నిధానానికి వచ్చేసేరు. అప్పుడు రావణుడు నిరాశచెంది క్రోధంతో మండిపడి యుద్ధానికి బయలుదేరేడు.

## రావణుడు మళ్లాయుద్ధానికి వెళ్లుట

రావణుడు యుద్ధానికి బయలుదేరి వెళుతుంటే దుశ్శకునాలు ఎన్నోకనపడ్డాయి. పది శిరస్సుల మీదా గద్దవాలి ఎగిరిపోయింది.

వాడు ఏదీలెక్కచేయలేదు. ఆదుష్టుడు రణభేరీవాయింపచేసి భటులకు ఆజ్ఞ ఇచ్చేసరికి చతురంగ బలాలూ అగ్నిహోత్రంలో పడబోయే మిడతలదండులాగున వచ్చేసేయి. అప్పుడు దేవతలు రాముణ్ని స్తుతిస్తూ రమానాథా ! వీడు మమ్ములను మహాకష్టపెట్టేడు. ఇక వీడిని ఆటలాడించి విడిచిపెట్టక వేగంగా వధించు. స్వామీ! వీడు సజ్జనుల హృదయాలకి బల్లెంలాంటి వాడు, వీడివల్ల మాతల్లి సీతామహాదేవి కూడా భయపడుతుంది. అన్నారు. దేవతల మాటలు విని రాముడు నవ్వుతూ శరాలూ కోదండమూ సరిచేసుకొని నీలమేఘచ్ఛాయ గల శరీరంతో ఎఱ్ఱపద్మాలలాంటి కన్నులతో మనోహరంగా మొలను అమ్ములపొదీ చేతిని విల్లూపట్టుకొని విశాలమైన వక్షం మీద మునిపాదచిహ్నం ప్రకాశిస్తుండగా బయలుదేరేడు. ఆసౌందర్యం చూచి దేవతలు జయ జయధ్వానాలు చేస్తూ పుష్పవర్షం కురిపించి జ్ఞాననిధానా! భూ భారాన్ని నివారించు అని వినుతించేరు. రాముడు కోదండం పట్టుకొని బాణాలు వేస్తే బ్రహ్మాండమంతా వణకిపోతుంది. ఆదిశేషుడూ ఆదికూర్మం దిగ్గజాలూ పర్వతాలూ భూమీ చలించిపోతాయి, అని జ్ఞాన భూములలో విహరించే పరమ భక్తుడైన తులసీదాసు అన్నాడు. అప్పుడు రాక్షసులందరూ ప్రతిజ్ఞలు చేసికొని ప్రళయ కాలమేఘాలు లాగున వచ్చేరు. కపులకూ రాక్షసులకూ అప్పుడు గొప్ప యుద్ధం జరిగింది. తళతళలాడే కత్తులు పదిదిక్కులందూ మెరుపులులా ప్రకాశించేయి. రథాలూ ఏనుగులూ గుఱ్ఱాలూ చేసేధ్వనులు ఉరుముల్లాగునా వానరుల తోకలన్నీ ఇంద్రధనుస్సులలాగునా ఆకాశంమీదకెగిరిన ధూళీ బాణాలు వర్షధారల లాగునా ఆ యుద్ధభూమిలో కనిపిస్తున్నాయి. రెండు తెగల వారూ పర్వతాలతో కొట్టుకుంటుంటే ఆవర్షంలో పిడుగులు పడ్డట్టు వినిపిస్తున్నాయి. రాముని ఘోరమైన బాణాల దెబ్బలకు రాక్షసులు నిలువలేక గిరగిర తిరిగి నేలనుపడిపోతున్నారు. కొండలలో నుండి ప్రవహించే సెలయేళ్లలాగున ఆశరీరాలలో నుండి రక్తం ప్రవహిస్తుంది.

ఆరక్త ప్రవాహాలన్నీ అతిభయంకరంగా కనిపిస్తున్నాయి. ఆరక్త ప్రవాహాల ఒడ్డున రెండు పక్షాల యోధులూ మోహరించి ఉన్నారు. రథ చక్రాలు ఆనదులలో సుడులులాగుననూ ఏనుగులూ గుఱ్ఱాలూ భటులూ గాడిదలూ ఒంటెలూ అందులో జలజంతువులు లాగుననూ శక్తి. తోమరం మొదలైన సాధనాలు మొసళ్లూ చేపలూ తాబేళ్లూ లాగుననూ కెరటాల లాగుననూ కనిపిస్తున్నాయి. ఆనది ఒడ్డుల నున్న చెట్లలాగున వీరులందరూ ఆరక్తనదులలో పడికొట్టుకొనిపోతున్నారు. ఆ నదులలో నురుగలాగున కొవ్వు కనపడుతుంది. అదంతా చూచిన యోధులందరకూ ఉత్సాహం కలుగుతుంది. అధైర్యవంతులకి భయం కలుగుతుంది. ఆ క్తనదులలో భూతభేతాళప్రేతలు సంతోషంతోస్నానాలు చేస్తున్నాయి. కంక పక్షులూ గద్దలూ కాకులూ మొదలైన పక్షులు యుద్ధంలో తెగిపడిపోయిన భుజాలను నోటితో కరచుకొనిపోతుంటే వాటి నోటిలో ఉన్నఎర మరి కొన్ని పక్షులు వచ్చి బలవంతంగా ఎత్తుకొనిపోయి మింగేస్తున్నాయి. ఇంతమాంసంసిండిపోయి ఉన్నా నా నోటిలోని ఎరపట్టుకొని పోతున్నావేమి ? ఇంకా నీదరిద్రంతీరింది కాదా ? అని ఒక పక్షితో మరొక పక్షీ అంటుంది. ఆ చచ్చిపడిన వీరుల పేగులన్నీ గద్దలు లాగేస్తున్నాయి. ఆ పక్షులన్నీ ఆ నదులలో కళేబరాలమీద ఎక్కి పేగులులాగుతుంటే ఓడమీద ఉండి ఆప్రవాహాలలో క్రీడిస్తున్నట్టు కనపడుతున్నాయి. యోగినీ సమూహమంతా పునుకలలోకి రక్తం నింపుకుంటుంటే పిశాచాలు అద్భుతంగా ఆకాశంమీద ఎగిరి ఆడుతున్నాయి. చాముండా సమూహాలు పునుకలు పట్టుకొని తాళాలలాగున వాయిస్తూ పాటలు పాడుతున్నాయి. నక్కలు కూస్తున్నాయి. ఆయుద్ధభూమిఅంతా గొప్పకోలాహలంగా ఉంది. ఒక్కొక్కచోట శిరస్సులు లేని కళేబరాలు ఆడుతున్నాయి. తలకాయలు భూమిమీద పడిపోయికూడా జై జై అంటున్నాయి. మాంసం తినేపక్షులు పునుకలకోసం పోట్లాడి గొప్ప గొప్ప యోధులనుకూడా కిందపడేలాగున కాళ్ళతోతన్నుతున్నాయి. అప్పుడు మహాబలంతో వానరులందరూ రాక్షసులను నానాబాధలు పెట్టేరు. రాక్షస

వీరులందరూ రామునిబాణాలు తగిలి చచ్చిపడిపోయేరు. రాక్షసు లందరూ చచ్చేరని అప్పుడు రావణుడు ఇలాఆలోచించేడు. ఇప్పుడు ఈవానరసైన్యం ఎక్కువగా ఉంది నేను ఒక్కడనే మిగిలేను అందుకు ఎన్నో మాయలు పన్ని వీళ్ళను గెలుస్తాను అని ఆలోచించుకొంటుండగా దేవతలు శ్రీరామ చంద్రుడు పాదచారిగా ఉన్నాడని మాతలిచేత రథం రామునికోసం పంపించేరు. రాముడు సంతోషించి ఇంద్రునిచేత పంపించబడ్డ ఆ రథం ఎక్కేడు. మనోవేగంతో పరుగెత్తగల నాలుగుగుర్రాలతోఉన్న ఆ దేవేం ద్రుని రథం శ్రీరామచంద్రుడు కూర్చోగానే ఎంతో ధన్యత పొందింది. ఆ రథం మీద కూర్చున్న ఆనందమయున్నిచూచి వానరులందరూ ఉప్పొంగి పోయి ఆనందంతో చెలరేగిపోయేరు. అదిచూచి రావణుడు క్రోధంతో ఈ వానర సమూహాన్ని గెలవలేకుంటున్నాను. వీళ్ళకు తగినట్టుగా చెయ్యాలని అమూర్ఖుడు మాయపన్నేడు. భవానీ! అప్పుడు రామునికి తప్ప తక్కినవా రందరకూ ఆ రాక్షసమాయ నిజంగానే కనపడింది. ఎంతోమంది రాక్షసులూ ఎంతోమంది రామలక్ష్మణులూ కనబడినారు; అదిచూచి లక్ష్మణుడూ వానరు లందరూ చిత్రప్రతిమలలాగున నిలబడిపోయేరు. అప్పుడు రాముడు నవ్వి తనసైన్యమంతా భ్రాంతిపొంది పోయిందని తెలిసికొని ఒక్కబాణం వేసే సరికి ఎక్కడిమాయ అక్కడ పోయింది. ఒక్కనిమిషంలో మాయ అంతా తొలగిపోగానే వానరులందరూ సంతోషంతోరామున్ని వినుతించేరు. అప్పుడు శ్రీరామచంద్రుడు వానరులారా! మీరందరూ చాలాశ్రమపడి ఉన్నారు అందుచేత విచిత్రమైన ద్వంద్వయుద్ధం చూస్తూ వెనుకని ఉండండి అని గంభీర వాక్కులతోచెప్పి రావణుని యెదుటికి రథం నడిపించమని మాతలికి ఆజ్ఞాపించేడు. అతడు వేగంగా రథం రావణుని ముందరకు నడిపించేడు. రావణుడు క్రోధంతో గర్జిస్తూ మహాగర్వంతో రాముని మహిమ తెలియక ఓ తాపసీ! నేను నీవు వధించిన యోధులలాంటివాడిని కాను రావణున్ని తెలిసిందా? నేను జగత్ప్రసిద్ధి పొందినవాడిని. సకల లోకాధిపతులూ నాచెర సాలలో ఒదిగి ఉంటారు. ఖరదూషణులనూ కబంధున్నీ చంపేనని గరి

న్నావు కిరాతుడిలాగున పొంచి ఉండి వాలిని చంపేవు గొప్పపోటరివి నా కొడుకునీ సోదరున్నీ చంపినందుకు ఆ పగ ఇప్పుడు తీర్చుకుంటాను రాజా! యుద్ధంలో నిలబడ్డావంటే నిన్ను యమలోకానికి పంపుతాను. నేను దేవ వైరిని నాకు కనబడి బ్రతికిపోగలవా! అన్నాడు. ఆదుర్భాషలన్నీ విని రాముడు నవ్వి వీడు కాలవశుడయేడు అనుకొని ఓరీ! రావణా! వట్టినే జల్పాలాడక సాహసంతో పౌరుషం చూపించు. వట్టినే జల్పాలాడితే నీకీర్తి నిస్సారమైపోతుంది ఓ రాక్షసుడా! ఓరిమితో నేనుచెప్పే నీతివిను. కలిగొట్టు చెట్టూ మామిడిచెట్టూ పనసచెట్టూల్లాగున. పురుషులు మూడువిధాలుగా ఉంటారు. కలిగొట్టుచెట్టు కేవలం పువ్వులే పూస్తుంది. మామిడిచెట్టు పువ్వులూపూస్తుంది. పండ్లు పండుతుంది పనసచెట్టు పువ్వు కనబడకుండా పండ్లే పండుతుంది. అలాగే పురుషులలోకూడా మొదటివాడు చేస్తాననడమే కాని చెయ్యడు. రెండవవాడు చేస్తానని చెప్పి చెప్పినట్లు చేస్తాడు. మూడవవాడు చేస్తాననకుండానే చేసేస్తాడు. ఒకవేళ అతడు అన్నాడంటే తిరుగుఉండదు. అన్నాడు. ఆ పరమపురుషుని మాటలు విని రావణుడు నవ్వుతూ ఓహో నీవు నాకు జ్ఞానం ఉపదేశిస్తున్నావా! నాతో విరోధం పొందినప్పుడు లేనిభయం నీకు ఇప్పుడెందుకు? ఇప్పుడు ప్రాణాలంటే నీ కింత తీపా? అన్నాడు.

## రామ రావణుల యుద్ధం

ఈ విధంగా దుర్భాషలాడుతూ రావణుడు క్రోధంతో వాడియైన బాణాలు భూమీ ఆకాశం దిక్కులూ నింపేసేడు. రావణుడువేసిన బాణాలన్ని టినీ క్షణంలో రాముడు ఆగ్నేయాస్త్రంతో కాల్చేసేడు. అప్పుడు రావణుడు క్రోధం ఎక్కువై శక్తిని ప్రయోగించేడు. ఒక్కబాణంతోనే ఆ శక్తిని శ్రీరామచంద్రుడు కొట్టేసేడు. దశకంఠుడు అప్పుడు కోటి త్రిశూలాలూ తీవ్రబాణాలూ చక్రాలు మొదలైన భయంకరాయుధాలను రామునిమీద ప్రయోగించేడు. శ్రమలేకుండా అతి సులభంగా శ్రీరామ

చంద్రుడు ఆ ఆయుధాలన్నింటినీ తెగగొట్టిపారేసేడు. దుష్టుని కోరికల లాగున రావణుని బాణాలన్నీ నిష్ఫలమైపోయేయి. అప్పుడు ఆ రాక్షసుడు నూరు వాడిబాణాలతో మాతలిని నొప్పించేసరికి అతడు నివ్వెరపాటుతో దేవతలు విభ్రాంతితో చూస్తుండగా పరమాత్ముడైన రామునికి జయమగుగాక! అని భూమిమీద పడిపోయేడు. రాముడు అతన్ని వెంటనే లేవనెత్తి రోషంతో మహోజ్వలంగా రావణునివైపు చూడగానే అమ్ముల పొదిలోనుండి బాణాలులేచి తీవ్రంగా నిలబడ్డాయి. అప్పుడు సర్వలోకాధీశ్వరుడైన శ్రీరామచంద్రుడు కోదండం ధరించి టంకారధ్వని భూమి దిక్కులూ వణికిపోయేలాగున చెయ్యగానే రాక్షసులందరూ తక్షణం గాలిలో కలిసిపోయేరు. ఆది కూర్మం పర్వతాలు కంపించిపోయేయి మండోదరి హృదయపద్మం వణికిపోయింది భయంతో దిగ్గజాలు దంతాలు భూమికి అంటేలాగున ఘీంకారంచేస్తూ ముందుకుపడ్డాయి. పార్వతీ రామచంద్రుని ప్రభావం సామాన్యమైందా? అన్నాడు శివుడు. ఆకౌతుకమంతాచూచి దేవతలు ఆనందంతో శ్రీరామచంద్రున్ని అనేకవిధాలుగా స్తోత్రంచేసి వేగంగా శత్రువును సంహరించుమని ప్రార్థించేరు. అప్పుడు శ్రీరామచంద్రుడు ఆకర్ణాంతంగా నారలాగి వాడియైన బాణాలు వేసేసరికి అవి భయంకరమైన సర్పాలలాగున వెళ్ళి ముందు రావణుని సారథినీ తరువాత రథాన్నీ గుఱ్ఱాలనూ జెండానూ భూమిమీద పడగొట్టేసేయి. రావణుడు అప్పుడు తన బలమంతా లోలోపలే వ్యర్థమై పోయినందుకు గొప్ప రోషంతో పంతంతో పెద్ద బొబ్బలు పెట్టేడు. అవమానంచేత బాధపడిపోతూ కొత్తరథం ఎక్కి ఆ రాక్షసుడు రాముని మీద అనేక విధాలైన ఆయుధాలు కురిపించి ఫలితంలేనివాడై పోయేడు. ఉమా! పరద్రోహి ప్రయత్నించి చేసే కార్యాలలాగున రావణుని బాణాలూ మొదలైన సాధనాలన్నీ నిష్ఫలమై పోయేయి. సర్వలోకధీశ్వరుడైన శ్రీరామచంద్రున్ని ఆయుధాలు ఏంచెయ్యగలవు? హైమవతీ రామున్ని జయించడానికి భూమిమీద ఏ సాధనాలూలేవు. నిర్మలమైన ప్రేమకు అతడు వశమైపోతాడు. నిరంతరం సేవచేసేవాడికి, అన్నాడ

మహాదేవుడు. అప్పుడు దశకంఠుడు పదిశూలాలతో దేవేంద్రుని గుఱ్ఱాలను నొప్పించేడు అవి వశంతప్పి భూమిమీద పడిపోగానే శ్రీరామచంద్రుడు వాటిని లేవనెత్తి నిలబెట్టేడు. అప్పుడు రాముడు కోపోద్రేకముతో ధనువునబాణాలు సంధించి రావణుని పదితలలనూ పదేసి బాణాలు వేయగానే పదితలలూ రక్తధారలతో నిండిపోయి అతి భయంకరంగా కనపడ్డాయి. అలా రక్తం కారుతుండగా రాక్షసుడు కదిలే కొండలాగున క్రోధంతో పరుగెత్తి వస్తుండగా రాముడు వాడియైన ముప్పై బాణాలు సంధించి విడువగానే రావణుని పదిశిరస్సులూ యిరవై భుజాలూ తెగిపోయి భూమిమీద పడిపోయేయి. వెంటనే మళ్ళా కొత్తతలలూ బాహువులూ పుట్టేసేయి. వాటినికూడా రాముడు పడగొట్టేసేడు. ఇలా పడగొట్టేసరికల్లా వెంటనే పదితలలూ ఇరువై చేతులూ పుడుతూనే ఉన్నాయి, ఇలా ఎన్ని సార్లు తెగగొట్టినా తిరిగే పుడుతూనే ఉన్నాయి. ఈ విధంగా కౌతుకప్రియుడైన శ్రీరామచంద్రుడు యుద్ధంలో క్రీడచేసేడు. పండితుడైనవాడే ఆ కేళీవినోదాన్ని తెలిసికోగలుగుతాడు. ఈ విధంగా భూమిమీద పడిన రావణుని తలలూ బాహువులూ రాసులుగా పడి ఆకాశాన్ని ముట్టిపోయేయి. అవి ఆకాశంమీద రాహుకేతువుల లాగున కనిపిస్తున్నాయి. రామబాణాలవల్ల తెగిపోయి రావణుని శిరస్సులూ భుజదండాలూ కిందపడకుండా పక్షులలాగున ఆకాశంమీదకి ఎగిరిపోతున్నాయి. హిమగిరి కుమారీ! రామచంద్ర విభుడు రావణుని తలలూ బాహువులూ తెగగొట్టినకొలదీ తెరిపి లేకుండా పుట్టేస్తున్నాయి. విషయ భోగాలు అనుభవించిన కొలదీ కామం మరింత ఎక్కువైపోయినట్టు. తనతలలు వృద్ధిపొందడం చూచి అభిమానం ఎక్కువైపోయి రావణుడు తనకు చావు ఉన్నదన్న సంగతి మరచిపోయేడు. ఇంకా మండిపడుతూ దిక్కులు అదిరిపోయేలాగున గర్జిస్తూ రామునికి ఎదురుగావెళ్ళి బాణాలు వర్షంలాగున కురిపించేడు. రథంనిండా బాణాలు వేసి కప్పేసేడు. అప్పుడు మంచుగప్పిన సూర్యునిలాగున కొంతసేపు రాముడూ రథమూపైకి కనపడలేదు. అప్పుడు దేవతలందరూ హాహా

కారాలు చేసేరు. ఆ వెంటనే రాముడు శత్రుబాణాలను నివారించి పరాక్రమంతో వాడి శిరస్సులన్నీ కొట్టేసేడు.

ఆ శిరస్సులన్నీ భూమి ఆకాశం దిక్కులూ సందులేకుండా నిండిపోయేయి. తలలు ఆకాశంమీదికి ఎగురుతూ జై జై అంటూన్నాయి. అంతే కాకుండా ఏడీ లక్ష్మణుడు ఎక్కడున్నాడు? హనుమంతుడేడీ? ఆ రఘువీరుడెక్కడున్నాడు? అంటూ ఆ శిరస్సులు ఆకాశానికి ఎగిరిపోతున్నాయి. ఆ తలకాయలు చూచి వానరులు. భయపడుతుంటే రాముడు నవ్వి వాటిని బాణాలతో తెగగొట్టేసేడు. అప్పుడు కాళికాశక్తులు ఆశిరస్సులు పట్టుకొని సంతోషంతో రక్తనదులలో స్నానాలు చేసి యుద్ధమనే వటవృక్షాన్ని పూజించడానికి వెళ్తున్నాయి. ఆ సమయంలో రావణుడు ప్రచండమైన శక్తిని ప్రయోగించేడు అధికమైన క్రోధంతో అది కాలదండం లాగున విభీషణుని మీదకి వెళ్తుంటే ప్రణతార్తి భంజనుడైన రాముడు చూచి విభీషణున్ని తనవెనక్కు తీసుకొని తాను ముందు నిలబడ్డాడు. ఆశక్తి వచ్చి తన్ను తాకగానే రాముడు మూర్ఛపొందేడు. పార్వతీ! ఈ విధంగా రామవిభుడు ఒకలీల చేసేడు. కాని అతనికి ఏ వికారాలూలేవు. అది తెలిసికోలేక దేవతలు భయపడ్డారు.

## విభీషణుడు రావణునితో యుద్ధం చేయుట

ఈ విధంగా ప్రభువు శ్రమపొందడంచూచి విభీషణుడు ఆగ్రహంతో పెద్దగద తీసికొని ఆకాశం బద్దలయేలాగున సింహనాదంచేసి రావణుని సమీపించి ఇలా అన్నాడు. నీవు మానవులతోనూ దేవతలతోనూ ఇంకా అన్నిజీవ కోట్లతోనూ వెఱ్ఱివాడివై విరోధం తెచ్చుకున్నావు. పూర్వం ధైర్యంతో నీ శిరస్సులన్నీ శివునికి సమర్పించేవు. ఆ కారణంచేత నీకిప్పుడు ఒక తలకు కోటిచొప్పున కొత్తతలలు కలిగేయి. ఇంతవరకూ బ్రతికేవు ఇటుపైని మాడు కాలుడు నీ తలలమీద నృత్యం చేస్తు న్నాడు. నిర్భాగ్యుడా! నీవు రామవిముఖుడవై కూడా సంపదకోరు

తున్నావు. అయ్యో! ఎంత జడబుద్ధివి, అంటూరోషంతో రావణుని వక్షం మీద గదతో కొట్టేడు. ఆ దెబ్బకువాడు పదినోళ్లతో రక్తం కక్కుకుంటూ భూమిమీద పడిపోయేడు. వెంటనే మళ్లా క్రోధంతోలేచి యుద్ధానికి బయలుదేరేడు. మహాధైర్యంతో అన్నదమ్ములిద్దరూ యుద్ధంచేసేరు. మల్లయుద్ధమందుగల నేర్పుతో వారిద్దరూ పోరాడుచుండగా పరమేశ్వరుడైన రామవిభుడిచ్చిన బలదర్పాలు గల విభీషణుడు అన్నను గొప్పగా నొప్పించినా రావణుడు మహాధైర్యంతో కొంచెమైనా లెక్కచెయ్యలేదు. నగరాజతనయా! రావణున్ని ఎదిరించడానికి విభీషణుడికి శక్యమౌతుందా? శ్రీరాముని ప్రభావంవల్ల గదా సాహసించి కాలుదిలాగున యుద్ధంచేసేడు. అప్పుడు విభీషణుడు అలిసిపోయేడని తెలిసికొని హనుమంతుడు మహారౌద్రంతో ఒకకొండ పెకలించి తెచ్చి దానితో రావణుని సారథిని గుఱ్ఱాలనూ రథాన్నీ పడగొట్టి అతని వక్షంమీద గట్టిగాతన్నేడు, తన్నేసరికి రావణుడు శరీరం కంపించిపోతుండగా అలా నిలబడిపోయేడు. అప్పుడు విభీషణుడు రాముని యొద్దకు వెళ్ళిపోయేడు. అప్పుడు రావణుడు క్రోధంతో హనుమంతున్ని కొట్టబోతుంటే అతడు తోకాడించుకుంటూ రివ్వుమని ఆకాశానికి ఎగిరిపోయేడు. ఆ తోకపట్టుకొని రావణుడు తనవెంటనే ఎగిరేసరికి మారుతి తిరిగి యుద్ధం మొదలుపెట్టగానే ఆ మహావీరులైన యోధులిద్దరికీ ఆకాశంమీదే గొప్ప సంగ్రామం జరిగింది. ఆ యిద్దరూ ఆకాశంమీద కాటుకకొండా బంగారుకొండా యుద్ధం చేస్తున్నట్లు కనపడుతున్నారు. హనుమంతుడు ఎప్పుడైతే బుద్ధిచేతా బలంచేతా రాక్షసున్ని మించలేకుంటున్నాడో అప్పుడే రామున్ని మనస్సులో స్మరించుకొని కొట్టేసరికి రావణుడు నేలపడిపోయేడు. పడివెంటనే లేచి యుద్ధంచేసేసరికి ఇద్దరినీ దేవతలు మెచ్చుకున్నారు. హనుమంతుడు చాలా అలసిపోయేడని వానరులూ భల్లూకాలూ అతనికి సహాయంగా వచ్చేరు. అప్పుడు మదమత్తుడైన రావణుడు వానర వీరులను గాయాలు పడేలాగున కొట్టేడు. రాముడు ఆ కపులకు ఉత్సాహం కలిగేలాగున

పిలిచేడు. ఆ బలపరాక్రమాలతో ఉన్న వానరులను చూచి రావణుడు కన పడకుండా మాయమైపోయి కొంతసేపటికి ఎన్నో వికృతాకారాలతో ఒక్కొక్క వానరుడికి ఒక్కొక్క రావణాసురుడు కనపడేలాగున మాయపన్నేడు. ఆ లెక్కలేనంత మంది రావణులను చూచి భయంతో వానరులు పారిపోయేరు. అలా ఆర్తులై పారిపోతూ వానరులూ భల్లూకాలూ రక్షించండీ రక్షించండీ లక్ష్మణా ! రామా ! రక్షించండీ అంటూ మొఱ పెట్టేరు. పార్వతీ ! అని దిక్కులందూ దశకంఠులు నిండిపోయి భయం కరంగా గర్జిస్తుండే సరికి దిక్కులు తెలియక దేవతలూ దిక్పాలకులూ అడలిపోతూ నిరాశచెంది ఇక ఏమిజయము ? ఇంకెక్కడి బ్రతుకు ? పూర్వం ఒక్కరావణుడే మనలనందరినీ గెలిచేసేడు. ఇప్పుడు ఇంత మంది రావణులైనారు. ఇక నీరాక్షసుల నెలా తప్పించుకొని పోగలము ? అన్నలారా ! కొండగుహాలు వెతుక్కోవాలి. అనుకున్నారు. శివుడూ బ్రహ్మజ్ఞానులైన మునులూ మాత్రమే ఆ సమయలో రాముని మహిమ ఎరిగినవారు గనుక నిర్భయంగా ఉన్నారు. వానరులందరూ ఆరాక్షసమాయ నిజమనుకొని శ్రీరామచన్ద్రా ! మమ్ములను కాపాడుమని భయంతో పారిపోతున్నారు, అందులో నలుడూ నీలుడూ హనుమంతుడూ అంగ దుడూ మహాబలపరాక్రమవంతు లౌటచేత లెక్కపెట్టలేని ఆరావణులతో యుద్ధానికి తలపడ్డారు అప్పుడు వానరులూ దేవతలూ వ్యాకులం పొందడం చూచి రాముడు నవ్వుకొని ఒక్కబాణంతో మాయారావణులందర్నీ సంహా రించేసేడు. సూర్యోదయ మయేసరికి చీకటంతాపోయినట్లు క్షణములో శ్రీరామచంద్రుడు ఆ మా య న ం త టి నీ అస్తమింప జేసేసరికి ఒక్క రావణుడే ఉండడంచూచి దేవతలు సంతోషించేరు. ఉమా! ఇదంతా రాముని మహిమగదా అని తెలిసికొని జ్ఞానులు ఎంతో ఆనంద పరవశులై పోతుంటారు. బుద్ధిహీనులు అది తెలిసికోలేక నోటికివచ్చినట్టూ వదరుతుం టారు. అప్పుడు దేవతలు హర్షంతో రామునిమీద పుష్పవర్షం కురిపించేరు కోపమూ మొదలైన వికారాదులు లేని నైపలలాముడు శ్రీరామచంద్రుడు

అప్పుడు సంతోషంతో చేయిచాపి పిలువగానే వనచరులందరూ ఒకరినొకరు పిలుచుకొంటూ రామునివల్ల బలంపొంది అతివేగంగా వచ్చేసేరు. శ్రీరామ చంద్రుణ్ని స్తోత్రంచేస్తున్న దేవతలనుచూని ఓహో! వీళ్ళందరూ నేను ఒంటరిగా ఉన్నానని అనుకొంటున్నారు అని రావణుడు ఆగ్రహంతో ఓరి! మూర్ఖులారా! మొదటినుండీ మీకు నాచేత దెబ్బలు తప్పలేదు. రండి మీ పని తీరుస్తానని ఆకాశానికి ఎగిరేడు. దేవతలు దుస్సహుడైన వాడినిచూచి భార్యలతో కూడా హాహాకారాలుచేస్తూ విమానాలతో పారిపోయేరు. వారిని చూచి రావణుడు నాయెదుటపడి ఎక్కడికక్కడ పోగలరు? అంటుండే సరికి వాడినిచూచి కోపించి అంగదుడు దేవతల దీనతచూచి ఆకాశానికి ఎగిరి గరుత్మంతుడు పదితలల సర్పాన్ని పట్టినట్టు వాడికొప్పు పట్టుకొని భూమిమీద పడేలాగున విసరేసేడు. అలా వాడు కిందపడగానే వాడిని కాళ్ళతో తొక్కి తన్ని అంగదుడు రాముని దగ్గరకు వెళ్ళిపోయేడు. అప్పుడు రావణుడులేచి పదిచేతులతోనూ పది ధనుస్సులూ పట్టుకొని ఎక్కుపెట్టి బాణాలు వర్షంలా కురిపించేడు. కపులందరూ భయపడి పోతున్నారు. అప్పుడు రావణుడు తన బలానికి సంతోషించుకున్నాడు, అంతలో రాముడు వాడి తలలూ భుజాలూ కొట్టేసేడు అవి నేలను రాలిపోయి కొత్తగా పుట్టేసేయి. పుణ్య క్షేత్రంలో పాపాలుచేస్తే ఒకపాపానికి కోటి పెరిగిపోయినట్టు కొట్టినకొలది రావణుని తలలూ భుజాలూ వృద్ధిపొందుతున్నాయి. నగరాజపుత్రికా! బాహువులూ తలలూ తెగిపోయినా ఆమొండి రాక్షసుడు చావలేదని ఆశ్చర్యం పొంది భల్లూకాలూ వానరులూ రోషంతో సింహనాదాలు చేస్తూ. రావణుని మీదకు బయలుదేరేరు. హనుమంతుడూ నలుడూ నీలుడూ అంగదుడూ సుగ్రీవుడూ మొదలైన పరాక్రమవంతులందరూ చెట్లూ కొండలూ తెచ్చి రావణున్ని కొట్టేరు. అవి అందుకొని రావణుడు వానరుల మీద విసిరేసేడు. ఒక వానరుడు రావణుని శరీరం గోళ్ళతో చీరేసేడు. మరొ కడు తాళ్ళతో తన్ని పారిపోయాడు. నలుడూ నీలుడూ వాడి తలలమీద ఎక్కి ముఖాలన్నీ గోళ్ళతో చీరేసేడు. ముఖాలనిండా రక్తం ప్రవహించి

పోతుంటే రావణుడు గొప్ప విషాదంపొంది తలలెక్కిన ఆబలవంతులను పట్టుకోవడానికి చేతులు చాపేడు, వాడి చేతులకు దొరకకుండా ఆ వీరు లిద్దరూ తప్పించుకొని వాడి భుజాలమీద తిరుగుతున్నారు. రావణుడు ఎలాగో వాళ్ళను పట్టుకొని నేలనువేసి కొట్టాలనుకొనేసరికి వాడి చేతులు కరిచేసి పారిపోయేరు. రావణుడు ఆగ్రహంతో పది ధనుస్సులూ పట్టుకొని బాణాలువేసేసరికి వానరులందరూ బడలికపొంది పడిపోయేరు. హనుమం తుడూ మొదలైన ముఖ్యులందరూ మూర్ఛితులైపోయేరు. అదిచూచి రావ ణుడు ఆనందించేడు.

## జాంబవంతుడు రావణుని మూర్ఛపొందించుట

అప్పుడు సాయంకాలమైంది. ఆనందంతో ఉన్న రావణునితో జాంబవంతుడు యుద్ధానికి తల పడ్డాడు. కపులూ భల్లూకాలూ కొండలూ చెట్లూ పట్టుకొని రావణున్ని ఎన్నోసార్లు కొట్టీ గోళ్ళతో చీరీ నానావిధాలా బాధించేరు. వాడు మహాక్రోధంతో వాళ్ళను పట్టుకొని రక్తాలు కారేలా గున భూమి మీదవేసి కొట్టేడు. వాళ్ళు దీనతతో తల్లడిల్లిపోయేరు. అది చూచి బలవంతుడైన జాంబవంతుడు రావణున్ని గట్టిగా తన్నేడు వక్షం మీద తన్నగానే రావణుడు రథంమీదనుండి నేలను పడిపోయేడు. ఇరవై చేతులలోనూ తామరపువ్వుల మధ్య ఉండిపోయిన తుమ్మెదలలాగున ఇరవై మంది భల్లూకాలూ ఇమిడిపోయేరు. అలా మూర్ఛపోయిన రావణాసురున్ని జాంబవంతుడు కాళ్ళతో తన్ని రాముని దగ్గరకు వెళ్ళిపోయేడు. అప్పుడు సారథి ఆ రావణున్ని రథంమీద పెట్టేడు. వానరులూ భల్లూకాలూ మూర్ఛ తేరి రాముని దగ్గరకు వెళ్ళిపోయేరు. రాక్షసవీరులు యమరాజును పరివేష్టించి ఉన్నారు!

## త్రిజట సీతకు యుద్ధ వృత్తాంతం చెప్పుట

ఆ రాత్రి సమయంలో త్రిజట సీతాదేవియొద్దకు సంతోషంతో వెళ్ళి యుద్ధ వృత్తాంతమంతా సవిస్తరంగా చెప్పింది. అదివిని సీత

శత్రువు తలలూ భుజాలూ నఱికినప్పటికీ కొత్తగా పుడుతున్నాయన్న మాటకు భయపడి చింతిస్తూ ఆ మంచి మనస్సుగల త్రిజటతో అంటుంది. తల్లీ! ఆ లోక విరోధియైన దుష్టుడు ఎలా చస్తాడు? అయ్యో ఆ పరమ పురుషుని బాణాలచేత శిరస్సులు తెగిపడిపోయినా ఆ దుర్మార్గుడు చావ లేదా? అయ్యయ్యో! నా నాథున్ని నాకు దూరంచేసిన నా దురదృష్టమే ఈ దుష్టున్ని బ్రతికిస్తుంది. హా! విధీ! ఏదైవం నాడు కపటమైన బంగారు లేడిని పంపేడో ఆ దైవమే నాకు వక్రమై ఇంకా శత్రువును నిలబెట్టేడు, అప్పుడు నాచేత లక్ష్మణున్ని అనరాని మాటలాడించిన దైవమే ఇప్పుడు ఈ కష్టాలను నాచే అనుభవింప జేస్తున్నాడు. రామ విరహాన్ని సహించే లాగునచేసి నా ప్రాణాలు పోకుండా నిలబెట్టిన దైవమే తలలన్నీ తెగి పడిపోయినా ఆ దుష్ట రాక్షసున్ని ప్రాణాలు పోకుండా నిలబెట్టేడు. అని అనేక విధాలుగా తలపోస్తూ రామచంద్రున్ని ధ్యానించుకుంటూ దుఃఖిస్తున్న సీతాదేవిని చూచి త్రిజట ఓ రాజపుత్రికా! ఆ రాక్షసుడి వక్షంమీద కొడితే వేగంగా చస్తాడు. కాని వాడి హృదయంలో ఎల్లప్పుడూ సీతాదేవి నివ సించి ఉండడంచేత శ్రీరామచంద్రుడు వాడి హృదయంమీద బాణంవేసి కొట్టడు. వాడి హృదయంలో వైదేహి ఉంది. ఆమె హృదయంలో నే నున్నాను. నా హృదయంలో ఈ బ్రహ్మాండాలన్నీ ఉన్నాయి. అంచేత వాడి హృదయంమీద బాణంవేస్తే హాని కలుగుతుందని మానేసేడు అని త్రిజట చెప్పేసరికి విని జానకి నవ్వి వెంటనే సంతాపం పొందుతుండడం చూచి త్రిజట కల్యాణీ! ఆ రాక్షసుడు చచ్చేవిధం చెపుతాను విను. సందేహం పొందకు. తలలన్నీ నరకగా నరకగా ఆ రావణుడు ఎప్పుడు పరితాపం పొందుతాడో ఆ సమయంలో నిన్ను మరిచిపోతాడు. అప్పుడు పరమాత్ముడు వాడి హృదయానికి నాటేలాగున బాణం వేస్తాడు. అప్పుడు వాడు చస్తాడు అని అనేకవిధాలుగా బోధించి సీత సెలవుపొంది త్రిజట తన యింటికి పోయింది. జానకీదేవి శ్రీరామచంద్రున్ని ధ్యానించు కుంటూ విరహవేదన భరించలేక రాత్రినీ చంద్రున్నీ నిందిస్తూ దుంఖంతో

ఎప్పటికీ తెల్లవారిందికాదని రాత్రి పొడుగై పోయిందని రామ విరహ వేదనతో శోకిస్తుండగా ఆ లోకజననికి ఎడమకన్నూ ఎడమ భుజమూ అదిరేయి. ఆ శుభ నిమిత్తాలు చూచి ఆమె మనస్సులో కొంత ధైర్యం వహించింది.

## రావణుడు మూర్ఛతేరి మరునాడు యుద్ధానికి వెళ్లుట

అర్ధరాత్రి సమయంలో రావణుడు మూర్ఛతేరి లేచి క్రోధంతో రథం నడిపేవాడిని ధిక్కరించి అంటున్నాడు. ఓరి దుష్టుడా! యుద్ధ భూమిలోనుండి నన్నెందుకు ఇంతదూరం తీసుకొని వచ్చేవురా? అని పళ్ళు కొరుకుతూ కళ్ళవెంట నిప్పులు రాలేలాగున చూచేసరికి వాడు భయంతో పాదాలు పట్టుకొని వేడుకున్నాడు. అంతలో తెల్లవారింది. రావణుడు రథమెక్కి యుద్ధభూమికి వెళ్లేడు రావణుడు మళ్ళా వచ్చేడన్న సంగతి వినగానే కపిసైన్యంలో కలకలం నిండిపోయింది. అప్పుడు కపులూ భల్లూకాలూ గొప్ప గొప్ప పర్వతాలూ వృక్షాలూ పెకలించుకొని వచ్చి క్రోధంతో రావణుడు సొమ్మసిల్లి పోయేలాగున కొట్టేరు. ఇంకా శరీరమంతా గోళ్లతో చీరేసేరు. అప్పుడు వీరులైన వానరులనుచూచి రావణుడు గొప్ప విచారంతో అదృశ్యుడై పోయి నిమిషంలో గొప్ప మాయ పన్నేడు. భయంకరమైన జంతువులూ భూత బేతాళాలూ పిశాచాలూ అనేకంగా కనబడుతున్నాయి. ఆ భయంకర భూతాలన్నీ బాణ బాణాసనాలు ధరించి ఉన్నాయి. యోగినీ భూతాల సమూహం కొత్తనెత్తురు తాగి ఒక చేతితో ఖడ్గమూ మరొక చేతితో పునుకా పట్టుకొని పాటలు పాడుతూ నాట్యాలు చేస్తున్నాయి. నాలుగు దిక్కులా పట్టండి కొట్టండి అనే శబ్దం నిండిపోయింది. పిశాచాలు మింగేస్తాం అని నోళ్ళు చాపుకొని వస్తుంటే అక్కడ నిలబడలేక కోతులూ భల్లూకాల సమూహం అంతా పారిపోయింది. అక్కడ భయంకరమైన అగ్నిమంటలు బయలుదేరేయి. అదిచూచి వానరులు భల్లూకాలూ భయపడి ఇసుక ఎంతపోసినా ఆ మంటలు చల్లారనందున

సిద్ధులూ ఈ దుష్టుడైన రాక్షసుడు ఎప్పుడు చస్తాడు? అని ఆలస్యానికి సహించలేక చింతిస్తున్నారు. లాభం ఎక్కువైనకొలదీ లోభం ఎక్కువైపోయినట్టు రావణుని తలలు ఎంతరాసులుగా పడిపోయినా ఇంకాపుట్టేస్తూనే ఉన్నాయి. ఎప్పటికీ వాడు చావకుండడం చూచి రాముడు విభీషణునివైపు చూచేడు. పార్వతీ! కాలునైనా మృతినొందించగల స్వామి తన భక్తుని మనస్సు పరిశీలించడానికి అలా అతనివైపుచూచేడు. ఆ భక్తజన రక్షాదీక్షితుడైన శ్రీరామచంద్రుణ్ని చూచి విభీషణుడు చేతులు జోడించి సర్వజ్ఞా! నీకు తెలియనిదిలేదు. స్వామీ వీనికడుపులో అమృతభాండముంది. అందు చేత తలలు తెగిపడినా బ్రతికేఉన్నాడు. అని చెప్పగానే రాముడు భయంకర బాణాన్ని ప్రయోగించడానికి సిద్ధపడ్డాడు. రావణునికి అప్పుడు ఎన్నో దుర్నిమిత్తాలు కనబడుతున్నాయి. నక్కలూ గాడిదలూ కుక్కలూ గొల్లుమని ఏడుస్తున్నాయి. లోకానికి అరిష్టం కలిగించే పక్షులు కూసేయి. ఆకాశంమీద కేతూదయమైంది. అన్నిచోట్లా దాహం ఎక్కువైపోయింది పర్వదినం కానిదే సూర్యగ్రహణం అయింది. మండోదరి గుండె గడగడలాడింది. విగ్రహాల కన్నులనుండి ఎక్కువగా నీరు కారింది పెద్దగాలి వీచింది. పిడుగులు పడ్డాయి. భూమి కంపించింది. మేఘాల తలవెంట్రుకలూ రక్తమూ ధూళీ కురిసేయి. పార్వతీ! అప్పుడు లెక్కలేనన్ని అశుభశకునాలు కనపడ్డాయి. ఈ ఉత్పాతాలు చూచి దేవతలు వ్యాకులంతో ఆకాశవీథిని గుంపుకూడి శ్రీరామచంద్ర విభునికి జయమగుగాక! అని చూస్తున్నారు. దేవతల భయం చూచి రాముడు ధనుస్సున బాణసంధానంచేసి ఆకర్ణాంతంగా లాగి, ముప్పై ఒక్క వాడియైన బాణాలు విడిచేడు. దేవీ! ఆ బాణాలు కాల సర్పాలలాగున వెళ్ళి అందులో ఒక బాణంవెళ్ళి రావణాసురుని కడుపు అనే సరస్సుని ఇంకించేసింది. తక్కిన బాణాలువెళ్ళి వాడి తలలూ బాహువులూ తెగగొట్టేసేయి. పదితలలూ ఇరవై బాహువులూ పడిపోగానే ఆమొండెం తైతైమని ఆడుతుంది. ఎంతో ఎత్తూ భారమూ అయిన ఆ రావణకళేబరం భూమిమీద నాట్యం చేస్తుంటే ఆ భారానికి భూమి క్రుంగిపోయింది. శైలరాజతనయా! రాముడు ఆ కళేబరాన్ని రెండుముక్కలయేలాగున కొట్టే

నేడు. ఆ రెండుముక్కలూ పెద్దకాటుకకొండలలాగున భయంకరమైనధ్వనితో భూమిమీద పడిపోయేయి. రావణుడు చచ్చేసమయంలో రాముడేడీ! అతన్ని యుద్ధంలో చంపేస్తాను. అని సమస్తభూతాలూ భయపడేలాగున పెద్దబొబ్బ పెట్టేడు. రావణుడు పడిపోగానే భూమి అల్లల్లాడిపోయింది. సముద్రాలూ నదులూ కలిగిపోయేయి. దిగ్గజాలు భయపడిపోయేయి. పర్వతాలు ఊగిపోయేయి. వాడి కళేబరం ముక్కలకింద పడిపోయి కొందరు వానరులు అణగిపోయేరు. రాముని బాణాలు రావణుని శిరస్సులూ భుజాలూ మండోదరి యెదుటపెట్టి తిరిగివచ్చి ఆ పరాత్పరుని అమ్ములపొదిలో దూరిపోయేయి. దేవతలు సంతోషంతో దుందుభులు వాయించేరు. రావణుని కళేబరంలోనుండి గొప్ప తేజస్సువచ్చి రామునిలో ప్రవేశించింది. బ్రహ్మ శివుడూ చూచి సంతోషించేరు, బ్రహ్మాండమంతటా జయ జయ ధ్వనులు నిండిపోయేయి. సీతానాథుని ప్రబలమైన భుజాలకు జయమని అందరూ సంతోషంతో వినుతించేరు. దేవతలూ మునులూ సంతోషంతో పరిమళంతో కూడిన పుష్పాలు రామునిమీద వర్షంలా కురిపించేరు. అప్పుడు వారందరూ ఇలా వినుతించేరు. జై రమాకళత్రా! పరమపావన చరిత్రా! కమలనేత్రా! కోదండరామా! కృపాసముద్రా! గోవిందా! ముకుందా! శరణాగతత్రాణా! దుష్టరాక్షస సంహారీ! లోకోపకారీ! పరమపావనా! పాపనాశనా! ఆనంద రూపా! విశ్వదీపా! నిత్యనిర్మలా! నిర్వికారా! అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకా! ఆపద్బాంధవా! అనాథరక్షకా! అహల్యాశాప విమోచనా! ఆర్త శరణ్యా! భవరోగవైద్యా! వటపత్రశయనా! వారిజనాభా! వైకుంఠవాసా! మాయాసమేతా! సీతానాథా! సుగుణధామా! సార్వభౌమా! నీకు జయమగుగాక! అని వినుతించి కల్పవృక్షంయొక్క కొత్తగా పూసిన పువ్వులుతెచ్చి వర్షం కురిపించి దుందుభులు ఘుమ ఘుమ ధ్వనులతో మ్రోగించేరు. అప్పుడు ఆ యుద్ధభూమిలో శ్రీరామచంద్రుడు కోటి మన్మథాకారుడై జటా కిరీటంలో మధ్య మధ్య పరిమళ పుష్పములు ఎంతో రమ్యంగా ప్రకాశిస్తుండగా నక్షత్ర సమూహంతోకూడిన మెరుపుల సముదాయం నీలా

చలంమీద ఉన్నదన్నట్టుగా కిరీటంగా అమర్చబడ్డ జటాసమూహం ప్రకాశ మానంగా ఉంది. అతని వక్షం లక్ష్మికి ఉనికిపట్టుగదా! అతడు నిత్యానంద మూర్తి. అతన్ని వర్ణించడానికి సృష్టిలో ఏ వస్తువూలేదు. అతని శరీరంనిండా రక్తపుకణాలు చక్కని తమాల వృక్షంమీద ఎఱ్ఱని పక్షుల సమూహం కాబోలు అన్నట్టు కనిపిస్తున్నాయి. ఆ జగదేక సుందరుని మాటలతో వర్ణించిచెప్పే నా తెలివికి పండితులు నవ్వుతారని సంశయిస్తూ న్నాను. మనస్సుకూ వాక్కులకూ అందని మహాత్మన్ని హీనమైన ఉప మానాలతో వర్ణించి చెప్పడానికి గొప్ప సిగ్గుకూడా కలుగుతుంది. అప్పుడు శ్రీరామచంద్రమూర్తి కృపాదృష్టి అనే వర్షంచేత దేవతలందరికీ అభయ మిచ్చేడు. కపివీరులూ భల్లూకవీరులూ సుఖధామా! జయరామా! అని వినుతించేరు.

## మందోదరి మొదలైన రాక్షసస్త్రీలు శోకించుట

అప్పుడు మందోదరి తన ముందరపడ్డ భర్త శిరస్సులుచూచి దుఃఖంతో తపించిపోయి భూమిమీద పడిపోయింది. స్త్రీలందరూ ఏడుస్తూ ఆమెను తీసికొని యుద్ధభూమికి వెళ్ళేరు. ఆ రాక్షస స్త్రీలందరూ పతి యొక్క స్థితిచూచి గుండెలు బాదుకొని గొప్ప రోదనాలుచేస్తూ కింద పడి పోయేరు. కొప్పులు విడిపోయినాయి. ఆభరణాలు ఊడిపోయేయి. శరీరాల నిండా దూళి అంటుకుపోయింది. కన్నీరు నదులైపోయి వక్షాలమీద పారుతుంది. ఆతని గుణాలు తలంచి వర్ణిస్తూ హా! నాథా! నీ భుజబలానికి భూమి అల్లలాడిపోయేదే. సూర్య చంద్రులూ అగ్ని తమ తేజస్సులు విడిచిపెట్టేసేవారే. నీ భారాన్ని భరించలేక భూమీ దిగ్గజాలూ ఆదికూర్మం ఆదిశేషుడూ సోలిపోయేవారే. అయ్యో! అటువంటి ప్రతాపంగల నీ శరీరం ఈ యుద్ధభూమిలో శ్రీరామచంద్రునిచేత చంపబడి పడిపోయిందే. నాథా! దిక్పాలకులందరినీ భుజబలంచేత గెలిచేవే. నీ పరాక్రమానికి మూడు లోకాలూ అదలిపోతుండేవే. అటువంటి నీవు ఇప్పుడు అనాథునిలాగున

భూమిమీద పడిపోయేవే. అయ్యో! అని అనేక విధాలుగా ఏడ్చేరు. అందులో మందోదరి ఈ విధంగా పరితపించింది. అయ్యో! నాథా! నీ ప్రభుత్వం జగత్ప్రఖ్యాతిని పొందింది. మీ పుత్రులూ పరివారం సైన్య సమూహంయొక్క పరాక్రమం కొనియాడ శక్యంకాదు. అటువంటప్పుడు సుఖంగా జీవించలేక శ్రీరామచంద్రునితో తెలియక విరోధం పూనడంచేత ఇంత జరిగింది. నేను ఎంత బోధించినా విన్నారుకారు. హా! రాక్షసేశ్వరా! ఈ సకల ప్రపంచం మీ చేతిలో ఉండేదే. మీపేరు వినగానే దేవతలూ మునులూ గడగడ లాడేవారే. మీ యెదుట పడేసరికి నమస్కరించి సెలవు పొంది దిక్పాలకులు వెళ్లేవారే. అయ్యో! ఇప్పుడు ఆ వైభవమంతా ఏమై పోయింది? హా! నాథా! ఈ యుద్ధభూమిలో మీ తలలు నక్కలకూ భూతాలకూ ఆహారమైనవా? రామ విముఖులు పొందవలసిన అవస్థఇదేనా. నాథా! కాలవశులవుటచేత చరాచర నాథుడైన శ్రీరామచంద్రున్ని మానవుడని తలంచి నా మాట విన్నారుకారు. అయ్యో! మనోహరా! రాక్షసవనానికి రాముడు అగ్నిహోత్రుడని తెలుసుకున్నారుకారు. బ్రహ్మాది దేవతలూ శివుడూ ఎల్లప్పుడూ ఏమహాత్మునికి నమస్కరిస్తుంటారో ఆ పరిపూర్ణుడూ కరుణామయుడూ సుఖస్వరూపుడూ ఐన రామున్ని ఈర్ష్యచేత భజించేరుకారు ప్రాణేశ్వరా! మీదేహం ఆజన్మాంతం పరద్రోహానికే పాటుపడింది అయినప్పటికీ శ్రీరామచంద్రుడు కృపతో మీకు తన దివ్య పదాన్ని ఇచ్చేడు. అటువంటి శ్రీరామచంద్రున్ని నిర్వికారున్ని నిరామయున్ని మహాత్మున్ని సుఖధామున్ని ప్రార్థించి నమస్కరిస్తున్నాను. కరుణకు రామునితో సమానుడు మరొకడు లేడు శమదమాలతో కూడిన యోగి జనులకుకూడా దుర్లభమైన సద్గతిని మీకిచ్చేరు. అని మందోదరి అనే మాటలు విని దేవతలూ, సిద్ధులూ సంతోషించేరు. అప్పుడు శివుడూ విధాతా సనక సనందనాది మునులూ నారదుడూ మొదలైన పరమార్థవాదులందరూ పరమాత్ముడైన రామున్నిచూచి పరమానంద సముద్రంలో మునిగిపోయి పరవశులై పోయి పరమసుఖాన్ననుభవించేరు. విభీషణుడు స్త్రీలందరూ ఏడుస్తుండడంచూచి తన మనస్సులో దుఃఖం పొంగిపోతుండగా వెళ్ళి అన్నయొక్క స్థితినిచూచి శోకిస్తున్నాడు.

శత్రువు నశించిపోయేడు. బుద్ధిమంతుడైన విభీషణుడు రాజ్యంపొంద గలిగేడు. మీ కీర్తి మూడులోకాలలోనూ నిండిపోయింది. నాకు సహాయంగా వచ్చి మీబలాలు చూపించి శత్రువును నశింపజేసిన మీకీర్తి చరిత్రను ఎవరు ఇష్టంతో చదివినా విన్నా అపారమైన సంసారసాగరాన్ని శ్రమలేకుండా దాటగలుగుతారు అన్నాడు. రామచంద్రప్రభువు పలికిన మాటలను విని పొంగిపోక రాముని పాదపద్మాలకు మాటిమాటికీ వినయముతో నమస్కరించి సంతోషంతో నిలబడ్డారు. అప్పుడు రాముడు హనుమంతున్ని పిలిచి అన్నా! నీవువెళ్ళి లంకలోనున్న సీతాదేవితో సకల వృత్తాంతంచెప్పి ఆమె క్షేమం కనుక్కొనిరా, అన్నాడు.

## హనుమంతుడు రామాజ్ఞపై సీతను దర్శించుట

అప్పుడు హనుమంతుడు రాముని ఆజ్ఞప్రకారం లంకాపట్టణంలోకి వెళ్ళేసరికి రాక్షసులూ రాక్షసస్త్రీలూ అనేకవిధాలుగా అతన్ని గౌరవించి పూజించి సీతాదేవి ఉన్నచోటికి తీసికొనివెళ్ళి చూపించేరు. ఆమెను చూచి హనుమంతుడు దూరంనుండే నమస్కరించేడు. అప్పుడు సీత ఓహో! రామదూతయైన మారుతివచ్చేడని సంతోషించి పుత్రా! వానరసైన్యంతో తమ్మునితో కూడా శ్రీరామచంద్రప్రభువునకు క్షేమమేనా? అన్నది. అప్పుడు హనుమంతుడు అమ్మా! సూర్యకుల భూషణుడైన శ్రీరామచంద్రుడు అన్నివిధములా సుఖంగా ఉన్నాడు. యుద్ధంలో రావణాసురున్ని ససైన్యంగా సంహరించేసి లంకారాజ్యం బుద్ధిమంతుడైన విభీషణునికిదయతో ఇచ్చేడు. అని చెప్పగానే సీతాదేవి సంతోషించి అన్నా! ఈ శుభవార్త చెవులకు ఇంపుగా వినిపించినందుకు నీకు ఏమి బహుమానం ఇయ్యగలను? వానరేంద్రా! నామనస్సుకి ఎంతశాంతి కలిగించేవు అన్నది. అప్పుడు హనుమంతుడు తల్లీ! శత్రు సంహారం చేసి లక్ష్మణ సమేతంగా ఉన్న ఆనంద స్వరూపుడైన శ్రీరామచంద్రున్ని చూచినందువల్ల సమస్తలోకాల రాజ్యం పొందినంత సంతోషం అనుభవిస్తున్నాను. ఇంక నాకేమికావాలి అన్నాడు.

ఆమాటలకు మెచ్చి సీతాదేవి తనయా ! సకల సుగుణాలూ నీహృదయంలో చెదరకుండా నిలుచును గాక! సౌమిత్రితోకూడా శ్రీరామచంద్రుడు ఎల్లప్పుడూ నీకు అనుకూలుడై నీ యోగక్షేమాలు చూచి రక్షించుచుండును గాక! అని ఆశీర్వదించి కుమారా ! ఇపుడు ఆ శ్యామల కోమల సుందర శరీరుడైన శ్రీరామచంద్రుని దర్శనం నాకు లభించునట్టు చేయుమనగానే ఆంజనేయుడు సంతోషంతో ఆమెసెలవుపొంది శ్రీరామసన్నిధికివచ్చి నమస్కరించి ఆయనతో సీతాదేవి క్షేమసమాచారమంతా విన్నవించేడు.

## రాముడు సీతను తీసుకొనిరమ్మని విభీషణునితో చెప్పుట

ఆ సందేశమంతావిని రాముడు ప్రేమతో అంగదున్నీ విభీషణున్నీ పిలిచి మీరు వేగంగా హనుమంతునితో కూడావెళ్ళి సీతాదేవిని ఆదరంతో ఇక్కడకు తీసికొనిరండి. అనేసరికి ఆజ్ఞ శిరసావహించి సంతోషంతో సీతాదేవి ఉన్న వనంలోకి వెళ్లేరు. అక్కడ రాక్షస కాంతలు వినయంతో సేవిస్తుండగా ఉన్న లోకమాతయైన సీతను చూచి నమస్కరించేరు. అప్పుడు విభీషణుడు ఆ స్త్రీలందరితో చెప్పగానే వారు సీతాదేవికి స్నానంచేయించి అనేకవిధాలైన ఆభరణాలు ధరింపజేసి ప్రకాశమైన పల్లకీలో కూర్చోబెట్టేరు. ఆమె రామున్ని ధ్యానించుకొంటూ ఆ పల్లకీలో కూర్చుంది. బెత్తాలు పట్టుకొని భటులు నాలుగువైపులా సంభ్రమంతో సేవిస్తూ నడుస్తున్నారు. రాక్షసకాంతలు సంతోషంతో పల్లకీచుట్టూ నడుస్తున్నారు. ఆసమయంలో లోకమాతయైన సీతామతల్లిని చూడాలని వేడుకతో వస్తున్న కపులనూ భల్లూకాలనూ రాక్షసభటులు బెత్తాలతో కొడుతున్నారు. అదిచూచి రాముడు ప్రియసఖా! విభీషణా! నా మాటవిని జానకిని కాలినడకతో ఇక్కడికి వచ్చేఏర్పాటు చేయించు. ఈ సమూహమంతా ఆమెను తల్లిలాగున చూడడానికి వీలయేలాగున చేయించు అని చిరునవ్వుతో చెప్పేడు. అందుకు వానరులందరూ సంతోషించేరు. దేవతలు పుష్పవర్షం కురిపించేరు. ఇంతవరకూ రహస్యంగా అగ్నిలో దాచిన

నిజమైన సీతను ఇప్పుడు తాను పరిగ్రహింపదలంచి రాముడు ఇలా అంటున్నాడు.

## సీత అగ్నియందు ప్రవేశించుట

ఇన్నాళ్ళు రాక్షసుని చెరలో ఉన్న ఈ సీతతో నాకేంపని? అని నిష్ఠురంగా అనగానే రాక్షసస్త్రీలందరూ విచారించేరు. సర్వసాక్షియైన రాముడు ఆ విధంగా అనగానే త్రికరణశుద్ధిగా రాముని ఆజ్ఞ మీరని సీతాదేవి అన్నా! లక్ష్మణా! నాకు ధర్మార్థముగా సహాయకుడవై ఇక్కడ అగ్నిని రగిలించు నిన్ను వేడుకొంటున్నాను అన్నది. వినయమూ వివేకమూ ధర్మమూ గొప్ప నీతీ కూడియున్న ఆ తల్లిమాటలు విని సౌమిత్రి కంటనీరుపెట్టుకొని రాముని వైపు చూచి నమస్కరించి మాట్లాడడానికి శక్తిలేక అలా నిలబడిపోయేడు. రామాజ్ఞకు తిరుగులేదు. ఎవరును ఉల్లంఘించలేరు. అప్పుడు లక్ష్మణుడు అగ్నిహోత్రున్ని అక్కడ ప్రతిష్ఠించి పెద్దపెద్ద కట్టెలు వేయగానే ఆకాశమంత పొడుగుమంటలు భయంకరంగా బయలుదేరేయి అది చూచి సీత సంతోషంతో అంటుంది. మనోవాక్కాయాలతో నా హృదయం ఎల్లప్పుడూ శ్రీ రఘురామచంద్రున్నితప్ప ఇతరం తలంచనిదైతే ఓ అగ్ని దేవా! నీవు చల్లని చందనంలాంటి శీతలత్వాన్ని పొందు. అందరి మనస్సులలోని ఉద్దేశాలూ నీవు ఎరుగుదువు. నీకు తెలియనిది లేనేలేదు. అంటూ రామచంద్రున్ని ధ్యానించుకుంటూ జై శ్రీరామచంద్రా! సర్వాంతర్యామీ! అని ప్రజ్వలిస్తున్న అగ్నిలో చల్లని చందనంలో ప్రవేశించినట్టు ప్రవేశించింది. ఆకాశం ముట్టే మంటలలో సీత ప్రతిబింబమైన లౌకిక సంబంధమైన కళంకమంతా కాలిపోయింది. దేవతలూ మునులూ సిద్ధులూ ఆకాశవీధి నుండి ఇదంతా చూస్తున్నారు. కాని ఎవ్వరూ రహస్యం తెలిసికోలేకపోయేరు. పరమేశ్వరుడైన శ్రీరామచంద్రుని లీలలు తెలిసికోవడం ఎవరికి శక్యమవుతుంది?

## పవిత్రమైన సీతను అగ్నిదేవుడు రామునికి సమర్పించుట

అప్పుడు సత్యమైన సీతాదేవిని సమస్తలోక పూజ్యురాలిని అగ్ని దేవుడు తీసికొనివచ్చి పూర్వం సముద్రుడు ఆదిలక్ష్మిని హరికి సమర్పించి నట్టు రామునికి సమర్పించేడు. అప్పుడు సీతాదేవి శ్రీరామచంద్రుని ఎడమ భాగాన్ని నిలబడ్డది. నల్లపద్మంపక్కని బంగారుపద్మంలాగున అప్పుడు సీతా రాములు ఇద్దరూ ప్రకాశిస్తున్నారు. దేవతలు సువాసనగల పుష్పవర్షం కురి పించేరు దుందుభులు వాయించేరు గంధర్వులు పాడేరు అప్సరసలు ఆడేరు. అందరూ వినుతించేరు. అప్పుడు సీతారాముల సౌందర్యం వర్ణించడానికి శక్యంకాదు. వానరులూ భల్లూకాలూ పరమసంతోషంతో జై రఘురామా! సుఖధామా అని వినుతించేరు.

## దేవతలు వచ్చి శ్రీరామచంద్రుని స్తుతించుట

అప్పుడు శ్రీరామచంద్రుడు దేవేంద్రుని సారథిని సెలవిచ్చి పంపిం చేసేడు. స్వార్థపరులైన దేవతలు శ్రీరామచంద్రుని యొద్దకువచ్చి పర మార్థవాదులు స్తుతించినట్టు ఓదీనబాంధవా! దయాసముద్రా! రామభద్రా! మహాత్మా! తండ్రీ! నీవు దేవతలయందు దయచూపించేవు. విశ్వద్రోహి యైన రావణుడు వాడిపాపంవల్ల వాడేనశించేడు దేవా! నీవు సమభావం కలవాడవు. అవ్యయుడవు. ఉదాసీనుడవు. లక్ష్మీనాథుడవు, కరుణ గల వాడవు, సకలాంతర్యామివి. సూర్యచంద్రులకూ అగ్నికీ తేజస్సును ఇచ్చే వాడివి. అనఘా, మూలకారణా! స్వయంప్రకాశా! జననమరణములు లేనివాడా. అనామయా! సచ్చిదానంద స్వరూపా! సకల లోకాధిపా! సకల లోకాలనూ ప్రకాశింపజేసేవాడా! మత్స్య కూర్మ వరాహ నారసింహ వామన పరశు రామ శ్రీరామరూపధారీ! ఎప్పుడు దేవతలకు దుఃఖం కలుగుతుందో అప్పుడు నీవు అనేక రూపాలు ధరించి కాపాడుతుంటావు. దేవా! దయాపయోధీ! కామరోషాదులు కలిగి దుష్టుడూ లోకకంటకుడూ ఐన రావణుడు నీయొక్క పరమపదం పొందడం మాకు ఆశ్చర్యంగా ఉంది. ప్రభూ! మేము పరానికి

అధికారులమై ఉండికూడా నీ పాదభక్తిని మరచిపోతుంటాము. రమానాథా! నిజంగా మేము స్వార్థపరులం కాబట్టే సంసార మోహంలో పడిపోతుంటాం. స్వామి! మమ్ములను ప్రేమతో కాపాడు. నీ పాదపద్మాలే శరణని వచ్చేం! అని వినయంగా చేతులు జోడించి నమస్కరించేరు.

## బ్రహ్మదేవుడు శ్రీరామచంద్రుని స్తుతించుట

తరువాత బ్రహ్మదేవుడు భక్తి పరవశుడై శరీరం పులకరిస్తుండగా శ్రీరామచంద్రుని ఇలా స్తుతించేడు. జై సనాతనా! సుఖధామా! రామా! వనజాక్షా! హరీ! పాపనివారణా! పావననామా! ధనుర్బాణధారీ! సంసారమనే యేనుగుకి సింహంవంటివాడా! భక్తవరదా! సమస్త లోకాధీశ్వరా! కామం మొదలైన దోషాలను నివారించేవాడా! సమస్త సద్గుణ సముద్రా! అపరిమిత శక్తిని ధరించినవాడా! షడ్గుణైశ్వర్యసమేతా? సర్వసాక్షీ! సజ్జన హృదయ పద్మాలలో విహరించే తుమ్మెదవంటివాడా! నిరుపమా! నిర్గుణా! నిరీహా! నిర్వికారా! సమస్త లోకాలనూ పవిత్రంచేసే నామంకలవాడా! సంపూర్ణ కామా! నూరుకోట్ల మన్మధుల సౌందర్యంగల మనోహర శరీరం ధరించిన వాడా! బ్రహ్మాండా లన్నిటియందూ నిండిన తెల్లని కీర్తిగలవాడా! ఎల్లప్పుడూ కవులచేతా మునీశ్వరులచేతా సిద్ధులచేతా స్తోత్రం చేయబడేరూపం గలవాడా! రావణ సర్పానికి గరుత్మంతుడా! భక్తజన హృదయరంజనా! సర్వలోక శోకభయ నివారణా! క్రోధంలేనివాడా! ఎల్లప్పుడూ జ్ఞాన స్వరూపం గలవాడా! మహాపవిత్ర గుణాలతో నిండిన అవతారం ధరించినవాడా! సీతాసమేతా! అందరి హృదయాలలో ఆత్మరూపివై ఉండేవాడా! ఏకమైన వాడా! వ్యాపించినవాడా! అనేకమైనవాడా! పుట్టుకా అంతమూ లేనివాడా! స్వప్రకాశా! అఖండమై శాశ్వతమై ప్రకాశించేవాడా! కరుణాకరా! రఘువంశాభరణా! సర్వేశ్వరా! దీనుడైన విభీషణునికి రాజ్యలక్ష్మినిచ్చినవాడా! ఆర్తబాంధవా! ఆనందనిలయా! జ్ఞాననిధానా! కోటి సూర్యప్రకాశా! శంక

రునిచేత స్తుతింపబడువాడా! సీతానాధా! నీకిదే భక్తితో నమస్కరిస్తు న్నాను. శాశ్వతా! నిన్ను ఏమరుపాటులేకుండా భజించడానికి నేను ఏపాటి వాడను? ఈశ్వరా! అవ్యయానందమందిరా! అప్రమేయా! ఇంద్రియా గోచరా! నిరీశా! ఈశ్వరేశా! సర్వతోముఖా! నిరవద్యా! సదసదాతిరిక్తా! నిష్కారణా! సర్వకారణా! శ్రీనివాసా! సూర్యకిరణాలు సూర్యునింటే వేరు కానట్టు అనేకరూపాలతో నీవు ఉన్నప్పటికీ అవేవీ నీకంటే వేరుకావనీ అవేవీ నీవుకావనీ శ్రుతులూ పురాణాలూ చెపుతున్నాయి. దేవా! ఎల్లప్పుడూ నీ దివ్యసుందరమూర్తిని దర్శిస్తున్న వానరులు ధన్యులు. ప్రభూ! సంసా రంలో మునిగిపోయి నీపాదభక్తిమరచి తిరిగే జీవులదేహాలు నీచేత తిరస్క రింపబడ్డవే. స్వామీ! దీనుడనైన నన్ను కరుణతో చూచి భేదబుద్ధి నాకు లేకుండా చెయ్యి. విషమకార్యపరుడనై దుఃఖరూప విషయ సుఖాలను యధార్థమైన సుఖమనుకొనే భ్రాంతిని తొలగించి నన్ను రక్షించు. దేవా! నీపాదభక్తినాకు ప్రసాదించు, అని విధాతభక్తితో గగుర్పాటుచెందిన శరీరంగలవాడై శ్రీరామ విభున్ని స్తోత్రంచేసి శోభావంతమైన అతని దివ్యస్వరూపాన్ని తనివితీరక చూస్తున్నాడు.

## శ్రీరామునియొద్దకు దశరథుడు వచ్చుట

అప్పుడు అక్కడికి దశరథుడు వచ్చి పుత్రులను చూచి కంటనీరు పెట్టుకున్నాడు. రామలక్ష్మణులు ఇద్దరూ తండ్రికి నమస్కరించేరు. అతడు ఇద్దరు కుమాళ్ళనూ ఆశీర్వదించేడు. అప్పుడు రాముడు దశరథునితో నాయన గారూ! మీయొక్క పుణ్యప్రభావంవల్లనే ఈ రాక్షసులందరినీ గెలువగలి గేను. అన్నాడు. అదివిని దశరథుడు సంతోషించి పులకిత శరీరంతో బాష్పాలు నింపుతూ ఉన్నస్థితిని చూచి రాముడు అతని మొదటి భక్తికి అనుమానించి దృఢమైన జ్ఞానబోధచేసేడు. మునుపు భేదబుద్ధికలిగి ఉండ డంచేతనే దశరథుడు మోక్షాన్ని పొందలేదు. పార్వతీ! సగుణారాధనచేసే వాళ్లు మోక్షం పొందలేరు. అందుచేత సారమైన జ్ఞానాన్ని రాముడు అతనికి

కరుణతో ఉపదేశించేడు. అప్పుడు దశరథుడు సంతోషంతో రామచంద్రుని పాదపద్మాలకు నమస్కరించి సెలవుపొంది ప్రకాశమానంగా దివానికి వెళ్ళిపోయేడు.

## దేవేంద్రుడు శ్రీరామచంద్రుని స్తుతించుట

తరువాత దేవేంద్రుడు సీతా లక్ష్మణ సహితంగా ఉన్న శ్రీరామ చంద్రుని శోభనుచూచి భక్తిపరవశుడై చేతులుజోడించి ఫాలమునచేర్చి స్తోత్రం చేసేడు, రామా! నీకు నమస్కరించే జనులకు విశ్రాంతి సుఖాన్ని ఇచ్చేవాడా! శోభానిలయా! జానకీకళత్రా! తూణీరధనుర్బాణధరా! అపరిమిత బలముగల భుజదండములుగలవాడా! ప్రకాశమానమైన సంపూర్ణ ప్రతాపం గలవాడా! ఖరదూషణాది భయంకర రాక్షస సంహారకా! భానువంశాధీశా! దుష్టుడైన దశముఖున్ని నీవు సంహరించుటచేతనే దేవతల మందరము సనాథుల మైనాము. భూభార నివారణా! నీకు జయమగుగాక! కరుణాసాగరా! అపారమహిమ గలవాడా! దేవతలనూ పరమమునీశ్వరులనూ పరిపాలించేవాడా! పరమేశ్వరా! అపారసంసార బంధనివారణా! రావణుడు గొప్ప భుజబలంగలవాడై దేవతలనూ సిద్ధులనూ చారణులనూ పన్నగులనూ యక్షులనూ నరులనూ నిరోధించి తనలోపు చేసుకున్నాడు. ఆ ఖలుడు ద్రోహబుద్ధితో అందరినీ బాధించేడు అటువంటి పాపాత్ముడు ఆ పాపఫలం పొందేడు. అంబుజాక్షా! నావంటివారు లేరనే అభిమానం నామనస్సులో ఎక్కువగా ఉండేది. ఇప్పుడు నీపాదదర్శనంవల్ల దుఃఖానికిమూలమైన ఆ అభిమానం అంతా నశించిపోయింది. నిశ్చలమైన నీపాదభక్తి నాకు కలిగింది అవ్యక్తుడవని వేదాలు చెపుతుంటే నిర్గుణపరబ్రహ్మనివైన నిన్ను కొందరు మనస్సులో ధ్యానిస్తుంటారు. దేవా! నేను కోసలప్రభువైన శ్రీరామచంద్ర సగుణమూర్తిని సేవిస్తున్నాను. మహాత్మా! సీతాలక్ష్మణ సహితంగా నామనఃపద్మంలో విహరించుమని నిన్ను వేడుకుంటున్నాను. ప్రభూ! నన్ను నీదాసునిగా భావించి నిర్మలమైన భక్తి నాకు ప్రసాదించు.

ముకుందా! సుఖకరా! భయనివారణా! శరణాగతరక్షకా! రామభద్రా! రఘువరా! నిర్వికారా! నీకు నమస్కరిస్తున్నాను. సాటిలేని శక్తికలవాడవు నీవే కదా జగదేక నాయకా! నన్ను కృపాదృష్టితోచూచి నేను చేయవలసిన దేమున్నా ఆనతియ్యి నాథా అన్నాడు. ఆప్రియమైన మాటలు విని రాముడు ఇంద్రా! రాక్షసులచేత చంపబడిన వానరులనూ భల్లూకాలనూ నా హితంకోరి ప్రాణాలుపోసి బ్రతికించు అన్నాడు.

## యుద్ధంలో చచ్చిన వానర భల్లూక వీరుల ఇంద్రుడు బ్రతికించుట

పార్వతీ! ఆ ప్రభుని మాటలలో గూఢార్థాన్ని జ్ఞానులైన మునులే తెలిసికోగలరు. మూడులోకాలనూ సంహరించడానికీ బ్రతికించడానికీ తానే సమర్థుడై ఉండికూడా ఆఘనత దేవేంద్రునికి ఇచ్చేడు. అప్పుడు ఇంద్రుడు అమృతవర్షం కురిపించేడు. కపులూ భల్లూకాలూ సజీవులై లేచి కృపాళుడైన రామునిచెంతకు వెళ్లి చేరేరు. ఇంద్రుడు చచ్చిపడియున్న రెండు పక్షాల సైనికులమీదా సమానంగానే అమృతం కురిపించేడు కాని వానర భల్లూకభటులే బ్రతికేరు. రాక్షసభటులందరూ నేల కలిసిపోయేరు. రాక్షసుల మనస్సులు రామునిలో కలిసిపోయినాయి. అందుచేత వారు ముక్తిపొంది పోయేరు. వానర భల్లూకాలు దేవతలు కాబట్టి పరమేశ్వరుడైన రాముని యిచ్ఛప్రకారం బ్రతికేరు. ఆదీనబాంధవుడైన శ్రీరామచంద్రునితో సమానులెవరున్నారు? రాక్షసులకుకూడా ముక్తినిచ్చేడు. దుష్టుడైన రావణుడు పరమమునులు పొందే స్థానాన్ని పొందేడు. అప్పుడు దేవతలు రామునిపై పుష్పవర్షం కురిపించి ఆకాశమార్గంగా విమానాలమీద వెళ్లిపోయేరు.

## శివుడు శ్రీరామచంద్రుని స్తుతించుట

తరువాత ఇదేమంచి సమయమని ఈశ్వరుడు రాముని సన్నిధికి వచ్చి భక్తితో నమస్కరించి శరీరం పులకరిస్తుండగా గద్గదకంఠంతో వినయపూర్వకంగా ప్రార్థించేడు. ఓ రవివంశనాథా! నన్ను రక్షించు. ధనుర్బాణ

ధారీ। ఖరారీ। మోహం అనే మేఘానికి గాలివంటివాడా। మోక్షసదనా। సంశయం అనే అరణ్యానికి అగ్నివంటివాడా। దేవతలకు హితమాచరించే వాడా। సగుణ నిర్గుణ స్వరూపా। సద్గుణ నిలయా। వేదాంత విచారసార మైనవాడా। సాటిలేని ధీరుడా। భ్రమాంధకారాన్ని నశింపజేసేవాడా। అపరిమితమైన మదం కామం క్రోధం అనే మదపుటేనుగులకు సింహంవంటి వాడా। అజ్ఞానాంధకారానికి సూర్యునివంటి వాడా, అనుభవజ్ఞానస్వరూపా। మహావీరా! నిర్వికారా। జ్ఞానుల హృదయాలలో నివసించువాడా। పరిస్ఫుటమైన జ్ఞానాన్ని ఇచ్చేవాడా। సంసారతాప నివారకా! అనేకవిషయాభిలాషలనే పద్మాలకి మంచువంటివాడా। మనస్సుకి అందనివాడా। మునులకు మేలుచేయువాడా। అప్రమేయా। ఏకరసస్వరూపా। పరమపురుషా। పారమూ సారమూలేని భయంకర సంసారసాగరాన్ని ఇంకించి నన్ను తరింపజెయ్యి. పద్మనేత్రా! నీలమేఘవర్ణా! దయాంతరంగా। దీనశరణ్యా। దేవదేవా! ప్రణతార్తిభంజనా। విశ్వరూపా! విశ్వాత్మకా। విశ్వదూరా। విశ్వమోహనా। విశ్వేశ్వరా। విశ్వహరణా। రామా। సీతాలక్ష్మణ సహితంగా ఎల్లప్పుడూ నా హృదయ పద్మంలో నివసించి ఉండు. ఈశ్వరేశా। నిశ్చలమైన సంపూర్ణభక్తిని నాకు ప్రసాదించు, నేను నీ వాడను. ముకుందా। మునిరంజనా। ఖలభంజనా। సముద్రంచేత చుట్టబడ్డ సమస్త భూమికీ ఆభరణమైనవాడా। తులసీదాసవిభూ! పుట్టుకా రోగాలూ చావూ మొదలైన భయంకర తాపాలను నివారించువాడా! దేవా। వైకుంఠ నగరంతో సమానమైన అయోధ్యా పట్టణంలో నీకు పట్టాభిషేకం జరిగేటప్పుడు నీ దివ్య దర్శనానికి సంతోషంతో వస్తాను అని చెప్పి ఫాలలోచనుడు రాముని ఆజ్ఞపొంది వెళ్ళిపోయేడు. అప్పుడు విభీషణుడు వచ్చి రామునికి నమస్కరించి కోదండపాణీ। నాదొక్క విన్నపము. పరివారంతోకూడా రావణున్ని చంపి మూడు లోకాలలోనూ నీ కీర్తిని నిండజేసేవు. మునులనూ దేవతలనూ కాపాడినావు. దేవా। నేను అతి దీనుడిని, మలిన హృదయున్ని, హీనజాతి వాడిని. అట్టి నన్ను కరుణతో కాపాడేవు. ఆనందమయా। నీ దాసుడనైన

నా గృహంలో ఒక్కసారి నీపాదం ఉంచి పావనం చెయ్యవా? తండ్రీ దీనదయానిధీ! యుద్ధభూమిలో అలసియున్న శ్రమ తీరేలాగున నాయింట్లో! అభ్యంజన స్నానంచెయ్యి. నాయింట్లో సంపద అంతాచూచి ఈ వానరులకూ భల్లూకాలకూ పంచిపెట్టు. అన్నివిధాలా నన్ను నీ దానినిగా చేసికొని కరుణతో సీతోకూడా అయోధ్యాపురానికి తీసికొనివెళ్ళు. మహాత్మా! శ్రీరామా! అన్నాడు. అతని మృదువైన మాటలువిని శ్రీరామచంద్రుడు తన విశాల నేత్రాలనుండి నీరు కారుతుండగా సోదరా! నిజంగా నీ యిల్లూ ధనం అంతా నావే. అయినప్పటికి భరతుని అవస్థ తలంచుకుంటే నిముసం ఒకయుగం అనిపిస్తుంది. వేగంగా నేను అక్కడికి వెళ్ళి పోవాలి. భరతుడు జడలుధరించి శరీరం కృశించిపోతుండగా ఎల్లప్పుడూ నన్నే జపిస్తున్నాడు. కాబట్టి ప్రియమిత్రా! భరతున్ని చూడడానికి అతి వేగంగా వెళ్లే యేర్పాటు చెయ్యమని నిన్ను ప్రార్థించుచున్నాను. అవధి తీరిన తరువాత ఏమాత్రం ఆలస్యమైనా భరతున్ని ప్రాణాలతో చూడలేము అని తమ్ముణ్ని తలంచుకొని శరీరమంతా గగుర్పాటు చెందగా రాముడు అంటున్నాడు సఖా! విభీషణా! నీవు కల్పాంతం అయేవరకూ సుఖంగా రాజ్యంచేస్తూ నన్ను స్మరిస్తూ అన్ని సుఖాలనూ మించిన సుఖమైన నా పరమపదాన్ని పొందగలుగుతావు. అని రాముడు చెప్పగానే సంతోషంతో విభీషణుడు రాముని పాదపద్మాలు పట్టుకున్నాడు. భల్లూక వానర వీరు లందరూ ఆనందంతో భక్తిపరవశులై రాముని పాదకమలాలకు నమ స్కరించి వినుతించేరు.

## విభీషణుడు పుష్పకం తెచ్చుట

అప్పుడు విభీషణుడు రామునియొద్ద సెలవు తీసికొనివెళ్ళి సూర్యు నితో సమానమైన ప్రకాశంగల పుష్పకంమీద వింత వింతైన వస్త్రాలూ ఆభరణాలూ రత్నాలూ ఉంచుకొని రామసన్నిధికి వచ్చేడు. రాముడు నవ్వి మిత్రుడా! ఈ పుష్పకంతో ఆకాశానికివెళ్ళి ఆ వస్త్రభూషణాదులన్నీ

భూమిమీద పడేలాగున వర్షంలా కురిపించు అన్నాడు. విభీషణుడు సంతోషించి ఆ విధంగానే చేసేడు. అప్పుడు వానరులూ భల్లూకాలూ ఎవరికి దొరికినవి వారు ఏరుకొని ఆ మణులన్నీ నోళ్ళలో పెట్టుకొని తినడానికి పనికిరావని అవతల పారేసేరు. కౌతుక ప్రియుడైన శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణ సహితంగా ఆ వానరచేష్టలుచూచి నవ్వేడు. మహామునులు ధ్యానంచేత ఎవన్ని తెలిసికోలేరో వేదాలు ఇదికాదు ఇదికాదని ఏ నిరుపమానున్ని వెదకికూడా తెలిసికొని నిరూపించలేవో ఆ ప్రభువు అతి ప్రీతితో కపులను కూడి అనేక వినోదాలు చేస్తున్నాడు. కాత్యాయనీ జపాలూ తపాలూ యోగాలూ యజ్ఞాలూ సేవలూ దానాలూ చేసినప్పటికి అతడు సంతోషించడు. కేవలమైన ప్రేమకు వశుడైపోతాడు. దేవీ! సీతానాథుడే కేవల పరతత్వం. కాబట్టి అతనియందు ఎడతెగని భక్తి కలిగిఉండాలి. అప్పుడు ఆ వానర భల్లూకవీరులు ఆ వస్త్రాలూ నగలూ అలంకరించుకొని రామునియొద్దకు వచ్చేసరికి వాళ్ళనుచూచి రాముడు నవ్వుతూ దయతో వానరులారా! మీ సహాయంవల్ల కార్యమంతా నెరవేరింది. ఇక మీరు మీ యిళ్ళకు వెళ్ళండి. మీ మనస్సులలో భయం విడిచిపెట్టి నన్ను ధ్యానిస్తుండండి అన్నాడు. ఆ మాటలువిని ప్రేమకు వశులైన వానరులు రామునితో అంటున్నారు. ప్రభూ! నీవు అన్నది బాగానేఉంది. దీనులమైన మమ్ములను నీ అధీనం చేసుకున్నావు. మూడు లోకాలకూ నీవే నాథుడవు. అధిపా! గరుత్మంతునికి దోమ ఏమైనా సహాయం చేయగలదా? నీవాడిన మాటలకు మాలో మేము సిగ్గుపడిపోతున్నాం. నాథా! అని వానరులూ భల్లూకాలూ ప్రభుని ఆజ్ఞప్రకారం ఇళ్ళకు వెళ్ళిపోలేక భక్తి పారవశ్యంతో రామచంద్రమూర్తిని మనస్సులలో నిలుపుకొని కొంత ఆనందం కొంత వగపుతో ఎట్టకేలకు ఇళ్ళకు వెళ్ళిపోయేరు. సుగ్రీవుడూ జాంబవంతుడూ అంగదుడూ హనుమంతుడూ నలుడూ నీలుడూ ఇంకా ఇతర సమూహం విభీషణుడూ అతని పరివారము వర్ణనాతీతమైన ప్రేమతో రెప్ప వేయకుండా రాముని ఆకారంయొక్క శోభను చూస్తూ ఉన్నారు.

## రాముడు సీతాలక్ష్మణ సైన్య సమేతంగా పుష్పకంపై అయోధ్యకు వెళ్లుట

అప్పుడు రాముడు అధికమైన వారి ప్రేమ కనిపెట్టి సీతా లక్ష్మణ సహితంగా తాను ఎక్కియున్న పుష్పకం ఎక్కండని వారికి ఆజ్ఞ యిచ్చి బ్రాహ్మణులను తలంచి నమస్కరించి ఉత్తర దిక్కుగా వెళ్ళుమని విమానానికి ఆజ్ఞాపించేడు. ఆకాశవీధిని పుష్పకం వెళ్ళిపోతుంది. అందరూ జై రమేశా! రామచంద్రా! అని పెద్ద ధ్వనితో అన్నారు. ఆ పుష్పకంలో ఎత్తైన అందంగా ఉన్న పీఠంమీద సీతారాములు కూర్చున్నారు. ఆ విమానం మహావేగంగా వెళ్ళిపోతుంది. దేవతలు పుష్పవర్షం కురిపించేరు. చల్లని సుగంధ వాయువు వీచింది. అంతటా శుభ శకునాలు కనపడ్డాయి.

## రాముడు సీతకు మార్గంలోని ముఖ్యస్థలాలు చూపుట

అప్పుడు శ్రీరామచంద్రుడు సీతాదేవితో అంటున్నాడు. సుందరీ! ఇదిగో ఇదే యుద్ధభూమి. ఇక్కడ లక్ష్మణుడు ఇంద్రజిత్తుని సంహరించేడు. ఇదిగో ఇక్కడ కొందరు రాక్షసులను అంగదుడూ హనుమంతుడూ జాంబవంతుడూ చంపేరు. ఇక్కడ లోకకంటకులైన రావణ కుంభకర్ణులను నేను సంహారంచేసేను. దేవీ! అదిగో చూడు. అదే సేతువు. నేనక్కడ పరిశుద్ధుడైన చంద్రమౌళిని ప్రతిష్ఠించేను. అని చెప్పి భక్తితో సీతా సహితంగా ఆశివునికి నమస్కరించేడు. తరువాత ఆ అరణ్యంలో తాను ఎక్కడెక్కడ నివసించేడో ఆయా స్థలాలన్నీ సంతోషంతో సీతాదేవికి రాముడు చూపించేడు. ఒక్కక్షణంలో పుష్పకం అవన్నీదాటి దండకారణ్యానికివచ్చేసింది. అప్పుడు రాముడు అగస్త్యుడూ మొదలైన మునులు నివసించే ఆశ్రమాలకు వెళ్ళి వారికి వినయంతో నమస్కరించి అందరిచేతా ఆశీర్వాదాలు పొందేడు. ఆ తరువాత చిత్రకూట పర్వతవాసులైన మునులకు దర్శన మిచ్చి వారందరికీ ఆనందం కలిగించేడు. ఆ వెనుక విమానం మహా

వేగంగా వెళ్ళిపోతుంది. అక్కడ రాముడు పాపనాశనియైన యమునానదిని సీతాదేవికి చూపించేడు. అతిమనోహరమైన ఆ యమునానదిని దాటిన తరువాత గంగానదిని సీతకు చూపించి దేవీ! అన్నినదులలో ఇది శ్రేష్ఠమైంది ఈ నదికి నమస్కరించు. అన్నాడు. తరువాత పౌలతీ! ఇది తీర్థరాజమైన ప్రయాగ దీన్నిచూచినంతమాత్రాన్నే కోటి జన్మాలలోచేసిన పాపాలన్నీ పోతాయి. పరమగతికూడా లభిస్తుంది. పరమపావనియైన త్రివేణి ఇదిగో నిర్మలబుద్ధిని కలుగజేస్తుంది. ఇది విష్ణులోకానికి సాటిలేని నిచ్చెనవంటిది. సమస్త శోకాలనీ పోగొడుతుంది. అదుగో అయోధ్య. తాపత్రయాన్ని నశింపజేస్తుంది. భవరోగాన్ని నివారించే మహౌషధం చూడుమని సీతకు చెప్పి ఆమెతో కూడా రాముడు ఆ పవిత్రమైన పట్టణానికి నమస్కరించేడు. సీతారాములిద్దరూ ఆ పట్టణంచూచి ఆనందంతో పొంగిపోయేరు. అప్పుడు వానరసహితంగా త్రివేణిలో స్నానాలుచేసి రాముడు బ్రాహ్మణులకు తృప్తి పొందేలాగున భక్తితో అనేక దానాలు చేసేడు.

## శ్రీరాముడు హనుమంతున్ని భరతునియొద్దకు పంపుట

అప్పుడు రాముడు హనుమంతున్నిచూచి అన్నా! నీవు ముందుగా వటు రూపంతోవెళ్ళి భరతునితో మన క్షేమవార్తచెప్పి అక్కడ క్షేమం తెలిసికొనిరా. అన్నాడు. మారుతి సంతోషముతో అయోధ్యకు వెళ్ళేడు. అప్పుడు రాముడు భరద్వాజాశ్రమానికి వెళ్ళి అతని దర్శనంచేసేడు. భరద్వాజ మహాముని అనేకవిధాలుగా రామున్ని పూజించి గొప్పగా స్తోత్రంచేసి ఆనందంతో ఆశీర్వదించినాడు. అతనికి నమస్కరించి సెలవుపొంది పుష్పకంలో కూర్చున్నాడు రాముడు. పుష్పకం వేగంగావెళ్లిపోతుంది. శ్రీరామచంద్రుడు వస్తున్నవార్తవిని గుహుడు నావ ఎక్కడ? అని అనుచరులను పిలిచేడు. అంతలో పుష్పకం అక్కడ దేదీప్యమానంగా నిలబడ్డది. రామాజ్ఞ ప్రకారం గంగానదినిదాటి పుష్పకం నిలబడగానే సీతాదేవి ఆ గంగానదిని పూజించి నమస్కరించింది. గంగానది సీతాదేవిని స్థిరసౌభాగ్యంపొంది

యుండుమని ఆశీర్వదించింది. అంతలో గుహుడు అక్కడికివచ్చి ప్రేమతో శరీరం మరచిపోయి సీతాసహితుడైన వేదాంత విహారున్నిచూచి భక్తితో పాదసమీపాన్ని భూమిమీద పడి నమస్కరించేడు. నిర్మలమైన అతని ప్రేమకు సంతోషించి రాముడు లేవనెత్తి ఆలింగనం చేసుకున్నాడు. చెంత కూర్చుండబెట్టుకొని క్షేమమడిగేడు. గుహుడు స్వామీ! మీ పాదసందర్శనం వల్ల నిరంతరం క్షేమంగా ఉన్నాను. పరమ సౌఖ్యధామా! రామా! నిజ భక్తకువలయ సోమా! సోమశేఖరస్తుతనామా! నీకే ఎల్లప్పుడూ నమస్కరిస్తున్నాను. అని స్తుతించేడు. అన్నివిధాలా అధముడైన ఆ నిషాదున్ని భరతునితో సమంగా చూచి ఆలింగనంచేసికొన్నాడు. కరుణాసముద్రుడు, ఆశ్రితవత్సలుడు. ఓమందమతీ; ఎందుకు రామ నిధున్నిమరచి ఆనంధం అనుకొని భ్రమపడి పాపసమూహంలో పడి చస్తావు? ఇకనైనా తెలివి తెచ్చుకొని మహాత్ముడైన తులసీదాసు బోధవిని రామున్ని భక్తితో భజించి మోక్ష సామ్రాజ్య సుఖంపొందు. విషయసుఖాలను విషంతో సమానంగా చూడు. వాటిలో పడి లెక్కలేనన్ని జన్మలెత్తి చావడం ఎందుకు? రావణ సంహారకుడైన రాముని చరిత్రం అనంతం. మహాపావనమైంది. రామ పాద భక్తినీ మోక్షప్రదమైన జ్ఞానాన్నీ జయాన్నీ ఐశ్వర్యాన్నీ ఇంకా సర్వ సౌఖ్యాలనూ ఇస్తుంది. అందుచేత భక్తితో వినండి. చదవండి ఓమనసా! ఈ కలి కాలం గొప్పపాపాలకు ఉనికిపట్టు కాబట్టి ఆపాపాల్లోపడి తాపాలు పొంది దుఃఖించకుండా ఉండడానికి నిష్కపటమైన శ్రీరామనామస్మరణ తప్ప ఆధారం ఇతరమేదీలేదని దృఢంగానమ్ము.

కరుణా సముద్రా। దైవశేఖరా। నిరాకారా। అవికారా। పరాపర ప్రకృతులకు అతీతమైనవాడా! యోగిజనుల హృదయపద్మాలలో నివసించే తుమ్మెదవంటివాడా। పరబ్రహ్మ। పరమాత్మా। సనాతనా। ఆకాశ పుష్పంలాగున భ్రాంతికల్పించే సమస్త ప్రపంచలక్ష్మికి నాథుడా। దుష్టరాక్షసహరణ లీలావిహారా। గరుడవాహనా। ఎల్లప్పుడూ పార్వతీ

దేవిచేత వినుతింపబడే నామమూ సద్గుణాలూ కలవాడా। విశ్వగురూత్తం సమా। సంసారమనే ఎండమావులను నివారించు వాడా। జ్ఞానప్రభాకరా। యుద్ధంలో భయంకర శౌర్యంగలవాడా। షడ్గుణైశ్వర్యసమేతా। నీలమేఘ శ్యామా। పద్మపత్రనేత్రా। శమదమాలను కలిగించువాడా। శాశ్వతా నందస్వరూపా। నమస్కరించే సజ్జనులను పోషించువాడా। నందగోపాల వేషం ధరించినవాడా హరీ నమోనమః.

గద్య : ఇది శ్రీ సీతారామచంద్ర వరప్రసాద వంశ భూసురులూ
కాశ్యపస గోత్రోద్భవులూ ఐన నవ్యా నేశ్వర శర్మగారితనయ
రుక్మిణీ నామధేయచేత రచింపబడ్డ వ్యావహారికవచన
తులసీరామాయణము నందు లంకా కాండం అనే
ఆరోసోపానం
ఓం తత్సత్
శ్రీ సీతారామచంద్రార్పణమస్తు

ఓమ్

# శ్రీమదాంధ్రతులసీరామాయణం

## వ్యావహారికవచనం

## ఏడో సోపానం ఉత్తరకాండ

శ్రీ విశ్వేశ్వర సేవితా! భావాతీత ప్రకాశా! పరమేశ్వరా! సాధుజన జీవనధనా! సద్గుణ నిధానా! లావణ్యంతో కూడిన సౌందర్యంతో విహరించేవాడా! లక్ష్మీమనోహరా! నెమలికంఠంతో సమానమైన రంగు గలిగి ప్రకాశమానమైన శరీరం గల విశ్వంభరున్నీ వైకుంఠున్నీ భృగుమహర్షిపాద చిహ్నం గల వక్షస్థలం గలవాన్నీ సర్వజ్ఞున్నీ సర్వేశ్వరున్నీ పద్మలోచనున్నీ కృపాళున్నీ నిత్యున్నీ పీతాంబరధారినీ వానరాది సకల జనులతో సీతా సహితంగా పుష్పకవిమానంలో ఉన్నవాన్నీ నిరంతరం సేవిస్తాను. ఏ పరమేశ్వరుని పాదపద్మాలు శివునికీ బ్రహ్మదేవునికీ ఆశ్రయించదగినవో ఎల్లప్పుడూ భక్తుల హృదయ పద్మాలలో తుమ్మెదల జంటవలె ఉంటాయో సీతాదేవిచేత నిత్యం సేవింపబడుతుంటాయో అటువంటి సర్వులోకశరణ్యుడైన శ్రీరామచంద్రుని పాదపద్మాలను నేను ఎల్లప్పుడూ ఆశ్రయిస్తాను. మన్మథునికి విరోధీ బాలచంద్రున్ని ధరించినవాడూ ప్రసిద్ధుడూ శుద్ధుడూ అఖండుడూ మనస్సూ బుద్ధీ ఇంద్రియాలూ అందుకోలేని అజేయుడూ అనామయుడూ వృషభధ్వజుడూ అయిన శివున్ని ఎల్లప్పుడూ సేవిస్తూ ఉంటాను

### భరతుడు సీతారామలక్ష్మణులింకా రాలేదని చింతించుట

అయోధ్యా పట్టణంలో స్త్రీలూ పురుషులూ రామవిరహాన్ని శరీరాలు శుష్కించిపోయి ఉండగా రాముడు రావడానికి ఇంక ఒక దినమే గడువు ఉన్నది. అన్నిచోట్లా అందరూ వాళ్ళవాళ్ళు అనుకుంటున్నారు అంతటా శుభశకునాలు కనపడుతున్నాయి. అందరి మనస్సులూ ప్రసన్నత పొందేయి.

నగరమంతా కొత్తకొత్తశోభతో కనపడుతుంది. రాముడు వస్తున్నాడని చెపుతుందో అన్నట్టు, కౌసల్యా మొదలైన తల్లులందరికి సీతాలక్ష్మణ సహితంగా శ్రీరామచంద్రుడు వస్తున్నాడని ఇంక ఎవరో చెపుతారు. అన్నట్టు ఆనందం కలిగింది, భరతుడికి కుడికన్నూ కుడిభుజమూ మాటి మాటికీ అదురుతున్నాయి, అవి శుభశకునాలని, సంతోషించి మనస్సులో ఈవిధంగా అనుకుంటున్నారు, ఇంక అవధి ఒక్కటే ఆధారం అదీ ఇంక ఒకదినమేఉంది అనుకుంటుండే సరికి దుఃఖం ఎక్కువైపోయింది, శ్రీరామ చంద్రుడు ఇంకారాకపోవడానికి కారణమేమో? నేను దుష్టుడనని నాదోష మెంచినన్ను మరచిపోయేడేమో! అహాహా! లక్ష్మణుడే ధన్యుడు. అతడు శ్రీరామచంద్రుని పాదపద్మాల యందు దృఢమైన భక్తి కలవాడు. శ్రీరామ చంద్రుడు నన్నుకుటిలస్వభావుడని భావించేడు. లేకపోతే తనవెంటనన్నెం దుకు తీసుకొనివెళ్ళడు? నాప్రవర్తన ఏమీమంచదికాదు. అది రాముడు లక్ష్యంచేసేడంటే నేను కోటికల్పాలకైనా తరించలేను. ఆకరుణాశీలుడైన స్వామి భక్తులహృదయాలలో కల్మషాలని ఎంచడని విన్నాను. దీన జనులను రక్షించే స్వభావంగల వాడౌటచేత నన్నువిడిచిపెట్టడని సమ్మకంతో స్తుంది ఈశుభశకునాలు కనపడడంచేత నాప్రభువు నా దేవుడు వస్తున్నాడనే విశ్వాసం కలుగుతుంది. ఒకవేళ అవధిదాటిపోయినా జీవించిఉంటే నావంటి అధముడు ప్రపంచంలో ఎవడూఉండడు. అని ఈవిధంగా రామవిరహ సముద్రంలో భరతుని మనస్సు మునిగిపోబోతుంది.

## భరతుని యొద్దకు హనుమంతుడు వచ్చుట

ఆ సమయంలో మారుతి తెప్పలాగున బ్రాహ్మణ వేషంతో అక్కడికి వచ్చి జటాకిరీటంతో కృశించి పోయిన శరీరంతో దర్భాసనం మీద కూర్చొని రామున్ని ధ్యానించుకుంటూ కంటనీరు పెట్టుకుంటూ ఉన్న భరతున్ని చూచేడు. చూచి సంతోషించి పులకించిన శరీరం గలవాడై ఆనందబాష్పాలతో సుఖం అనుభవించి భరతుడు వినేలాగున ఆంజనేయుడు చెవులకు హాయి కలిగించే మాటలనే అమృతం ఒలికించేడు ఈ ప్రకారంగా

ఓ భరత ప్రభూత్తమా ! రాత్రింబవళ్లూ ఏ విభుని విరహంచే దీనుడవై అతన్ని విశ్రామం లేకుండా చింతిస్తున్నావో ఆతని అనంత గుణాలను స్మరిస్తున్నావో ఆ రవికులదీపకుడైన శ్రీ రామచంద్రుడు వైదేహీనాథుడు సంతోషంతో వస్తున్నాడు. యుద్ధభూమిలో శత్రువులను సంహరించేడు. సీతాదేవితోనూ లక్ష్మణునితోనూ దేవతలతని కీర్తిగానం చేస్తుండగా సజ్జనులకు సుఖం కలిగించే రాముడు అయోధ్యా పురానికి వస్తున్నాడు అనగానే ఆ పరమానందకరమైన హనుమంతుని మాటలు విని భరతుడు దాహంతో ఉన్నవాడు అమృతం దొరికితే సంతోషించినట్టు పరితోషం పొందేడు. ఆ విధంగా ఆనందపరవశుడై భరతుడు వాయునందనున్ని చూచి అయ్యా ! నీవు ఎక్కడ నుండి వచ్చి ఈ పరమహర్షం కలిగించే మాటలు చెప్పేవు ? అనేసరికి హనుమంతుడు ఓ కరుణా సముద్రా ! నేను వానరుడను. వాయుపుత్రుడిని రామపాద సేవకున్ని అనగానే భరతుడు నేచి ఆదరంతో హనుమంతున్ని కలిసికొని పొంగిపోర్లే ప్రేమను మనస్సులో పట్టలేక ఆనందాశ్రువులతో శరీరం పొంగిపోతుండగా అన్నాడు. ఓ కపివరా! నీదర్శనం వల్ల నా దుఃఖమంతా పోయింది. నీవు రామప్రభువుకి ఎంతో ప్రియుడవు. ఆహా! ఎంతపుణ్యం ! అని మాటిమాటికి కుశలప్రశ్న చేస్తూ భ్రాతా ! ఈ సంతోష వార్త చెప్పినందుకు ఏమిచ్చి నీఋణం తీర్చుకోగలను ? నీతోసమానుడైన హితుడు ఈభూలోకంలో ఉన్నాడా ? ఈ సందేశంతో సమానమైన ఆనంద కరమైన వార్త అన్నిలోకాలలో ఏసమయంలోనూ ఉండదు. ఇప్పుడు సీతానాథుని చరిత్రంతా క్రమంగా చెప్పు అన్నాడు. అనగానే ఆ మహాత్ముడైన భరతుని పాదాలకు తలవంచి నమస్కరించి హనుమంతుడు శ్రీ రామచంద్రుని గుణాలు వర్ణిస్తూ చరిత్రంతా విస్తరించి చెప్పేడు. భరతుడు సంతోషించి కపీంద్రా! స్వామి నన్ను దాసుడని ఏ సమయానైనా తలంచుతుంటాడా ? అని అడగ్గానే భరతుని వినయవంతమైన మాటలకు వాయుపుత్రుడు పొంగిపోయి ఆతని పాదాలు పట్టుకొని పరమానందంతో అంటున్నాడు, స్వామి ! ఆ చరాచరవిభుడు సీతానాథుడు తన శ్రీముఖంతో ఎవని సద్గుణాలను నిత్యం వర్ణిస్తూంటాడో ఆ సద్గుణ సముద్రుడవు. నీవు

శ్రీరామ చంద్రునికి ప్రాణప్రియుడవు. ఇది యథార్థం అనగానే భరతుడు అధిక ప్రేమతో మారుతిని చూస్తూ అని వాచ్యమైన హర్షం పొందేడు. హనుమంతుడు వినయంతో భరతుని పాదపద్మాలకు నమస్కరించి సెలవు పొంది రాముని సన్నిధికి వేగంగా వెళ్ళి భరతుని క్షేమవార్త సంతోషంతో చెప్పేడు.

## శ్రీరామచంద్రుని పురప్రవేశం

అప్పుడు శ్రీరామచంద్రుడు సీతాదేవీ లక్ష్మణుడూ వానరులూ రాక్షసులూ సేవిస్తుండగా పుష్పకంమీద సమస్తలోకాల వారు స్తోత్రాలు చేస్తుండగా వస్తున్నారు. అప్పుడు భరతుడు అయోధ్యకు వచ్చి గురువు గారితో ఈ ప్రియవార్త చెప్పి రాజభవనంలోకి వెళ్ళి తల్లులతో శ్రీరామ చంద్రుడు సీతా లక్ష్మణ సహితంగా వస్తున్నాడని చెప్పేడు. నగరంలో జనులందరికీ చెప్పేడు. అందరూ అపరిమితానందం పొందేరు. స్త్రీలందరూ బంగారుపళ్లాలతో పెరుగూ దూర్వాంకురాలూ గోరోచనం మంచి పువ్వులూ పండ్లు నానావిధాలైన శుభవస్తువులూ పట్టుకొని కలస్వరములతో పాటలు పాడుతూ బయలుదేరేరు ఆ పట్టణంలో స్త్రీలూ పురుషులూ అందరూ సంతోషంతో రామునికి ఎదురుగా వెళుతున్నారు అన్నా! నీవు శ్రీరామ చంద్రున్ని చూచేవా? అని ఒకరినొకరు అడుగుకుంటూ నడుస్తున్నారు. రాముని రాకతెలియగానే అయోధ్యా పురానికి కొత్త శోభ కలిగింది. సరయూనది నిర్మలమైన నీటితో ప్రకాశిస్తుంది. గాలి చల్లగా మెల్లగా సువాసనతో వీచింది. అప్పుడు భరతుడు గురుబ్రాహ్మణ పరిజన సహితుడై తమ్మునితో కూడ అధికమైన ప్రేమతో కరుణా సముద్రుడైన రామ భద్రునికి ఎదురుగా వెళ్ళుతున్నాడు. స్త్రీలందరూ మేడలమీద ఉండి పుష్పకం వస్తూండడం ముఖాలు ఆకాశానికెత్తి చూస్తున్నారు. చక్కని కంఠస్వరాలతో పాటలు పాడుతున్నారు. ఆహా! నేటికిగదా జగత్ప్రభువుని సంతోషంతో చూచే భాగ్యం మనకు కలిగింది అని ఆడుతున్నారు. రాము డనే సంపూర్ణ చంద్రున్ని చూచి అయోధ్యా పురమనే సముద్రం పొంగి

పోతుంటే స్త్రీలు అనే కెరటాలు కోలాహలం చేసేరు సంతోషంతో. అప్పుడు శ్రీరామ చంద్రుడు వానరులూ మొదలైన మిత్రులను చూచి మధురమైన మాటలతో అంటున్నాడు. అన్నలారా! అదుగో అయోధ్యా పట్టణం చూచేరా! పరమ పవిత్రమైంది. స్వభావసిద్ధంగా చాలా అందమైంది. వైకుంఠ పట్టణం చాలా శ్రేష్ఠమైందని వేదాలూ పురాణాలూ చాలాకాలం నుండి చెపుతుంటాయి. కానినాకది అయోధ్య అంత ప్రియమైందికాదు ఈ సంగతి ఎవరికో కొందరికి మాత్రమే తెలుసును అందరికి తెలియదు. అందు చేత ఈ పురమే సుఖసాధనమని తెలిసికోలేక వైకుంఠపురం కోసం భ్రమి స్తుంటారు, ఇదినాకు జన్మభూమి, ఈపట్టణానికి ఉత్తరంగా పారేసరయూ నదిలో స్నానం చేస్తే జనులు శ్రమ లేకుండా నా సమీపాన్ని నివసించే దివ్యసౌఖ్యం పొందుతారు. ఈ నగరవాసులైన జనులు నాకు ఎంతో ప్రియులు ఈపురం సమస్త సుఖాలకు నిలయం. ఈ పట్టణం ఎంతో నా మనస్సుని ఆనందింప జేసేదౌటచేత ఈ పట్టణవాసులు అంతమందు నాయొక్క పరం ధామం లభిస్తుంది అని అయోధ్యా పురలక్ష్మిని రాముడు వినుతించేసరికి అందరూ సంతోషించి నమస్కరించేరు. శ్రీరామచంద్రుని స్తోత్రం పొందిన అయోధ్యానగరం ఎంత ధన్యతమమైందో? అప్పుడు అయోధ్యా పురవాసు లందరూ సంతోషంతో తనకు ఎదురుగా వస్తుండడం చూచి రాముడు ఆనందంతో పట్టణ సమీపాన్ని దిగుమని విమానానికి ఆజ్ఞ యిచ్చేడు. వెంటనే పుష్పకం భూమిమీదకు దిగింది.

## శ్రీరాముడు పుష్పకాన్ని కుబేరుని యొద్దకు పంపుట

అప్పుడు శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణ సమస్త పరివారసహితంగా విమానం దిగి ఆపుష్పకాన్ని కుబేరుని యొద్దకు వెళ్లమని ఆజ్ఞాపించేసు. ఆ పుష్పకం రాముణ్ని విడిచి వెళ్ళలేక వెళ్ళలేక రాముణ్ని ప్రార్థించి ఆకాశమార్గంగా కుబేరుడున్నదిక్కుకి ఎగిరివేగంగా వెళ్ళిపోయింది అప్పుడు శ్రీరామచంద్రుడు సమస్తవానరరాక్షసమధ్యాన్ని దేవతల నడుమను

శచీ సమేతుడైన దేవేంద్రుడు తన వెంత ఉపేంద్రుడు ఉండగా ప్రకాశిస్తు న్నాడన్నట్టు సీతాదేవితోనూ తమ్ముడైన లక్ష్మణునితోనూ ప్రకాశిస్తున్నాడు.

## భరతుడు సీతారామలక్ష్మణుల సందర్శించుట

అప్పుడు భరతుడు వసిష్ఠ వామ దేవాదిమునులతో మంత్రులతో పరివారంతో తమ్మునితో కృశించిపోయిన శరీరం గలవాడై రాముని సన్నిధానానికి వచ్చేడు. రాముడు వసిష్ఠ వామ దేవాదిమునులనుచూచి చేతిలోని విల్లూబాణాలూ భూమిమీదపెట్టి భక్తితో తమ్ముడూతానూ నమస్కరించేరు. ఆమునులు రామలక్ష్మణులను ఆనందంతో కౌగిలించుకున్నారు. ఆశీర్వదించి క్షేమం అడిగేరు. అప్పుడు రాముడు మీ దయవలన క్షేమంగా ఉన్నాము కరుణానిధులైన మునుల కృపవలననేగదా రాజులకు శుభం కలుగుతుంది, గురుకరుణ వల్లనేగదా మావంటివారికి పరమ శుభం చేకూరడం అనగానే వసిష్ఠుడు సంతోషంతో రామా!నీవంటి వినయం ఇతరు లెవరికి ఉండదు వినయమైనా విజ్ఞానమైనా భక్తైనావైరాగ్య మైనా నిన్నుచూచి ఎవరైనా నేర్చుకోవాలి ఈశ్వరేశా!నీవుగురువువైశిష్యులకు పరమ జ్ఞానం యధార్థంగా ఉపదేశిస్తావు. ఉత్తమ శిష్యుడవై వినేవాడవూనీవే. పరమార్థంచేత గురువూ శిష్యుడూ అనేభేదంఉందా! అనఘా! నీసగుణరూప ప్రవర్తన పరమాద్భుతంగదా. అని వసిష్ఠుడు శ్రీరామచంద్రున్ని వినుతించేడు. బ్రాహ్మణులందరికీ రాముడు నమస్కరించేడు. భరతుడు భక్తిపరవశుడై శ్రీరామచంద్రుని పాదాలు పట్టుకున్నాడు పాదాలపైనున్న భరతున్ని లేపనెత్తాలని రాముడుచూచేడు. కాని భరతుడు తీవ్రభక్తిచేత వివశుడైఉండడంచేత లేవలేదు అప్పుడు రాముడు ఎక్కువ ప్రయత్నంతో ఎత్తిఅతన్ని కౌగిలించుకున్నాడు. ప్రేమతో క్షేమమడిగేడు. శరీరేంద్రియ మనస్సులు ఆనందంలో మునిగి పరవశం పొంది ఉండడంచేత భరతుడు మాటాడలేక పోయేడు. భవానీ! అలాంటిస్థితిని స్వానుభవంచేత తెలిసికోవలసిందే కాని వర్ణించడానికి వశంకాదు. అని పార్వతితో అన్నాడు పరమేశ్వరుడు.

అలా మాటలతో చెప్పలేని సుఖాన్ని అనుభవించి. స్వామీ! సేవకుడ నైన నాకు కృపతో దర్శనమిచ్చేవు సుఖధామా! అందుచేత నాకు అత్యంత క్షేమం కలిగింది. కృపాసాగరా! దీనుడనని యెరిగి వేగంగానాకు నీ విరహ సముద్రంలో మునిగిపోతున్ననాకు చేయూత ఇచ్చిఉద్ధరించేవు. అన్నాడు. రాముడు తనపాదపద్మాలకు అధిక భక్తితో నమస్కరించిన శత్రుఘ్ను న్నిలేవనెత్తి ఆలింగనం చేసుకున్నాడు ప్రేమతో. భరతుడూ లక్ష్మణుడూ ప్రేమతో ఒకరినొకరు కౌగిలించుకొని సంతోషించేరు. శత్రుఘ్నుడూ లక్ష్మణుడూ ప్రేమతో పరి రంభణం చేసికొని ఎడబాటు వల్ల కలిగిన దుఃఖంసివారణై పోవడంచేత అపరిమితానందం పొందేరు. భరత శత్రుఘ్ను లిద్దరూ సీతాదేవి పాదపద్మాలకు భక్తితో నమస్కరించేరు. సంతోషంతో సీతాదేవి ఇద్దరు మరుదులనూ దీవించింది. అప్పుడు పురజనులందరూ రామున్ని చూడాలని మహాన దంతో తొక్కులాటుపడి పోతుంటే అదిచూచి రాముడు ఒక వినోదంచేసేడు పురజనులెందరున్నారో అందరకూ అన్ని రూపాలతో దర్శనమిచ్చేడు. ఎవరెవరిని ఏ ప్రకారంగా గౌరవించాలో ఆ ప్రకారంగా స్త్రీలతోనూ పురుషులతోనూ ప్రేమపూర్వకంగా మాటలాడి అందరి హృదయాలూ ఆనందంతో నిండిపోయే లాగున చేసేడు. ఒకే సమయంలో రాముడు అందరినీ కలిసికొని ఆనందింప జేసేడు. ఆరహస్యం ఎవరికీ తెలియదు. అందరికీ అన్నిరూపాలతో తమఅంత రంగంలోనే రాముడు ఉన్నాడని తెలిసికోవడం మోహవశులకు శక్యమవుతుందా?

## కౌసల్య మొదలైన తల్లులు సీతారామలక్ష్మణుల చూచుట

అప్పుడు ఆ ఆనందమయుడైన రామున్ని చూచి కౌసల్యా మొద లైన తల్లులు లేగలను చూచి పడివడిగా పరుగెత్తి వచ్చేగోవుల లాగున సమీపించగానే శ్రీరామచంద్రుడు మధుర సంభాషణచేత వారందరి మన స్సులను తేర్చి ఆనందింప జేసేను. అప్పుడు సహించరాని వియోగ దుఃఖ మంతా తొలగిపోవడం చేత తల్లులు హర్షంతో ఇద్దరు కుమాళ్ళనూ చూచి

ఎంతో సుఖసముద్రంలో మునిగిపోయేరు. శ్రీరామపాద పద్మరతుడైన తన
కుమారుణ్ని సుమిత్ర సంతోషంతో చూచి అపరిమిత ప్రేమను పొందింది.
రాముణ్ని కైకేయి చూచేటప్పుడు చాలా సంకోచించింది. లక్ష్మణుడు తల్లులు
ముగ్గురినీ సాటిలేని ప్రేమతో చూచివారి ఆశీర్వాదాలు పొందేడు. కైకేయిని
మళ్లా మళ్లా ప్రత్యేకంగా మనసారా చూచేరు రామలక్ష్మణులు. అయిన
ప్పటికీ ఆమె హృదయంలో కలత తీరలేదు. అప్పుడు జానకిదేవి ముగ్గురు
అత్తలకూ భక్తితో వంగి పాదాలకు నమస్కరించింది. ఆ ముగ్గురూ తమకు
నమస్కరించిన కోడలిని లేవనెత్తి చలనంలేని సౌభాగ్యాన్ని పొందుమని
ఆశీర్వదించేరు. శ్రీరామచంద్రుని ముఖం చూస్తూ కళ్లనుండి వచ్చే నీరు
ఆపుకొని బంగారు పళ్లెరాలతో మంగళహారతులు ఇచ్చేరు. నగతనయా!
తల్లులూ మొదలైన స్త్రీలందరూ అనేకవిధాలైన అందమైన శుభకరమైన
వస్తువులిచ్చి అనుభవానికి మూలమైన గోవిందుణ్ని చూచి బ్రహ్మానంద
సముద్రంలో తేలిపోయేరు. కౌసల్య మాటిమాటికీ ప్రకాశమానమైన కౌశేయ
వస్త్రాన్ని ధరించినవాణ్ని పరమేశ్వరుడైన వాణ్ని ప్రపంచమంతటా నిండి
యున్నవాణ్ని తన భక్తులను ఎల్లప్పుడూ పోషించేవాణ్ని సంతోష
పరవశత్వంతో చూచింది. అమె తన మనస్సులో ఈ యిద్దరు ముద్దుకు
మారులూ అతి సుకుమారులుగదా! యుద్ధంలో ఆ రాక్షస భటులందరినీ
రావణాసురుణ్ని ఎలా సంహరించేరో? అని ఆశ్చర్యం పొందుతుంది.
సీతారాములనూ లక్ష్మణుణ్ని చూచి తల్లి మాటిమాటికీ చూచి హృదయం
ఉప్పొంగి శరీరం గగుర్పాటు చెందుచుండగా ఆనందపరవశ అయిపోయింది.
అప్పుడు విభీషణుడూ నలుడూ నీలుడూ సుగ్రీవుడూ అంగ
దుడూ హనుమంతుడూ జాంబవంతుడూ మొదలైన వానరవీరులందరూ
చక్కని మనుష్య శరీరాలు ధరించి మిక్కిలి గొప్పదైన భరతుని నిశ్చల
వ్రతనియమానికీ భక్తికీ సంతోషించి ఎంతో ప్రీతితో వర్ణించేరు. అయోధ్యా
వాసులైన స్త్రీ పురుషులకు రామపాద భక్తి ఎంత అపారంగా ఉందో
ఇంతటి భక్తి ఎవరికుంటుంది? అని ప్రశంసించేరు. అప్పుడు రాముడు

వానరులందరినీ విభీషణాది రాక్షసులనూ జాంబవంతున్నీ అతనిపరివారాన్నీ పిలిచి మిత్రులారా ! ఈయన మా గురువుగారు. అని వసిష్ఠున్ని చూపించి ఈ మహాత్ముని మహిమవల్లనూ కరుణవల్లనూ నేను రాక్షసులను సంహారించగలిగేను. ఈ పూజ్యునిసేవ మీకు ఆనందాన్ని కలుగజేస్తుంది. కాబట్టి ఈయనకు నమస్కారించండి. అని చెప్పి గురువుగారిని చూచి మునిశేఖరా ! వీరు నాకు సాటిలేని మిత్రులు, యుద్ధం అనే సముద్రంలో ఓడలై నన్ను ఒడ్డు చేర్చేరు. నామేలు కోరి ప్రాణాలు సమర్పించేరు. అన్నాడు రాముని మాటలు విని అందరూ సంతోషించేరు. అప్పుడు వారందరూ వసిష్ఠమునీ చంద్రునికి భక్తితో నమస్కారించి అతని వలన దీవెనలు పొందేరు. తరువాత ఎంతో భక్తితో కౌసల్యకు నమస్కారించేరు. వారి నిర్మలమైన భక్తికి సంతోషించి అన్నలారా ! మీరందరును నాకు రామునితో సమానులు. అని ప్రేమతో అందరినీ కౌసల్య దీవించింది. శ్రీ రామచంద్రుడు భవనంలో ప్రవేశించే ఆ శుభసమయాన్న ఆకాశమంతా పుష్పవర్షంతో నిండిపోయింది. మేడలెక్కి పురస్త్రీ లందరూ సజ్జనమిత్రుడైన రాముని చూస్తున్నారు. పురజనులందరూ ద్వారాలన్నింటి యందూ తోరణాలూ జండాలూ అనేక విధాలైన శుభవస్తువులూ బంగారు కలశాలూ అమర్చుకొని సంతోషంతో చూస్తున్నారు. వీథులన్నీ మంచి సువాసనతో కూడిన నీరు జల్లి యేనుగు తలలలో పుట్టిన మంచి ముత్యాలతో ముగ్గులు పెట్టబడి ఎంతో అందంగా కనపడుతున్నాయి. అనేక విధాలైన వాద్యాలు వాయింపబడుతున్నాయి. పట్టణమంతా శుభకరంగా శోభావంతమై కనపడుతుంది. జనులందరూ అపారమైన సంతోషంతో కొత్త కొత్త వస్త్రాభరణాలు ధరించి శ్రీ రామచంద్రుని సేవించడానికి సన్నాహమై సిద్ధంగా ఉన్నారు. అన్ని చోట్లా స్త్రీలందరూ ఆనందంతో మంచి మంచి వస్తువులు రాముని కిచ్చి బంగారు పళ్లేలతో హారతులిచ్చి పాటలు పాడేరు.

## శ్రీరామచంద్రుడు రాజమందిరం ప్రవేశించుట

ఆకాశవీథిని దేవదుందుభులు మ్రోగుతుండగా ఆనందనిలయుడైన శ్రీరామచంద్రుడు ఎన్నో శుభశకునాలను చూస్తూ పురపురుషులూ స్త్రీలూ

అందరూ తనవెంట వస్తుండగా రత్నప్రాకారాలతో కూడిన రాజభవనం ప్రవేశించేడు, ఆవెంటనే కైకేయి సిగ్గుపడి ఉండడంచూచి ఆమెమేడమీదకి ముందుగా వెళ్ళి అనేక విధాలుగా బోధించి ఆమెను సంతోషపరచి తరువాత తన భవనంలోకి వెళ్ళేడు రాముడు భవనంలో ప్రవేశించగానే స్త్రీలూ పురుషులూ అపారమైన సుఖాన్నిపొందేరు.

## శ్రీరామపట్టాభిషేకం

అప్పుడు వసిష్ఠ మహాముని బ్రాహ్మణులందరినీ పిలిచి మహాత్ములారా। ఈవేళ శుభదినం ఇదే శుభగడియా కొబట్టి శుభకరుడైన రామున్ని మహావైభవంతో రాజ్యానికి అభిషేకంచెయ్యవలసిఉన్నది. కాబట్టి మీరందరు అనుజ్ఞ యివ్వండి అన్నాడు. వసిష్ఠుని మాటలు వినగానే ఆపండితులైన బ్రాహ్మణులందరూ పరమ సంతోషంతో ఆయననుచూచి అంటున్నారు ఓమునికులోత్తమా!రామాభిషేకం అన్ని భువనాలకీ శుభకరమే. అందుచేత పట్టాభిషేకం చెయ్యించండి. అన్నారు. వసిష్ఠుడు అప్పుడు సుమంత్రునితో పట్టాభిషేకానికి ఉండవలసిన సమస్త వస్తువులూ సిద్ధం చేయించుమని చెప్పేడు. మునియాజ్ఞ ప్రకారం సుమంత్రుడు రథాలూ గుఱ్ఱాలూ ఏనుగులూ బంట్లూ మొదలైనవారిని అన్నిచోట్లకూ పంపించి కావలసిన మంగళద్రవ్యాలన్నీ సంపాదింపజేసి వచ్చిమునిపాదాలకు నమస్కరించేడు. పట్టణం అంతాఎంతో రమణీయంగా అలంకరింపబడ్డది. దేవతలు పుష్పవర్షం కురిపించేరు. అప్పుడు రాముడు సేవకులను పిలిచి నామిత్రులందరికూ స్నానాలు చేయించండి. అని అజ్ఞాపించేడు. రామాజ్ఞ ప్రకారం వేగంగా సేవకులు సుగ్రీవుడూ మొదలైనవారందరికీ అభ్యంగన స్నానాలు చేయించేరు. అప్పుడు కరుణా సముద్రుడైన శ్రీరామభద్రుడు భరతున్ని ప్రేమతో పిలిచి తన చేతులతో స్వయంగా అతని జడలన్నీ విప్పేడు. తరువాత ముగ్గురు తమ్ముళ్ళకూ సంతోషంతో తలలంటి స్నానాలు చేయింపించేడు. పరమేశ్వరుడైన రాముడు ఎంతమృదువైన స్వభావంగలవాడు, భరతుని భక్తి శ్రీరామచంద్రుని మృదుత్వమూ

కోటిమంది శేషులైనా వర్ణింపలేరు. అప్పుడు శ్రీరామచంద్రుడు గురువుగారి శాసన ప్రకారం తనజడలు విప్పించుకొని తలవెంట్రుకలు సవరించుకొని వేడి నీళ్ళ స్నానం చేసేడు, తరువాత ఆభరణాలన్నీ ధరించేడు. అప్పుడు రాముడు కోటిమన్మధుల సౌందర్యాన్ని మించి ప్రకాశిస్తున్నాడు. అప్పుడు కౌసల్యా మొదలైన అత్తలు ఆదరంతో సీతాదేవికి తలంటి నీళ్ళుపోయించేరు. మంచివస్త్రభూషణాలు ధరింపజేయించేరు. అప్పుడు ఆదిలక్ష్మియైన సీత రాముని ఎడమ ప్రక్కను ప్రకాశిస్తుంటేచూచి జన్మలు ఫలించేయని ముగ్గురు తల్లులూ సంతోషించేరు ఆగందమూలుడూ విశ్వనాథుడూ ఐన శ్రీరామ చంద్రున్ని దర్శించడానికి శివుడూ అజుడూ మునులూ దేవతలూ సంతోషంతో విమానాలెక్కి అక్కడికి వచ్చేరు. సంపూర్ణ చంద్రముఖుడైన శ్రీరామచంద్రున్ని విరాగ అందరిలో మొదటి వాడైన వసిష్ఠ మహాముని సంపూర్ణ రాగంతో చూచేడు. ఎప్పుడైన రాగియే విరాగి కాగలుగుతాడు. అప్పుడు వసిష్ఠ మహాముని ఆజ్ఞా ప్రకారం కోటిసూర్య ప్రకాశ మానమైన దివ్యసువర్ణ సింహాసనం రత్న ప్రభచేతదిక్కులు ప్రకాశించేలాగున అచ్చటికి తేబడింది. శ్రీరామచంద్రుడు అప్పుడు బ్రాహ్మణు లందరికి భక్తితో నమస్కరించి జనులందరూ ఆనందంతో చూస్తుండగా ఆ సింహాసనం మీద కూర్చున్నాడు. సీతామహాదేవి ఎడమతొడపై కూర్చొని ఉండగా రాముడుగోమేధికంతోకలిసి ఇంద్రనీలం సింహాసనంమీద ప్రకాశిస్తూఉన్నట్టు కనపడుతున్నాడు. గరుడవాహనంమీద లక్ష్మీనారాయణులు వేంచేసినారన్నట్టు అప్పుడు సీతారాములు సింహాసనం మీద ప్రకాశిస్తున్నారు. మేరు పర్వతం మీద పరమేశ్వరుడు పార్వతీ సమేతుడై విహరిస్తున్నాడేమో అన్నట్టు సీతా సహితుడై శ్రీ రామచంద్రుడు సింహాసనం మీద శోభిస్తున్నాడు. బంగారు పద్మంమీద సరస్వతితో కూడా బ్రహ్మదేవుడు కూర్చున్నాడేమో అన్నట్టు సింహాసనం మీద భూపుత్రికతో కూడా శ్రీ రామచంద్రుడు దేదీప్యమానంగా కనబడుతున్నాడు. సమస్త భువనాలూ

అదే గృహంలో మాయ అనే యిల్లాలుతో కూడా నివసించే గృహస్థుడేమో అన్నట్టు సీతాసమేతుడై శ్రీరామచంద్ర విభుడు ప్రకాశమానంగా కనపడు తున్నాడు. సీతారాములను మాటలతో వర్ణించడానికి శేషుడికీ బ్రహ్మ దేవుడికీ సరస్వతికీ వేదాలకీ కూడా శక్యంకాదు. కోటి కోటి ప్రకాశమానులై సుందర సింహాసనాసీనులై ఉన్న జానకీ రాములను నా గురువరేణ్యులను స్తోత్రం చెయ్యడానికీ వర్ణించటానికీ ఇతరులెవ్వరికీ తరంకాదు. అప్పుడు జానకీ సమేతుడై భూప్రజలకు కల్పవృక్షం లాంటివాడైన రాజీవాక్షున్ని చూచి మునులందరూ ఎంతో ఆనందించేరు. అప్పుడు బ్రాహ్మణులందరూ ఒక్కసారిగా వేదమంత్రాలు చదువుతుండగా దేవతలందరూ జయ జయ ధ్వనులు చేస్తుండగా పట్టులన్నింటికీ మొదటి పట్టైనవాడూ త్రిపురధ్వంస కుడైన మహాదేవునికి నివాసస్థానమైన వాడూ ఐన శ్రీరామచంద్ర పర బ్రహ్మమూర్తికి వసిష్ఠమహర్షి పట్టం కట్టేడు. అప్పుడు బ్రాహ్మణు లందరూ సంతోషంతో వసిష్ఠమహర్షి ఆజ్ఞప్రకారం సముద్రజలాలతోనూ పుణ్యనదీ జలాతోనూ శ్రీరామచంద్రునికి అభిషేకం చేసి అయోధ్యకు రాజును చేసేరు స్త్రీలందరూ తల్లులూ ఆనందంతో నివాళు లిచ్చేరు. అప్పుడు దేవతలు దుందుభిధ్వనులు చేయుచుండగా రాముని తల్లులు యాచకులందరికీ రత్నాలూ వస్త్రాలూ బంగారం మొదలైనవన్ని ఎవరేమి కోరితే అవి వాళ్లకు దానం చేసి ఇంకెప్పుడూ వారు యాచకులు కాకుండా ఉండేలాగున చేసేరు అన్నిలో కాలకీ ప్రభువైన శ్రీ రామచంద్రుడు సింహాసనం మీద ఉండగా చూచి హర్షంతో దేవతలు పుష్పవర్షం కురిపిం చేరు. ఆనంద పరవశులై పోయే దేవతా స్త్రీలు నాట్యం చేస్తూ పాటలు పాడేరు. కిన్నరులూ గంధర్వులూ సీతాసమేతుడైన శ్రీ రామచంద్రున్ని స్తోత్రాలు చేస్తూ భక్తిగీతాలు పాడేరు. దేవతలూ మునీశ్వరులూ పండితులూ స్త్రీలూ పురజనులూ పరమానంద భరితులై పోయేరు. వందిమాగధులు సంతోషంతో స్తోత్రపాఠాలు చేసేరు. శత్రుఘ్నుడు శ్రీరామచంద్రునికి గొడుగు పట్టేడు. భరతుడూ లక్ష్మణుడూ రెండువైపులా నిలిచి వింజా

మరలు వీచుచున్నారు. సుగ్రీవుడూ అంగదుడూ హనుమంతుడూ విభీషణుడూ జాంబవంతుడూ మొదలైన వారందరూ బాణాలూ ధనుస్సులూ ఖడ్గాలూ మొదలైన యాయుధాలు పట్టుకొని భక్తితో నిలబడ్డారు సీతాసమేతుడైన శ్రీరామచంద్రుడు కోటిమన్మథ సుందరాకారంతో కూర్చున్నాడు అట్టి సమయంలో ఆ పరమపురుషుని దర్శనం చేయగలిగిన జనుల అదృష్టము ఇంతా అంతా అని చెప్పడానికి శక్యంకాదు. అప్పుడు అక్కడున్న సమస్తమైన వారూ అనుభవించిన సుఖమూ ఆనందం వర్ణించడానికి శక్యంకాదు, ఆ అనుభవం యొక్క రుచి త్రిపురవైరికే స్వానుభవం, రామచంద్రున్ని దేవతలందరూ వేరు వేరుగా స్తుతించి తమ తమ తావులకు వెళ్లిపోయేరు.

అప్పుడు వేదాలు వందుల వేషాలు ధరించి రామ సన్నిధికి వచ్చేయి. వారిని రాముడు ప్రేమతో ఆదరించేడు ఆ రహస్యం ఎవరికీ తెలియదు. అప్పుడు వందులు భక్త చంగనుడైన శ్రీ రామచంద్రున్ని స్తుతించేరు. ఆస్తోత్రం విని జ్ఞానులైన మునీశ్వరులందరూ సంతోష పరవశులై శరీరాలు మరచిపోయేరు. జై నిర్గుణా! సగుణాకారా! తులలేని రూపంగలవాడా! రావణాది దుష్ట రాక్షస సంహారకా! గంగానది పుట్టుకకు స్థానమైన పాదం గలవాగా! నరరూపం ధరించి భూభార నివారణచేసి సమస్తజన దుఃఖాలనూ పరిహరింప జేసిన రాజేంద్రా! నీకు శుభమగుగాక! ప్రణతజనపాలా శ్రీలోలా! కృపాలవాలా! సద్గుణజాలా! శోభావిశాలా! నీలమేఘశ్యామా! నిత్యపరిపూర్ణా! శుభాకరా! సజ్జనహృదయాలలో నివసించేవాడా! సౌందర్యనిధీ! దేవా! దేవతలూ రాక్షసులూ పన్నగులూ నరులూ చరాచర జీవులందరూ నీమాయకు వశులై అపారమైనయీ కాలంలో జనన మరణాలనే తరంగాలతో రాత్రింబగళ్లూ విసువూ విరామం లేకుండా భవసాగరంలో తిరుగుతుంటారు. ఎవరిని నీవు కరుణతో చూస్తావో వారు స్వతం మూడు విధాలైన దుఃఖాలనూ శ్రమలేకుండా దాటిపోగలరు. సంసార దుఃఖ హారిణా! నీకు నమస్కరిస్తున్నాం. మమ్మల్ని ఆదరంతో రక్షించు మనుష్యులలో ఎవరైతే జ్ఞానసంకాశాలని మదోన్మత్తులై నీ పాదభక్తి మానేస్తారో

అటువంటివారు దేవతులకు దుర్లభమైన పదవి పొంది కూడా పతితులై పోతుంటారు. పరమపురుషా, ఎవరు ఆశలన్నీ తెగగోసి మనస్సులలో ఎంతో విశ్వాసం గలవారై సమస్తపాపాలూ పోగొట్టుకొని నీ దాసులై నిన్ను సేవిస్తూ ఎల్లప్పుడూ నిర్మలమైన నీ నామ జపమే చేస్తూ విరామం లేకుండా నీ భక్తితో తన్మయులై ఉంటారో వారు అవలీలగా సంసారసముద్రాన్ని దాట గలుగుతారు. అటువంటి మహిమగల నీ దివ్యనామమే మేము రాత్రింబగళ్లూ ఆదరంలో జపిస్తూ ఆనందిస్తుంటాము.

అంబుజాక్షా! అఖండ సుఖధామా! శర్వవినుతనామా! సంపూర్ణ కామా! రామా! ఏపాదపద్మాల్ని శివుడూ బ్రహ్మదేవుడూ పూజిస్తుంటారో ఏ పాదపద్మంయొక్క పవిత్రమైన పరాగం తగిలినంత మాత్రాన్ని అహల్య తరించగలిగిందో ఏపాదం యొక్క గోళ్ళనుండి బయలుదేరి వచ్చిన పరమ పవిత్రమైన గంగానది మూడు లోకాలవారిచేతా స్తోత్రం పొందుతుందో ఏపాదపద్మాలు అడవిలో తిరిగి ముళ్లు గుచ్చుకోవడం చేత బాధపడ్డాయో ఏపాదాలు ధ్వజమూ అంకుశమూ చాపమూ వజ్రమూ పద్మమూ అనే చిహ్నములు కలిగి ప్రకాశిస్తున్నాయో ఆ నీ యొక్క పాద పద్మాలనుఎల్లప్పుడూ సేవిస్తుంటాం విశ్వ ప్రభూ! మోక్ష సుఖప్రదాయకా! అవ్యక్తం మూలమూ వేదశాస్త్రాదులు పైచర్మమూ ఆరు బోదెలూ ఇరవై యైదు కొమ్మలూ అనేకమైన కర్మలనే ఆకులూ పువ్వులూ సుఖదుఃఖాలు రెండూ కటువూ మధురమూ ఐన ఫలాలూ కలిగి ఏకమైన చక్కని లత చుట్టుకొని ఉండగా అనాదియైన సంసార వృక్షం నిత్యం కొత్త చిగుళ్లూ పువ్వులతో ప్రకాశిస్తూ భ్రాంతిని కలిగిస్తుంది. అది నీరూపమే దానికి మేము ఎల్లప్పుడూ భక్తితో నమస్కరిస్తాము. అప్రమేయాకారా! మనస్సునకు అతీతమైంది ఏకమైంది రెండుగా విభజింప దగనిదీ అనుభవంచేత పొందదగిందీ నాశంలేనిదీ పుట్టుక లేనిదీ బ్రహ్మమైందీ పరిపూర్ణమైందీ చలనం లేందీ వికారాలులేందీ గుణాలు లేందీ ఐన నీ స్వరూపాన్ని ఎవరు ధ్యానించి వర్ణిస్తారో ఆనేర్పరులే పూర్తిగా తెలిసినవారు ఓద్దైత్యాంతకా! మేము ఎల్లప్పుడూ నీ సగుణ రూపాన్ని అపరిమిత కీర్తిని వర్ణించి పాడుతుం

టుంటాం సీతా నాథా! కృపాసముద్రా! సద్గుణనిలయా! శ్రీరామచంద్రా! ఒక్కవరం వేడుకుంటున్నాం. మా హృదయాలు పరిశుద్ధంగా ఎల్లప్పుడూ ఉండి నీపాదపద్మ భక్తిచేస్తుండేలాగున ప్రసాదించు. అని ఈవిధంగా వేదాలు స్తోత్రాలు చేస్తూ అందరూ ఆనందభరితులై చూస్తుండగా అంతర్థానమై బ్రహ్మ పట్టణానికి వెళ్ళిపోయినాయి. ఆతరువాత శంకరుడు వచ్చి గద్గద కంఠంతో శరీరం గగుర్పాటు చెందగావినయంతోజయరామా!రమారమణా! జయసంసారనివారణా! నిజభక్త జనభయ హరణా! సాకేతపుర పతీ! జై దేవతాపతీ! నేను శరణా గతుడను. నన్నురక్షించు. దశముఖ నాశకారణా! భూభార నివారణా! మహాపాపహరణా! సుందరరూపా నీబాణాగ్నికి రాక్షసులందరినీ శలభాలలాగునచేసినవాడా! వరప్రదాతా! నీవు తప్ప ఇతరం లేనివాడా! భూమండలానికి అలంకార మైనవాడా సువర్ణ వస్త్రధారీ! ధనుర్బాణధారీ! మమతా అహంకారం మదంమోహం అనేరాత్రి యొక్క చీకటిని ధ్వంసంచేసే ప్రకాశవంతమైన గొప్పకిరణాలు గల సూర్యుడా! కమలాధీశా! భవపాశనాశా! మనుష్యులనే మృగాలు దుర్విషయాలనే అడవులలో తిరుగుతుంటే వారిహృదయాలలోనే ఉండి మన్మథుడనే కిరాతుడు మలంవంటి భోగాలనే బాణాలు కాడేలాగున కొట్టి చంపుతుంటాడు. పద్మనాభా! అటువంటి మన్మథున్ని సంహరించి ఆదిక్కులేని పామరజనులను రక్షించు. అనేక రోగాలూ వియోగాలూ భరించలేని భయంకర దుఃఖాలూ అనుభవిస్తూ చస్తుంటారు జనులు. నీ పాదభక్తి లేకపోవడమే వారు అటువంటి దుఃఖాలు అనుభవించడానికి కారణం. అతినిర్మలమైన నీపాదభక్తిలేకపోతే జనులు సంసారదుఃఖ సముద్రంలో ఎందుకుపడిపోరు? నీకథలను ఎల్లప్పుడూ వింటు కాలంగడిపేవారికి సుజ్జనులను సేవించడం భగవంతున్ని సేవించడం ఇష్టమవుతుంది నిత్యమూవారు ఆనంద పరవశులై నీ కీర్తినివింటూ సంసారదుఃఖాన్ని మరచిపోతారు. కాబట్టి నీభక్తియందు ఆసక్తి లేని వారు నిత్యమూ మలినులే. దీనులూ నీచబుద్ధులూ దుఃఖ స్వభావం ప్రవర్తనా కలవారు అయిఉంటారు లోకంలో అటువంటివారు.

ఎప్పుడూ వారు సంసారదుఃఖ సముద్రాన్ని దాటలేరు స్వామీ నీభక్తులూ మునులూ రాగంమోహంలోభం లేనివారై మదం మచ్చరం రోషంలేని వారై సుఖాలనీ ఆపదలనీ సమానంగా చూస్తూ శాంతసత్యసంతోషులై ఉంటారు. యోగంమొదలైన నిష్ఠలు మానేసి ఎల్లప్పుడూ రాగద్వేషాదులను విడిచిపెట్టి నీగుణ వర్ణన చేస్తూ భక్తితన్మయులై ఆనందిస్తుంటారు. నియమంతో నీయందే భక్తిగలవారై ఎల్లప్పుడూ నీ సేవచేస్తూనిందాస్తుతులు సమానంగా తలంచుతూ పండితులు సంచరిస్తుంటారు మునిజనుల హృదయ పద్మాలలో విహరించే తుమ్మెద వంటివాడా! సూర్యవంశ పద్మ భాస్కరా! రాక్షసవంశవనకుఠారా! భక్తవరదా! నిన్నే ఎల్లప్పుడూ భజిస్తాను. సంతోషంతో నీనామమే జపిస్తాను. నీకే నిత్యమూ నమస్కరిస్తాను. దృఢమైన నీ పాదభక్తి సజ్జనసంగమూ నాకియ్యి. అని శ్రీరామ చంద్రుని సద్గుణ సమూహాన్ని వర్ణన చేసిచేసి సంతోష పరవశుడై శంకరుడు కైలాసానికి వెళ్ళిపోయేడు. అప్పుడు రామచంద్రుడు సుగ్రీవుడూ మొదలైన వానరులకూ సపరివారుడైన విభీషణునికీ వేరు వేరుగా సుఖకరమైన విడిదెలు ఇప్పించేడు. వైనతేయా! పావనమైన యీకథ సంసారసాగరాన్ని దాటడానికి నావవంటిది. మూడు విధాలైన తాపాలనూ పోగొడుతుంది. రామరాజ్యాభిషేక మహోత్సవ కథ విన్న వారికి విజ్ఞానం కలుగుతుంది. రామపాదభక్తి కలుగుతుంది. ఈ చరిత్ర ఎల్లప్పుడూ ఎవరు కోరి చవిదీరా విన్నావారికి దేవతల కందరాని దివ్య సుఖం భూమిమీదనే కలిగి అంతాన్ని వారు గొప్పదైన రామనిలయాన్ని పొందుతారు. ముక్తులూ విరక్తులూ విషయాసక్తులూ కూడా భక్తితో ఈ శ్రీరామ చరిత్ర విన్నారంటే వారికి నిర్మలమైన భక్తి సద్గతీ రాముడు సంతోషంతో ఇస్తాడు సీతా నాథుని చరిత్ర నాబుద్ధికి తోచినంత చెప్పేను. ఇది దురితాలను పోగొడుతుంది. చింతలనూ దుఃఖాలనూ నశింప జేస్తుంది. అని కాగభుశుండి మునివరుడు గరుత్మంతునికి చెప్పేడు. అప్పుడు అయోధ్యా పట్టణం నిత్య నూతన మంగళప్రదంగా ఉంది.

రాముడు రాజ్య పరిపాలనం చెయ్యడం వల్ల ఆ పట్టణంలోనున్న అన్ని జాతుల ప్రజలూ అపరిమితహర్షాన్ని పొందేరు. ఏవిభుని పాద పద్మాలు ఎల్లప్పుడూ మునులూ బ్రహ్మదేవుడూ శివుడూ నమస్కరించి ధ్యానిస్తుంటారో లక్ష్మీదేవి నిరంతరం సేవిస్తుంటుందో ఆరాజీవాక్షుని పాదభక్తి పురవాసు లందరకూ నిత్యానిండి పోయింది. యాచకులందరూ నానావిధాలైన వస్త్రాభరణాది వాంఛితార్థాలను పొందేరు. బ్రహ్మణు లందరూ వివిధ దానాలను పరిగ్రహించి సంతోషించేరు. వానరులూ భల్లూకులూ సపరివారంగా విభీషణుడూ రామపాద భక్తిపరవశులై బ్రహ్మా నందంలో మునిగి పోయి సమస్తం మరచి పోయేరు. అలా ఆరు మాసాలు గడిచి పోయింది. వారందరూ తమతమ యిళ్ళు కూడా కలలోనైనా తలచనంతమరపు పొంది పోయేరు. సజ్జనుడు ఎప్పుడూ పరద్రోహం తలంచ నట్టు అప్పుడు రాముడు స్నేహితుల నందరినీ పిలిపించేడు. వారందరూ వచ్చి రాముని పాదపద్మాలకు నమస్కరించి నిలబడ్డారు. వారిని రాముడు ప్రేమతో దగ్గరకూర్చుండ బెట్టుకొని సంతోషంతో మిత్రులారా! మీరు నాసేవ గొప్పగా చేసేరు మీ ఎదుట చెపితే ముఖస్తుతిలా ఉంటుంది. నాయందు భక్తిచేత మీరు ఇళ్లు కూడా మరచిపోయి ఉన్నారు. మీవంటి పియులు నాకులేరు. లక్ష్మణ భరత శత్రుఘ్నుల కన్నా సీత కన్నా బంధు మిత్రుల కన్నా రాజ్యం కన్నా తను ధన మందిరాల కన్నా మీరే నాకు ఎక్కువ ప్రియులు అసత్యం కాదు. అందరికీ సేవకుల

రాముడు సుగ్రీవ విభీషణాదులకు సెలవిచ్చి పంపుట

మీదప్రేమ ఉండడం ధర్మమే కాని అందరికన్నా నాకు సేవకుల మీద ప్రేమ ఎక్కువ. అందుచేత మిమ్మలను విడిచి పెట్టలేక యిన్నా ళ్లుంచేను. ఇంకా ఇలా ఉంటే మీ యిళ్ళ దగ్గర వారందరూ మీకోసం చూస్తుంటారు. ఇక మీరు వెళ్ళి సంతోషంతో మీమీపనులు చూచుకుంటూ నియమంతో తనన్నుభజించండి నేను అంటా నిండి ఉన్నానని తెలిసికొని

భక్తితో సేవించండి. అని రాముడు చెప్పగానే విని వారందరూ భక్తి పరవశులై పోయి శరీరాలుకూడా మరచి పోయి రామచంద్రుని యెదుట చేతులు జోడించి నిలబడ్డారు. కాని ఒక మాటైనా అనలేక పోతున్నారు. అప్పుడు కరుణా సముద్రుడైన రాముడు వారందరి యొక్క అధికమైన ప్రేమను చూచి అనేక విధాలుగా వారికి జ్ఞానబోధ చేసేడు. అందరూ ప్రభుసముఖాన్ని ఏమీ అనలేక అతని పాదలవైపు చూస్తూఉన్నారు. అప్పుడు రాముడు మంచిమంచి వస్త్రాలూ భూషణాలూ తెప్పించేడు. భరతుడు ముందుగా సుగ్రీవునికి స్వయంగా వస్త్రాభరణాలను ధరింప జేసేడు. అతడు మిక్కిలి వినయభావంతో వాటిని ధరించేడు. తరువాత రామాజ్ఞ ప్రకారం లక్ష్మణుడు విభీషణునికి ఆదరంతో విలువైన వస్త్రాలూ ఆభరణాలూ రమ్యమైనవి ధరింపజేసేడు. అంగదుడు తాను కూర్చున్న చోటినుండి కదలక మెదలక చూస్తున్నాడు. రాముడు అతని మనస్థితి తెలిసిన వాడౌటచేత అతన్ని పిలవలేదు. జాంబవంతుడూ నలుడూ నీలుడూ మొదలైన మిత్రుల నందరినీ పిలిపించి రాముడు వారందరికీ విలువైన చక్కని వస్త్రాభరణాలు ఇప్పించి ధరింపజేసేడు. వారందరూ రామున్ని మనస్సులలో ధ్యానించుకొంటూ వినయంతో పాదపద్మాలకు మ్రొక్కి వెళ్ళి పోయేరు అప్పుడు అంగదుడు లేచికంటినుండి బాష్పాలు రాలుతుండగా చేతులు జోడించి నిలబడి వినయంతో అంటున్నాడు. ఆర్తబాంధవా! దీన దయా నిధీ! సర్వలోకేశా! సర్వజ్ఞా! సౌఖ్యధామా! రామా! వాలి మరణించే టప్పుడు నన్ను నీకప్పగించలేదా? నన్ను విడిచిపెట్టకు. అనాధ శరణ్యా! దీనబాంధవుడ వన్న నీబిరుదువిని నీపాదపద్మాలు పట్టుకున్నాను. భక్తవందా! నీవే తల్లివీ తండ్రివీ గురువువీ ప్రభువువీ దేవుడివీ కాబట్టి నిన్నువిడిచి నేను ఎక్కడకు వెళ్ళగలను? కరుణా సముద్రా! నీపాదపద్మాలను విడిచి పెట్టి నేను ఇంటికి వెళ్ళి చేసేపని ఏముంది? దేవా! జ్ఞానం బుద్ధిబలం లేని బాలుడను. నన్ను దయతో చూచి ఇక్కడనే ఉంచు. నీగుమ్మంలో ఉండి చిన్న చిన్న పనులు చేస్తూ నీపాదారవిందాలు నిత్యం దర్శిస్తూ సేవిస్తూ

నేను తరిస్తాను. అని రాముని పాదాలమీద పడిపోయేడు అంగదుడు. రాముడు అతన్ని లేవదీసి ఆనందంతో కౌగిలించుకున్నాడు. తనమెడలో నున్న రత్నహారంతీసి అతని మెడలో వేసి మంచి వస్త్రాభరణాలు ధరింప జేసేడు. తరువాత అతనికి మంచి ఉపదేశంచేసి వెళ్ళమని సెలవిచ్చి భక్తులైన మిత్రుల నందరినీ పంపించి రాముడు తమ్ముళ్ళతో కూడా సాగనంపడానికి వెంటను వెళ్ళేడు అంగదుని భక్తి ఇంతాఅంతాకాదు. మాటిమాటికి శ్రీరామ చంద్రుని వైపు చూచి సాష్టాంగ నమస్కారాలు చేస్తున్నాడు, నన్ను ప్రభువు ఉండుమంటాడేమో ? అని మనస్సులో అనుకొని అతని ఆదరం చూపూ మధుర వాక్యాలూ అనురాగం నవ్వూ తలంచుకొని ఆనందిస్తున్నాడు. చివరకు ప్రభువుయొక్క ఆజ్ఞ ప్రకారం అంగదుడు రామపాద పద్మాలు మనస్సులో నిలుపుకొని వెళ్ళిపోయేడు. అప్పుడు రాముడు అందరినీ ఆదరంతో పంపించేడు. అందరినీ చాలా దూరం వరకూ భరత లక్ష్మణ శత్రుఘ్నులు పంపించి తరిగి వచ్చేరు.

## హనుమంతుడు తిరిగి రామదర్శనానికి వచ్చుట

అప్పుడు హనుమంతుడు సుగ్రీవుని పాదాలు పట్టుకొని వినయంతో దేవా! నాకు సెలవిస్తే శ్రీరామ చంద్రుని పదిరోజులు సేవించి తిరిగి నీ దర్శనానికి వస్తాను. అన్నాడు. అనగానే సుగ్రీవుడు వాయుపుత్రా! నీవు పుణ్య శీలుడవు. వెళ్ళి రామచంద్రున్ని సేవించరా. అని చెప్పి వానరులందరితో సుగ్రీవుడు వెళ్ళి పోయేడు. అంతలో అంగదుడు హనుమంతున్ని చూచి మారుతీ! నీకు నమస్కరిస్తాను. శ్రీరామచంద్రునికి ఎల్లప్పుడు నమస్కరిస్తున్నానని నాకుమారుగా నీవు భూమి మీదపడి నమస్కరించు నన్ను ఎప్పుడూ మరువవద్దని వేడుకున్నానని చెప్పు. అనిచెప్పి సుగ్రీవాదులతో వెళ్ళిపోయేడు. హనుమంతుడు భక్తితో ఉప్పొంగి పోతూ రాముని సన్నిధికి వెళ్ళి నమస్కరించి అంగదుని భక్తిగురించి విన్నవించేడు. రాముడు విని ప్రేమమగ్నుడయేడు. వైనతేయా! శ్రీరాముని మనస్సు కరిగిన్త్వాకిని

వ్రజంలాంటిది. మృదుత్వానికి పువ్వువంటిది. దానిని తెలుసుకోవడం ఎంత నేర్పుగల వానికైనా కష్టమే.

## శ్రీరామచంద్రుడు గుహునికి సెలవిచ్చి పంపుట

అప్పుడు కృపాసముద్రుడైన రాముడు గుహున్ని ఆదరంతో పిలిచి వస్త్రాలూ భూషణాలూ ఇచ్చిబహుమానంచేసి అన్నా! ఇకనీవు వెళ్లి ఇంట్లో ఏచింతాలేకుండా నన్ను భజిస్తూ త్రికరణ శుద్ధిగా ధర్మ మందా సక్తిగల వాడవై ఉండు. సోదరా! స్నేహితుడవు. భరతునితో సమానుడవు. కాబట్టి ఏ అనుమానం లేకుండా నీకు రావాలని ఉన్నప్పుడల్లా వస్తూ పోతూఉండు, అన్నాడు గుహుడు సంతోషించి రాముని పాదపద్మాలకు సమస్కరించి కన్నుల నుండి బాష్పాలు కారుతుండగా అపరిమిత భక్తిపరవశుడైపోయి నాడు. గిరిజా! అప్పుడు అతనిస్థితి వర్ణించడానికి శక్యంకాదు. రాముని ఆనజ్ఞపొంది వెళ్లిపోయేడు, రాముని పాదపద్మాలను తన హృదయంలో నిలుపుకొని తనఇంటికి వెళ్లి ఆ పరమేశ్వరుని సద్గుణాలను అనేక విధాలుగా వర్ణించేడు. తనపరివార జనులందరికీ రామునిగుణాలు వర్ణించి చెప్పేడు. వాళ్లందరూ విని సంతోషించి ఆ పాప నివారకుడూ సుఖనిలయుడూ అఘటన ఘటనా చతురుడూ ఐన రఘురామచంద్రునకు జై. అని ధన్యవాదాలు చేసేరు ఎల్లప్పుడూ రామగుణ కీర్తనలు చేస్తూ రాత్రింబగళ్లు సంతోషంతో గడుపు తున్నారు. రాముడు రాజ్య సింహాసనం మీదకూర్చొనే సరికి మూడులోకాలూ ఆనందించేయి, శోకమంతా నశించిపోయింది. అందరూ విరోధాలు మానేసేరు. విశ్వ భర్త యైన రామప్రభువు యొక్క ప్రతాపం వల్ల జనులందరూ వర్ణాశ్రమధర్మ నిరతులై వేద మార్గంలో నడుస్తున్నారు. ఎల్లప్పుడూ కొత్త సుఖాలను అనుభవిస్తున్నారు. శోకం భయం రోగం మచ్చుకైనాలేవు, రామరాజ్యంలో ఆధ్యాత్మిక అధిదైవిక అధిభౌతిక తాపాలు జనులను బాధించలేదు. ఈశ్వరుడైన రఘురామచంద్ర విభుడు రాజ్యభారం వహించడం వల్ల జనులందరూ అన్యోన్యమైత్రితో స్వధర్మాల

తప్పకుండా జగత్పూజ్యమైన వేదమార్గ ప్రవర్తన చేస్తూ అన్యాయం ఎటువంటిదో తెలియకుండా ఉన్నారు ధర్మం నాలుగు పాదాలతో నడుస్తుంది. పాపం కలలోనైనా, కనపడదు స్త్రీలూ పురుషులూ కూడా రామభక్తిపరులే, అందరూ పరమపదానికి అర్హత కలవారే, బాధలూలేవు అపమృత్యుభయమూలేదు. రోగాలూలేవు, అందరూ ఆరోగ్యవంతులైన ప్రకాశంగల శరీరాలు కలవారే. దీనులూ దరిద్రులూ దుఃఖం గలవారూ బుద్ధిలేనివారూ పండితులు కానివారూ రూపంలేనివారూ మంచిలక్షణాలు లేనివారూ వెతికినాలేరు. శ్రీరామచంద్రుని రాజ్యంలో జనులందరూ దంభం లేనివారే నిర్మలమైన ధర్మమందు ఆసక్తి కలవారే. స్త్రీలూపురుషులూ చతురబుద్ధులే. మంచిగుణాలు కలవారే సద్గుణాలను ఎరిగినవారే పండితులైనవారే జ్ఞానులే. కృతజ్ఞులే ఎవ్వరూ కపటచాతుర్యం ఎరుగరు. చరాచర ప్రాణులన్నీ కాలంవల్లా కర్మవల్లా సంఘస్వభావాలవల్లా కలిగే దుఃఖాలు ఎప్పుడూ పొందలేదు. రోమరోమాలలోనూ బ్రహ్మాండాలన్నీ కలిగి ప్రకాశిస్తున్న నీలమేఘశ్యామునికి ఈ ఏడు సముద్రాలతో చుట్టబడియున్న భూభారం భరించడం ఒక ఘనకార్యంకాదు. శ్రీరాముని మహిమ తెలిసిన వారికి అతన్ని వర్ణించడం హీనంగానే కనిపిస్తుంది. రాముని మహిమ తెలిసినవారే ఈచరిత్ర భక్తితో స్మరిస్తుంటారు. ఇంద్రియ నిగ్రహంగలిగి ప్రవర్తించే మునీశ్వరులు ఈ మహిమను తెలిసికోవడానికి ఫలం పవిత్రమైన లీలా ప్రవర్తనను అనుభవం పొందడమే, అదేమహాభాగ్యం అని నిర్ణయించేరు. శ్రీరామ చంద్రుడు ప్రభువై రాజ్య పరిపాలన చేస్తూండగా ప్రజలు అనుభవించే సుఖాలూ ఐశ్వర్యాలూ వర్ణించడానికి శేషునికీ సరస్వతి దేవికీ శక్యం కాదు. ప్రజలందరూ పరోపకారులే, ఉదార స్వభావంగలవారే స్త్రీలూ పురుషులూ బ్రాహ్మణపాద భక్తులే, స్త్రీలు త్రికరణ శుద్ధిగా నిజపతివ్రతలే. పురుషులు ఏకపత్నీవ్రతులే, రామరాజ్యంలో దండం యతీశ్వరుల చేతులలోనే ఉంది, భేదం అనేది నర్తకీనర్తకుల నాట్యపద్ధతులలోనేఉంది, జయం మనోనిగ్రహంలోనే ఉంది,

లోభగుణం రామపాదపద్మ భక్తియందే ఇమిడి పోయింది. తోటలలోని చెట్లన్నీ మంచిమంచి పువ్వులతోను పండ్లతోనూ ప్రకాశిస్తున్నాయి. సింహాలూ ఏనుగులూ కలిసి మెలసి తిరుగుతున్నాయి. పక్షులూ మృగాలూ అన్యోన్య విరోధాలు విడిచిపెట్టి హాయిగా సంచరిస్తున్నాయి. పక్షులు చక్కని కంఠాలతో కూస్తున్నాయి. మృగాలు నిర్భయంతో సంతోషంతో తిరుగుతున్నాయి. చల్లని పిల్ల వాయువు మెల్లగానూ మంచివాసనతోనూ విసురుతుంది. చక్కని పువ్వులలోని తేనెతాగి తుమ్మెదలు మదించి రొదలు చేస్తున్నాయి. ఉద్యాన వనాల్లో వృక్షాలూ లతలూ కోరేసరికి ఫలాలిస్తున్నాయి. ఆవులు కోరేసరికి పాలిస్తున్నాయి. భూమి సస్యసమృద్ధితో శోభిస్తుంది ఎల్లప్పుడూను. త్రేతాయుగమైనప్పటికీ సీతాపతి పరిపాలించడం చేత కృతయుగ ధర్మాలన్నీ నడుస్తున్నాయి. పార్వతీ! జగదాత్ముడైన రాముడు రాజ్యం చేస్తున్నాడని పర్వతాలలో ఎక్కువగా రత్నాల గనులు బయలు దేరేయి. నదులూ సరస్సులూ నిర్మలమైన నీటితో నిండిఉన్నాయి. సముద్రం మేరమీరకుండా రత్నాలు తీరానికి చేరుస్తుంటే జనులందరూ అవి ఏరు కుంటున్నారు. సరోవరాలు నిండా తామరపువ్వులు వికసించి ఎంతో అందంగా ఉన్నాయి పదిదిక్కులు తేజస్సుతో ప్రకాశిస్తున్నాయి. చంద్రుడు తనకిరణములచేత భూమండలంనిండింపజేస్తున్నాడు. సూర్యుడు భూమికి ఎంతవేడిమి అవసరమో అంతేయిస్తున్నాడు. మేఘాలు కోరేసరికి వర్షిస్తున్నాయి. ఉమా! శ్రీరామచంద్రుడు అశ్వమేధయజ్ఞాలు చేసికోట్లకొలదీ బ్రాహ్మణులకు అనేకధానాలుచేసేడు వేద మార్గం తప్పకుండా ధర్మ పరిపాలన చేసేడు. మిక్కిలి చాతుర్యం కలవాడూ గుణాతీతుడూ దేవేంద్ర సమానమైనభోగాలు అనుభవించేవాడూ పూర్ణకాముడూ ఐన శ్రీరామచంద్రునితో సమానమైన రాజు మరొకడులేడు. శోభాఖనియై సుశీలయై ప్రకాశించే సీతాదేవిఎల్లప్పుడూ వినయంతో శ్రీరామచంద్రుని పాదపద్మసేవ చేస్తుంది అనుకూలవతీ బుద్ధిశాలినీ వినయవతీవివేకవతి చాతుర్యవతీఅయిన లోకమాత సీతాదాసదాసీ జనులెందరున్నా తాను స్వయంగా ఇంటి పనులు

వజ్రంలాంటిది. మృదుత్వానికి పువ్వువంటిది. దానిని తెలుసుకోవడం ఎంత నేర్పుగల వానికైనా కష్టమే.

## శ్రీరామచంద్రుడు గుహునికి సెలవిచ్చి పంపుట

అప్పుడు కృపాసముద్రుడైన రాముడు గుహున్ని ఆదరంతో పిలిచి వస్త్రాలూ భూషణాలూ ఇచ్చిబహుమానంచేసి అన్నా! ఇకనీవు వెళ్లి ఇంట్లో ఏచింతాలేకుండా నన్ను భజిస్తూ త్రికరణ శుద్ధిగా ధర్మమందు సక్తిగల వాడవై ఉండు. సోదరా! స్నేహితుడవు. భరతునితో సమానుడవు. కాబట్టి ఏ అనుమానం లేకుండా నీకు రావాలని ఉన్నప్పుడల్లా వస్తూ పోతూఉండు, అన్నాడు గుహుడు సంతోషించి రాముని పాదపద్మాలకు నమస్కరించి కన్నుల నుండి బాష్పాలు కారుతుండగా అపరిమిత భక్తిపరవశుడైపోయి నాడు. గిరిజా! అప్పుడు అతనిస్థితి వర్ణించడానికి శక్యంకాదు. రాముని అనుజ్ఞపొంది వెళ్లిపోయేడు. రాముని పాదపద్మాలను తన హృదయంలో నిలుపుకొని తనఇంటికి వెళ్లి ఆ పరమేశ్వరుని సద్గుణాలను అనేక విధాలుగా వర్ణించేడు. తనపరివార జనులందరికీ రామునిగుణాలు వర్ణించి చెప్పేడు. వాళ్లందరూ విని సంతోషించి ఆ పాప నివారకుడూ సుఖనిలయుడూ అఘటన ఘటనా చతురుడూ ఐన రఘురామచంద్రునకు జై.అని ధన్యవాదాలు చేసేరు ఎల్లప్పుడూ రామగుణ కీర్తనలు చేస్తూ రాత్రింబగళ్లు సంతోషంతో గడుపుతున్నారు. రాముడు రాజ్య సింహాసనం మీదకూర్చొనే సరికి మూడులోకాలూ ఆనందించేయి, శోకమంతా నశించిపోయింది. అందరూ విరోధాలు మానేసేరు. విశ్వ భర్తయైన రామప్రభువు యొక్క ప్రతాపం వల్ల జనులందరూ వర్ణాశ్రమధర్మ నిరతులై వేద మార్గంలో నడుస్తున్నారు. ఎల్లప్పుడూ కొత్త సుఖాలను అనుభవిస్తున్నారు. శోకం భయం రోగం మచ్చుకైనాలేవు. రామరాజ్యంలో ఆధ్యాత్మిక అధిదైవిక అధిభౌతిక తాపాలు జనులను బాధించలేదు. ఈశ్వరుడైన రఘురామచంద్ర విభుడు రాజ్యభారం వహించడం వల్ల జనులందరూ అన్యోన్యమైత్రితో స్వధర్మాల

భోజనం చెయ్యడం ఎరుగని సమస్తలోకైక భోక్తా కర్తా అయిన శ్రీరామ చంద్రుడు నిత్యమూ తల్లులు సంతోషించి చూస్తుండగా తమ్ములతో కలసి భోజనం చేస్తుంటాడు. ఇలా ఆనందంతో ఉంటూ ఉండగా ఒకనాడు భరత శత్రుఘ్ను లిద్దరూ హనుమంతునితో కలసి సంతోషంతో ఉద్యానవనం లోకి వెళ్లి అందమైన ఒక చంద్ర కాంతమణి వేదికమీదకూర్చుని రాముని గుణగాధలన్నీ హనుమంతున్ని అగిగితెలిసికొని ఆసక్తితోమళ్లామళ్లా అడిగి చెప్పించుకొని ఆనందించేరు. అయోధ్యలో ప్రతియింట్లోనూ పురాణాలు చదువుతుంటారు. పార్వతీ! రాత్రింబగళ్లూ పావనమైన రామభద్రుని చరిత్ర పాడుకుంటూ స్త్రీలూ పురుషులూ భక్తిపరవశులైపోయి ఎంతకాలం గడిచిపోయిందో ఎరగనైనా ఎరగరు. ఆదివిష్ణువైన శ్రీరామచంద్రుని పరిపాలనలో ఉన్న పురజనులుపొందే సుఖసంపదలూ సంఘాల చక్కదనాలూ కోటిమంది శేషులైనా వర్ణించలేరు. నారదుడూ సనక సనందనాదులూ రామదర్శనానికి నిత్యం అయోధ్యకువెళ్ళి ఆ పురవైభవం చూచివైరాగ్యం మంచిపోతుంటారు. బంగారంతోనూ రత్నాలతోనూ చక్కని మేడల యందు చిత్రవర్ణములతో తయారుచేయబడ్డ ఎన్నో స్థలాలు ఉన్నాయి. కోటగోడలు ఆపట్టణానికి నాలుగువైపులా శోభిస్తున్నాయి. రంగుల రంగుల గోపురాలూ రత్నాలు తాపిన మేడలూ క్రిందను రంగులతో కూడిన మణులు స్థాపించిన గదులూ తయారై ఉన్నాయి. వజ్రాలలో నిర్మింప బడ్డ ఆమేడలు ఆకాశాన్ని అంటుతున్నాయి. అందమైన ఆమేడల చివర సూర్యచంద్రుల కాంతికూడా తక్కువ అనిపించేలాంటి బంగారు కుండలు ఉన్నాయి. ప్రకాశవంతమైన అనేక మణులతోచేయబడ్డ కిటికీలు చూచేవారికి ఆశ్చర్యం కలిగిస్తున్నాయి. ప్రతియింట్లోనూ మణిదీపాలు మహాతేజస్సుతో వెలుగుతున్నాయి. పగడాలతో చేయబడిన ద్వారాలు ఎంతో రమ్యంగా ఉన్నాయి. బంగారంతోనూ మరకత రత్నాలతోనూ నిర్మింపబడ్డ స్తంభాల మీద బొమ్మలు అతి విచిత్రంగా కనబడుతున్నాయి. స్ఫటిక పురాళ్ళతో తయారు చేయబడ్డ గోడలూ గడపలూ బంగారంతో చేయబడిన వజ్రఖచిత

ములైన తలుపులూ ప్రతిద్వారాలయందూ రమణీయంగా కనపడుతున్నాయి. ప్రతియింటి చిత్రశాలలలోనూ రామచరిత్ర వ్రాయబడిఉంది. ఆరామచరిత్ర చూడగానే మునీశ్వరుల మనస్సులను కూడా హరించేస్తుంది, అంతటా పూలతోటలు నాటేరు పూలతీగలు అన్నింటికి చక్కని పందిళ్ళు వేసేరు అలతలన్నీ బాగా చిగురించి పూచి ఎల్లప్పుడూ వసంత ఋతువులాగున మనోహరంగా కనపడున్నాయి, తుమ్మెదలు మనోహరంగా ఝుంకారాలు చేస్తున్నాయి. చల్లని మెల్లని సుగంధవాయువు విసరుతుంది. పక్షులు చక్కగాకూస్తున్నాయి. పావురాలూ హంసలూ నెమళ్ళు సారసపక్షులూ ఉద్యానవనాల్లో కూస్తూ నృత్యంచేస్తున్నాయి. చిలుకలూ గోరువంకలూ సర్వజ్ఞా! వరదా! రామచంద్రా! అనిమనస్సులు వికలించేలాగున పలుకు తున్నాయి, చిన్నపిల్లలువాటికి అలానేర్పు తున్నారు. రాజమందిర ద్వారాలు రమణీయంగా ఉన్నాయి. నాలుగు దారులు కలిసిన వీధులూ బజారు వీధులూ చాలామనోహరంగా ఉన్నాయి. చక్కని అంగళ్ళు అమూల్యమైన వస్తువులతో నిండి ఉన్నాయి.

రామచంద్రుడు పరిపాలిస్తున్న ఆ పట్టణ మహాత్వం చెప్పనలవి కాదు. కుబేరునితో సమానులైన కోమట్లు ఆ పట్టణంలోని వారందరూను. ఆ పురవాసులైన స్త్రీలూ పురుషులూ బాలురూ వృద్ధులూ అతిసుఖవంతులూ మంచి ప్రవర్తన కలవారూ శీల నిధులూ సౌందర్యవంతులూ అయిఉన్నారు. గిరికుమారీ! ఆ పట్టణానికి ఉత్తర దిక్కున నిర్మలమైన లోతైన జల ప్రవాహం కలదై సరయూ నది ప్రవహిస్తుంది. మనోహరంగా బురద లేకుండా ఆ నదికి ఘట్టం కట్టబడింది. దూరంగా మరొకచోట చక్కగా విశాలమైన ఘట్టం ఉంది. ఆ ఘట్టంలో ఏనుగులూ గుఱ్ఱాలూ నీరు తాగు తాయి, మనుష్యులు స్నానాలు అక్కడ చెయ్యరు. రాజఘట్టం అన్నిటి కంటే శ్రేష్ఠగానూ అతి మనోహరంగానూ విశాలంగానూ ఉంది, అక్కడ నాలుగు జాతులవారూ స్నానాలు చేస్తుంటారు. అన్ని తీరాలలోనూ ఎన్నో దేవ మందిరాలు ఉన్నాయి. ఆ దేవాలయాల చుట్టూ చక్కని ఉపవనాలు

ఉన్నాయి. ఆనదీతీరాన్ని అక్కడక్కడ జ్ఞానులూ యతులూ తీర్థవాసులూ ఉంటుంటారు, తీరాల్లో అందంగా తులసీవనాలు నాటబడి ఉన్నాయి. ఆ పట్ట ణాన్ని చూచినంత మాత్రంచేత జనుల పాపాలన్నీ పోతాయి. చిత్రవిచిత్ర మైన వాపీకూప తటాకాలు ఎన్నో ఉన్నాయి. సుందరమైన ఉపవనాలలో చక్కని సరోవరాలు ఎన్నో నాలుగు వైపులా మెట్లు కట్టబడి ఉన్నాయి. ఆ కమలా కరాలను చూస్తే మునీశ్వరులైనా మోహించి పోతారు. ఆ సరోవరాలలో ఎన్నో రంగులుగల పద్మాలు ఉన్నాయి. తుమ్మెదలు చక్కగా ఝంకారం చేస్తుంటాయి.

అందమైన పక్షులు వింతగా కూస్తూ బాటసారులను పిలుస్తున్నట్లుం టుంది. కోవెలలు మనోహరంగా కూస్తుంటాయి. అటువంటి ఉద్యానవనా లెన్నో ఉన్నాయి. రాజీవాక్షుడైన ఆ రామచంద్రుడు ఏలే పట్టణ వైభవం సౌందర్యం చెప్పతరంగాదు. అణిమాదిసిద్ధులూ గొప్పసంపదలూ సౌఖ్యాలూ కలిగి ఆ పురజనులు ఎల్లప్పుడూ శరీరాలు ఉప్పొంగిపోయేలాగున శ్రీరామ చంద్రున్ని కీర్తించి భక్తితో అతని గుణాలు ఒకరితో ఒకరు చెప్పుకుంటుం టారు. ప్రతిదినమూ శ్రీరామచంద్రున్ని భజించండి అని ఒకరి కొకరు బోధించుకుంటుంటారు. ఆ పద్మనేత్రున్ని ఆ శ్యామలదేహున్ని అశరశరా సనాలూ అమ్ముల పొదినీ ధరించినవాన్ని సజ్జనుల హృదయ పద్మాలకు సూర్యునివంటివాన్ని దాసులను కంటిని రెప్ప విధంగా కాపాడేవాన్ని భయంకరమైన కాలమనేసర్పానికి గరుత్మంతునివంటివాన్ని మోహం, లోభం అనే వేళ్ల సమూహానికి కిరాతుని వంటివాన్ని కామం అనే ఏనుగులకు సింహం వంటివాన్ని భక్తులకు సుఖాన్ని ఇచ్చేవాన్ని మనస్సులలో మమ కారం కోర్కెలూ విడిచిపెట్టి సేవించండి. శోకం సంశయం అనే గాఢాంధ దుకారానికి సూర్యుడైనవాన్ని రాక్షసులనే అడవికి అగ్నిహోత్రుడైనవాన్ని కపటం అనే కప్పలకి కాలసర్పం అయినవాన్ని భయంకరమైన సంసార కాంక్షాన్ని తొలగించేవాన్ని సద్గుణనిధియైనవాన్ని సీతానాధుడైన శ్రీరామ

ఆనందంతో సేవించండి. అనేక విధవాసనలనే దోమల సమూహానికి మంచుకుప్పవంటివాడూ సమస్త లోకాలకూ సంతోషం కలిగించేవాడూ నాశంలేనివాడూ నాకు సుఖాన్నిచ్చేవాడూ భూభార నివారకుడూ ఏకరసమైనవాడూ రఘువంశభూషణుడూ మునీశ్వరులను ఆనందింపజేయువాడూ ఉదారుడూ తులసీదాసు హృదయనాథుడూ అని ఈవిధంగా స్త్రీలూ పురుషులూ శ్రీరామచంద్రుణ్ని స్తోత్రం చేస్తుండగా ఆ కరుణానిధి వారిని అనుకూలతతో ఎల్లప్పుడూ చూస్తుంటాడు. రామచంద్రుడు అనే సూర్యుడు ఉదయించగానే గొప్ప ప్రకాశం మూడులోకాలలోనూ నిండిపోయింది. ఆ రామప్రతాపం అనే సూర్యోదయం ఎంతోమంది జనులకు కష్టంకలిగిస్తుంది. ఎంతోమంది జనులకు సుఖాన్ని ఇస్తుంది. ఎటువంటివాటికి శోకమే కలుగుతుందో వాటిని వర్ణించి చెప్తాను. ఓ పక్షిరాజా! ముందుగా అవిద్య అనే రాత్రి పోయింది. అందుచేత పాపాలనే గుడ్లగూబలు నశించిపోయేయి. కామం రోషం అనే కలువపువ్వులు ముడుచుకుపోయేయి. అనేక విధాలైన గుణాలూ కర్మలూ కాలానుసారంగా కలిగే అవివేకమూ అనే చకోరపక్షులకు ఎక్కడా ఎన్నడూ సుఖంలేకపోయింది. మానం మదం మోహం మచ్చరం అనే దొంగలయొక్క ప్రవీణత నిరర్థకమైపోయింది.

ధర్మం అనే సరోవరంలో జ్ఞానవిజ్ఞానాలనే తామరపువ్వులు వికసించేయి. సంతోషం సుఖం వైరాగ్యం వివేకం అనే చక్రవాకపక్షులు ఆనందంతో అంతటా విహరిస్తున్నాయి. రాముని పతాపం అనే సూర్యుడు ఏ మహాత్ముల హృదయాలలో ప్రకాశిస్తుంటాడో ఆ మహానుభావుల హృదయాలలో నేను ముందు చెప్పిన దోషాలేవీ ఉండవు. ఎవరి హృదయాలలో రాముని ప్రతాపం అనే సూర్యుడు ప్రకాశించడో వారి హృదయాలలో నేను వెనుక చెప్పిన నిర్మల గుణాలు ఉండవు. రామప్రతాపం అనే సూర్యకాంతి ప్రసరిస్తున్నచోట నేను వెనుకచెప్పిన సర్వగుణాలు నిలిచిఉంటాయి. ఎవరి హృదయాలలో రామప్రతాప సూర్యుడు ప్రకాశించడో వారి హృదయాలలో నేను ముందు చెప్పిన దోషాలన్నీ నిలిచి ఉంటాయి.

## రాముడు భరత లక్ష్మణ శత్రుఘ్న హనుమంతులతో ఉద్యానవనానికి వెళ్ళుట

ఒకనాడు శ్రీరామచంద్రుడు తమ్ముళ్ళతో కూడా ప్రియభక్తుడైన హనుమంతున్ని తీసికొని వేడుకతో ఫలపుష్ప శోభితమైన ప్రమదావనానికి వెళ్లేడు.

## సనకాది మునీశ్వరులు రామ దర్శనానికి వచ్చుట

ఆ సమయం తెలిసికొని సుగుణాఢ్యులూ అపారమైన తేజస్సుగల వారూ ఎల్లప్పుడూ బ్రహ్మానందాన్ని అనుభవించేవారూ చూడడానికి చిన్న పిల్లలలాగున కనిపిస్తూ వృద్ధులైనవారూ సాటిలేని సుందరాకారులూ అయిన సనకసనందనాదులు నాలుగు వేదాలూ రూపాలు ధరించేయన్నట్లుగా అక్కడకు వచ్చేరు. వారికి దిక్కులే వస్త్రాలు. రామకథలు జరిగే చోటికి వెళ్ళడమే వారికి వ్యసనం, వారు అంతవరకూ అగస్త్య మహాముని ఆశ్రమంలో ఉండి ఆయన ఆరణులు మధించగానే అగ్ని పుట్టినట్టు తక్షణం జ్ఞానం పుట్టజేసే శ్రీరామచంద్రుని సత్కథ వర్ణించి చెపుతుండగా విని విని శ్రీరామ సందర్శనం చేద్దామని కుతూహలం కలగగానే వచ్చేరు. రాముడు వారిని చూచి సాష్టాంగ నమస్కారం చేసి సంతోషంతో క్షేమమడిగి పచ్చని వస్త్రం ఆసనంగా పరిచి కూర్చోమన్నాడు. భరత లక్ష్మణ శత్రుఘ్నులూ మారుతీ కూడా వారికి నమస్కరించేరు అప్పుడు ఆ మునులు రాముని తేజస్సు చూచి పట్టరాని భక్తిలో మగ్నులై పోయి ఆ నీలమేఘశ్యాముని రెప్పవేయకుండా చూస్తున్నారు, భవానీ! ఈ విధంగా చేతులు జోడించుకొని నిలిచియున్న మునుల స్థితి చూచి సీతానాధుడు కన్నులు ఆనంద బాష్పాలతో నిండిపోతుండగా శరీరం పులకరిస్తుండగా వారి చేతులు తన చేతులతో పట్టుకొని కూర్చుండబెట్టి వారితో మనోహరమైన మాటలతో అంటున్నాడు: మహాత్ములారా! మీ దర్శనంవల్ల నేను ధన్యుడనయేను.

సజ్జన సంగంవల్ల భవబంధ విమోచనం అవుతుందనీ కాముకుల సంగం సంసార బంధానికి మార్గమనీ కవులూ పండితులూ సజ్జనులూ వేదాలూ పురాణాలూ సద్గ్రంథాలూ చెపుతుండగా విన్నాను. నా పాపాలన్నీ నశించేయి అన్నాడు ఆమాటలు విని మునులు సంతోషించి పులకిత శరీరులై శ్రీరామచంద్రుణ్ణి ఈ విధంగా వినుతించేరు. అనంతా! భగవంతా! అనామయా! ఆదిదేవా! అనఘా! అనేక రూపధారీ! ఏకరూపా! అరూపా! భువనాత్మకా! కరుణామయా! సనాతనా! నిర్గుణా! సద్గుణధామా! నిరంజనా! అవికారా! శ్రీరమణా! జ్ఞాననిధానా! వసుంధరాధరా! ఉపమానరహితా! ప్రణతార్తిభంజనా! భక్తరంజనా! మానరహితా! మానప్రదా! శ్రీనారాయణా! ముకుందా! సీతారమణా! కోటిమన్మథాకారా! దీనవరదా! కలుషహారిణా! దేవశరణ్యా! పావనా! సుజనావనా! నిన్ను వేదపురాణాలు నిత్యం కొనియాడుతుంటాయి. పరమార్థ తత్వానివీ పరమార్థతత్వాన్ని ఎరిగినవాడవూ! కృతజ్ఞుడవూ అజ్ఞానమనే చీకటిని పోగొట్టేవాడవూ! నామరహితుడవూ అనేక నామాలు కలవాడవూ నిష్కాముడవూ సర్వకామినీ అకారణుడవూ సర్వకారణుడవూ సర్వగతుడవూ సర్వరూపుడవూ ఏరూపం లేనివాడవూ సర్వ హృదయాలలో ఉండేవాడవూ సర్వాధారుడవూను సర్వేశ్వరా! సర్వతోముఖా! సర్వాతీతా! భక్తజన హృద్దీపకా! సర్వవ్యాపకా! వైదేహీ ప్రాణేశా! మా హృదయాలలో సందేహాలూ ద్వంద్వాలూ పోగొట్టి స్థిరమైన జ్ఞానం ప్రకాశించేలాగున చెయ్యి. మాహృదయాలలో నీవు ఎల్లప్పుడూ సాక్షాత్కరించి మదం మోహం కామం శరీరభ్రాంతీ వదలించి రక్షించు. రాక్షసాంతకా! పరమానంద స్వరూపా! కరుణానిలయా! పరిపూర్ణకామా! నీయందు భక్తి ప్రియమూ ఎడతెగకుండా ఇచ్చి మమ్మల్ని రక్షించు. సర్వవినుతనామా! రామా! వాసుదేవా! భువనాభరణా! త్రివిధ తాపాలూ హరింపజేసేదీ సంసారభయం నశింపజేసేదీ అతిపావనమైందీ అయిన నీ పాదారవింద భక్తిని దయతో మాకు ప్రసాదించు. సమస్కరించే వారికి కామధేనువూ కల్పవృక్షమూ అయినవాడా! సమస్త శుభనిలయా! వామన

స్సంబంధమైన సమస్త దుఃఖాలనూ నివారించు సమత్వబుద్ధిని మాకు అనుగ్రహంతో ఇయ్యి. భయమూ ఆశా ఈర్ష్యా తొలగించి వినయమూ వివేకమూ వైరాగ్యమూ అభివృద్ధి పొందేలాగున చెయ్యి.

భూమండలానికి ఆభరణమైనవాడా! గొప్పదైన సంసార నదిని దాటించేనావవంటివాడా! లక్ష్మీరమణా! పరమేశ్వరా! సూర్యవంశాకాశం మీద ప్రకాశించే సూర్యుడా! మునులహృదయ సరోవరాలలో విహరించే రాజహంసా! బ్రహ్మచేతనూ శివుని చేతనూ నమస్కరింపబడే పావనమైన పాదపద్మాలు గలవాడా! వేదధర్మ రక్షకా! వేదాంతవిచారణకి సారమైనవాడా! విశ్వాకారా! భేదానికి అభేదానికి మించినవాడా నాదబిందు కళలకుమూలమైనవాడా! కాలాన్నీ గుణాలనీ కర్మలనీ భావాన్నీ మింగేసి ఏకంగా ప్రకాశించే వాడా! ఉదారమై పవిత్రమైన తారక నామంగలవాడా! భక్తజనకుముదసోమా! దోషహరణా! స్తోత్రం చేయదగిన చరిత్ర కలవాడా! తులసీదాస ప్రభూ. త్రిభువనాభరణా! దుష్టులకు దుర్లభమైన వాడా! దేవతలకు హితము చేసేవాడా! లావణ్య వైభవాలతో మనోహరమైనవాడా! కోటిసూర్యుల తేజస్సుమించిన ప్రకాశంగలవాడా! సపాటపదాక్రమం గలవాడా! అని ఎన్నోసార్లు స్తోత్రాలుచేసి తలలువంచి గొప్పభక్తితో నమస్కారాలు చేసి శ్రీరామచంద్రుని చేత వరాలు పొంది సనక సనందనాదులు బ్రహ్మలోకానికి వెళ్ళిపోయేరు.

## శ్రీరాముడు తమ్ములకు సజ్జనదుర్జన లక్షణాలు చెప్పుట

తరువాత భరత లక్ష్మణ శత్రుఘ్నులు శ్రీరామచంద్రుని పాదపద్మాలకు నమస్కరించి ఏదో అడుగదలంచి సంకోచిస్తున్నారు. అందరూ ఆంజనేయుని వైపు చూస్తున్నారు. భ్రమ ఎలాపోతుందో ఆవిధమంతా దేవదేవుడైన శ్రీరామచంద్రునివల్ల వినాలని అభిలాషపడుతున్నారు. సర్వాంతరాత్ముడైన రాముడు అదితెలిసికొని హనుమంతునితో

హృదయులై సమస్త ప్రాణులయందూ ప్రేమగలవారై భయంలేనివారూ నిత్యసంతుష్టులూ అమానిత్వం అడంభిత్వం మొదలైన సుగుణాలు కలిగి త్రికరణ శుద్ధిగా నాపాదభక్తి మరువనివారేనాకు ప్రియులు. గుణాఢ్యులు కోరికలు లేనివారూ నా నామ జపం చేసే వారూ వైరాగ్యం వినయం సత్ప్రవర్తనా కలవారూ సంతోష చిత్తులూ గొప్ప సౌమ్యతా శీతల స్వభావం కలవారూ మృదు చిత్తం కలవారూ స్నేహ భావం కలవారూ నిర్మలధర్మ పరాయణులూ బ్రాహ్మణ పాదభక్తులూ సజ్జనులని తెలిసికో వచ్చును. వత్సా! నియమం నీతి ఇంద్రియ నిగ్రహం ఎవరికి నిలిచిఉంటాయో ఎవరు పరుషవాక్యాలు పలుకరో ఎవరునిందా స్తుతులను సమానంగా చూస్తుంటారో ఎవరు ఎల్లప్పుడూ నాపాదపద్మ చింతతోనే కాలం గడుపుతుంటారో ఆబుద్ధి మంతులూ సుగుణ వంతులూ అసంతోషవంతులూ నాకు ప్రాణసమానులు. తమ్ముడా! ఇంక దుర్జనుల స్వభావం నీకు చెపుతాను విను. దుర్జనులతో ఎప్పుడూ కలియ కూడదు. వాళ్లతో స్నేహం చేస్తే గొప్ప కష్టాలు కలుగుతాయి. కపిలగోవు దుష్టగోవుతో సహవాసం చేస్తే కష్టాలు పడక తప్పదు. ఇతరుల సంపద చూచేసరికి దుష్టులు ఓర్వ లేక మనస్సులో ఉడికి పోతుంటారు. పరనింద విన్నారంటే పోయిన ధనం మళ్ళాదొరికి నంత సంతోషం పొందుతారు. వారు కామక్రోధ మదలోభ కపటాలతో కూడి నియమ మనేది లేకుండా ఎల్లప్పుడూ ప్రాణులను బాధించడమే ఎంతో ఘనకార్యమనుకొని దంభాభిమానాలతో పనులు చేస్తు సంచరించే పాపాత్ములే వారే దుష్టులు. అందరితోనూ విరోధమే పొంది తమకు మేలుచేస్తే మరచిపోయి వారికి తిరిగి అపకారం చేసేవారే ఖలులూ జడులూ కుటిలులూ కఠినాత్ములూను. ఇతరులకి ఇచ్చేటప్పుడు అసత్యం పుచ్చు కొనేటప్పుడు అర్థం భోజనం చేసేటప్పుడుకల్ల నమలేటప్పుడు కపటం. దుష్టుల ప్రవర్తన ఈలాగే ఉంటుంది. ఇంపుగ కూస్తునెప్పటి నెమలి భయంకర సర్పాలని చంపేస్తుంది, ఆవిధంగానే దుష్టులు పైకి ఎంతో మృదువుగా మాట్లాడుతూ ఉంటారు,

కానిహృదయాలు అతికఠినంగా ఉంటాయి. ఆఖలు పరస్త్రీల యందు కోరికలు కలిగి పరనింద చేస్తూ పరధనాపేక్షతో ఉండి గొప్ప సామర్థ్యంతో ప్రవర్తిస్తుంటారు. పాపపు శరీరాలు ధరించిన అజనులు రాక్షసు వేసుమా. తమ్ముడా! వారికి నరక భయం అనేదిలేదు. శిశ్నోదరపరాయణులై యథేచ్ఛగా సంచరిస్తుంటారు. లోభ గుణమే వారికి పక్కవస్త్రం కట్టు వస్త్రమూను, పరుల గొప్పతనం వినేసరికి జ్వరం వచ్చినట్టు ఊపిరి విడుస్తూమూలుగు తుంటారు. ఎవరైనా ఆపదలు పొందుతుంటేభూమండలమంతా ఏలగలిగినంత సంతోష పరవశులై పోతుంటారు. ఎల్లప్పుడూ తమమేలు కోరుకోవడం పరులతో విరోధం పొందడం దుష్టులకు ఇష్టంగా ఉంటుంది. కామంలో పడికొట్లాడుతుంటారు. నిందింపదగిన మార్గంలో సంచరిస్తుంటారు. తల్లిదండ్రులనూ గురువులనూ బ్రాహ్మణులనూ పెద్దలనూ లెక్కచెయ్యరు. వారికి చావుకలిగినా సరే ఇతరుల నాశాన్నే కోరి చేస్తుంటారు. వారికి హరికథలైనా సత్సంగమన్నా రుచించవు. భూమిమీద వారు దుర్గుణ సముద్రులు మందమతులూ బ్రాహ్మణులకూ దేవతలకూ వేదాలకూ ప్రపంచానికి సజ్జనులకి ద్రోహం చేసేవారూ అయిఉంటారు. డాంబికంగా పైకి పెద్ద మనుష్యుల లాగున వేషాలు వేసుకొని ఉత్తముల లాగున నటిస్తూ కపట హృదయాలతో ప్రవర్తిస్తుంటారు. ఇవే దుర్జనుల లక్షణాలు. వత్సా! కృతయుగంలోనూ త్రేతాయుగంలోనూ అటువంటి దుష్టులులేరు. ద్వాపరయుగంలో తక్కువగా ఉంటారు. కలియుగంలో లెక్కలేనంత మంది ఉంటారు. నాయనా! పరులకు ఉపకారం చెయ్యడంతో సమానమైన ధర్మంలేదు. పరులను బాధించడంతో సమానమైన దుష్కార్యమూలేదు. అని పండితులు తెలిసికొంటారు. అన్ని శాస్త్రాలసారమూ ఇదే.

మానవులై పుట్టికూడా పరులను బాధించే పాపాత్ములు భరించలేని సంసారసముద్రంలోపడి ఎన్నటికీతీరం చేరలేక బాధపడుతూనే ఉంటారు. మోహానికి వశులైపోయి అనే పాపాలు చేస్తూ స్వార్థపరులై తిరిగే జనులు

పరలోకసుఖాన్ని ఎన్నడూ పొందలేక భయంకరమైన నరక సముద్రంలో పడిపోతుంటారు. శుభకర్మలూ అశుభకర్మలూ చేసే జనులను నేనే కాల స్వరూపుడనై ఆయా ఫలితాలను అనుభవింప జేస్తుంటాను. అందుచేత సంసారం మహాదుఃఖానికి కారణమని తెలిసికొని నిపుణులైన బుద్ధిమంతులు నన్నే సేవిస్తుంటారు. సజ్జనులూ దేవతాంశవల్ల పుట్టినవారూ మునీశ్వరులూ శుభాశుభకర్మలన్నీ విడిచిపెట్టి పరమాత్ముడనైన నన్నే ఎల్లప్పుడూ విరామంలేకుండా భక్తితో భజిస్తుంటారు. వత్సా! సజ్జన దుర్జనుల గుణాలన్నీ నీకు వివరించి చెప్పేను వీటిని మనస్సులో ఎవరైతే నిలుపుతారోవారు ఎప్పటికీ భవసాగరంలోపడరు. మాయచేత చేయబడిన గుణదోషాలు ఇన్నీ అన్నీకావు. ఆగుణదోషాలను లెక్కచేయక నిత్యసుఖాన్ని ఇచ్చే నన్ను మరచిపోకుండా సేవించడమే జ్ఞానం, ఆ గుణదోషాలలోకి దిగిపోవడమే అజ్ఞానం. అని ఇలా శ్రీముఖంతోచెప్పిన శ్రీరామచంద్రుని వాక్యాలు విని ముగ్గురు అన్నదమ్ములూ హనుమంతుడూ అపరిమిత సంతోషభరితులై ఉప్పొంగి పోయేరు.

అప్పుడు శ్రీరామచంద్రుడు ముగ్గురు తమ్ములూ హనుమంతుడూ సేవిస్తుండగా సంతోషంతో ఇంటికి వచ్చేరు. ఈవిధంగా సంతోషంతో రఘురామచంద్రుడు నిత్యం కొత్తకొత్త చరిత్ర జరిగిస్తూ ఉండగా నారదుడు ఎన్నోసార్లు వచ్చి ఆ చరిత్ర గానంచేస్తూ బ్రహ్మలోకానికి వెళ్లి అక్కడ ఆ చరిత్ర వినిపించగా విని బ్రహ్మదేవుడు ఆనందంతో తనివి తీరక మరొకమారూ మరొకమారూ పాడుమని నారదుని చేత పాడించుకొని సంతోషిస్తున్నాడు. నిరంతర బ్రహ్మానుభవ సుఖం అనుభవిస్తుండే సనకాది మునులు కూడా ఆగానం విని నారదున్ని ప్రశంసించి వారి సమాధులూ మరచిపోయేరు. అనుభవజ్ఞాన సంపన్నులకు కూడా రామ చరిత్ర ఎంతహర్షం కలిగిస్తుందో చూచేవా? పర్వతరాజపుత్రీ! జీవన్ముక్తులు కూడా శ్రీరామచరిత్ర వింటూ ఆనందిస్తుండగా ఆచరిత్ర ఇష్టంకాని జనుల మనస్సులు రాళ్లతో సమానంకావా?

నాలుగు లక్షల యోనులలోనూ పుడుతూ చస్తూ నానాయాతనలూ అనుభ విస్తూ ఉంటాడు. వాడికి నాశంలేదు గనుక. ఆ విధంగా కాలకర్మలకి వశుడై గుణాలచేత బద్ధుడై విడిపించుకోవడానికి శక్యంకాని మాయ వివ శత్వాన్ని పొందించగా ఆ జీవుడు ఆపద అనే సముద్రంలో మునిగిపోయి యెల్లప్పుడూ చస్తూ పుడుతూ దారికానక దుఃఖిస్తుండగా నిర్నిమిత్తంగా భగ వంతుడు ప్రసన్నుడై వాడికి మానవ జన్మ ఇస్తాడు. మానవ జన్మ అతి భయంకరమైన సంసార సాగరాన్ని దాటించడానికి చక్కనినావ. నా అను గ్రహమే అనుకూల వాయువు. సద్గురువే కర్ణధారి సంపూర్ణమైన సామగ్రి ఈ విధంగా సులభంగా ఏర్పడినప్పటికీ ఏ నరుడు భవసాగరాన్ని దాటడో వాడు నిందింపతగినవాడూ మందమతీ అయిపోయి ఆత్మహత్య చేసికొన్న వాడి గతికి పోతాడు. వాని జన్మ ఈగ జన్మతో సమానమైంది. కాబట్టి ఇహలోకంలోనూ పరలోకంలోనూ సుఖించాలని కోరేవారు నా మాటలను వినండి. హృదయంలో భద్రంగా నిలబెట్టుకోండి. సద్గతిని పొందడానికి సులభమైన మార్గం నా పాదభక్తియే. అంతకంటే సులభమార్గం లేనేలేదని వేదాలూ పురాణాలూ తెలియజేస్తున్నాయి. కాబట్టి భక్తియే ముఖ్యమైంది. దాన్ని అభ్యసించండి జ్ఞానం కష్టసాధ్యమైంది దానికి ఎన్నో అడ్డు తగులు తుంటాయి. దానికి ఎన్నో కఠినమైన సాధనలు చెయ్యాలి ఎన్ని సాధనలు చేసినా ఎన్ని పాట్లు పడినా ఎన్ని నిష్ఠలు చేసినా నా భక్తిలేనివారు జ్ఞానాన్ని కోరికూడా ప్రయోజనం పొందలేరు, శుభకరమైన నా భక్తియే మహావైభ వంతో నా దివ్యపదాన్ని పొందిస్తుంది. సోదరులారా! ఎన్నోసాధనలు చేసి కష్టాలకు ఓర్చుకొని ఒకానొకడు జ్ఞానసిద్ధి పొందినా వాడికి నా భక్తి లేక పోతే నాకు ప్రియుడు కానేకాడు. భక్తి సర్వ స్వతంత్రమైంది. సర్వ సద్గు ణాలకూ గనివంటిది సజ్జన సాంగత్యం వల్లే భక్తి కలుగుతుంది, పూర్వం ఎంతో పుణ్యం చేసినవారికి గాని గొప్పదైన సత్సంగం ఎన్నడూ లభించదు సజ్జన సాంగత్యం సంసార దుఃఖాన్ని నశింపజేస్తుంది అంతకంటే ఇతర మైన పుణ్యం ఏదైనా ఎక్కడైనా ఉందా? త్రికరణ శుద్ధిగా బ్రాహ్మణపాద

పూజయే పుణ్యాలన్నిటిలో ఉత్తమమైంది. కపటం లేకుండా బ్రాహ్మణ సేవ చేసేవారికి వేగంగా దేవతలూ మునులూ అనుకూలమవుతారు ఇంకొక రహస్యం చెపుతాను వినండి. ఎవరు శివుణ్ని భక్తితో పూజిస్తారో వారే నన్ను నిశ్చయంగా పొందుతారు. శివ భక్తులే నాకు ప్రియులు. శివభక్తి లేనివారికి నా పాదభక్తియందు చిత్తం నిలవదు. ఇంత సులభమైన భక్తి చెయ్యడంలో కష్టమేమున్నది? యోగం యజ్ఞాలూ జపతపాలూ చెదిరిపోయే మనస్సు నిలబెట్టడం ఉపవాసాలూ చెయ్యడం ఇంద్రియ నిగ్రహం ఎంత కష్టతరమైనవో భక్తి అంతకష్టం కలిగించదు కదా! ఎంత సులభోపాయమో చూడండి. మనస్సులో కుటిలత విడిచిపెట్టి గొప్పదైన మృదు స్వభావంతో దొరికిన దానితో తృప్తి పొంది సంతోషించడమే నా భక్తులయొక్క గుణం. నా దాసుడు అనిపించుకొని కూడా ఆశలను ఎప్పుడైతే విడిచిపెట్టడో ఆ దుర్బలమనస్సుగల మనుష్యుణ్ని ఎలా విశ్వసిస్తారు ఎవరైనాను? ఎక్కువ మాట లెందుకు చెప్పడం? శ్రేష్ఠమైన ఆచారాలే ఎవరికైనా నేను వశమయే లాగున చేస్తాయి. ఆ ఆచారాలేవో చెపుతాను వినండి. వైరం లేనివాడూ ఆశలు లేనివాడూ భయం లేనివాడూ అన్ని ఆరంభాలూ విడిచినవాడూ అంత రింద్రియాలనీ బాహ్యేంద్రియాలనీ జయించిన మహాశాంత స్వభావుడూ కొంచెమైనా గర్వం లేనివాడూ ఈ ఇల్లు నాది అనే భావంలేనివాడూ ఉదార స్వభావంగలవాడూ అయి సంచరించేజ్ఞానికి అన్ని దిక్కులందూ ఉత్సాహమే సమకూరుతుంది. పాపంలేనివాడూ రోషంలేనివాడూ సమర్థుడూ ఎల్లప్పుడూ సత్సంగమందు ఆసక్తిగలవాడూ స్వర్గలోక నివాసమూ బ్రహ్మపదమూ కూడా తృణంతో సమానంగా భావించేవాడూ నిశ్చలమైన భక్తి దుర్మార్గ చరిత్రులు వినని స్వభావం తర్కవాదాలు చెయ్యకపోవడం ఎల్లప్పుడూ సంతోషంతో ఉండడం గలిగిన చతురుడైనవాడూ నాయొక్క సద్గుణ సమూహమందు అత్యంతాసక్తి కలవాడూ మదంలేనివాడూ మమకారం మోహం పోయినవాడూ రాగం లేనివాడూ అతి సులభంగా నా పరబ్రహ్మ పదాన్ని కనిపెట్టి ఆ నిత్యసుఖాన్ని పొందగలుగుతాడు. ఆతడే నా భక్త

శ్రేష్టుడు అని శ్రీరామచంద్రుడు చెప్పిన అమృతోపమానమైన మాటలు విని అపరిమితానందభరితులై జనులందరూ ఆ పరమపురుషుని పాదపద్మాలు పట్టుకొని నిర్మల కృపానిధానా! మాకు తల్లి తండ్రి గురువూ దైవమూ నీవే. సర్వమూ నీవే. మా ప్రాణాలూ నీవే. మా బంధువూ నీవే. మా ప్రభువూ నీవే. మాకు శరీరాలూ ధనమూ గృహాలూ సమస్తమైన మేలు కలిగించే ధర్మాలూ నీవే ఇస్తుంటావు. ఓ భక్తవత్సలా! నీలాగున బోధించ డానికి ఇంకెవరున్నారు? మమ్మల్ను కన్నతల్లులూ తండ్రులూ మాకు బోధ చేసేదంతా స్వార్థంతో చేసిందే అవుతుంది నిర్హేతుకముగా ఉపకారం చేసే వారు నీవూ నీ భక్తులూను. లోకంవారందరూ స్వార్థంకోసం మిత్రభావం కనపరుస్తుంటారు

ఇందులో కలలోనైనా పరమార్థం వెతికినా లేదు. అని ప్రేమరస మగ్నమైన హృదయాలతో జనులందరూ ఆడిన మాటలువిని శ్రీరామ చంద్రుడు సంతోషించేడు అప్పుడు అందరూ రామునియొద్ద సెలవు తీసి కొని అతని మనోహరమైన సంభాషణ ఆనందముతో తలంచుకుంటూ వారి వారి నివాసాలకి వెళ్లిపోయేరు. చ్చిదానంద శ్రీరామచంద్రపరబ్రహ్మమే రాజైన అయోధ్యా పురవాసులుగా నున్న స్త్రీ పురుషులు మిక్కిలి కృతార్థులని వేరుగా చెప్పడమెందుకు? అని శివుడు అంబికతో అన్నాడు.

## వసిష్ఠుడు శ్రీరామచంద్రుని దర్శించి స్తుతించుట

ఒకనాడు వశిష్ఠుడు సకలాంతర్యామియైన శ్రీరామచంద్రున్ని చూడ డానికి వచ్చేడు. రాముడు నిర్మలభక్తితో అతని పాదపద్మాలు కడిగి ఆజలం శిరస్సుమీద జల్లుకొని ఆసనంఇచ్చి కూర్చుండ బెట్టేడు. అప్పుడు వసిష్ఠ మహాముని భక్తితో చేతులు జోడించి శ్రీరామ చంద్రుని చూచి ఓ దశాస్యాంతకా! కరుణాసింధీ! నీ చరిత్రంతా చూచేసరికి నామనస్సు మోహించి పోయింది. వేదాలైనా తెలిసికోలేని నీమహిమ చాలాగొప్పది

ప్రసాదించు. ఇదే నేను కోరుకొనేవరం, అని ప్రార్థించి వసిష్ఠుడు తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు.

## రాముడు తమ్ములతో, హనుమంతునితో పుర బాహ్యావనానికి వెళ్లుట

గౌరీ! అప్పుడు రాముడు తమ్ముళ్ళూ హనుమంతుడూ వెంట వస్తుండగా పట్టణానికి అవతలకు వెళ్ళి ఏనుగులనూ గుఱ్ఱాలనూ రధాలనూ చూడాలని తలంచేడు. ఆజ్ఞ అయినంతనే సేవకులు గుఱ్ఱాలనూ రధాలనూ ఏనుగులనూ తీసికొనివచ్చి నిలబెట్టేరు. రాముడు అవి చూచి ప్రశంసించి ఆ సేవకులమనస్సు లెరిగి వారు కోరినవన్నీ ఇచ్చి సంతోషింప జేసేడు. తరువాత శ్రమలన్నీ పోగొట్టగలిగిన రామవిభుడు తాను శ్రమపొంది ఒక చల్లనైన మామిడితోటలోకి వెళ్లేడు. అక్కడ భరతుడు తనపైవస్త్రం పరిచేడు. రాముడు ప్రీతితో తమ్ములందరూ సేవిస్తుండగా కూర్చున్నాడు. ఆంజనేయుడు చల్లని గాలితగిలేలాగున విసురుతున్నాడు. పార్వతీ! హనుమంతునితో సాటిభక్తుడు మరొకడులేడు. అతడే రామప్రియుడు.

## నారదుడు శ్రీరామదర్శనానికి వచ్చుట

ఆసమయంలో నారదుడు చేతితోవీణ పట్టుకొని సంతోషంతో రాముని పవిత్రమైన కీర్తిని పాడుకుంటూ రాముడున్న ఆతోటలోకి వచ్చేడు. పంకజాక్షా! నిశ్చలుడా! వేదాంతవేద్యా! ఖలశాసనా! శోకవిమోచనా! మనోహరమైన నీలపద్మాల వంటి శరీరచ్ఛాయగలవాడా! శివునిహృదయ పద్మమందుతుమ్మెదవలె ఉండువాడా, గరుడవాహనా! విశ్వమోహనా! నన్ను కరుణాదృష్టితోచూడు, రాక్షస సమూహ బలభంజనా, సజ్జన మునిజన రంజనా! నిరంజనా! భయంకర పాపహరణా! సద్బ్రాహ్మణసస్యానికి తొలకరి మేఘం వంటివాడా! రామా! రక్షకులులేని వారిని రక్షించేవాడా! దీనజనావనా! భూభారాన్ని వారించే భుజములు గలవాడా! ఖరుడూ మొదలైన రాక్షస సైన్య సమూహాన్ని ఖండించినవాడా! సుఖానికి

ఉనికి పట్టైన ప్రకాశించే రూపంగలవాడా! దశరథకుల కుముదచంద్రా దశకంఠవంశ వేణువనదా వానలా! దీనశరణ్యా! జానకీనాథా! విస్తారమైన కీర్తిచంద్రికచేత ఆవరింపబడ్డ దిగంతాలు కలవాడా! వేదశాస్త్ర పురాణాలలో ప్రసిద్ధి చెందిన నీకీర్తిని దేవతలూ సజ్జనులూ మహానందంతో పాడుతుంటారు. పరమ కరుణాకరా! అయోధ్యాపురాలంకారా! స్తోత్రం చేయదగిన యుద్ధం చేసినవాడా! కలియుగ పాపములనే అడవికి అగ్నియైన నామం గలవాడా! దుఃఖనివారణా! తులసీదాసహృదయాబ్జ పతీ! మలినమైన అహంకారమనే భయంకర మతంగ జానికి సింహం వంటివాడా! అని నారదుడు రాముని సద్గుణ సమూహాన్ని ఆనందంతో పాడుతూ తన హృదయంలో రాముని దివ్యమూర్తిని నిలుపుకొని బ్రహ్మదేవుని సభకు వెళ్లిపోయేడు. నగతనయా! నాబుద్ధికి అందినంత వరకూ శ్రీరామ చరిత్ర పూర్తిగా విశదంగా చెప్పేను. అది నూరుకోట్లకంటే విస్తరించి ఉంటుంది. సరస్వతీదేవీ వేదాలూ దాన్ని పూర్తిగా వర్ణించలేరు రామచంద్రుడు అంతంలేనివాడు. పరమ పవిత్రమైన అతనిగుణాలూ అంతంలేనివే. రాముని జన్మలూ కర్మలూ పవిత్ర నామాలూ అంతంలేనివే. నీటి బిందువులనీ భూరజాన్నీ లెక్క పెట్ట వచ్చునుగాని రామకథ పూర్తిగా చెప్పడానికి ఎవరికీ శక్యం కాదు. రామకథ విన్నవారికి ఎన్నటికి తరుగులేని భక్తిని ఇస్తుంది. విష్ణుపదాన్ని పొందిస్తుంది. పూర్వం కాగభుశుండి గురుత్మంతునికి చెప్పిందంతా వివరించి చెప్పేను.

రాముని సద్గుణాలను కొంచెం మాత్రమే వర్ణించిచెప్పేను. ఇంక ఇపుడు ఏమిచెప్పేది? చెప్పు. దేవీ! అనగానే శుభకరమైన శ్రీరామచరిత్ర విని పరమానంద భరితయై ఆ విశ్వజనని వినయమైన మృదువాక్యాలతో అంటుంది, పురభంజనా! భక్తరంజనా! సంసారబంధాన్ని తొలగించే శ్రీరామచంద్రుని కథ విని ధన్యాత్మురాలినయేను ముమ్మాటికిని, ఓకరుణాకరా! నీకృపవలన గొప్పదైన మోహమంతా పోయింది. పూర్తిగా కృతకృత్యత పొందగలిగేను. సీతానాథుని మహిమంతా తెలుసుకున్నాను. జీవితేశ్వరా!

నీ ముఖచంద్రుని నుండి స్రవించిన రామకథ అనే అమృతాన్ని నాచెవులార త్రాగేను కాని నామనస్సు తనివి పొందలేదు. భవబంధహరా! ఎవరు శ్రీరామచరిత్ర విని తృప్తి పొందేమంటారోవారు అందులో సారాన్ని గ్రహించలేదనే నానమ్మకం జీవన్ముక్తులైన మునీశ్వరులు కూడా శ్రీరామచంద్రుని నిర్మల చరిత్రను ఎల్లప్పుడూ వింటూ పాడుతూ రామ భక్తులై పరమపావనులై ఉంటారు. భవసముద్రాన్ని అవలీలగా దాటగోరే నరులకు రామచరిత్ర తెప్పఅయి సులభంగా దాటించేస్తుంది. విషయా సక్తులైన జనులకు రామచరిత్ర వినడానికి ఇంపుగా ఉండి మనస్సుకి ఆనందం కలిగిస్తుంది. సర్వశుభాన్నీ కలిగిస్తుంది. చెవులు ఉండి కూడా రామచరిత్ర వినడానికి మనోహరంగా ఎవరికి ఉండదో అటువంటివారు ఉంటారా? ఒకవేళ ఉంటేవారు ఆ మూఢులు ఆత్మహత్య చేసికొన్నవారితో సమానులే. ఇదియథార్థం. నాథా! శ్రీరామచరిత మానసం అతిమనో హరంగా వినిపించగా విని పరమానందాన్ని పొందేను. ఈకథ కాగభుశుండి మునీశ్వరుడు గరుత్మంతునికి చెప్పేడనిసెలవిచ్చేరు. ఆ మునిజ్ఞానం విజ్ఞా నం వైరాగ్యం కలిగి ఉండీన్నీ రామచరిత్ర యందు ఎంతో ఆసక్తికలవాడై ఉండీన్నీ కాకి శరీరం పొందడానికి కారణమేమి? అతడు రామభక్తిని కలా ఆచరించేడు? మహాత్మా! వెయ్యిమంది నరులలో ఒక ధర్మశీలుడు ఉంటాడు. కోటిమంది ధర్మశీలురలో దృఢతరమైన వైరాగ్యం గలవాడు ఒక్కడు ఉంటాడు. కోటిమంది వైరాగ్యవంతులలో ఒక్క పరిపూర్ణజ్ఞాని ఏనబడతాడు. కోటిమంది జ్ఞానులలో ఒక జీవన్ముక్తుడు ఉంటాడు. అని వేదాలు చెపుతున్నాయి. వెయ్యిమంది జీవన్ముక్తులలో ఒకడు బ్రహ్మ మయుడై ఉండడం అరుదు. ధర్మాసక్తులూ విరక్తులూ ఉత్తమజ్ఞానులూ జీవన్ముక్తులూ బ్రహ్మపరులూ అయినవారిలో దంభం మదం భయం అన్యాయం మాయాలేకుండా శ్రీరామపాదభక్తికలిగి నిరంతరం ఆనందంతో సంచరించేవారు ఉండడం చాలా అరుదు. విశ్వనాథా! అలాంటప్పుడు కాకి మహాదుర్లభమైన రామభక్తిని ఏవిధంగా పొందేనో? చెప్పండి. హృద

యేశ్వరా ! రామభక్తుడూ జ్ఞానవైరాగ్యాలు కలవాడూ సద్గుణవంతుడూ ధైర్యవంతుడూ పండితుడూ అయిఉండిన్నీ కాకి శరీరం ధరించడానికి కారణం ఏమి? అతిపవిత్రమైన శ్రీరామచరిత్రను అతడు ఎక్కడ సంగ్రహించేడు? ఆ సచ్చరిత్రను మీరు ఎప్పుడు ఏవిధంగా విన్నారు? ఇదంతా వినడానికి నాకు చాలా వేడుకగా ఉన్నది. గరుత్మంతుడు జ్ఞానీ సద్గుణవంతుడూ విష్ణుపాదభక్తుడూ విష్ణుసామీప్యనివాసీ అయిఉండీ కాకిముని యొద్దకు ఎందుకు వెళ్లేడు? రామకథ వినడానికి మునీశ్వర్లు అందరినీ విడిచి అతని దగ్గరకు ఎందుకు వెళ్లవలసి వచ్చింది? ఆభక్తులైన కాకి మునికీ గరుత్మంతునికీ సంవాదం ఏప్రకారం జరిగింది? సవిస్తరంగా చెప్పమని ప్రార్థించిన ఉమాదేవియొక్క మృదువైన మనోజ్ఞవాక్యములు విని ఆనందించి సర్వజ్ఞుడైన మహాదేవుడు ఆదరపూర్వకంగా ఆమెను చూచి గిరితనయా! నీవు అతి ధన్యతమురాలవు. నీ బుద్ధికూడా అతి పావనమైంది. అధికంగా నీ హృదయంలో రామభక్తి నిండిఉంది. నేను మెచ్చుకున్నాను. నలినాక్షీ! అన్ని శోకాలనీ భ్రమలనీ నాశంచేసే పరమ పావనమైన ఇతిహాసం చెపుతాను విను. రామపాద భక్తి నీ విశ్వాసాన్ని వృద్ధి పొందిస్తుంది. శ్రమ లేకుండా సంసార సముద్రాన్ని దాటిస్తుంది. రాజీవాక్షీ! పూర్వం గరుత్మంతుడు కాగభుశుండిని ఇదే అడిగేడు. ఆ మహాత్ముడు ఆదరంతో చెప్పేడు. అదే నీకు చెపుతాను సావధానమైన మనస్సుతో విను.

## శివుడు పార్వతికి కాగభుశుండి చరిత్ర చెప్పుట

రాజీవ నాయనా! పాపనాశకరమైన కథ నేను విన్న ప్రకారం చెపుతున్నాను విను. ఆ సమయంలో నీవు దక్షుని కుమార్తెవై సతీదేవి అనే పేరుతో ఉండేదానవు. తండ్రి చేసే యజ్ఞానికి వెళ్ళి అక్కడ అవమానం పొంది ఆ యజ్ఞ సమయంలో నీవు శరీరం విడిచిపెట్టేసేవు. అప్పుడు నా అనుచరులందరూ ఆ యజ్ఞం పాడుచేసేసేరు. ఆ చరిత్ర నీవు విన్నదే. అప్పుడు నేను నీ వియోగంచేత వ్యథ పొందుతూ అడవులలోనూ నదీ తీరా

ల్లోనూ సరస్సులున్న ప్రదేశాలలోనూ పర్వతాలమీదా వైరాగ్యంతో సంచారం చేసేను. అప్పుడు మేరువు పర్వతానికి ఉత్తరంగా చాలాదూరాన్ని నీల పర్వతం ఉంది. దానికి మనోహరమైన నాలుగు బంగారు శిఖరాలు ఉన్నాయి. ఒక శిఖరం మీద మఱ్ఱిచెట్టూ మరొక శిఖరంమీద రావిచెట్టూ ఇంకొక శిఖరంమీద బొడ్డచెట్టూ నాలుగోశిఖరంమీద మామిడిచెట్టూ ఉన్నాయి. ఆ పర్వతంమీద ఒక సుందరమైన సరోవరం ఉంది. దానికి నాలుగువైపులా మణులతో కట్టబడిన మెట్లు ఉన్నాయి. దానిలో చల్లని తియ్యని నిర్మలమైన నీరుంది. అనేకమైన రంగుల తామరపువ్వులూ హంసలయొక్కా తుమ్మెదలయొక్కా చక్కని రవాలూ కలిగి ఆ కొలను ఎంతో మనోహరంగా ఉంది. ఆ రమ్యమైన పర్వతం మీద ఆకాకి ముని ఎల్లప్పుడూ నివసించి ఉంటాడు. కల్పాంతమందు కూడా ఆ కాకికి నాశమేలేదు. నగరాజ తనయా! ఆ పక్షియొక్క వింతకథ చెపుతాను విను.

కామం మోహం మదం అవివేకం మొదలైన మాయవల్ల కలిగే దోషగుణాలన్నీ అన్నిలోకాలలో వ్యాపిస్తుంటాయి. కాని అవేవీ ఒకప్పుడైనా ఆ పర్వతాన్ని సమీపించవు. దానిమీద నివసించి సంతోషంతో ఆ కాకి ఏ విధంగా శ్రీరామచంద్రుని భజిస్తుందో ఆ పావనమైన కథ నీకు విస్తరించి చెబుతాను విను గిరిజా! ఆ పక్షి రావిచెట్టు నీడను ధ్యానం చేస్తుంది. బొడ్డచెట్ట నీడను యజ్ఞమూ జపమూ చేస్తుంది. మామిడి చెట్టు నీడను మానసపూజ చేస్తుంది. ఆ కాకి రామభక్తి తప్ప ఇతరమైన పనే యెరుగదు. మఱ్ఱిచెట్టుయొక్క చల్లని నీడను రామకథలను చెపుతుంటుంది. అక్కడకు పక్షులన్నీ వచ్చి సంతోషంతో కాకిముని చెప్పే హరికథలు వింటుంటాయి. అతి విచిత్రంగా భక్తితో రామచరిత్ర చెపుతుంటే ఆ సరోవరంలో ఉన్న హంసలన్నీ ఆదరంతో ఆ కథ వింటుంటాయి. నేను అక్కడకు వెళ్ళి ఆ వినోదమంతా చూచేను. మనస్సుకి ఎంతో ఆనందమనిపించింది. అప్పుడు నేను ఒక హంస రూపం ధరించి మిక్కిలి సంతోషంతో శ్రీరాము చరిత్ర వింటూ కొన్నాళ్ళు అక్కడ ఉండి ఆనందంతో కైలాస పర్వతానికి

వచ్చేను. దేవీ! వాయస రూపంతో ఉన్న ఆ ముని దగ్గరకు నేను వెళ్ళిన కథ చెప్పేను ఇంక గరుత్మంతుడు అతని దగ్గరకు వెళ్ళిన సమాచారం అంతా చెపుతాను విను.

## గరుత్మంతుని మోహానికి కారణం

హిమగిరి తనయా! రామచంద్రుని యుద్ధక్రీడ అంతా చూస్తే నాకు సిగ్గు కలుగుతుంది అప్పుడు ఇంద్రజిత్తు యుద్ధంలో సర్పబాణం వేసేసరికి శ్రీరామచంద్రుడు దానిచేత కట్టుబడిపోయేడు కాదా? ఏ మహాత్మున్ని తలంచేసరికి బంధాలన్నీ విడిపోతాయో ఆ విశ్వనాథుడు కట్టుబడ్డాడంటే అది ఒక వింత నటన కాదా? అప్పుడు నాగపాశబద్ధుడైన శ్రీరామచంద్రున్ని చూచి నారదుడు గరుత్మంతున్ని పంపేడు. అతడు వచ్చి బంధాలన్నీ విప్పేసి వెళ్ళిపోయేడు. అప్పుడు గరుత్మంతునికి గొప్ప భ్రాంతి కలిగింది. శ్రీరామచంద్రుడు బంధంలో ఎందుకు చిక్కుబడిపోయేడు? అని అనేక విధాలుగా విచారించేడు. పరమేశ్వరుడూ వ్యాపకుడూ అభవుడూ బ్రహ్మ స్వరూపుడూ మాయా మోహాలనే చీకటికి సూర్యుడూ అసత్తుకి దూరమైన వాడూ భూభారం నివారించడానికి అవతరించేడని నేను విన్నాను గాని ఈ రాముని చర్య చూస్తే నాకు ఏ మహిమా కనపడదు. అందుచేత నాకు చాలా సందేహంగా ఉంది, నరులు ఎవని నామం స్మరించేసరికి సకల బంధాలనుండీ విడుదలబడతారో ఆ పరమాత్ముడైన రాముడు పరమనీచమైన ఒక రాక్షసుని నాగపాశంచేత బంధింపబడిపోయేడు. అని వితర్కించుకొని తన మనస్సుకి ఎన్నో విధాలుగా బోధించుకున్నాడు, కాని జ్ఞానోదయంకాక గరుత్మంతునికి గొప్ప భ్రమ కప్పేసింది.

పార్వతీ! పూర్వం నీకు భ్రమ ఎలాకమ్మినదో ఆవిధంగానే గరుత్మంతుడూ భ్రాంతిలో పడిపోయేడు. ఆసందేహం తొలగించుకో లేక మోహచిత్తుడై రామమాయా మహిమకు బద్ధుడైపోయేడు. గరుత్మంతుడు

ఈ విధంగా సందేహ నివృత్తికాక వెళ్ళి ఈ సంగతి అంతా నారదునితో చెప్పేడు. అదంతా నారదుడు విని వైనతేయా! రాముని మాయ ప్రబల మైంది. దానిని తెలిసికొని దాటడానికి ఎవ్వరికీ శక్యంకాదు. జ్ఞానుల మన స్సులనైనా మహామోహంలో ముంచేస్తుంది. మాయకు అంతశక్తి ఉంది. ఈ రామమాయనన్నూ ఎన్నోసార్లు ఆడించింది ఆ మాయే విన్నిప్పుడిలా తహతహలాడిస్తుంది. గొప్పమోహమే నీమతి చెడదీసింది. కాబట్టి దానిని నివారించడానికి తగినంత చతురత నాకులేదు. నీవు బ్రహ్మదేవునియొద్దకు వెళితే అతడు తగిన సదుపాయం చెపుతాడు. దానివల్ల నీభ్రాంతి తొలగి పోతుంది. అప్పుడు యథార్థమైన జ్ఞానం కలుగుతుంది. అని చెప్పి నారదుడు రామున్ని గూర్చి పాడుకుంటూ వెళ్ళిపోయేడు. గరుత్మంతుడు నారదుని మాటప్రకారం బ్రహ్మదేవునిదగ్గరకు వెళ్ళి తన సందేహమంతా అతనితో చెప్పేడు. విరించి రామున్ని తలంచుకొని శిరస్సువంచి నమస్కరించి మన స్సులో శ్రీరామచంద్రుని ప్రతాపమంతా ఊహించి భక్తిపరవశుడై అను కుంటున్నాడు. ఆహా! రామమాయా మోహితులై జ్ఞానులూ కవులూ పండితులూ భ్రమలో పడిపోతుంటారు. శ్రీరామచంద్రుని మాయ నన్ను కూడా ఎన్నోసార్లు ఆడించింది. ఆదేవుని కృపవలననేగాని మరొక విధంగా ఆమాయను గడవలేము. సకల చరాచర ప్రాణులనూ పుట్టించే నేనే మాయకు వశుడనైపోయి గొప్పభ్రమలో పడిపోయినప్పుడు ఈ గరుత్మం తుడు భ్రమపొందేడంటే ఆశ్చర్యమేముంది? అని తలంచి విధాత గరుత్మం తునితో అంటున్నాడు. ఖగరాజా! రాముని ప్రభావం శంకరుడే ఎరుగును. ఆమహాత్ముని యొద్దకు నీవువెళ్ళి ప్రార్థిస్తే నీభ్రాంతిని నివారించగలడు. అని చెప్పేసరికి అదివిని వెంటనే గరుత్మంతుడు నాదగ్గరకు వచ్చేడు. అప్పుడు నేను నాస్నేహితుడైన కుబేరుని యొద్దకు వెళుతున్నాను. నీవు ఇక్కడ మన ఆశ్రమంలో వెండికొండమీద ఉన్నావు. భవానీ! ఆపక్షిరాజు నాకు నమస్కరించి తన సంశయమంతా నాతో చెప్పేడు. నేను వినయంతో కూడిన అతని మృదువైన మాటలువిని వైనతేయా! నీవు మార్గమధ్యంలో

వచ్చి అడిగితే నేనెలా బోధిస్తాను? చాలాకాలం సజ్జన సహవాసం చేస్తే నీ భ్రాంతి అంతా తొలగిపోతుంది ఇంతకంటే మరొకమార్గములేదు. ఆది మధ్యాంతరహితుడైన రాముని మనోహరమైన చరిత్రలు మహామునులు చెప్పుతుండగా అవి భక్తిశ్రద్ధలతో నీవు వింటుండాలి చాలాకాలం. ఆ రామ కథలు నిత్యం జరిగే స్థలానికి నిన్ను పంపిస్తాను. వెళ్ళివిను. నీ సందేహాలన్నీ తీరిపోతాయి. రామపాద భక్తి కలుగుతుంది. సత్సంగంవల్లగాని రామచరిత్రలు వినటం లభించదు. ఆమనోహరమైన కథలు వింటేనే గాని మోహంతీరదు. ఆమోహం వదలకపోతే రామపాద భక్తికలుగదు. కాబట్టి ఉత్తరదిక్కున నీలపర్వతం ఒకటుంది, దాని మీద కాకిరూపముతో ఒక మునీశ్వరుడున్నాడు. అతడు గుణవంతుడు ఎల్లప్పుడూ రామపాద భక్తి కలవాడు. అతడు భగవంతుని కథలతో పొద్దుపుచ్చుతుంటాడు, గొప్పజ్ఞాన నిధి అతడు చాలాకాలంనుండి అక్కడ శ్రీరామకథలు చెపుతుంటే అనేక పక్షులు వచ్చి వింటూంటాయి. కాబట్టి నీవుకూడా అక్కడకువెళ్ళి ఆకథలు భక్తితోవిను. మోహంవల్ల కలిగిన నీ సంశయాలన్నీ తొలగిపోతాయి. అని బోధించి అతన్ని అక్కడకు పంపించేను.

అతడు నాకు నమస్కరించి వెళ్ళిపోయేడు. పార్వతీ రాముని కరుణవల్ల నేను సమస్త రహస్యం తెలిసి ఉండి కూడా ఆ రహస్యానికి కారణం నేనతనికి చెప్పలేదు. గరుత్మంతుడు నాచేత నాగపాశ విమోచనం పొందేడు రాముడని అభిమానం పొందేడు. దాన్నిపోగొట్టే వాడు ఆ శ్రీరామచంద్రుడే. పక్షిభాష పక్షియేబాగా తెలిసికో గలుగునని నేనతన్ని కాగ భుశుండిముని దగ్గరకు పంపించేను. శ్రీరామ చంద్రుని మాయాకు మోహితుడుకాని జ్ఞాని ఎక్కడున్నాడు? మూడులోకాలూ పరిపాలనచేసే స్వామికి వాహనమైనవాడూ జ్ఞానీ, భక్త శ్రేష్ఠుడూ ఐన గరుత్మంతుడే రామమాయకు లోబడిపోయి మోహంలో పడిపోయి బాధపడుతుండగా భూమిమీద దౌర్భాగ్యులైన పామర జనులు స్వాభిమానంతో

గర్వించి మిట్టిపడి పోతుంటారు. శంకరుడూ బ్రహ్మదేవుడూ కూడా శ్రీరామచంద్రుని మాయకు మోహంపొందిపోతుంటే ఇతరుల మాటలెక్క ఎందుకు? అని మాయాధిపతియైన శ్రీరామచంద్రుణ్ని మునీశ్వర్లు భక్తితో నిరంతరం సేవిస్తుంటారు.

## గరుత్మంతుడు కాగభుశుండి యొద్దకు నీల పర్వతానికి వెళ్లుట

అప్పుడు గరుత్మంతుడు అఖండ భక్తుడైన కాగభుశుండిముని దగ్గరకు వెళుతూ అక్కడ కన్నుల పండువుగా ఉన్ననీల పర్వతాన్ని చూచేడు. చూడగానే మనస్సుకి ఎంతోసంతోష మైంది మాయా అశాంతిని కలిగించే మోహం చింతా వదిలి పోయేయి. అప్పుడు గరుత్మంతుడు వెళ్ళి అక్కడి కొలనులో స్నానంచేసి మంచినీరు తాగి మఱ్ఱిచెట్టు నీడకు సంతోషంతో వెళ్లేడు ఎన్నోముసలి పక్షులన్నీ శుభకరమైన శ్రీరామ చరిత్ర వినడానికి అంతకు ముందే అచ్చటికి వచ్చి ఉన్నాయి రామచరిత్ర ప్రారంభించ బోతున్నారు. అంతలో గరుత్మంతుడు వస్తుండడంచూచి అందరూ సంతోషించేరు అప్పుడు కాగభుశుండి గరుత్మంతున్ని స్వాగతం అడిగి ఆసనమిచ్చి కూర్చుండు మనిగౌరవంతో పక్షిరాజా! నీదర్శనం వల్ల నేను ధన్యుడనయేను నావల్ల ఏపని కోరి వచ్చేవో సెలవిస్తే తక్షణం అది చేస్తాను. అనగానే గరుత్మంతుడు మృదువైన మాటలతో కాకిమునిని చూచి అంటున్నాడు. అనఘా! నీవు పరమ శివునిచేత ప్రశంస పొందేవు. ఎంతో ధన్యుడవు. నేను ఏ పనిమీద వచ్చేనో నీదర్శనం వల్ల అదంతా నెరవేరింది. నీయాశ్రమాన్ని చూచినంత మాత్రాన్ని కృతార్థుడనయేను నా సంశయమూ మోహం భ్రాంతీ కూడా తొలగి పోయేయి. సమస్త సుఖాలనూ కలుగు జేసేదీ దుఃఖా లన్నిటినీ తొలగ జేసేదీ అయిన శ్రీరామ చరిత్ర నాకు ఆదరంతో చెప్పుమని నిన్ను మాటిమాటికి వేడు కుంటున్నాను. అన్నాడు. అనగానే అతకి విషయం ప్రేమా పవిత్రతత కలిగిన మాటలు వినికాగ భుశుండి సంతోషించి శ్రీరామ చరిత్ర వినిపించ డానికి ప్రారంభించేడు,

## కాగభుశుండి గరుత్మంతునికి శ్రీరామ చరిత్ర చెప్పుట

అప్పుడు కాగభుశుండి గరుత్మంతునికి రామచరిత మానస సరోవర వర్ణన చెప్పేడు. తరువాత నారదుడు మోహం పొందిన చరిత్రా, తరువాత రావణాదుల జన్మకధా ఆతరువాత రామావతారచరిత్రా శిశుచరిత్రా బాలచరిత్రా ఆవెనుక విశ్వామిత్రుడు రావడం సీతారామకల్యాణ చరిత్రా సంతోషంతో వర్ణించి చెప్పేడు. తరువాత శ్రీరామ పట్టాభిషేకానికి సన్నాహం చెయ్యడం కైకేయి వరాలు కోరడం దశరథుడు ఆవరాలు ఇవ్వడం పట్టాభిషేకం భంగమైపోవడం పురజనులందరూ రామున్ని విడిచి పెట్టలేక చింతించడం సీతాలక్ష్మణుడూ రామునితో వస్తామని కోరడం సీతారామ లక్ష్మణులు వనవాసానికి వెళ్లడం నాపికుని భక్తి గంగానదిని దాటడం వాల్మీకి దర్శనం ఆతని సంభాషణా చిత్రకూట పర్వతం మీద నివసించడం. విస్తరించి శరీరం పులకరించే లాగును వర్ణించి చెప్పేడు. తరువాత సుమంత్రుడు తిరిగీ పురానికి రావడం దశరధుని మరణం భరత శత్రుఘ్నులు రావడం వచ్చి శోకించడం భరతుని యొక్క ప్రేమ భరితమైన చరిత్రా దశరధునకు భరతుడు ఉత్తర క్రియలు చేయడం పురజనులతో బంధువులతో భరతుడు చిత్రకూట పర్వతానికి వెళ్లడం భరతుడు సీతారామలక్ష్మణులను చూడడం శ్రీరామచంద్రుడు అతనికి ప్రేమతో పట్టణానికి వెళ్లమని బోధించడం అతనికి పాదుకలివ్వడం భరతుడు వాటిని భక్తితో తీసికొని శిరస్సున ధరించి పరివారంతో కూడా పట్టణానికి వెళ్లి ఆపాదుకలను నియమంతో పూజించడం రాముడు ఇంద్రపుత్రుని తప్పు క్షమించి రక్షించడం అత్రిమహాముని దర్శనం చెయ్యడం వర్ణించి చెపుతుంటే గరుత్మంతుడు వినిచాలా ఆనందాన్ని పొందేడు తరువాత విరాధవధా శరభంగుని శరీరపరిత్యాగం సుతీక్ష్ణుని భక్తి అగస్త్యమహాముని దర్శనం దండకావనం యొక్క పావనత్వం రాముడు జటాయువును చూచి అతనితో స్నేహం చెయ్యడం పంచవటీ నివాసం రాముడు లక్ష్మణునికి సదుపోధ చెయ్యడం శూర్పణఖ రావడందాని

ముక్కూ చెవులూ లక్ష్మణుడు కొయ్యడం ఖరదూషణాదులను చంపి మునుల భయాన్ని పోగొట్టిన వృత్తాంతం అది రావణుడు తెలిసికొని మారీచునితో సంభాషించడం మాయలేడి రావడం సీతదాన్ని కోరడం రామచంద్రుడు దానివెంట వెళ్లడం మారీచవధా. ఆ లేడి కేకవిని సీతాదేవి భయపడి లక్ష్మణున్ని పంపడం, అతడు ఆమెను ఒంటరిగా విడిచి రామునిదగ్గరకు వెళ్లడం. మాయ సీతాపహరణం, రామలక్ష్మణులు తిరిగి వచ్చి ఆశ్రమంలో సీతను కానక దుఃఖిస్తూ అరణ్యంలో వెదకుతూ తిరగడం రామచంద్రుని విరహం దారిలో పడియున్న జటాయువు వలన సీతావృత్తాంతం తమ్ముడూ తానూ వినడం ప్రాణాలు వదలిన జటాయువుకి దహన సంస్కారం చెయ్యడం కబంధున్ని వధించడం శబరికి సద్గతి నియ్యడం సీతావిరహంతో పంపాసరోవరానికి రాముడు తమ్మునితో కూడా వెళ్లడం నారదుని సంవాదం ఆంజనేయుడు కలుసుకోవడం సుగ్రీవునితో స్నేహం చెయ్యడం వాలిని సంహరించడం సుగ్రీవునికి వానర రాజ్య పట్టాభిషేకం చెయ్యడం రామలక్ష్మణులు ప్రవర్షణ పర్వతంమీద ఉండడం దేవతలు అక్కడచేసిన సత్కారాలూ వర్షశరదృతువుల వర్ణనా రామునిరోషమూ వానరుల భయమూ సుగ్రీవుడు వానరులను నాలుగు దిక్కులకూ పంపడం, ఆవానరులందరూ సీతాదేవిని వెదకడానికి వెళ్లడం హనుమంతుడూ మొదలైనవారు గుహావివరంలో చొరబడడం స్వయంప్రభ మహిమవల్ల తిరిగిరావడం. ఆ వానరులనుచూచి సంపాతి తినాలనుకోవడం తరువాత రాముని దూతలని తెలిసికొని వారితో సీత ఉన్నవిధమంతా చెప్పడం ఆంజనేయుడు సముద్రందాటడం లంకలో ప్రవేశించి సీతనుచూడడం ఆమెకు ధైర్యం చెప్పి పరాక్రమంతో వనమంతా పెకలించి రాక్షసులనుచంపి రావణునికి బోధచేసి లంకాపట్టణమంతా దహించి తిరిగి సముద్రందాటి అంగదుడూ మొదలైన కపులతో కలిసివచ్చి రామునితో సీత కుశలవార్త చెప్పి రామునిచే స్తుతిని పొందడం వానరసైన్యంతోకూడా శ్రీరామచంద్రుడు సముద్రతీరానికి రావడం విభీషణుడు శరణని రావడం సముద్ర నిగ్రహం

సేతుబంధనం సముద్రం దాటడం అంగదుని రాయబారం గొప్పయుద్ధం జరగడం కుంభకర్ణుడూ ఇంద్రజిత్తు ఘోర యుద్ధాలు చెయ్యడం వారిద్దరూ సంహరింపబడడం ఎంతోమంది రాక్షసులూ వానరులూ యుద్ధరంగంలో చచ్చిపోవడం రామరావణుల ఘోర యుద్ధం జరగడం రావణవధా మందోదరి విలాపం విభీషణునికి రాక్షసరాజ్యాభిషేకం చెయ్యడం సీతారాముల పునస్సమాగమమూ దేవతల్లూ సిద్ధులూ రామచంద్రుడిన్ని స్తుతించడం దేవతలు పుష్పవర్షం కురిపించడం దేవకాంతలు సంతోషంతో పాడుతూ నాట్యంచెయ్యడం శ్రీరామచంద్రుడు కోటిసూర్య ప్రకాశంతో సీతాలక్ష్మణ సహితంగా వానరులూ రాక్షసులూ సేవిస్తుండగా పుష్పకంతో అయోధ్యకు రావడమూ రాముడు నగరంలో ప్రవేశించడం ప్రజలు సంతోషించడం రామపట్టాభిషేకం రాముడు పరిపాలించేపట్టణంలోని సంపదలూ వైభవాలూ సౌఖ్యాలూ వర్ణించి కాగభుశుండి గరుత్మంతునికి చెప్పేడు. నేనిప్పుడు నీకు వర్ణించి చెప్పిన విధంగానే కాకముని వినిపించిన మనోహర రామచరిత్ర అంతావిని గరుత్మంతుడు సంతోష సముద్రంలో తేలి కాగభుశుండితో అంటున్నాడు,

ఓజ్ఞాననిధీ! నీప్రసాదం వల్ల శ్రీరామచంద్రుని చరిత్ర అంతా విన్నాను. నామోహం భ్రమా సందేహం పూర్తిగా వదలి పోయేయి. రామపాదభక్తి నామనస్సులో వృద్ధి పొందింది. మహాత్మా! నేనుధన్యుడనయేను. రామచంద్ర విభుడు యుద్ధరంగంలో బద్ధుడవడంచేత నాకుగొప్ప మోహం కలిగింది. ఆచిదానందుడికి యుద్ధంలో వికలత్వ మేమో? బోధపడ భ్రాంతిపొందేను. మునీంద్రా! రామచరిత్ర కేవలం మనుష్య వర్తన లాగున ఉండడం చేత నాకింత సందేహం కలిగింది. అటువంటి భ్రాంతికలగడం కూడా నాయందు ఆ కరుణానిధి అనుగ్రహించేడనే తలంచేను. ఎండలో తాపం పొందినవాడు చల్లని చెట్టునీడకు వచ్చి సుఖించినట్టు ఈ భ్రాంతి నాకు కలుగక పోతే నీతో సఖ్యం ఎలాలభిస్తుంది? రాముని కరుణ నాయందులేకపోతే రామకథామృతం ఎలా పానం చెయ్యగలుగుతాన?

రాముడు ఎవనిని కరుణతో చూస్తాడో వానికి సాధుసంగం లభిస్తుంది. అనివేదశాస్త్ర పురాణాలు నిర్ణయించి చెపుతుంటాయి మునులందరూ చెప్పేదీ అదే. మహాత్మా! శ్రీరామచంద్రప్రభు సత్కృప చేతనే కదా నాకు నీదర్శనం లభించింది. నీప్రసాదం వల్లనా సంశయమంతా వదలిపోయింది. ధన్యతముడనయేను అనిగరుత్మంతుడు పలికిన గొప్పవినయంతోనూ ప్రేమరసంతోనూ నిండిన మిక్కిలి హితమైన మాటలు విని కాకముని శరీరంపులకరించగా కన్నులనుండి ఆనందబాష్పాలు కారుతుండగా సంతోషించేను. పార్వతీ! వినేవాడు కథారసాన్ని గ్రహించగలవాడూ విష్ణుపాదభక్తిగలవాడూ పుణ్యాత్ముడూ సత్ప్రవర్తన కలవాడూ ఐనప్పుడు సజ్జనులు రహస్యాన్ని ఆనందంతో ఉపదేశిస్తారు. అప్పుడు మళ్లా గురుత్మంతునితో కాగభుశుండి మునీశ్వరుడు పరిపూర్ణమైన ప్రేమరసం ఒలుకుతుండగా ఇలా అన్నాడు. మహాత్మా! అన్నివిధములచేతా నీవునాకు గొప్పగా పూజింపదగినవాడవు. రామకృపకు పాత్రుడవు. బుద్ధిమంతుడవు. నీమనస్సులో మోహం సందేహం విష్ణుమాయా ఎలా నిలుస్తాయి? పక్షీంద్రా! నామీద అనుగ్రహంచేత శ్రీరామచంద్రుడు నన్ను గొప్పచెయ్యడానికి మోహమిష చేత నిన్ను నాదగ్గరకు పంపించేడు, నీవు నాయందు దయ చూపించి నన్ను ధన్యాత్ముని చెయ్యాలని వచ్చేవు. రాముని కరుణను నేనుపొందేను. మహాత్మా! నీవు మోహాన్ని పొందడం ఒక ఆశ్చర్యంకాదు. నారదుడూ విధాతా శివుడూ సనకాది మహామునులూ మోహంలో చిక్కిపోలేదా? కామం ఎవరిని ఆడించలేదు? ఎవరికి తృష్ణ వెఱ్ఱెత్తించలేదు? రోషం ఎవరి మనస్సులను ఉడికించలేదు? వైనతేయా! మిత్రా! జ్ఞానులూ తాపసులూ కవులూ శౌర్యవంతులూ గుణవంతులూ మానవంతులూ సత్ప్రవర్తనులూ చాతుర్యంగలవారూ పండితులూ ఇంకాఎటువంటి సద్గుణాలు గలవారైనా లోభం అనేపాశానికి కట్టుబడనివారు మూడులోకాలలోనూ ఉన్నారా? సఖా,

ధనమదం ఎవనిని వంకరనడత లేనివాన్నిగా చేస్తుంది? అధికారగర్వం ఎవనిని చెవిటి వానినిగా చెయ్యదు? స్త్రీలచూపులనే బాణాలు ఎవన్ని కలిగించవు? పక్షీంద్రా? త్రిగుణాలవల్ల కలిగిన సన్నిపాతరోగం ప్రకోపించి ఎవన్ని బాధించదు? మానమదాలు విడిచిపెట్టి మంచిగా ప్రవర్తించేవారెవరున్నారు? యౌవనం అనేజ్వరం ఎవనిని వ్యర్థంగా ప్రలాపాలాడించదు? మమత్వం ఎవనికీర్తిని నశింపజేయదు? మత్సరం ఎవనికి కళంకం కలిగించదు? శోకం అనేగాలి ఎవన్ని చలింపజెయ్యదు? చింతఅనేపాము ఎవనిని మింగదు? జీవులందరిలో మాయచేత మోహింప జేయబడని వారెవరున్నారు? శరీరం అనే కట్టెలో మనోరథం అనేపురుగు ఎవరికుండదు? ఈషణత్రయంతఃప్రపంచంలో ఎవరిమనస్సు మలినం చెయ్యకుండా ఉంటుంది? సఖా! ఈ చెప్పబడ్డ మాయాపరివారమైన ప్రబల మైనగుణాలు అపారంగా అన్నిలోకాలలోనూ వ్యాపించి ఉంటాయి. అని ఇన్నీ అని ఎవరూ చెప్పలేరు అటు వంటి మాయకు విధాతాహరుడూ కూడా భయపడిపోతుంటే ఇతరుల మాట చెప్పడమెందుకు? అన్ని లోకాలలోనూ ఆ సైన్యమంతా అలుముకొని ఉంది. కామంరోషంమొదలైనవి ఆసైన్యానికి అధిపతులు. దంభంకపటం పాషండతా ఆసైన్యంలోని యుద్ధ వీరులు. ఆమాయయే శ్రీరామచంద్రుని దాసి. సమస్తం తెలిసిన పండితులకు అది మిథ్యయేసుమా. మిత్రా! పాదము మోపి చెపుతున్నారు విను, శ్రీరామచంద్రుని కరుణ లేందే మాయాంధకారం విడిపోదు. మాయను వదలించు కోవడానికి రామకరుణ తప్ప వేరేమరొక ఉపాయంలేదు. స్వామీ. ఏమాయ సకల భువనాలనూ ఆడించేస్తుందో మూడులోకాలలో ఎంతటివారైన ఏ మాయయొక్క అపారమైన ప్రవర్తనను తెలిసికోలేరో ఆమాయను శ్రీరామచంద్రుడు చిన్మయుడు కను బొమల సంజ్ఞ చేతనే ఆడిస్తూంటాడు, తన పరివారంతో కూడా అమాయనర్తకిలాగున నాట్యచేస్తుంటుంది. సఖా! అటు వంటి సచ్చిదానందుడూ అభవుడూ బలానికినిలయమైనవాడూ జ్ఞానస్వరూపుడూ వ్యాపకుడూ వ్యాప్తుడూఅఖండుడూ అంతంలేనివాడూ సమస్త శక్తులూగలవాడూ భగ

వారిహృదయాలలో తెరవేసినట్టు దట్టమైన అజ్ఞానంకప్పి ఉండడంచేత రామునియొక్క యథార్థమైన పరస్వరూపం వారు విచారణచేసి తెలిసికో లేరు. కామం రోషం లోభం మదం మొదలైన గుణాలకి వశులైపోయి దుఃఖ రూపమైన ఇంటిసంసార భారం మోసికొని ఉండడమందే ఆసక్తి అధికంగా ఉన్నత మూఢజనులు చీకటి నూతిలో పడిపోయిన వారగుటచేత జ్ఞానస్వరూపుడైన నిత్యానందస్వరూపుడైన రాముణ్ని ఎలాతెలిసికో గలుగుతారు? మహాత్మా! నిర్గుణస్వరూపం తెలిసికోవడం సులభం. సగుణస్వరూపంతో చేసిన శుభకరమైన రామునిలీలలు తెలిసికోవడం చాలాకష్టం. అతని లీలలు వివేకించి తెలిసికోలేక మోహితులై పోతుంటారు. జ్ఞానులు కూడా అతని సద్గుణ స్వరూప లీలలకి ఒక్కొక్కప్పుడు అతని కరుణ తప్పినప్పుడు భ్రాంతిలో మునిగిపోతుంటారు. వైనతేయా! శ్రీరామవిభుని మహిమనూ నాబుద్ధికి అందినట్టుగా ఆమహాత్ముని రమ్యమైన కథనూ నాకు ప్రబలమైన మోహం ఎలా కలిగిందో ఆవృత్తాంతమూ నీకు వెల్లడిగా తెలిసేలాగున చెపుతాను విను. నీవు రామకృపకు పాత్రుడవూ నాకు ఆనందం కలిగించే రామగుణాలయందు ఇష్టంగల వాడవూ కాబట్టి నీకు రహస్యం ఏమీదాచకుండా ఉన్నదున్నట్టు చెపుతాను. విహగేంద్రా! శ్రీరామచంద్రుని స్వభావంవిను. తన భక్తులైనవారికి కొంచెమైనా అభిమానం ఉండనీయడు. అభిమానం దుఃఖకరమైనది. అదే సంసారమంతటికీ మదుదు పీడాకరమైంది. అన్నికష్టాలనీ కలిగిస్తుంది కాబట్టి అదయానిధి ఆ అభిమానం అనే దుర్గుణాన్ని పోగొడతాడు అతనికి భక్తులయందు ప్రేమ అధికము. శిశువు శరీరం మీద చిన్నగాయం ఉన్నా తల్లి గొప్ప మందు పెడుతుంది. అలాగే రామవిభుడు తన భక్తుడు ఏమాత్రమైనా అభిమానంతో ఉంటే దాన్నిపోగొట్టి రక్షిస్తాడు. శిశువు గాయానికి మందు పెట్టేసరికి భయపడిఏడ్చినా తన శిశువు పుండు మానిపోవుంచునగదా అని తల్లి ఏడుపు లెక్కచెయ్యదు అవిధంగానే మొదట తెలియక భక్తుడు నేను ఎంత భక్తితో సేవించినా ఆభగవంతుడు నాకు అన్నికష్టాలే కలిగిస్తున్నాడు.

అని ఏడుస్తాడు తరువాత శ్రీరామచంద్రుని కరుణా స్వభావం తెలిసి కొని మరింత ధృఢమైన భక్తితో సేవిస్తాడు. అటువంటి విభున్ని భ్రమ విడిచిపెట్టి ఎందుకు సేవించవే చిత్తమా! అని తులసీదాసు మహాత్ముడు ప్రబోధిస్తున్నాడు.

## కాగభుశుండి గరుత్మంతునికి శ్రీరామచంద్రుని మహిమచెప్పుట

విహగనాథా! సావధానంగా విను. నాజడత్వమంతా వివరించి చెపు తాను ఎప్పుడెప్పుడు రామ విభుడు మనుష్య శరీరం ధరిస్తుంటాడో అప్పు డప్పుడు నేను అయోధ్యకువెళ్ళి రాముని బాల చరిత్ర అంతాచూచి పరమ సంతోషాన్ని పొందుతుంటాను. అక్కడ జన్మోత్సవాలన్నీ చూచి విడిచి రాలేక అయిదేళ్ళవరకూ అక్కడే ఉండిపోతుంటాను, నూరుకోట్ల మన్మ థుల సౌందర్యాన్ని జయించిన మనోహర రూపంగల బాల రాముడు నాకుఇష్టదైవం మహాత్మా! నాప్రభువు ముఖాన్ని చూస్తూ నాకన్నులున్నం దుకు ఫలం పొందుతుంటాను, అతినీచమైన కాకిశరీరం ధరించినా బాల రాముని సమీపాన్నిఉండి అతివిచిత్రమైన అతని చరిత్రచూచి చూచి సాటి లేని ఆనందాన్ని పొందుతుంటాను. బాల్యంలో ఎక్కడెక్కడ ప్రభువు తిరుగుతుంటే అక్కడక్కడుకు నేను ఎగిరివెళుతుంటాను. గృహాంగణంలో రాలిన ఎంగిలి మెతుకులు తిని తనివి పొందుతుంటాను. ఒకమారు రామ చంద్రుడు చక్కని పుణ్యచరిత్ర జరిగించేడు. ఆలీలలు తలంచుకుంటే నా శరీరమంతటా పులకలుపుడతాయి, స్వామీ! రామవిభుని చరిత్ర సేవకు లకు సుఖాన్ని ఇస్తుంది. కాబట్టి చెపుతున్నాను విను

అయోధ్యలో రాజమందిరం అన్నివిధాలా సుందరంగా ఉంటుంది. నవరత్న ఖచితమైన బంగారుభవనం యొక్క ప్రాంగణాన్ని వర్ణించడం సరస్వతికి కూడా వశంకాదు. ఆప్రాంగణంలో తమ్ముళ్లతో కూడా రాముడు ఆడుకుంటుంటాడు. బాలవినోదలీలలు ఎన్నో చేస్తూతల్లికి ఆనందం కలిగి స్తూంటాడు. శ్యామలవర్ణంతో కోటిమన్మథ సుందరుడైన శ్రీరామచంద్రుడు

ప్రకాశిస్తున్నాడు. ఎఱ్ఱపద్మాలలాంటి కోమలమైన పాదాలూ చంద్రకాంతిని మించిన ప్రకాశవంతమైన పాదాలగోళ్లు వజ్రం అంకుశం మొదలైన చిహ్నాలతో కూడిన [illegible] ఎర్రనైన అడుగులూ చక్కగా ధ్వనించే కడియాలూ రత్నఖచితమైన సువర్ణంతో చెయ్యబడిన మువ్వలూ గల పాదాలతో ఘల్లుఘల్లుమని మనోహరమైన ధ్వని వినబడేలాగున పరుగెత్తుతున్నాడు చక్కని మూడురేఖలుగల బొజ్జా [illegible] బొడ్డూ విశాలమైన వక్షం మీద తళతళలాడే హారాలూ ఎఱ్ఱపద్మాలవంటి అరచేతులూ ప్రకాశవంతమైన గోళ్లూ చక్కని ఆభరణాలూ పొడవైన బాహువులూ సింహపు కొదమ భుజాలవంటి భుజాలూ శంఖంవంటి కంఠం అందమైనగడ్డం శోభావంతమైన ముఖం ముద్దులొలికే చిలుకపలుకులూ ఎఱ్ఱని పెదవీ అందమైన రెండు సుందర పళ్లూ చిరునవ్వు వెన్నెలలు వ్యాపించే మృదువైన అద్దాలవంటి చెక్కిళ్లూ చక్కని ముక్కూ జగాలన్నింటికీ సుఖాన్ని కలిగించే వెన్నెల కాంతిని మించిన నవ్వూ, కొత్తగా పూసిన చిన్న నీలపద్మాలలాంటి కళ్లూ సంసారబంధ విమోచనం చెయ్యగలిగిన లలాటం మీద కొత్త గోరోచన తిలకమూ వంకరలైన కనుబొమలూ మనోహరమైన చెవులూ నల్లని [illegible] తేరిన తలవెంట్రుకలూ చక్కని బంగారు వస్త్రంతో చేయబడిన జుబ్బా కలిగి అతిప్రసన్నంగా చూస్తుంటే నా మనస్సుకి ఎంతో ఆనందం కలిగించింది. సౌందర్యనిధియైన శ్రీరామచంద్రప్రభుడు రాజభవనప్రాంగణంలో ఎంతో వినోదంగా ఆడుకొనే సమయంలో ఆదృశ్యం ఎంతో ఆనందకరంగా ఉంది. తన ప్రతిబింబంతో మనసారా నటిస్తున్న మాయానటకున్ని వనమాలధరి చిన్నవాన్ని శివునిచేత నమస్కరింపబడేవాన్ని వెయ్యి నోళ్లు ఉన్నా వినుతించలేము. అప్పుడు శ్రీరామచంద్రుడు నాతో అనేక వినోదాలూ క్రీడించేడు. సంతోషంతో, ఆ సంగతి చెపితే నాకిప్పుడు సిగ్గు కలుగుతుంది. ఆ ప్రభువు నన్ను పట్టుకుందామని పరిగెత్తుకొస్తుంటే నేను వేగంగా పారిపోయేను. అప్పుడు నాకొక [illegible] చూపించేడు. నేను ఆకాశం నుండి దిగి దగ్గరకు వచ్చి నిలబడ్డాను. ప్రభువు నన్ను

చూచినవ్వేడు. నేను పారిపోయేటరికి ఏడుస్తాడు. నేను దగ్గరకువెళ్ళి అతని పాదంపట్టుకోబోతుంటే భయపడి పారిపోయేవాడు. నన్ను తిరిగి తిరిగి చూస్తాను. వేదాంతాల యందు సంచరించే విశ్వనాధుడు ప్రాకృత బాలుని విధంగా లీలనడుపుతున్నాడు. ఆలీలనాకు భ్రమకలిగించగానే నేనుకూడా నీలాగునే మోహంలో పడిపోయేను

ఇతడు సచ్చిదానంద లక్షణుడైన సర్వసాక్షి అయితే ఈవిధంగా ఇతని చర్య ఉంటుందా? అని నామనస్సులో గొప్ప సందేహం కలిగింది. ఆవెంటనే రాముని ప్రేరేపణవల్ల గొప్ప మాయవచ్చి కమ్మింది. అది ఎంతమాత్రం దుఃఖాన్ని కలిగించలేదు. తక్కిన జీవులలాగున నన్ను సంసారంలో ముంచెయ్యలేదు. వినతానందనా! దీనికొక కారణం ఉంది సావధానంగా విను. ఒక్క సీతానాథుడే సర్వోత్తముడు. అఖండ జ్ఞాన స్వరూపుడు బ్రహ్మాండమయుడు. చరాచర జీవులందరూ మాయకు వశులైనవారే అందరికీ చలించని పరమజ్ఞానమే ఉంటే జీవుడూ ఈశ్వరుడూ అనేభేదం లేకుండానే ఉండును. కాబట్టి ఈశ్వరుడే స్వతంత్రుడై ఉంటాడు కాని మాయకువశుడై భ్రాంతిచేత అభిమానం గల జీవుడు. ఈశ్వరవశవర్తియైన మూడు గుణాలుగల మాయకు పరతంత్రుడెందుకు కాదు? ఏకమై ప్రకాశించే శ్రీరామచంద్రుడు మాయక్రమ్మిన జనులకు జీవుడై ఎన్నో రూపాలతో ఉన్నట్టు కనపడతాడు అజ్ఞానంచేత. విచారణ చేసి జ్ఞానాన్ని పొందగానే అటువంటి మాయ అంతా అసత్యమని వెల్లడిగా తెలిసిపోతుంది. అటువంటి జ్ఞానం కలగడానికీ మాయ తొలగడానికీ శ్రీరామచంద్రుని పరిపూర్ణకరుణ తప్ప ఇంకవేయి ఉపాయాలు చేసినా వ్యర్థమే.

రామున్ని భజించడం మానేసి మరిదేనివల్లనైన సర్వోత్కృష్టమైన మోక్షం కోరేవాడు ఎంతజ్ఞానైనప్పటికీ వాడు తోకా కొమ్ములూలేని పశువేసుమా. పదహారు కళలతో చంద్రుడు నక్షత్రాలన్నీ ఆకాశమందు

ప్రకాశిస్తున్నా పర్వతాలన్నిటి మీదా దావాగ్ని అలముకొన్నప్పటికీ సూర్యుడు ఉదయించకుండా రాత్రిపోదు ఆవిధంగానే శ్రీరామచంద్రుని భజనచేయకుండా జీవులకు క్లేశంపోదు. రామభక్తులకు అవిద్య ఎప్పుడూ కమ్మదు. రాముని ప్రేరేపణవల్ల ఎల్లప్పుడు జ్ఞానం నిలిచి ఉంటుంది ఆకారణం చేత రామసేవకులైన వారికి భక్తి విశేషంగా అభివృద్ధి పొందుతుంది. భేదబుద్ధి కలగడం చేతనే వినాశం కలుగుతుంది కాని సర్వాత్ముడైన రాముడే అని ప్రపంచాన్నంతటినీ చూచేవారికి ఎప్పుడూ వినాశం కలగదు ఇది నిశ్చయం. భ్రాంతిపొందిన నన్ను చూచిప్రభువు నవ్వడం మొదలు పెట్టేడు. జగన్నాధుడైన రాముని చరిత్ర విస్తరించి చెపుతానువిను అతిరహస్యం మనోహరం అయిన అతని క్రీడా రహస్య విధాన మంతానీకు బోధపడేలాగున. ఆనీలమేఘ శ్యాముడైన ముద్దురాముడు నన్ను పట్టుకోవాలని మోకాళ్ళు చేతులూ ఆనిగజగబ పాకుతూ వెంటతగిలి వస్తున్నాడు ఆసంగతి తల్లితండ్రులూ కూడా ఎరగరు. అప్పుడునేను పారిపోతుంటే నన్నుపట్టుకోవడానికి తనబాహువుచాపేడు. బాలరామభద్రుడు. నేనుఎంత మీదకిఎగిరి ఆకాశంనుండి చూచినా అతని బాహువునాకు అంతదగ్గరగా కనబడుతుండేది. ఆకాశంమీదనేను బ్రహ్మలోకం వరకూ ఎగిరి తిరిగి వెనక్కిచూస్తేనాస్వామి బాహువుకి నాకూ రెండు అంగుళాలే ఎడముంది. సప్తావరణాలూ దాటినేను చూచినా అంతవరకూ రాముని భుజదండం విడివై ఉండడంచేతనాకు మిక్కిలి వ్యాకులం కలిగింది. అతిభయంతో నేను అప్పుడు రెండు కళ్ళుమూసుకొని తిరిగి తెరచిచూచే సరికి పూర్వంలాగుననే నేను అయోధ్యలోనే ఉన్నాను. నన్ను చూచిరాముడు నవ్వేడు ఆనవ్వేస్వామి నోటిలోనేను వెంటనే ప్రవేశించేను. అతనికడుపులో ఎన్నో బ్రహ్మాండాలు ఉండడం ఆశ్చర్యంగా చూచేను. ఎన్నోలోకాలు నాకు కనిపించేయి. అవన్నీ చూచేసరికి నాకు ఆశ్చర్యం ఎక్కువై పోయింది ఆలోకాన్ని నిర్మాణంలో ఒకదానికంటేఒకటి గొప్పగా ఉన్నాయి. ఆలోకాలలో కోట్లకొలదీ బ్రహ్మలూ కోట్లకొలదీ రుద్రులూ కోట్లకొలదీ సూర్యులూ చంద్రులూ

నక్షత్రాలూ లెక్కపెట్టలేనంత మంది లోక పాలకులూ యమధర్మరాజులూ పర్వతాలూ మంచిమంచి భూములూ సముద్రాలూ నదులూ సరస్సులూ వనాలూ సృష్టిలో ఉన్న నాగులూ దేవతలు మనుష్యులూ తపస్వులూ చరాచర ప్రాణులూ నాకు కనపడ్డాయి. ఎన్నడూ చూడనివీ విననివీ మనస్సుకీ అగమ్యము లైనవీ ఎన్నో అద్భుతాలను నేను అక్కడ చూచేను అవన్నీ ఏర్పాటు చేసి ఎలావర్ణించి చెప్పగలను? ఒక్కొక్క బ్రహ్మాండంలో ఒక్కొక్క నూరేసి సంవత్సరా లున్నాను. ఒక్క బ్రహ్మాండమైనా విడిచి పెట్టకుండా మిక్కిలి కుతూహలంతో తిరిగేను. ప్రతి లోకంలోనూ వేరువేరుగా శివులూ బ్రహ్మలూ విష్ణువులూ ఇంద్రులూ మనువులూ దిక్పాలకులూ సాధ్యులూ దేవతలూ మానవులూ రాక్షసులూ కిన్నరులూ సిద్ధులూ చారణులూ పన్నగులూ విద్యాధరులూ భూత సమూహాలూ పక్షులూ మృగాలూ నాకు అంతటా కనపడ్డాయి. భూములూ సముద్రాలూ నదులూ సరస్సులూ పర్వతాలూ బ్రహ్మాండా లన్నింటిలో నాకు వేరువేరుగా కన పడ్డాయి ప్రతి బ్రహ్మాండం లోనూ నా ప్రతిబింబం అన్నట్టు నా నిజ రూపం కూడా కనపడ్డది. సాటిలేని వివిధములైన వస్తువులు కూడా నాకు ఆలోకాలలో కనపడ్డాయి. అన్ని భువనాలలోనూ పుణ్యవంతమైన అయోధ్యా పురములూ పాపహరమైన సరయూ నదులూ రతీ దేవిని మించే సౌందర్య వతులైన స్త్రీలూ మన్మథున్ని నిరసించే సుందరాకారులైన పురుషులూ కౌసల్యలూ దశరథులూ భరతలక్ష్మణ శత్రుఘ్నులూ బాల రాములూ అంతటా కనబడ్డారు. అన్ని బ్రహ్మాండాలలోనూ అవతరించి బాలలీలావినోదం చేస్తున్నాడు శ్రీరామచంద్ర ప్రభువు. అన్నిలోకాలలో నేను సంచారం చేసి వేరువేరుగా గొప్ప విచిత్రాలన్నీ చూచేను. కాని శ్రీరామచంద్రుడే తప్పనాకు ఇతరమేమీ కనబడలేదు. ఆవిధంగా నాకు ఈశ్వరుడే కనపరచేడు. అటువంటి శిశుత్వమూ సౌందర్యమూ దయాళు త్వమూ కనపరుస్తూ సమస్త లోకేశ్వరుడు కనపడుతుండగా అధికమైన దేహాత్మ భ్రాంతితో తిరిగేను ఆవిధంగా అనేక బ్రహ్మాండాలలో తిరిగి

తిరిగి నూరు కల్పాలు జరిగినట్టు గ్రహించేను. ఆతరువాత నాయాశ్ర మానికి చేరుకొని అక్కడ చాలా కాలం ఉన్నాను. అలాఉండి నాయిష్ట దైవం అయోధ్యలో అవతరించేదని విని ఆసక్తితో వెళ్లి జననోత్సవం దర్శించేను.ఇంతకుముందు నీకు వర్ణించి చెప్పినట్టే ఉంది అమహోత్సవము చాలా ఆనందించేను. శ్రీరామచంద్రుని గర్భంలో అనేక బ్రహ్మాండాలు నేను చూచేను వాటిని వర్ణించలేను. అన్ని బ్రహ్మాండాలలోనూ మాయా నాధుడూ భగవంతుడు కరుణాకరుడు రాజీవాక్షుడు జ్ఞాననిధీ అయిన శ్రీరామ చంద్రున్ని చూచేను. నామనస్సులో మాటిమాటికీ ఇలా తలంచుకున్నాను. అయ్యయ్యో! నామనస్సు మోహం అనే బురదలో మునిగి పోయింది. రెండు గడియల కాలంలోనే నూరు కల్పాలు గడిచి పోయినట్టు భ్రాంతి చెంది ఎన్నో బ్రహ్మాండాలలో తిరిగి తిరిగి అలసి పోయేను, అనుకొనే నన్ను చూచి సచ్చిదానంద మూలమైన శ్రీరామచంద్రుడు నవ్వేడు. ఆ సుందరమైన మృదువైన అతని నోటినుండి బయటికి వచ్చేను. అప్పుడు ఇంతకు ముందు లాగునే నాతో శిశు చర్యలు చేస్తూ రామచంద్రుడు ఆడు కుంటున్నాడు. అప్పుడు నేను ఎన్ని విధాలుగా మనస్సమాధానం చేసు కుందామన్నా నా చిత్తానికి విశ్రాంతి లేక చికాకు పొంది పోయింది, ప్రభువు యొక్క చరిత్ర అంతాచూచి ఆపరమ పురుషుని పరమ మహత్వం తెలిసి కొని అతని పాదపద్మాల దగ్గర భూమిమీద పడిపోయేను. ఒక్క మాటైనా నోటినుండి రాలేదు. కొంత సేపటికి తెలివిపొంది గోవిందా! ఆర్త శరణ్యా! కృపా సముద్రా! రామచంద్రా! రక్షించు. రక్షించు. అన గానే నన్ను ప్రేమ విహ్వలునిగా తెలిసికొని సంతోషంతో చూచి తన మాయనూ గొప్ప మహిమనూ ఉపసంహారం చేసి సుందరమైన తన హస్తాన్ని నా శిరస్సు మీద ఉంచి నేను పొందే సమస్త దుఃఖం పోగొ ట్టేడు. నామోహమంతా పోయింది. ముందు నేను చూచియున్న మహా మహిమ నంతటినీ తలంచుకొని సుఖించేను. శ్రీరామచంద్రుని భక్త వత్సలత చూడగానే నాకు అధికమైన భక్తి కలిగింది. కన్నులనుండి బాష్ప

ములు కారుతుండగా శరీరం పులకరిస్తుండగా మిక్కిలి వినయంతో చేతులు రెండూ జోడించి, అనేక విధాలుగా స్తోత్రాలు చేసేను నా ప్రేమ రసంతో నిండిన పవిత్రమైన మృదువాక్కులు విని ఆవిశ్వ నాధుడు కరుణతో అతిదీనుడనైన నన్ను తన దాసునిగా పరిగ్రహించేడు ఆవిధంగా నన్ను కరుణతో చూచి గంభీరమైన మృదుమధుర వాక్కులతో లక్ష్మీనివాసుడైన శ్రీరామచంద్రుడు నీకేమి కావాలో అడుగు నేను చాలా ప్రసన్నుణ్నైనాను. అన్నాడు. నీకు అణిమాది సిద్ధులు కావాలా? అన్నిటికంటే గొప్పదై పండితులందరూ కోరే మోక్ష సుఖం కావాలా? దేవతలకైనా దుర్లభమైన వివేకం సాటిలేని అనుభవ జ్ఞానం వైరాగ్యం అడుగు నీవు నిస్సంశయంగా ఇస్తాను. అన్నాడు. ఆమాటలు నేను విని రెండింతలు ప్రేమచే వివశత్వం పొందిన బుద్ధిగలవాడనై మనస్సులో ఇలా అనుమానించేను. ఇనకులేశ్వరుడైన, రాముడు నాకు అన్ని సుఖాలూ ఇస్తానన్నాడు కాని తన భక్తిని ఇస్తాననలేదు ఎన్ని సుఖాలున్నా శ్రీరామచంద్రుని భక్తిలేకపోతే ఎంత మంచి కూరలలోనైనా ఉప్పులేనట్టై పోతుంది. నిరంతరం రామభక్తి భజనా లేకపోతే ఎన్ని రకాల సుఖాలున్నా ఫలితమేముంది? అని హృదయంలో ఆలోచించి ఈ విధంగా అన్నాను. ప్రభూ! నీవు ప్రసన్నుడవైనట్టైతే తగిన వరం నాకు అనుగ్రహించదలంచితే నాయందు పరిపూర్ణ కరుణా ప్రేమా నీకు ఉన్నట్టైతే నాకు ఇష్టమైన వరం ప్రసాదించు. అనాథ నాధా! నీవు సర్వ హృదయాంతర్యామివీ ఉదారుడవూ కాబట్టి దేనిని యోగులూ మునులూ పొందదలంచి వెతుకుతుంటారో ఆనీ పాదపద్మభక్తి అఖండంగానూ పరమశుద్ధంగాను నాకు నిలిచిఉండేలాగున ప్రసాదించు. వేదాలు పురాణాలూ దేనిని కీర్తిస్తుంటాయో దేనిని నీకరుణచేత ఎవరో ఒకకొంతమంది మాత్రమే పొందగలుగుతారో అటువంటి భక్తిని నాకు అనుగ్రహించు. అనగానే శ్రీరామచంద్రుడు అట్టే అగుగాక. అని నావైపు చూచి ఆనంద కరమైన మాటలతో ఇలా అన్నాడు.

తిరిగి నూరు కల్పాలు జరిగినట్టు గ్రహించేను. ఆతరువాత నాయాశ్ర
మానికి చేరుకొని అక్కడ చాలా కాలం ఉన్నాను. అలాఉండి నాయిష్ట
దైవం అయోధ్యలో అవతరించేడని విని ఆసక్తితో వెళ్లి జననోత్సవం
దర్శించేను. ఇంతకుముందు నీకు వర్ణించి చెప్పినట్టే ఉంది ఆమహోత్సవము
చాలా ఆనందించేను. శ్రీరామచంద్రుని గర్భంలో అనేక బ్రహ్మాండాలు
నేను చూచేను వాటిని వర్ణించలేను. అన్ని బ్రహ్మాండాలలోనూ మాయా
నాథుడూ భగవంతుడు కరుణాకరుడు రాజీవాక్షుడు జ్ఞాననిధీ అయిన శ్రీరామ
చంద్రున్ని చూచేను. నామనస్సులో మాటిమాటికీ ఇలా తలంచుకున్నాను.
అయ్యయ్యో! నామనస్సు మోహం అనే బురదలో మునిగి పోయింది.
రెండు గడియల కాలంలోనే నూరు కల్పాలు గడిచి పోయినట్టు భ్రాంతి
చెంది ఎన్నో బ్రహ్మాండాలలో తిరిగి తిరిగి అలసి పోయేను. అనుకొనే
నన్ను చూచి సచ్చిదానంద మూర్తిమైన శ్రీరామచంద్రుడు నవ్వేడు. ఆ
సుందరమైన మృదువైన అతని నోటినుండి బయటికి వచ్చేను. అప్పుడు
ఇంతకు ముందు లాగునే నాతో శిశు చర్యలు చేస్తూ రామచంద్రుడు ఆడు
కుంటున్నాడు. అప్పుడు నేను ఎన్ని విధాలుగా మనస్సమాధానం చేసు
కుందామన్నా నా చిత్తానికి విశ్రాంతి లేక చికాకు పొంది పోయింది. ప్రభువు
యొక్క చరిత్ర అంతాచూచి ఆపరమ పురుషుని పరమ మహత్వం తెలిసి
కొని అతని పాదపద్మాల దగ్గర భూమిమీద పడిపోయేను. ఒక్క
మాటైనా నోటినుండి రాలేదు. కొంత సేపటికి తెలివిపొంది గోవిందా!
ఆర్త శరణ్యా! కృపా సముద్రా! రామచంద్రా! రక్షించు. రక్షించు. అన
గానే నన్ను ప్రేమ విహ్వలునిగా తెలిసికొని సంతోషంతో చూచి తన
మాయనూ గొప్ప మహిమనూ ఉపసంహారం చేసి సుందరమైన తన
హస్తాన్ని నా శిరస్సు మీద ఉంచి నేను పొందే సమస్త దుఃఖం పోగొ
ట్టేడు. నామోహమంతా పోయింది. ముందు నేను చూచియున్న మహా
మహిమ నంతటినీ తలంచుకొని సుఖించేను. శ్రీరామచంద్రుని భక్త
వత్సలత చూడగానే నాకు అధికమైన భక్తి కలిగింది. కన్నులనుండి బాష్ప

గతిసేనని ఎల్లప్పుడూ అధికమైన భక్తితో నన్ను సేవించేదాసుడు అందరి కంటే నాకు మితలేని ప్రియుడూ వెంటనంటి ఉండి రక్షిస్తుంటాను. మళ్లా మళ్లా చెపుతున్నాను విను సత్యంగా నాకు భక్తుని కంటే ఇష్టుడు లేడు. ప్రపంచమంతటిలోనూను. కాబట్టి నాభక్తుడవై సమస్త శుభాలూ పొందు. భక్తి లేనివాడు బ్రహ్మదేవుడైనా సరే అన్ని జీవులలాగే నాకు ప్రియుడు. భక్తి కలవాడు ఎంత నీచుడైనా నాకు ప్రాణ సమానమైనవాడు నా మాటయధార్థం శుచి కలవాడూ సత్ప్రవర్తన కలవాడు పరిశుద్ధమైన మనస్సుగలవాడూ అయి నాపాదసేవ నిరంతరం చేస్తుండేవాడు నాకుఎంతో ప్రియమైనవాడని వేరేచెప్పడమెందుకు అటువంటివానిని చూచినప్పుడు? ఎవరికి ప్రీతిపుట్టదు? వేదాలూ పురాణాలూ అటువంటివాని సద్గుణాలను ఎంతో ప్రశంసిస్తున్నాయిగదా? ఒకతండ్రి యొక్క కొడుకులలోనే ఎంతో భేదం ఉంటుంది. ఒకడు పండితుడవుతాడు ఒకడుతపశ్శాలి అవుతాడు ఒకడుజ్ఞాని అవుతాడు ఒకడు ధనవంతుడవుతాడు ఒకడుశూరుడవుతాడు, మరొకడు త్యాగిఅవుతాడు.

ఇంకొక కొడుకు అన్నిధర్మాలూ విడిచిపెట్టి తండ్రిని భక్తితో సేవిస్తుంటాడు. వాడే తండ్రికి ప్రాణసమానమైన ప్రియుడయి ఉంటాడు. తండ్రికి అందరు కొడుకుల మీదా ప్రేమే గాని భక్తితో తనను సేవించే కుమారుని యందు ప్రేమ విశేషంగా ఉంటుందిగదా, ఆ విధంగానే ఈ చరాచర జీవకోట్లన్నీ నావల్లనే పుట్టినప్పటికీ అన్నింటియందుండే ప్రేమ కంటె మదం మాయా లేకుండా పరిశుద్ధమైన మనోవాక్కాయాలతో భక్తికలిగి నన్ను సేవించేవారు స్త్రీలైనా పురుషులైనా యేజీవులైనా సరే నాకు మిక్కిలి ప్రియులు అన్నిలోకాలలో నూ ఇది సత్యమైన నామతము. సర్వసమ్మతం కూడాను, కాబట్టి ఇతరమయిన ఆశలన్నీ విడిచిపెట్టి నీవునన్నే భజించు ఎల్లప్పుడూ నన్నే స్మరించు, నారూపం ధ్యానించు సేవించు ఈ కాలం నిన్నేమీ బాధించలేదు. అని పలికిన ప్రభువు మాటలు విని నేను అమృతాన్ని నాచెవులతో తాగి తన్మయమైన చిత్తంతో శరీరం గగుర్పాటు

చెందగా విచారించడానికి శక్యంకాని ఆనందాన్ని పొందేను. పక్షీంద్రా! అప్పుడు నేను పొందిన ఆనందాన్ని సుఖాన్ని నాచెవులూ మనస్సూ ఎరుగును. గాని నాలుకతో వర్ణించలేను. రాముణ్ని దర్శించి సుఖమనుభవించినకన్నులూ వర్ణించగలవా? ఆ ప్రకారంగా అనేక విధాలుగా ప్రభువు నాకు బోధించి సుఖాన్ని పొందించి మునుపటిలాగునే ఆటలాడుకుంటూ ఆకలి అవుటచేత ముఖం ఎఱ్ఱబారగా తల్లివైపుమాస్తుంటే అతని తల్లి చూచి మంచిమాటలాడి ఎత్తుకొని ఒడిలో కూర్చోబెట్టుకొని రాముని చక్కని చరిత్ర పాడుతూ పాలిచ్చింది. సృష్టిస్థితి సంహారాలు చేసే ముగ్గురు నేర్పరులకూ మూలకారణమయినవాడు తల్లిఒడిలో కూర్చొని పాలు తాగుతున్నాడంటే తత్త్వం తెలియని మూఢజనులు మోహంలో పడిపోరా? సమస్త సుఖాలూ ఇచ్చే శంకరుడు ఏ సుఖాన్ని నితంంకోతుంటాడో అటువంటి సుఖ మహాసముద్రంలో నిరంతరం అయోధ్యా ప్రజలందరూ తేలుతున్నారు. అటువంటి సుఖం లేశమయినా కలలోనైనా అనుభవించిన సజ్జనులు గొప్ప బ్రహ్మానంద సుఖాన్నైనా ఎప్పుడు లెక్కచెయ్యరు. విహగనాథా! అప్పుడు నేను కొంతకాలం నరకూ అయోధ్యలో నివసించి శ్రీరామచంద్రుని శిశువినోదం అంతాచూచి ఆనందపరవశత్వం అనుభవించి అతని ప్రసాదంవల్ల భక్తివరంగా పొంది ప్రభుపాదాలకు నమస్కరించి నాయాశ్రమానికి తిరిగీ వచ్చేను. దేవా! ఎప్పుడైతే రామచంద్రుడు నన్ను కరుణతోచూచి తనవాన్నిగా చేసుకున్నాడో అప్పటినుండీ మాయనన్ను బాధించకుండా విడిచిపోయింది. విష్ణుమాయనన్ను మిక్కిలి ఆడించిన రహస్యగాథ అంతా నీకు చెప్పేను ఇంక నా అనుభవం చెపుతాను విను. రాముణ్ని భజించకుండా మరొకసాధనం దేనివల్లా దుఃఖం నశించదు. సీతానాథుని కరుణలేనిదే అతని మహిమ తెలియదు, తెలియందే విశ్వాసం కలుగదు. విశ్వాసంలేకపోతే ప్రీతిపుట్టదు, ప్రీతిపుట్టకపోతే స్థిరమయిన భక్తి నిల్వదు. కలుగదుకూడాను వైరాగ్యం లేకపోయినా తగినగురువు లేకపోయినా జ్ఞానం కలుగదు, హరిభక్తి లేకపోతే సుఖం ఉండదని వేదాలూ

పురాణాలూ ఘోషించి చెపుతున్నాయి. నీరులేంటే ఓడ ఎలా నడవలేదో అలాగే జనులకి జ్ఞానభక్తివల్ల సహజమైన ఆనందం యేర్పడదు. దేవిశ్రాంతి సుఖం ఉండదు. సంతోషం లేకపోతే కామం వదిలిపోదు. కామంవదలక పోతే కొంచెమైనా మనస్సుకి సుఖం కలలోనైనా ఉండదు నిరంతరం రామభజన భక్తితో చేస్తుండకపోతే కామవాంఛలు వదలవు. విమలమైన విజ్ఞానం పొందకపోతే నిర్వాసమత్వ భావం ఏర్పడదు, ఆకాశం లేకపోతే విశాలమయినదియుండదు. భూమిలేకపోతే చెట్లు పుట్టవు శ్రద్ధలేకపోతే ధర్మ సంగ్రహం చెయ్యలేము. భూమిలేకపోతే గంధం ఉండదు. స్థిరమైన తపస్సు చెయ్యకపోతే తేజస్సు వృద్ధికాదు. నీరులేకపోతే రుచి ఉండదు. పండితులసేవ చెయ్యకపోతే సత్ప్రవర్తన పొందలేము అగ్నిలేకపోతే రూపం ఉండదు. ఆత్మసుఖానుభవం లేకపోతే మనస్సుకి స్థైర్యం ఏర్పడదు వాయువు లేకపోతే స్పర్శ తెలియదు విశ్వాసంలేకపోతే ఆత్మజ్ఞానసిద్ధి కలుగదు వైనతేయా! విష్ణుభజన చెయ్యకపోతే సంసారభయం నశించి పోదు. విశ్వాసంలేకపోతే భక్తి ఎలా కుదురుతుంది? దృఢమైన భక్తిలేనిదే శ్రీరామచంద్రుడు హృదయం కరిగి దయతో చూడడు. రాముని కరుణ సంపాదించకపోతే జీవులకు విశ్రాంతి ఎన్నడూ ఉండదు. ఇది ఆలోచించి మనస్సు సంశయాలూ కుతర్కాలూ విడిచిపెట్టి అదిదేవుడైన రామున్ని కరుణానిధానున్ని ఆశ్రితావనున్ని మోక్షసుఖాన్ని ఇచ్చేవాన్ని ఎల్లప్పుడు భజించుతుండు మిత్రా! రాముని మహత్వం నా బుద్ధికి అందినట్టూ వర్ణించిచెప్పేను. యుక్తిచేత కల్పించిచెప్పలేదు, ఇదంతా నా కళ్ళతో చూచేను. పక్షీంద్రా! రాముని నామరూపాలూ సద్గుణ గాథలూ అనంతాలు. వేదశాస్త్ర పురాణాదులూ శేషుడూ చంద్రమౌళీ నియమముతో భజిస్తుండీ కూడా పారంచేరలేరు మునీశ్వర్లు తమబుద్ధులచేత గ్రహించినంతమాత్రమే నిత్యం పాడుతుంటారు. నీచమైన దోమ మొదలుకొని పక్షిరాజులైన నీవరకూ ఎగిరి ఆకాశంయొక్క అంతం తెలిసికోలేనట్టు సర్వేశ్వరుడైన రాముని మహిమ అనంతమగుటచేత యోగులూ

మునులూ తపస్వులూ శంకరుడూ బ్రహ్మదేవుడూ కూడా చివరతెలిసికో లేరు. సీతానాథుని మహిమ వర్ణించిచెప్పడానికి నాకు శక్యమవుతుందా? నూరుకోట్ల మన్మథులైనా రాముని సౌందర్యానికి సాటిగారు. కోటిమంది దుర్గాదేవులైనా రాముని ఆటోపానికి సాటిగారు. నూరుకోట్ల దేవేంద్రుల వైభవమైనా రామునివైభవంతో సాటిగాదు. నూరుకోట్ల ఆకాశాలైనా రాముని అవకాశంతో సాటిగావు. నూరుకోట్ల సూర్యుల ప్రకాశమైనా రాముని ప్రకాశంతో సరిపోదు. నూరుకోట్ల వాయువులబలంకూడా రాముని బలంతో సాటిగాదు. నూరుకోట్లయముల తీవ్రకఠినత్వం కూడా రామ చంద్రుని కఠినత్వానికి సాటిగాదు. సంసార సంబంధమైన సమస్తతాపాలూ నివారించడానికి నూరుకోట్ల చంద్రులచల్లదనం కూడా శ్రీరామచంద్రుని చల్లదనానికి సాటిగాదు. స్వామీ! అతడు శతకోటి తోకచుక్కలకంటే భయంకరమూర్తి. అతడు కాలానికి కాలుడు. వెయ్యికోట్ల పాతాళాలైనా అతని లోతుకి సమానంకావు. నూరువేల లక్షకోట్ల యములైనా ప్రభువు యొక్క ఉగ్రాకారానికి సమానంకారు. రామనామం నూరుకోట్ల పుణ్యతీర్థాల కంటే పావనమైంది. హనుమంతునికి ప్రాణప్రదమైంది. పండితులైన వారిని రక్షించేది నూరుకోట్ల హిమపర్వతాలైనా శ్రీరామచంద్రుని అచల త్వంతో సరికావు. నూరుకోట్ల సముద్రాలైనా ప్రభువుయొక్క గంభీర స్థితికి సాటికావు. అన్నికోరికలనూ ఇచ్చే రామవిభునితో నూరుకోట్లకామ ధేనువులైనా చాలవు. నూరుకోట్ల సరస్వతీ దేవులైనా శ్రీరామచంద్రుని చతురత్వానికిసాటికాదు. నూరుకోట్ల బ్రహ్మవిష్ణుమహేశ్వరులైనా రాముని సృష్టిస్థితి లయసంహారానికి సమానులుకారు. వారి వ్యాపారాలచేత ధనస మృద్ధిచేత నూరుకోట్ల కుబేరులైనా రామునికి సాటిగారు. భారంభరించ డానికి నూరుకోట్లశేషులైనా రామభద్రునికి సమానులుకారు. సకల ప్రపం చాన్నీ పంచభూతాలనీ పంచకోశాలనీ పంచవిషయాలనీ కల్పించి వాటి అన్నిటియందూ అనక్తి కలవానివలె ఉండి వాటిఅన్నిటితో సంబంధము లేకుండా ప్రకాశిస్తుందే జానకీహృదయేశ్వరుని దగ్గర కోటిమాయలైనా పనికి

రావు. శ్రీరామచంద్రుడు. అవధిలేనివాడూ ఉపమానంలేనివాడు పరమేశ్వరుడూ సర్వవ్యాపకుడూ చరాచర ప్రాణులనూ భరించేవాడూ ఏ వికారాలూలేనివాడూ బ్రహ్మవిష్ణుమహేశ్వర్లకంటే మొదటివాడూను మిణుగురు పురుగుల సమూహంసూర్యునితో సమానంకాని విధంగా అధికులైన అందరికంటే తానే అధికుడై తనకంటే అధికులెవ్వరూలేని సీతారాముని తో సాటిచేసి చెప్పడానికి ఏదీలేదు.

అందుచేతనే వేదశాస్త్రపురాణాదులు రాముణ్ని అనుపముడు అని కొనియాడు తుంటాయి ఆవిధంగానే మునీశ్వర్లు తమ బుద్ధులచేత గ్రహింప గలిగినంతయే స్తోత్రముచేస్తుంటారు పరమ దయామయుడూ ఎవరిభావం ఎట్టిదో గ్రహించే సమర్థత గలవాడూ ఐన రాముడు వారిస్తోత్రాలనూ వర్ణనలనూ విని శిశువుల మాటలకు తల్లి సంతోషించేలాగున సంతోషిస్తుంటాడు. శ్రీరామచంద్రుడు అపారమైన సద్గుణ సముద్రుడు కాబట్టి ఎవరైనా అతణ్ని తెలిసికొని పారంచేరగలరా? సజ్జనులు అతణ్ని గూర్చి చెప్పగా విన్నంత మాత్రమే నీతో చెప్పేను. పరిశుద్ధభావం గలవారికి వశమయేవాడూ సమస్త లోకేశ్వరుడూ భగవంతుడూ నాశంలేనివాడూ సుఖనిధానమైనవాడూ కరుణాసముద్రుడూ జానకీనాథుడవటచేత అభిమానం గర్వం మదం విడిచిపెట్టి మమత్వంమాని ఎల్లప్పుడూ అతని భజనచేస్తుండాలి. అని కాగభుశుండి చెప్పగావిని గరుత్మంతుడు అపరిమితానందపరవశుడై రెక్కలు పొంగిపోతుండగా కన్నులనుండి ఆనందబాష్పాలు రాలుతుండగా తనమనస్సులో సీతానాథుని మహిమను తలంచి తలంచి ముందుతాను పొందిన మోహాజ్ఞానకారణాననే తనలో తాను ఇలా పరితాపం పొందేడు ఆదిమధ్యాంత రహితుడైన పరబ్రహ్మమైన వాణ్ని మనుష్యుడనుకొని నేను ఎంత భ్రాంతి పొందేను? ఈ ముని కరుణవల్ల ఇప్పుడు ఆ భ్రాంతి అంతా పోయింది. అని ఆమునీశ్వరుని పాదలమీద మళ్ళా మళ్ళా పడి ఇతడు శ్రీరామచంద్రునితో సమానుడని భావించి అపరిమితానందంతో భక్తి వృద్ధిపొందుతుండగా సమస్కారాలుచేసి ఇలా అంటున్నారు.

మహాత్మా! సంసారసముద్రం దాటడానికి గురువులేకపోతే బ్రహ్మరుద్రాదుల కైనా శక్యంకాదు. నీవల్ల నా అవివేకం చేత పుట్టిన సంశయాలన్నీ తీరి పోయేయి. నన్ను సంశయం అనేపాము కరచింది. మోహం అనేకవిషం ఎక్కిపోయింది. కుతర్కం అనే దుఃఖం కలిగించే తరంగాలు లెక్కలేనన్ని పుట్టేసాయి నీరూపంగా శ్రీరామచంద్రుడు మాంత్రికుడై వచ్చి నన్ను బ్రతికించేడు దేవా! నీకృపవల్ల రామరహస్యం అంతా బోధపడ్డది. అని కాక మునీశ్వరున్ని గరుత్మంతుడు అనేక విధాలుగా స్తోత్రంచేసి నమస్కరించి వినయంతో చేతులు జోడించి అంటున్నాడు. స్వామీ! నా అవివేకం వల్ల అడుగుతున్నాను కాబట్టి ఆదరంతో నన్ను నీదాసునిగా తలంచి కరుణతో నాకు సమాధానం చెప్పుమని వేడుకుంటున్నాను నీవు తామసంలేని వాడవూ నిర్మల చిత్తంగలవాడవూ సర్వజ్ఞుడవూ సకల ప్రవర్తన గలవాడవూ ప్రసిద్ధిచెందిన శీలం కలవాడవూ బ్రహ్మజ్ఞానివీ. రామభక్తుడవూ పరిపూర్ణ వైరాగ్యం గలవాడవూ గదా అటువంటి నీకు కాకి శరీరం కలగడానికి కారణమేమి? మనోహరమైన రామచరిత మానస సరోవరం వనం నీకు ఎలా లభించింది? అదంతా నాకు సవిస్తరంగా చెప్పుమని ప్రార్థిస్తున్నాను. మహాప్రళయ కాలంలో కూడా నీకు నాశంలేదని పరమేశ్వరుడు చెప్పేడు. శివునిమాట అసత్యం కాదుగదా. ఇది నాకు అద్భుతంగా ఉంది సమస్తచరాచర జీవసమూహాన్నీ బ్రహ్మాండాలన్నింటినీ కాలం లయంచేసేస్తుంది. ఆకాలాన్ని ఎవ్వరూ అతిక్రమించలేరు అనఘా! అభయంకరమైన కాలం నిన్ను అంటలేక పోవడానికి కారణం ఏవో ఉంటుంది యోగబలం వల్లనా? జ్ఞానమహిమ వల్లనా? ఆ సమాచారం నాకు తెలియ జెయ్యి మహాత్మా! నీ ఆశ్రమంలో ప్రవేశించే సరికే నా అజ్ఞానం భ్రమా నశించిపోయేయి. దీనికి కారణమేమో నాకు తెలియ జెయ్యి స్వామీ! అని అడిగిన గరుత్మంతుని మాటలు విని కాగభుశుండి హర్షపరవశుడై అంటున్నాడు.

## కాగభుశుండి తనకు కాకిశరీరం కలగడానికి కారణం తెలుపుట

వినతాతనయా! నీబుద్ధి ధన్యమైంది నీప్రశ్న వినడానికి చాలా ఇష్టమైంది నీకు ఇలా ప్రశ్నించగానే నాకు అనేక జన్మలయొక్కవృత్తాంతమంతా జ్ఞాపకం వచ్చింది. నాచరిత్రంతా విన్నవిస్తాను శ్రద్ధతోవిను. జపం తపం వ్రతం శమం దమం యజ్ఞం దానంయోగం విజ్ఞానం నిర్మలమైన వైరాగ్యం వీటి అన్నింటికీ ఫలితం శ్రీరామచంద్రపాద భక్తే. అది కలగందే ఎవ్వరూక్షేమాన్ని పొందలేరు మహాత్మా! నేను ఈశరీరంతోనే రామభక్తిని పొందేను. అందుచేత నాకు ఈశరీరంమీదే ప్రేమ ఎక్కువ. కోరిక దేనివల్ల నెరవేరితే దానియందే గదా జనులకు ప్రేమ తనకుమేలు చేసినవాడు నీచుడైనా అతన్ని ప్రేమించడం నీతి అని వేదశాస్త్రపురాణాలూచెపుతున్నాయి. సజ్జనులు కూడా చెపుతుంటారు. పట్టుపురుగు వల్ల మనోహరములైన పట్టువస్త్రాలు లభించడం చేతనేగదా అదినీచమైన పురుగని ఆలోచించకుండా మనుష్యులూ దాన్ని ప్రేమతో పెంచుతుంటారు జనులకు స్వార్థలాభమందే ఆసక్తి అధికం. శరీరాలు ధరించిన ప్రాణులందరికి మనోవాక్కాయాల చేత సీతారామచంద్ర పాదపద్మభక్తితత్పరతయేయధార్థమైన స్వార్థం అపారమైన మేలు చేసేదీ అదే జీవులకు ఏశరీరంతో ఉన్నప్పుడు రామపాద భక్తి కలుగుతుందో ఎడతెగకుండా ఆశరీరం రమపావనమైందీ సౌభాగ్యవంతమైందీని రామభక్తి లేనివాడు బ్రహ్మదేవుని శరీరం వంటి శరీరం ధరించినవాడైనా వానిని పండితులూ కవులూ ప్రస్తుతి చెయ్యరు. రామభక్తున్ని ఆదరంతో గౌరవిస్తారు. ఈశరీరంతో నేను రామభక్తి పొందగలిగేను అందుచేత నాకు ఈశరీరం మీద ఎంతో ప్రీతి ఒకవేళదీన్ని విడిచిపెట్టాలని కోరితే విడిచిపెట్ట వచ్చును కానిదీన్ని విడవడానికి నాకు ఇష్టంలేదు. ఎందుచేతంటే ఏదో ఒకశరీరం లేకపోతే రామ భజనచేయడానికి ఎవరికి వీలుకాదని చెప్పబడ్డదివేదాలలో.

పూర్వం మోహం నన్ను నానాకష్టాలూ పెట్టింది. రామవిముఖత చేత ఎక్కడా విశ్రాంతిలేక దుఃఖపడి అనేక జన్మలెత్తిన తరువాత జపం

చేసేవారూ సజ్జనులని సర్వజనులచేతా ఆమోదింపబడుతున్నారు. పరద్రవ్య
హరణ పరాయణులే గొప్పబుద్ధిమంతులనీ డాంబికులే గొప్పపుణ్యాచరణు
లనీ అత్యంత పలికేవారే మంచి సద్గుణవంతులనీ ప్రపంచంలో ఎన్నబడు
తున్నారు. ఆచారహీనులూ నీచవృత్తులు చేసేవారూ వేదనింద చేసేవారూ
ఎల్లప్పుడూ డాబులుకొడుతూ ఏడబడవాగుతుండే వారూ జ్ఞానులనీ వైరాగ్యం
గలవారనీ చెప్పబడుతున్నారు. జడలూ గోళ్లూ పొడుగుగా పెంచుకున్న
వాళ్ళే గొప్ప తపస్వులూ గొప్ప పుణ్యాత్ములూ అని జనులచేత ఎన్నబడు
తున్నారు.

శుభంకాని వేషం వేసుకొని తినదగినవి తినరానివి అనే విచక్షణ
లేకుండా ఎటువంటి పదార్థాలైనా తినేవాళ్ళే పూజింపదగిన వాళ్ళనీ గొప్ప
యోగసిద్ధి పొందినవాళ్ళనీ ప్రజలచేత ఎన్నబడుతున్నారు. కొండేలు చెప్పే
వారూ అపకారం చేసేవాళ్ళూ నిత్యం మాననీయులూ గౌరవనీయులు అనీ
అతి వాగుడు గలవారూ అబద్ధాలాడేవారూ అందరిచేత వక్తలని ఎన్నబడు
తున్నారు. స్త్రీలకు వశులైపోయి తెలివిలేనివారై కోతులలాగున గౌరవము
పోగొట్టుకొని అద్దులేనిమిధున క్రీడలు చేస్తున్నారు పురుషులు. శూద్రులు
జంధ్యాలు వేసుకొని బ్రాహ్మణులకు జ్ఞాన బోధచేస్తున్నారు. దుర్దానాలు
పట్టుతున్నారు పాపపు కలికాలంలో నరులందరూ లోభపరాయణులూ కామ
క్రోధాలతో కూడినవారూ దుర్బుద్ధిగలవారూ వేదలనూ సద్గుణవులనూ సజ్జ
నులనూ బ్రాహ్మణులనూ విరోధంగా చూచేవారూ దైవదూషకులూ అధర్మ
రతులూ అయిపోయేరు. సద్గుణవంతులూ సౌందర్యవంతులూ అయిన తమ
భర్తలను విడిచిపెట్టి పరపురుషులను సేవించే దౌర్భాగ్యశీలం గల స్త్రీలు
ఎక్కువైపోయేరు. పుణ్యస్త్రీలందరూ ఆభరణాలు ధరించడం మానేసేరు.
విధవలు ఆభరణాలు ధరిస్తున్నారు. గురువు గుడ్డివాడూ శిష్యుడు చెవిటి
వాడూను. గురువుచూడడు శిష్యుడువినడు శిష్యునియొక్క దుఃఖనివారణ
చెయ్యకుండా వానిధనం మాత్రం తీసికొనే గురువు గురువు అనిపించుకోడు.
వాడుమిక్కిలిపాపాత్ముడవుట చేతభయంకరమైనపరకకూపంలో పడిపోతాడు

తల్లిదండ్రులు తమపిల్లలకి కడుపు నింపుకొనే హీనమైన అబద్ధపు విద్యతే నేర్పుతున్నారు ఉత్సాహంతో కోరికలు వృద్ధి పొందుతుండగాను. స్త్రీలూ పురుషులూ బ్రహ్మజ్ఞానం అంటే ఏమిటో తెలియక తమ పిల్లలకు ఎల్లప్పుడూ దుర్బోధలే చేస్తుంటారు. గురువూ బ్రాహ్మణుడూ అనకుండా పూజ్యులను వంచిస్తుంటారు శూద్రులు బ్రాహ్మణులతో మేము తక్కువవారమా? మీకు బ్రహ్మజ్ఞానం ఉందా? మీరా బ్రాహ్మణులు? అనివాదిస్తున్నారు మదమత్తులైన శూద్రులు అలావాదించి గద్దించి కళ్ళెఱ్ఱజేస్తుంటే వారికి జవాబు చెప్పలేక బ్రాహ్మణులు చిరాకుపడుతుంటారు. పరస్త్రీలంపటులూ కపటంతో ప్రవీణత కనపరచేవారూ దోహం మోహం మమత్వం నిండి ఉన్న బుద్ధి గలవారూ జ్ఞానులనీ అభేదవాదులనీ చతురులని చెప్పబడుతున్నారు ఆకలియుగంలోవారు స్వయంగా దుర్మార్గప్రవర్తన కలవారేకాకుండా సన్మార్గులను కూడా దుర్బోధలచేత వారి బుద్ధులను పాడుచేసి కుతర్కాలు చేసి వేదాలను నిందిస్తుంటారు.

అటువంటి దుష్టులైన కలికాల ప్రజలు ఒక్కొక్క నరకంలో ఒక్కొక్క కల్పం వరకూ పడిఉండి నానాబాధలూ పడుతుంటారు. వారికి మేలు ఎన్నటికీ కలుగదు. అనఘా! ఆకలికాలంలో నీచకులంలో పుట్టిన తెలకలివాళ్ళూ కుమ్మరివాళ్ళూ శ్వపచులూ కిరాతులూ మొదలైనవాళ్ళందరూ సంపద పోగొట్టుకొని భార్య చచ్చినా తలకాయ మున్నగా గొరిగించుకొని ఒక చోట ఉండకుండా కపటంతో సన్యసించి తిరుగుతున్నారు అటువంటి వారు బ్రాహ్మణులచేత కూడా పాదపూజలు చేయించుకొని తమచేతులతోటే ఇహపరసుఖాలను నశింపజేసికొని మహానరకంలో పడిపోతుంటారు, బ్రాహ్మణులు అక్షరజ్ఞానమేలేక లోలత్వం కామం ఎక్కువగా కలిగిఉండి దురాచారులూ దుష్టబుద్ధులూ శూద్రస్త్రీలతో భోగిస్తూ తిరుగుతున్నారు. శూద్రులు జపాలూ తపాలూ దానాలూ చేస్తూ ఉన్నతాసనాలపై కూర్చొని శాస్త్రాలూ పురాణాలూ చెప్పడానికి పూనుకుంటున్నారు. దుర్నియం వర్ణించడానికి శక్యంకాదు. జనులందరూ కల్పితాచారాలు చేస్తున్నారు. నీతి నశించిపోయింది.

కర్మలన్నీ నియమం లేకుండా చెయ్యడంవల్ల దేవతలకు నరులమీద ప్రేమ లేక వర్షాలు క్రమంగా కురిపించడం మానేసేరు. భూమి మీద సస్యాలు పూర్తిగా పండడం మానేసి ఎండిపోతున్నాయి. స్త్రీలు వెఱ్ఱి వెఱ్ఱి వికారపు శృంగారాలు చేసుకుంటున్నారు. ప్రపంచంలో అందరికీ ఆకలి ఎక్కువై పోయింది. దరిద్రులూ దుఃఖాలతో తపించిపోయేవారూ మమకారం మోహం కలిగినవారూ అయిపోయేరు జనులు. అందరూ సుఖం కావాలని కోరతారు. మూఢులై పోయి కొంచెమైనా ధర్మాసక్తి లేకుండా ప్రవర్తిస్తారు. హృదయాలు అతికఠినకగా ఉంటాయి. రోగపీడితులై పోయి భోగాలను భవించలేక రాగం రోషం అభిమానం గర్వం అధికంగా కలవారై కారణం లేకుండా విరోధాలు పొంది పాపమనే బురదలో దిగబడిపోయి జను లందరూ దుఃఖాలపాలై పోతున్నారు. స్త్రీలు భర్తలమాట వినక మీకే గాని మాకుస్వతంత్రం లేదా? మీరు స్వేచ్ఛగా తిరిగినప్పుడు మేమెందుకు తిరగకూడదు? అని అడ్డులేకుండా స్వేచ్ఛగా తిరుగుతున్నారు. ఆయుష్కాలాలు తగ్గిపోయి పదిహేనేండ్లే జీవితకాలమై పోయినా కల్పం అంత అయే వరకూ చావులేదనుకొని యిష్టానుసారం సంచరిస్తున్నారు జనులు. కలి వృద్ధి పొంది పోయి జనులందరినీ దుస్థితి పొందేలాగున చేసేసింది. కూతుళ్లనూ చెల్లెళ్లనూ కొంచెమైనా ఆదరించడం మానేస్తున్నారు జనులు. సౌమ్యతా సంతోషం ఆలోచనా ఏ జనులలోనూ లేదు. గొప్పకులం వారూ తక్కువ జాతివారూ సమానంగానే తిరుగుతున్నారు. పక్షీంద్రా! కలిప్రభావం ఏమని చెప్పేది? ఎక్కడచూచినా పరుషవాక్యాలు పలికేవారు ఎక్కువై పోయేరు. ఎక్కువలో లత్వం ఈర్ష్య పూర్ణంగా ఉన్నాయి సమభావం లేదు. వర్ణాశ్రమధర్మాలు పూర్తిగానశించిపోయేయి. ఆడవాళ్ళు మగవాళ్లు కూడా మహాక్రోధులై పోయి తమ శరీరాలనే పోషించుకుంటున్నారు. ధ వం తులు బాహ్యేంద్రియనిగ్రహముదానంచేసే గుణమూ దయా ఓరిమీ ఎరుగనే యెరుగరు. మూఢులూ పరవంచకులూ అక్రమంగా ప్రవర్తించేవారూ పరదా

షకులూ ఎక్కువైపోయేరు. వైనతేయా! ఘోరమైనకలికాలంలో పాపాలూ దుర్గుణాలు నివసించి ఉంటాయి. కాని కలి యుగంలో శ్రమలేకుండా మోక్షసుఖాన్ని పొందవచ్చును. కాబట్టి మిక్కిలి ఉత్తమమైంది. అందుచేత అది ఎంతచెడ్డదో సజ్జనులకు అంతమంచిది. కృతయుగంలో ధ్యానంవల్లా త్రేతాయుగంలో యజ్ఞాలు చేయడం వల్లా ద్వాపరయుగంలో పూజలు చేయడంవల్లా ఏఫలితం కలుగుతుందో ఆఫలితం కలియుగంలో నామస్మరణ వల్లే కలుగుతుంది. కృతయుగంలో జ్ఞానులూ యోగులూ మనసారా విష్ణుధ్యానంచేసి శాశ్వతపదాన్ని పొందుతుండేవారు. త్రేతాయుగంలో నానావిధ యజ్ఞాలూచేసి అకర్మఫలాన్ని విష్ణుదేవునికి అర్పించి శాశ్వతమైన ముక్తినిపొందుతుండేవారు. ద్వాపరయుగంలో శ్రీరామచంద్రుణ్ని భక్తితో పూజించి తరించేరు. పాపపు పనులుచేయకుండా కపటంలేకుండా శ్రీరామచంద్రుని సద్గుణ చరిత్రను భక్తితోగానం చేసినందువల్ల సంసార సముద్రాన్ని వేగంగా అతిసులభంగా దాటిపోవచ్చును. ఆప్రకారం యోగం యజ్ఞాలూ నిర్మల జ్ఞాన విజ్ఞానాలూ అవలంబించ గలరా? కలియుగంలో జనులకు వాటి అక్కరలేకుండా ఇతరసంకల్పాలు మానేసి అన్నివేళలందూ శ్రీరామచంద్రుణ్ని భజిస్తుండేవారూ పరమభక్తితో రామకథలు చదువుకొనేవారూ. నిస్సంశయంగా ఘోరసంసారాన్ని దాటి నిత్యానందాన్ని పొందగలరు. కలియుగంయొక్క గొప్పపవిత్రతా మహిమా నాకువెల్లడిగా బోధపడ్డది మనస్సుచేత చేసిన పుణ్యఫలం తప్పక లభిస్తుది మనస్సుచేత తలంచినంతమాత్రాన్ని పాపఫలంరాదు. కలియుగంతో సమానమైన యుగంవేరేలేదు జనులు విశ్వాసంతో నిరంతరం శ్రీరామచంద్రుని చరిత్ర చదువుకుంటే దుఃఖాలూ శోకాలూ పోయి శ్రమలేకుండా సంసార సముద్రాన్ని దాటి శాశ్వత సుఖం పొందగలుగుతాడు.

విశ్వాసంఉంచి శాశ్వతుడైనా శ్రీరామచంద్రుని చరిత్ర అనే అమృతాన్ని శ్వపచుడైనా పానంచేస్తుంటే నాశనంలేని మోక్షసుఖాన్ని శ్రమలేకుండా పొందగలుగుతాడు. ధర్మానికి నాలుగుపాదాలు.

అందులో ఒకపాదమే ప్రధానమైంది. కలియుగంలో ఎవరికైనా మనః పూర్వకంగా భగవదర్పణ బుద్ధితో దానం చెయ్యడమే నిస్సంశయంగా సకల శుభాలనూ కలుగజేస్తుంది. శ్రీరామచంద్రుని మాయాప్రేరేపణవల్ల అందరి హృదయాలలోనూ నాలుగుయుగాల ధర్మాలూ ప్రతిదినమూ ఉంటుంటాయి. శుద్ధ సత్వగుణమూ అనుభవజ్ఞానంతో కూడిన సమత్వభావమూ ధైర్యమూ చిత్తప్రసన్నతా కలిగినపుడు అవి కృతయుగధర్మాలని తెలిసికోవాలి. సత్వగుణం అధికంగానూ రాజసగుణం తక్కువగానూ ఉండి కర్మలయందు ఆసక్తి కలిగి అన్ని సుఖాలను అనుభవించదగిన లక్షణాలు త్రేతాయుగధర్మాలని తెలిసికోవాలి. స్వల్పమైన సత్వగుణం అధికంగా రాజసగుణం కొంచెం తామసగుణం కలిగి ప్రవర్తించే స్వభావాలు ద్వాపరయుగధర్మాలని తెలిసికోవాలి. తక్కువరాజసగుణం ఎక్కువతామసగుణం కలిగి సత్వగుణం చాలాతక్కువై వైరభావంతో ప్రవర్తించే లక్షణాలు కలియుగధర్మాలని తెలిసికోవాలి. పండితులు ఈయుగధర్మాలను తెలిసికొని అధర్మాలని విడిచిపెట్టి సద్ధర్మాలను ప్రీతితో అవలంబిస్తుంటారు. వినతాతనయా! మరొకమంచిమాట చెపుతాను విను.

శ్రీరామచంద్ర పాదారవింద భక్తిదృఢంగా ఉన్నవాన్ని ఈయుగ ధర్మాలేవీ భ్రాంతిపొందించలేవు ఆసర్వేశ్వరుని కరుణవానియందు అధికంగా ఉండడంచేత. నాట్యగాని కపటనటన వానిసేవకున్ని ఎప్పుడూ భ్రమపొందించ లేనట్టు రామసేవకుడైనవాన్ని రామమాయ ఎప్పుడూ భ్రాంతి పొందించ లేదు. హరిసేవచేయకుండా హరిమాయచేత కల్పింపబడ్డగుణ దోషాలు తొలగిపోవు. ఇదితెలిసికొని నిరంతరం హరిభజన చేస్తుండాలి. ఏ కోరికలూ లేకుండా. ఖగరాజా! ఆ కలియుగంలో నేను అయోధ్యలో చాలా కాలం ఉంటి అతిదీనంతో దరిద్రుడనై దుఃఖిస్తూ ఉజ్జయినీ నగరానికి వెళ్ళిపోయేను. అక్కడ నాకు కొంచెం ధనం కలిగింది. శివున్ని పూజించడం మొదలు పెట్టేను. ఆ నగరంలో నే ఒకవైదిక బ్రాహ్మణుడు వేదవిధి ప్రకారం

శివుణ్ని భక్తితో పూజిస్తుండేవాడు. అతనికి శివపూజ తప్ప రెండోపనేలేదు. పరమార్థం తెలిసినవాడు. పరమసాధువు. ఎప్పుడూ హరినినిందించడు బ్రాహ్మణులందరిలో శిరోరత్నంలాంటివాడు. నేను అతణ్ని మనస్సులో కపటం తోనే సేవించేను. ఆ బ్రాహ్మణుడు పవిత్ర బుద్ధిగలవాడు దయగలవాడు నీతితెలిసినవాడు. నిష్కల్మషస్వభావుడు పైకి నేను వినయవిధేయతలు కనపరుస్తుంటే అతడు నిజమనుకొని నమ్మి తనపుత్రునిలాగున చూచుకొని ప్రేమతో నాకు బోధించి చదివిస్తుండేవాడు నాకు శివమంత్రం ఉపదేశం చేసి ఆదయామయుడు ఎన్నోశుభకరమైన పద్ధతులు బోధించేడు. అప్పటి నుండీ నేను నిత్యం శివమందిరానికి వెళ్లి జపం చేస్తుండేవాడిని, కాని నేను ఖలున్ని. మలినబుద్ధిగలవాణ్ని, గర్వాంధుణ్ని, నీచకులంలో పుట్టినవాణ్ని మోహావశుణ్ని అవుటచేత నామనస్సులో అహంకారందంభం అధికంగా ఉండేయి విష్ణుభక్తులనూ సాధువులనూ బ్రాహ్మణులనూ చూచేసరికి మండి పడుతుండేవాణ్ని హరిద్రోహినయ్యేను. అటువంటి నా ప్రవర్తన అంతా చూచి నా గురువు ఎక్కువదుఃఖపడిఎల్లప్పుడు నెమ్మదిగా నాకు బోధిస్తుండేవాడు. కాని సద్బోధ చేస్తున్న కొద్దీ నామనస్సులో రోషం మరింత ఎక్కువైపోయేది. డాంబికుడికి ఎప్పుడైనా ధర్మమూ నీతి వినసహిస్తుందా? ఒకసారి గురువుగారు నన్నుదగ్గరకు పిలిచి అనేక విధాలైన ధర్మాలూ నీతికథలూ చెప్పి వత్సా! శివభజన వల్ల కలిగే ఫలం చెపుతాను. విను. ఏమనుకుంటున్నావోగాని శ్రీరామచంద్రుని పాదభక్తి వృద్ధిపొందడమే శివుణ్నినిత్యం నియమంతో సేవించినందు వల్ల కలిగేఫలం. సీతానాధుడు సర్వాధికుడైన పరమాత్ముడు పరబ్రహ్మ స్వరూపుడు. అందుచేత ఎల్లప్పుడూ శివుడూ బ్రహ్మదేవుడూ కూడా శ్రీరామచంద్రుణ్ని భక్తితో సేవిస్తుంటారు. అజ్ఞానం వల్ల యథార్థం తెలిసికోలేనివనుల మాట లెక్కేమిటి? రాముడికి శివుడికిభేదం లేదు, రాముడే శివుడు శివుడే రాముడు. అభేద బుద్ధితో శివుణ్నిపూజిస్తే విష్ణుదేవుడు సంతోషిస్తాడు విష్ణువునుపూజిస్తే శివుడు సంతోషిస్తాడు. శివపూజచేసి విష్ణునిందచేసిన వారూ విష్ణుపూజ

చేసి శివుణ్ణి నిందించేవారూ మహానరకంలో పడిపోతారు. ఓరి, నిర్భాగ్యుడా ఎవనిపాదపద్మాలను భక్తితో శివుడూ బ్రహ్మచేవిస్తుంటారో ఆశ్రీరామ చంద్రునికి ద్రోహివై కుటిల బుద్ధితో ముక్తికోరితో అదినీకు సాధ్యమను కున్నావా? అన్నాడు. గరుత్మంతా! శివుడు విష్ణుసేవకుడు అన్నగురువు మాటలు వినగానే నాకు మహాకోపం వచ్చిహృదయం బగబగమండి పోయింది.. తరువాత జరిగిన కథ చెపుతానువిను. పాముకి పాలుపోస్తే విషంగామారిపోయినట్టు నీచజాతి వాడినవుటచేత అతని యొద్దవిద్య నేర్చు కొని అతనికే ద్రోహంచెయ్యాలని ఆలోచిస్తుండేవాణ్ని. గురువు చాలాదయ గలవాడూ కోపంలేనివాడూ అవుటచేత మళ్లామళ్లా నాకు మంచిజ్ఞానబోధ చేస్తుండేవాడు నీచుడు ఎప్పుడైనా దేనివల్ల ఘనత పొందితేదాన్నివాడు చెయ్యాలని తలంచుతుంటాడు. అగ్గివల్ల అవిరిపుట్టి ఆకాశానికి వెళ్లి మేఘమై అదినీరుగామారి ఆఅగ్గినే ఆర్పేస్తుంది. కాదా? భూమిమీదపడి ఉండేపరాగం కాళ్లతో తొక్కబడి అతి నికృష్టంగాఉండేదైనా గాలిచేత ఎగురగొట్ట బడి గాలికి భారం కలిగిస్తుంది. అంతేకాక రాజకిరీటం మీదా కళ్లలోనూ పడి ఆగాలిని అందరిచేతానిందింపజేస్తుంది కాదా? ఇది ఆలోచించి పండితులు ఎన్నడూ నీచజనులతో సహవాసం చెయ్యరు. నీచులతోస్నేహం చెయ్యడం కలహించడం కూడా తగదని కవులూ పండితులూ చెపుతుంటారు. కాబట్టి దుర్మార్గులైన నీచుల్ని ఎప్పుడూ చెంత చేరనియ్యకుండా కుక్కను చూచి నట్టు దూరంగా ఉంచుతుండాలి. ఖగరాజా! నేను అతికుటిలుణ్ణి ఖలుణ్ణి నీచుణ్ని కాబట్టి గురువు నామేలు కోరి ఉపదేశించినా నాకు రుచించిందికాదు. ఒకనాడు నేను శివాలయంలో కూర్చొని శివనామం జపిస్తున్నాను. అంతలో గురువుగారు అక్కడికి వచ్చేరు. నేను చూచికూడా నామనస్సులో దురభి మానమూ గర్వము అధికంగా ఉండడంచేత ఎదురుగా వెళ్లలేదు. నమస్కా రమూ చెయ్యలేదు. అలా కూర్చొని ఉండి పోయేను పరమ దయాస్వ భావుడైన ఆగురువు ఏమీ అనలేదు. ఆపరతత్వం తెలిసిన ఆబ్రాహ్మ ణోత్తమునికి కొంచెమైనా కోపంరాదు సుమా. అయినప్పటికీ గురువు

గారికి పరాభవం చెయ్యడం మహాపాపమవుట చేత నేను చేసిన తప్పుకి ఆపరమేశ్వరుడు చంద్రమౌళి సహించలేక పోయేడు.

అప్పుడు శివమందిరంలోంచి అతి గంభీరంగా ఆకాశవాణి ఇలా వినబడ్డది. ఓరీ! భాగ్యహీనుడా! నీవు చేసిన తప్పుకి నీ గురువు దయగలవాడూ సమ్యజ్ఞానీ అవుటచేత అతనికి కొంచెమైనా కోపంరాలేదు. అయినప్పటికీ ఓరీ దురహంకారుడా; జ్ఞానహీనుడా! నీచుడా! అధర్మంగా నీతి తప్పి నడిస్తే నాకిష్టంలేదు కాబట్టి నీకిప్పుడే శాపమిస్తున్నానురా. మూఢుడా! నీకు తగినశిక్ష చెయ్యకపోతే నావేదమార్గమంతా భ్రష్టమై పోతుందిరా ఖలుడా; ఏదుష్టుడు గురువు దగ్గర ఈర్ష్యచూపిస్తాడో వాడు కోటికల్పాల వరకూ నరకంలోపడి ఉంటాడు, ఆ తరువాత మూడులోకాలలోనూ నానా యోనులందూ పుట్టి పదివేల జన్మలు పొంది మహాదుఃఖాలనూ బాధలనూ అనుభవిస్తుంటాడు. ఓరి పాపాత్ముడా! నీవు గురువు వచ్చేసరికి లేవకుండా కొండచిలువలాగున కూర్చున్నావు కాబట్టి ఒకసర్పానివై గొప్ప చెట్టు తొర్రలో ఉండు అని శపించేడు శంకరుడు. ఆదారుణమైన శాపంవిని గురువు గారు హా; హా! అంటూ గడగడ వణకి పోతున్న నన్నుచూచి కరుణగల వాడై వెంటనే భూమి మీదపడి సాష్టాంగంగా పరమేశ్వరునికి నమస్కారం చేసి రెండుచేతులూ జోడించి ఫాలమందుచేర్చుకొని శివదేవుని యెదుట నిలబడి గద్గదకంఠముతో పురహరా: సంసార దుఃఖనివారణా! అని పలు కుతూ ఆబ్రాహ్మణుడు తనమనస్సులోన ఘోరమైన నాగతిని తలంచుకొని శివునిశాపం అమోఘమైందిగదా అని ఆమహాదేవున్ని అద్దులేనిధారతో ప్రపీ ణతతో ఈ ప్రకారంగా స్తోత్రం చెయ్యడానికి ప్రారంభించేడు.

రుద్రా! సర్వేశ్వరా! మోక్షస్వరూపా! దేవా; సర్వవ్యాపకా; పరా త్పరా; పరబ్రహ్మ: సగుణనిర్గుణాతీతా! నిష్పందా! నిర్వికల్పా! సచ్చిదా నందా! గౌరీశా! స్వప్రకాశా, ప్రణవమూలా! సర్వపాపహరణా! ఇంద్రియ జ్ఞానాతీతా! వాగగోచరా! సర్వసాక్షీ! కాలాకాలా! కృపాలవాలా! గిరీశా!

అమేయా! హరా! తురీయా! శర్వా! మనోహరమైన హిమవత్పర్వతంవంటి తెల్లని శరీరవర్ణంగలవాడా! చక్కని బాలచంద్రునితో కూడిన విశాల ఫాలంగలవాడా! కోటిమన్మథాకారా! జటాజూటమందు గంగానదిని ధరించిన వాడా! సర్పాభరణా! కదిలే కుండలాలుగలవాడా! వర్ణించలేనంతటి ప్రసన్న మైన మనోహరముఖం కలవాడా! భగవంతుడా! మూడుకన్నులున్నవాడా! మూడుగుణాలనూ ప్రేరేపించేవాడా! నీలకంఠా! గోవిందా! శివా! పులితోలు వస్త్రంగాధరించేవాడా! వేదాంత విచారణవల్ల బోధపడే సారమైనవాడా! సాటిలేని తేజస్సుగలవాడా! జగదంతరాత్మా! సౌందర్యనిలయా! పార్వతితో కూడిన అర్ధశరీరం గలవాడా! నాథా! నిరీహా! భయంకరం కపాలమాలి కలు ధరించిన కంఠంగలవాడా! సూర్యచంద్రాగ్ని నేత్రా! శూలాయుధధారీ! మేరుపర్వతం ధనస్సుగా గలవాడా! కైలాసపర్వతనివాసా! సంసారభయనివారణా! భవా! బ్రహ్మవిష్ణువుల చేత నుతింపబడేవాడా! అభవా! ప్రచండరూపా! పరమేశ్వరా! శుభగరా! ఖలనాశకా! కోటిసూర్య ప్రకాశా! దేవతలూ గంధర్వులూ మరుత్తులూ మొదలైన ఆకాశగమనం చేసేవారి చేతవినుతింపబడే చరిత్ర కలవాడా! నీకు నమస్కరించే సజ్జను లకు ఇష్టదవై మేలుచేయువాడా! తాపత్రయ నివారణ చేసేదివ్య నామంగలి వాడా! నిత్యుడా! నిర్మలుడా! నాశలేనివాడా! వికారాలులేనివాడా! పరిశుద్ధ భావంచేత పొందదగినవాడా! నిరామయుడా! ప్రకృతికి దూరమైనవాడా! విశ్వనాథా! కళాతీతా! ప్రళయం చేసేవాడా! మోహాంధకారభాస్కరా! మూడు శరీరాలూ దాటి ప్రకాశించేదివ్య పదవియందుండువాడా! సర్వసందే హనివారణా! గొప్పహాలాహలాన్ని పానంచేసినప్రవీణుడా! లావణ్యంతోనిం డినవాడా! పినాకపాణీ! లోక కల్యాణకరా! భక్తలోకవరదా! మదనమద దమనా! మృడా! ప్రమథగణ నాథా నీకు అనేకనమస్కారాలు చేస్తున్నాను. ప్రభూ! ప్రసన్నుడవై మమ్ములనుచూడు నాథా! నరులు ఎంతవరకూనీపా దపద్మసేవ చేయడానికి ఇష్టపడరో అంతవరకూ ఇహమందూ పరమందూ కూడా సుఖమూ శాంతిపొందలేరు. సర్వభూతాధివాసా! విశ్వప్రకాశా! విశ్వ

కారణా! విశ్వేశ్వరా! విశ్వభరణా! అన్మయానందమూలా! శత్రుసమూహాన్ని జయించినవాడా! ఈశ్వరా! సుప్రసన్నుడవై మమ్మల్ని చూడు. నిన్ను భక్తితో సేవించని జనులకు ఎన్నడూ సంతాపాలు నశించవు గొప్ప మోహంలో పడిపోయి పుట్టుకలూ రోగాలూ మరణాలూ అనే చక్రంలో పడిపోయి విడిపించుకోలేరు. నిత్యసుఖం పొందలేరు. యోగాలూ జపాలూ పూజలూ యజ్ఞాలూ మొదలైన వేవీ ఎరగను. అయినప్పటికీ ఎల్లప్పుడూ నాగతినీవే అని నమ్మి నీకు భక్తి పూర్వకంగా నమస్కారంచేస్తున్నాను. జననం రోగం మరణం అనే ఆపదకు భయపడి ఉన్నాను. తాపత్రయంచేత తపించిపోతున్నాను అటువంటినన్ను కరుణతోచూచి రక్షించు సర్వేశ్వరా! మునిహృదయ సరస్సులో విహరించే హంసస్వరూపా! పండితులకు సుఖాన్ని ఇవ్వడానికి కారణమైనవాడా! అని యీవిధంగా శంకరునికి ప్రియమైన స్తోత్రం ఆబ్రాహ్మణుడు భక్తితో చేసేడు. దీన్ని ఎల్లప్పుడూ భక్తితో ఎవరు చదివినా పరమశివుడు ప్రసన్నుడై సమస్తమైనకోరికలూ సిద్ధింపజేసి మోక్షాన్నికూడా ఇస్తాడు. ఈవిధంగా స్తోత్రంచేసిన ఆబ్రాహ్మణుని భక్తికి సంతోషించి సర్వజ్ఞుడైన మహాదేవుడు ఆకాశవాణిగా ఓభక్తాగ్రేసరా! నేను సంతోషించేను, నీకేవరంకావాలో అడుగు. అన్నాడు. అదివిని బ్రాహ్మణుడు ఓ దేవదేవ! నీవుప్రసన్నచిత్తుడవైతే దీనుడనైన నాయందు నిర్మలస్నేహభావంతో కరుణతోచూచే వాడవైతే నాకునీపాదపద్మభక్తి దృఢంగా నిలిచేలాచెయ్యి.

పరమేశ్వరా! మరొకవరం కూడా కోరుకుంటున్నాను. అనుగ్రహించాలి. త్రినేత్రా! మదించిన గజాసురున్ని సంహరించినవాడా! చంద్రశేఖరా! చండికాపతీ! కోటి సూర్యప్రభాభాసురా! బలమైన నీమాయకు వశులైపోయి మూఢులైన జీవులుఇపూర్తిగా మరిచిపోయి కావరంతో సంచరిస్తుంటారు. నీవు కోపిస్తే ఎలానిలవగలుగుతారు? కాబట్టి కరుణానిధీ! ఆర్తత్రాణ పరాయణా! వీనికి నీవిచ్చిన శాపం కొంచెం కాలంలోనే

తీరిపోయేలాగున చేసి కరుణతో రక్షించు. ఏవిధంగా వీడికి పరమ శుభం కలుగుతుందో ఆవిధంగా చేయుమని పరహితంకోరి ఆ బ్రాహ్మణుడు కోరే వరానికి పరమశివుడు మెచ్చుకున్నాడు. అప్పుడు అట్లేయగుగాక! అని కోవెలలోనుంచి ఆకాశవాణి వినబడ్డది. అంతేకాకుండా వీడు దుష్టుడు. ఘోర పాపంచేసేడు. నా శాపం పొందికూడా నీసాధుత్వంచేత నాదయను పొంద గలిగేడు. శాంత శీలం గలవాడూ ఆదరంతో పరోపకారం చేసేవాడూ అయిన బ్రాహ్మణుడు శ్రీరామచంద్రుని లాగున నాకు అత్యంత ప్రియు డౌతాడు నాశాపం ఎన్నడూ అసత్య అయిపోదు. అయినా వీడికి వెయ్యి జన్మలకి శాపం తీరిపోతుంది, వీడుపుట్టేటప్పుడూ చచ్చేటప్పుడూ భరించ రాని దుఃఖం బాధా అనుభవించనక్కర లేదు. అన్నిజన్మలలోనూ వీడికి జ్ఞానం ఉంటుంది. ఈనాప్రమాణమైన ఆజ్ఞ వీడు హృదయంలో నిలుపు కొనునుగాక! అని బ్రాహ్మణునితో వలికి ఓరీ! శూద్రుడా! నీవు ఆశ్రీరామ చంద్రుని నగరంలో జన్మిస్తావు. ఆపురం యొక్క గొప్ప ప్రభావం వల్ల నన్ను ఆరాధిస్తావు. నా అనుగ్రహం వల్ల నీకు ఆశ్రీరామచంద్ర పాద పద్మాలయందు అఖండమైన భక్తి కలుగుతుంది. ఆపదలు పొందకుండా నిన్ను ఈబ్రాహ్మణోత్తముడు రక్షించేడు. అన్నా! నామాటలు సత్యమై నవి. బ్రాహ్మణ సేవ విష్ణుదేవునికి ఎంతోఇష్టం కాబట్టి బ్రాహ్మణులకు అవమానం ఎప్పుడూ చెయ్యకు. సజ్జనులను విష్ణు సమానులని తలంచు చుండు. దేవేంద్రుని వజ్రాయుధం భయంకరమైన నా త్రిశూలం యమ ధర్మరాజు కాలదండం సాటిలేని విష్ణుచక్రం చంపలేనంతటి గొప్పవా నైనా బ్రాహ్మణద్రోహం అనే అగ్ని కాల్చి భస్మంచేసేస్తుంది. కాబట్టి మరిచిపోయైనా బ్రాహ్మణులకు అపకారం ఎప్పుడూ చెయ్యబోకు. అందు వల్ల నీకు శ్రేయస్సుకలుగుతుంది బ్రాహ్మణారాధనమే చేస్తుండు. కుమారా! ఈవివేకం నీహృదయంలో నిలుపు కొన్నావంటే నీకులోకంలో దుర్లభమైంది ఏదీ ఉండదు. ఏనాటికీ బాధలేని గతి లభిస్తుంది యధార్థంగా ఇదేనా ఆశీర్వాదం అని శంకరుడు పలుకుతుండగా వినబడే ఆకాశవాణివిని

గురువుగారు తథాస్తు. అన్నారు. అలా అని గురువుగారు శరీరం పులకరిస్తుండగా వినయంతో పరమేశ్వరుని మనస్సులో తలంచుకొని కన్నుల నుండి ఆనంద బాష్పాలు కారుతుండగా హరా! గౌరీ హృదయ సరోజభృంగా సజ్జనవరదా। పరాత్పరా: భవహరా। శశిధరా। పురహరా। ఎల్లప్పుడునాకు నీసేవనే ప్రసాదించు. అని ప్రార్థించి ఆ పుణ్యాత్ముడు నన్నుచూచి అనేకవిధాలుగా నా బోధించి తన యింటికివెళ్ళిపోయేడు

అతిభక్తితో శంభుని పాదపద్మాలు హృదయంలో నిలబెట్టుకొని కాలప్రేరేపణవల్ల భయంకరమైన సర్ప శరీరం ధరించి నేను వింధ్య పర్వతారణ్యంలో ఉండి కొంతకాలానికి శ్రమలేకుండా ఆశరీరం విడిచిపెట్టే నేను, తరువాత ఎన్నోజన్మలు పొందిన శ్రమలేకుండానే ఆశరీరాలను విడిచిపెట్టేస్తుండేవాడిని. పాతవస్త్రాలు విడిచిపెట్టి కొత్తవస్త్రాలుధరించి నట్టు కొత్త శరీరాలు ధరిస్తుండేవాన్ని. విశ్వనాథుడు వేద ధర్మాన్ని నిల బెట్టడానికి నన్ను శపించేడేగాని తరువాత నాగురువుగారి అనుగ్రహంవల్ల నాయందు కరుణించడంవల్ల ఎన్నిజన్మలెత్తినా కొంచెమైనా కష్టంపొంద లేదు అన్ని జన్మలలోనూ నాకు జ్ఞానంకూడా తగ్గిపోలేదు. దేవతాజన్మలూ నరజన్మలూ మొదలైనవి ఎన్నోపొంది శ్రీరామచంద్ర పాదపద్మ భక్తి విడవకుండా భజనచేస్తుండేవాన్ని కాని నామనస్సులో నా గురువు గారు ఎంతమంచి స్వభావంగలవారు ఎంత మృదుచిత్తం గలవారు ఇటువంటి మహానుభావుని యొద్ద నా దుస్స్వభావం కనపరచేను. అనే ఆర్తిమాత్రం విడవలేదు. నామనస్సుకి ఎంతో బాధకలింగిం చేది. వైనతేయా। విను వేదాలు పురాణాలూ ఎటువంటి జన్మదేవతలకు కూడా దుర్లభమని చెపుతుంటాయో అటువంటి ధర్మమందు ఇష్టంకలిగిన బ్రాహ్మణజన్మ నాకు కలిగింది. ఆజన్మలో కొంతకాలానికి నేను ప్రేమతో బాలలీలలు చేస్తూ ఎల్లప్పుడూ బాలురతోకూడి ఆడుకుంటూ ఉండేవాన్ని నామనస్సనే తుమ్మెద ఎల్లప్పుడూ శ్రీరామచంద్ర పాదారవింద మకరందం

పానంచేస్తూ మత్తెక్కి ఉండడం చేత నాకు ఏవిధమైన వాసనాలేదు. "నాకు చదువుకొనే యీడు వచ్చింది. మాతండ్రి నాచేత అనేకవిధాలైన శాస్త్రాలు చదివించేడు, అవన్నీ తెలిసికొన్నాను. గణితశాస్త్రం నేర్చుకొన్నాను. కాని నాకు అవేవీ ఇష్టపడకుండా ఉండేవి. ఏఅభాగ్యుడైనా కామధేనువు సేవ మానేసి గాడిదసేవ చేస్తాడా? ఈశ్వరాసక్తి కలవాడు ఇతరమైనవాటిని మెచ్చుకుంటాడా? శ్రీరామచంద్ర పాద సరోజ మకరందపానంవల్ల అపారసుఖంపొంది మత్తెక్కిన మనస్సు ఇతరసుఖాలను కోరుతుందా? ఎంతో ఆనందంతో అమృతపానం చేసి సుఖమనుభవించే నోరు ఎప్పుడైనా ఎండిన మారేడుపండ్లు తినడానికి ఆశపడుతుందా? నా తండ్రి నన్ను చదివించి చదివించి ప్రయోజనమేమీ లేకపోవడం చేత విసుగెత్తి ఊరుకున్నాడు. కొంతకాలానికి తల్లిదండ్రులు ఇద్దరూ గతించడంచేత భగవంతున్ని సేవించడానికి అరణ్యానికి వెళ్లిపోయేను.

ఆ యరణ్యంలో ఎక్కడెక్కడ మునీశ్వరుల ఆశ్రమాలుంటే అక్కడికివెళ్ళి ఆమునీశ్వరులకు సంతోషంతో శిరస్సువంచి నమస్కారం చేస్తుండేవాన్ని. విశ్వనాథుని కరుణ తరుగు లేకుండా నాయందు ఉండడం చేత ఆమునీశ్వరులను శ్రీరామచంద్రుని కథలు చెప్పమని అడిగి వారు చెపుతుంటేవింటూ ఆనందంతో తిరుగుతుండేవాన్ని. నాహృదయంలో ఈ షణ్త్రయం అణగిపోయింది ఒక్క కోరికమాత్రం హృదయంలో ప్రబలంగాఉండేది. అదేదంటే శ్రీరామచంద్రపాదపద్మ దర్శనం నాకు ఎప్పుడు అవుతుందో అప్పుడేనాకు జన్మసాఫల్యం అవుతుందని. ఏమునీశ్వరున్ని అడిగినా ఈశ్వరుడు అన్నిప్రాణులయందూ ఉంటాడని చెప్పేరు. కాని నిర్గుణుడైన పరమేశ్వరున్ని సేవించేనేర్పు నాకులేనందున ఆమతం నామనస్సుకేమీ సంతోషం అనిపించలేదు. సగుణరూపుడైన భగవంతున్ని ఆరాధించడమే నాకెంతోయిష్టం దానివల్లనాకు భక్తివృద్ధి పొందుతుండేది. భగేశ్వరా! నాగురువుగారు ఉపదేశించిన వాక్యాలు తలంచుకొని నియమంతో కమలా

నాథునికీర్తిని పాడుకుంటూ క్షణక్షణానికీ రామపాదకమలభక్తి వృద్ధి పొందు తుండగా సంతోషంతో తిరిగేను. మేరు పర్వత శిఖరాన్ని మఱ్ఱిచెట్టునీడని లోమశుడనే మునీశ్వరున్ని చూచి నేను సంతోషంతో నమస్కారంచేసి దీన త్వంతో వినయ వాక్యాలు పలుకుతుంటే నా మృదువాక్యాలు విని ఆ మునీం ద్రుడు కరుణగల వాడవుటచేత నన్ను చూచి ఆదరంతో ఓ బ్రాహ్మణుడా! ఏమిపని కోసం వచ్చేవు అని అడిగేడు అప్పుడు నేను ఓ కృపాకరా! నీవు ప్రకాశమానమైన జ్ఞాననిధివీ సర్వజ్ఞుడవూ అవుటచేత నాకు దయతో సగుణరూపుడైన భగవంతున్ని ఆరాధించే పద్ధతి బోధించు మని నిన్ను ప్రార్థిస్తున్నాను, అన్నాను. అదివిని ఆమునీంద్రుడు సంతోషించి ఎల్లప్పుడూ ఉమానాథుడు స్మరించి ఆనందించే శ్రీరామచంద్రుని చరిత్ర నాకు చెప్పేడు తరువాత ఆ మునీశ్వరుడు అనుభవజ్ఞాన సంపన్నుడవడం చేతనూ బ్రాహ్మజ్ఞానమందు ఆసక్తికలవాడూ అవుట చేతనూ నన్ను బ్రహ్మో పదేశం పొందడానికి అధికారిగా భావించి ఆదరంతో బ్రహ్మజ్ఞానాన్ని ఉపదే శించేడు. రాముడంటే పరంధాముడు. జన్మలేనివాడు రెండుకానివాడు. మూడుగుణాలూ లేనివాడా. అందరిహృదయాలలో ప్రభువై ఉండేవాడు. ఆదిలేనివాడు నిత్యజ్ఞాన స్వరూపుడు, ఏబాధాలేనివాడు. సమస్త ప్రపంచానికీ అతడే ఆధారమైనవాడు నిష్కళుడు నిరీహుడు వికలత్వం లేనివాడు నామరూపాలు లేనివాడు అఖండుడు. అంతటావ్యాపించి ఉన్నవాడు. అనుభ వంచేతపొందదగినవాడు, ఆదీఅంతమూలేనివాడు. సాటిలేనివాడు ముసలితనం లేనివాడు. రోగాలులేనివాడు. మనస్సుకీ ఇంద్రియాలకీ అందనివాడు. మలిన లేనివాడు మితంలేనివాడు నిర్వికారుడుసుఖరాశి అవధిలేనివాడు.సమ స్తప్రపంచానికీ అధిష్ఠానమైనవాడు ప్రకృతికిఅంటనిపరబ్రహ్మస్వరూపుడు అటువంటి శ్రీరామచంద్ర పరబ్రహ్మమున్నూ నీవన్నూ ఒక్కటే. కానివేరు కాదు. అదెలాగంటే నీటికి కెరటానికూ ఎలాగైతే భేదంలేదో ఆప్రకారంగా నే ఈశ్వరుడికీ నీకూ ఏమీభేదం లేదు. శరీరానికి ఇంద్రియాలకీ అతీతుడై ప్రకాశించే ప్రత్యగాత్మకూ పరబ్రహ్మానికీ కొంచెమైనా భేదంలేదని నిశ్చ

యించివేదవేదాంత శాస్త్రాలు వెల్లడి చేసి బోధిస్తున్నాయి. కాబట్టి అవిద్య చేత శరీరమేనేననే భ్రాంతి పొంది తిరుగుతున్ననీవు ఆ అజ్ఞాన భ్రాంతి విడిచిపెట్టిజ్ఞానదృష్టితో నీవు ఎన్నటికీ నాశంలేని పరమాత్ముడవని తెలిసికో. అని అనేకవిధాలుగా నాకు ఆమునిచంద్రుడు విశదపరచి బోధించేడు. నాహృదయంచేత నిర్గుణ పర బ్రహ్మంఅనే మతంగ్రహించలేక ఆమహానుభావుని పాదాలకు నాశిరస్సు అంటేలాగున నమస్కరించి ప్రభూ! నాకు సగుణ బ్రహ్మోపాసన చేసే పద్ధతి బోధించు. దానివల్ల శ్రీరామచంద్రుని దర్శనం నాకు అయేలాగున చెయ్యి నామనస్సు అనే చేప శ్రీరామభక్తి, అనేనీటిని విడిచి బ్రతుకలేదు. ఓ జ్ఞాననిధీ: కరుణా జలధీ: పండితశ్రేష్ఠా: వేదశాస్త్రాలయందు చెప్పబడ్డ సద్గుణములుగల మహానుభావా! ముందునా కన్నులనిండా భవనైక సుందరమైన శ్రీరామచంద్రుని దివ్యరూపాన్ని చూచి భక్తి పరవశున్నైపోయి ఆ తరువాత నిర్గుణ బ్రహ్మను గురించిన బోధను చెవులకు పండుగయేలాగున వింటాను మహాత్మా! నాకు నిర్గుణ పరమాత్మజ్ఞానం మోహాంధకారాన్ని పోగొట్టే అపరిమిత కాంతితో ప్రకాశించే అద్వయ పరబ్రహ్మతత్వాన్ని అప్పుడు ఉపదేశించండి. అన్నాను. అప్పుడు అనుపమానమైన శ్రీరామచంద్ర చరిత్రనాకు మళ్లా చెప్పి ఆమునీశ్వరుడు అదంతా ఖండించి నిర్గుణ పరమాత్మతత్వాన్ని నిరూపించి చెప్పేడు. అప్పుడు కూడా ఆ నిర్గుణ మతంనాకు బోధపడక అదంతా దూరంచేసి సగుణాన్నే నిరూపణ చేసినేను మాట్లాడగానే ఆఉత్తమ మునీశ్వరునికి కోపంవచ్చింది. వినతాతనయా విను. ప్రపంచంలో ఎంతటి విజ్ఞానులకైనా తిరస్కారం చేస్తే తాముచెప్పిన దానికి వ్యతిరేకంగా ప్రత్యుత్తరం చెపితె అటువంటి దుర్బుద్ధిగలవారిమీద కోపంరాదా? మంచిగంధమైనా సరే మథించగామథించగా దానిలో నుంచి అగ్నిపుట్టదా? ఆకోపంతోటే మళ్లామళ్లా ఆనిర్గుణ రహస్యాన్ని బోధించేడు నాకామునీశ్వరుడు. నేనాబోధవింటూ నా మనస్సులో అనేకవిధాలైన అనుమానాలు పొందేను. ద్వైతబుద్ధిలేకపోతే క్రోధం ఎలా కలుగుతుంది? అజ్ఞానం లేకపోతే ద్వైత భావంకలుగదుగదా? ఆలోచించి

చూడగా మాయకువశుడై వేరువేరు రూపాలుగా ఏర్పడ్డ మందమతియైన జీవుడు ఈశ్వరసమానుడెలా అవుతాడు? ఇతరులకు మేలుచేసేవాడు దుఃఖం ఎందుకు పొందుతాడు? పరువేది సంపాదించినవాడు దరిద్రుడౌతాడా? తనకే అశుభం కలుగుతుందని తెలియక ఎల్లప్పుడూ ఒరులకు ద్రోహంచేసేవాడు శంకలేకుండా బతకగలుగుతాడా? కామంగలవాడు కళంకంలేకుండా ఉంటాడా? బ్రాహ్మణున్ని వంచించిన వాడికి వంశం ఉంటుందా? ఆత్మతత్వం తెలిసికొన్న వాడికి కర్మలు నశించిపోవా? దుర్మార్గుడైననీచుని స్నేహంచేస్తే సద్బుద్ధి కలుగుతుందా? పరస్త్రీని కోరేవాడు శుభగతిని పొందగలుగుతాడా? పరమార్థ రహస్యం తెలిసిన వాడు సంసార దుఃఖంలో పడిపోతాడా? ఇతరులను నిందించేవాడు సౌఖ్యం పొందుతాడా? నీతిలేని రాజ్యపరిపాలన నిలుస్తుందా? విష్ణుకథావర్ణన చేస్తుంటే పాపం నిలిచి ఉంటుందా? పుణ్యం చెయ్యకుండా పవిత్రమైన కీర్తి ఎలాకలుగుతుంది? పాపంచెయ్యకపోతే అపకీర్తి ఎలాకలుగుతుంది? సజ్జనులూ వేదపురాణాలూ దేన్ని గొప్పమహిమ గలదని కీర్తిస్తుంటారో అటువంటి భగవద్భక్తితో సమానమైన లాభం ప్రపంచంలో మరొకటుందా? మనుష్య జన్మపొంది కూడా శ్రీసీతారామచంద్రున్ని సేవించక పోవడం కంటే హానిమరొకటుందా? కొండేలు చెప్పుతుండడం తామస గుణం కలిగి ఉండడం కంటే పాపంమరేదైనా ఉందా? దయతో సమానమైన ధర్మం ఉందా? అని ఎన్నోయుక్తులు మనస్సులో ఆలోచించుకుంటూ ఆ మునీశ్వరుని ఉపదేశం వినలేము. అంతేకాకుండా సగుణస్వరూపుడైన దేవుణ్ని నిర్ణయించినేను జవాబు చెపుతుంటే కోపంతో ఆ మునీశ్వరుడు మూఢుడా! నేనుదయతో పరమార్థోపదేశం చేస్తుంటే భక్తిశ్రద్ధలతో విన్నావుకావు. అన్నింటినీ చూచి భయపడుతుండే కాకిలాగున సత్యమైన నామాటలు నమ్మక నాకు ఎదురు జవాబులిస్తున్నావు. నీకు మనస్సులో స్వపక్షమైన విశ్వాసం అధికంగా ఉండడంచేత నీవు పక్షులలో నీచమైనకాకి శరీరం ధరించు అనిశపించేడు.

గరుత్మంతా! ఆ మునీంద్రుని శాపం శిరసావహించేను. నాకు భయం గాని దీనత్వంగాని కొంచెమైనా కలుగలేదు. వెంటనే నేను కాకినై పోయి వినయంతో ఆ మునీశ్వరుని పాదాలకు నమస్కారంచేసి హృదయంలో శ్రీరామచంద్రుణ్ని స్మరించుకొని పరమానందంతో స్వేచ్ఛగా ఎగిరిపోయేను. హైమవతీ! విను శ్రీరామపాదభక్తులకు రాగద్వేషాలు ఉండవు కామక్రోధాలూ. ఉండవు రాముడే అంతటా నిండి ఉన్నాడని ఎల్లప్పుడు చూస్తుంటారు. అఘనులు ఆసద్భావంగల రామపాదభక్తులు ఎవరితోనూ పగలేకుండా ఉంటారు అని మహాదేవుడు అంబికకు ఆనతిచ్చేడు. విహగేశ్వరా! విను. ఇందులో ఆ మునీశ్వరుని దోషం ఆలోచించగా కొంచెమైనా లేదుసుమా, జగత్ప్రభువైన శ్రీరామచంద్రుడు నామనస్సులోని భక్తిని పరీక్షించడానికి అతని బుద్ధిని అలాతిప్పేడు. సమస్త జనుల హృదయాలనూ ప్రేరేపించే. దయామయుడూ అఖిలాంతరాత్ముడూ అయిన శ్రీరామచంద్రుడు ఆముని శాపరూపంగా నామనస్సును పరీక్షించేడు తన పాదభక్తునిగా నన్ను అంగీకరించేడు ఆవెంటనే రామప్రభుడు ఆ మునీశ్వరుని మనస్సు మార్చేసాడు. ఆ మహాత్ముడు నా సహజ శీలానికే ధృఢమైన రామభక్తికీ ఆశ్చర్యపడి మాటిమాటికీ చింతించి నన్ను ఆదరంతో పిలిపించి అనేకవిధాలుగా నన్ను సంతోషింపజేసి రామమంత్రం నాకు ఉపదేశించాడు. హర్షంతో బాలరూపంతో ఉన్న శ్రీరామచంద్రుని ధ్యానంచేసే విధానం నాకునేర్పేడు. ఆ కరుణానిధియైన ముని మిక్కిలి సుందరమైంది అత్యంతసుఖం కలిగించేదీ అయిన ఆధ్యానం నాకు ఎంతో ఇష్టమైంది పక్షీంద్రా! ఇదివరకు నీకు వర్ణించి చెప్పేనుగానా? ఆసౌందర్యరాశి అయిన ముద్దురామున్ని ఎల్లప్పుడూ స్మరించి ఆనందిస్తుంటాను. శ్రీరామచంద్రుని పాదపద్మ మకరందాన్ని తాగి మత్తెక్కిన చిత్తం అనే తుమ్మెద ప్రపంచ విషయాలనే పువ్వుల తేనె కావాలని వెళుతుందా? ఆమునీశ్వరుడు కొంతకాలం తన దగ్గర ఉంచుకొని నామనస్సు హర్షం పొందేలాగున మనోహరంగా వర్ణించి నాకు రామచరితమానసం వినిపించేడు తరువాత ఇలా అన్నాడు. పరమ శివుని కరుణ

వల్ల శ్రీరామచరిత మానస సరోవరం నాకు దొరికింది. నీవు శ్రీరామ చంద్రుడికి అంతరంగభక్తుడనని నీకు విపులం చేసి చెప్పేను.

హృదయంలో రామభక్తి ఎవరికి ఉండదో అటువంటి వారికి ఈ చరిత్ర చెప్పకూడదు. అని అనేక విధాలుగా బోధించేరు ఆ మునీశ్వరుడు. నేను అత్యంతభక్తితో ఆ మునీశ్వరుని పాదాలకు నమస్కారం చేసేను. ఆయన నాశిరస్సుమీద తన పవిత్రమైన చెయ్యిఉంచి ఈవిధంగాచెప్పేడు వత్సా! నా అనుగ్రహం వల్ల శ్రీరామచంద్రభక్తి ఎల్లప్పుడూ నీ హృదయంలో నిలిచియుండుగాక। నీవు శ్రీరామచంద్రుడికి అత్యంతప్రియుడవై అలరారుచుందువుగాక। సమస్త శుభాలకూ ఉనికిపట్టువై అభిమానం లేకుండా వైరాగ్యం కలిగి జ్ఞాననిధివై ఎప్పుడు నీవు కోరితే అప్పుడు నీ మరణం ఏరూపం కావాలంటే ఆరూపం పొందే శక్తి కలిగి జీవించు. నీవు ఏ ఆశ్రమంలో సీతావిభుని స్మరిస్తుంటావో ఆయాశ్రమానికి చుట్టూ యోజనం దూరం అవిద్యవ్యాపించదు. కుమారా। కాలకర్మలూ గుణదోషాలూ నిన్ను దుఃఖాన్నిపొందించలేవు. రాముని గూఢమైనవీ వెల్లడైనవీ సమస్త రహస్యాలూ రామునిగుణకథలూ ఇతిహాసాలూ పురాణాలూ అతి సులభంగా నీకు బోధపడతాయి. ప్రతి దినమూ సీతానాథుని పాదభక్తి కొత్త కొత్తగా వృద్ధిపొందుతుంది. నీవు మనస్సులో ఏమి కోరితే అది రాముని కరుణవల్ల సిద్ధిస్తుంది. అని ఆ మునీంద్రుడు ఆశీర్వదిస్తుంటే అది విని ఆకాశంనుండి బ్రహ్మవాణి తథాస్తు అని పలికి ఓ జ్ఞాననిధివైన మునీంద్రా! త్రికరణ శుద్ధిగా ఇతడు నాపాదభక్తుడు కాబట్టి ఇతనికి శుభాలుకలగడానికి కొరత ఎంతమాత్రంలేదు అని ఆకాశవాణిగా శ్రీరామచంద్రుడు అనతిచ్చిన మాటలు వినినేను సంతోషించేను. రామపాదభక్తి కూడా ఎక్కువైంది. సందేహాలన్నీ తొలగిపోయేయి. అప్పుడు. నేను వినయంతో ఎన్నో మార్లు నమస్కారంచేసేను ఆమునీశ్వరుని పాదపద్మాలకి. ఆవెంటనే ఆమహాత్ముని సెలవు పొంది ఈ ఆశ్రమానికి

వచ్చేసేను. వైనతేయా ! ప్రభువు ప్రసాదంవల్ల దుర్లభ మైన వరాలు పొందేను. ఇక్కడ నేనుఉండగా ఇరవై యేడు కల్పాలు జరిగి పోయేయి. నిత్యం ఆనందంతో ఉన్నాను. ఎల్లప్పుడూ శ్రీరామచంద్రుని సద్గుణాలను పాడుతుండడమేనాపని. జ్ఞానంగల పక్షుల సమూహమంతావచ్చి ఆరామచరిత్రంతా నిత్యం వినివిని ఆనంద సముద్రంలో మునిగి తేలుతుంటుంది. భక్తరక్షణ కోసం భగవంతుడు ఎప్పుడెప్పుడు అయోధ్యలో అవతరిస్తుంటాడో ఆయా సమయాలలో నేనువెళ్లి ఆపట్టణంలో నేనుండి బాలుడైన శ్రీరామచంద్రుని లీలలు చూచి శివునిచే జపింపబడే నామంగలిగిన మేఘశ్యాముడైన శిశురూపంతో ఉన్న ఆపరమాత్మున్ని నాహృదయ పద్మంలో నిలుపుకొన్ని ఇక్కడికి వచ్చేస్తుంటాను. నాకు ఈ కాకిదేహం ఎలావచ్చిందో ఆకథసవిస్తరంగా చెప్పినీ ప్రశ్నలన్నింటికీ సమాధానాలు చెప్పేను. శ్రీరామచంద్రుని భక్తియొక్కమహిమ అపారమైంది. సరస్వతీ దేవికైనా వర్ణించడానికి శక్యంకాదు. నాబుద్ధికి అందినంత చెప్పేను. ఖగనాయకా! ఈశరీరంతోటే నాయీశ్వరుడైన శ్రీరామచంద్రుని యందు భక్తి పెంపొందించుకోగలిగేను సీతానాథుని దర్శనం అవుతుంది. సమస్త సందేహాలూ తీరిపోయేయి. నిత్యం తరుగులేని ఆనందం లభించింది కాబట్టి నాకీ దేహం ప్రియమైంది. ప్రకాశమానమైన శ్రీరామచంద్ర పాదభక్తి ప్రభావం ఎంతని వర్ణించగలను? భక్తిపక్షాన్ని పంతంపట్టి మునీశ్వరుని శాపం పొంది మళ్లా అతని కరుణవల్లనే మునీశ్వరులకైనా దుర్లభమైన వరాలుపొందేను. భక్తియొక్క మహిమ వర్ణించి స్తుతించడానికి నాకు శక్యమౌతుందా? శ్రీరామచంద్రుడు ఎప్పుడూ భక్తికి సంతోషించినట్టు యోగం జపం తపం వ్రతంమొదలైన విధులెన్నింటికైనా మెచ్చడు భక్తియొక్కమహిమ తెలిసి కూడా అదిమానేసి కేవలం జ్ఞానం కావాలని కోరిఎన్నోకష్టాలు పొందేమూఢుడు ఇంట్లోకామధేనువు ఉండగా విడిచిపెట్టి ఎంతోశ్రమతో పాలకోసం తిరిగే వెర్రి వాడు లాంటివాడే కదా ! భక్తిని విడిచిపెట్టేసి వేరే ఉపాయాలచేత సౌఖ్యం కోరే జనుడు ఓడ విడిచి పెట్టి మహాసముద్రాన్ని కాలినడకతోదాట దలంచే తెలివితక్కువవాడేకదా!

సౌందర్యం గలస్త్రీనైనా మరొకస్త్రీచూచి మోహం పొందదు. శ్రీరామచంద్రునికి మాయా భక్తి అని ఇద్దరు స్త్రీలున్నారు. అందులోభక్తి ప్రియురాలూ మాయ నాట్యకత్తె అతనికి. శ్రీరామచంద్రుడు భక్తికిస్వాధీనమైపోయిఅనుకూలుడై ఉండడంచేతఆభక్తిని చూచిమాయభయపడుతూంటుంది. ఎవనిహృదయంలో శ్రీరామచంద్రభక్తి అపరిమితంగా ఉంటుందో అటువంటి వాన్నిచూచి సంకోచంతో మాయ తనమహిమని కనపరచదు కొంచెమైనాని ఆరహస్యం తెలిసికొని మునీశ్వరులు భక్తినే విశేషంగా కోరుతుంటారు. రాముని యొక్క ఈ పరమరహస్యాన్ని వేగంగా ఎవరూ తెలిసికోలేరు. ఆపరమేశ్వరుని కరుణ పొందినవారు మాత్రమే ఈ పరమరహస్యాన్ని తెలిసికొని ఎల్లప్పుడూ ఎడతెగని భక్తితో సేవించి స్వప్నంలోనైనాపరాకు చేతనైనా ఎన్నడూ మోహం పొందరు.

మిత్రమా ! విహంగనాథా! జ్ఞానం భక్తి అనే రెండింటి భేదమూ వెల్లడిగా బోధిస్తాను. ఆసక్తితో విను. భగవద్భక్తి అఖండంగా లభిస్తుంది. బుద్ధి అపరిమితమైన ఆనందరసంలో మునిగిపోతుంది. చెప్పడానికి అలవికాని ఒక కథ చెప్తానువిను అది తెలిసి కోవలసిందేకాని వర్ణించడానికి శక్యం కాదు. జీవుడు నాశంలేని వాడూ సుఖ స్వరూపుడూ చైతన్యం కలవాడూ సహజంగా పవిత్రమైనవాడూ ఈశ్వరుని అంశయే తానైనవాడూను. మాయకు స్వాధీనుడైపోయి కట్టుబడిపోయి ఆజీవుడు కోతిలాగునా చిలుకలాగునా చైతన్యమైనదీ చైతన్యంకానిదీ యథార్థంకాందీ విడిపించుకోలేందీ అయిన ముడిలో పడిపోతాడు. ముడిలో ఎప్పుడు చిక్కుపడిపోయేడో అప్పుడే ఆజీవుడు సంసారి అయిపోతాడు. ముడివిడక పోతేవాడికి సుఖమే ఉండదు. ఆముడి విడిపించు కోవడానికి వేదాలూ శాస్త్రాలూ పురాణాలూ అనేకమైన ఉపాయాలుచెప్పేయి. కాని ఆముడి విడిపోక మరింత బిగువైపోతుంది. జీవుని హృదయంలో గొప్ప అజ్ఞానాంధకారంతో కూడిన మోహం ఉంది గదా ఎలావిడుతుంది ఆముడి! ఆయజ్ఞానికి ముడి ఉన్నట్టేతెలియదు.

అలాసంసార మోహంలో పడిపోయి నానా యాతనలూ పొందుతుండగా ఈశ్వరుడు జాలిపొంది ఎప్పుడు సంయోగం ఏర్పరుస్తాడో నిర్హేతుకంగా అప్పుడు ఆముడి కొంతకొంత వదులై పిడుతుంది సంయోగమంటే ఏమిటో చెప్తాను విను సాత్విక శ్రద్ధ అనే చక్కని ప్రియమైన ఆవు జీవుని హృదయమనే గోశాలలో పరమేశ్వర కరుణచేత కట్టబడుతుంది. వేదంలో చెప్పబడ్డ జపం తపం యమంనియమం అనే పచ్చగడ్డి ఆయావుకిమేపి మలినంలేని స్వభావం అనే దూడ చేపేలా చెయ్యగానే విషయాల నుండి తప్పుకోవడం అనే బంధపుతాడు ఆగోవు వెనుక కాళ్ళకి బిగించి పరిశుద్ధ మనస్సు అనే గొల్లవాడూ జ్ఞానశాస్త్ర మందు పరమ విశ్వాసం అనే పాత్రలో ధర్మం అనే రుచి గలపాలు పితుకుతాడు. ఆపాలు నిష్కామం అనే అగ్గి మీద కాచి ఓరిమీ సంతోషం అనే గాలిచేత చల్లబడే లాగు చేసి ధైర్యం అనే చల్ల ఆపాలలో కలిపి పెరుగు అవగానే పరమానందం అనే కాంత శ్రేష్ఠమైన వివేకం అనే కవ్వం పట్టుకొని బాహ్యేంద్రియ నిగ్రహంఅనే కుదురు అమర్చి దానిమీద ఆ పెరుగు కుండ పెట్టి సత్యం అనే తాడు సంధించి తత్వవిచారణ అనే మధనంచేసి పవిత్రమూ నిర్మలం అయిన వైరాగ్యం అనే వెన్నతీస్తుంది. ఆతరువాత యోగం అనే అగ్నిని శుభకర్మలూ అశుభకర్మలూ అనే కట్టెలు వేసిమంట పెట్టి ఆవైరాగ్యం అనే వెన్నకాచగానే మమత్వం అనేమలినం అంతా మండిపోతుంది.

అప్పుడు గమగమ పరిమళిస్తూ నిర్మలమైన జ్ఞానం అనే నెయ్యి తయారవుతుంది. అప్పుడు బుద్ధి అనే కాంత సంతోషంతో ఆనేతని చల్లార బెట్టి పొందికగా ఉంచుతుంది. ఆ తరువాత అనుభవజ్ఞానంతో కూడినబుద్ధి అనే ఆ స్త్రీ దృఢ చిత్తం అనే ప్రమిదలో ఆనెయ్యిపోసి సర్వసమానం అనే నెమ్మెమీద పెట్టి మూడు అవస్థలూ మూడు గుణాలు అనే పత్తిలోని గింజలన్నీ తీసేసి అప్పుడు తురీయావస్థ అనే ధూదితో వత్తి చేసి గొప్ప అపరోక్ష జ్ఞానం అనే దీపం ప్రపంచాన్నంతటినీ వెలుగ జేసేకాంతితో

వెలిగించగానే దంభం మదం మొదలైన మిడతలు దగ్గరకు వెళ్లి భగ్గుమని మండిపోతాయి. సోహంఅస్మి అనే శుద్ధమైన అనుభవ వృత్తిచేత అఖండమైన దీపశిఖ ప్రచండమైన ప్రకాశంతో ఆత్మానుభవం వెల్లడిగాతో చేలాగునా భేదభావం నశించి పోయేలాగునా వెలుగుతు టుంది. మిక్కిలి బలమైన అవిద్యకు పరివారమైన మోహమూ మొదలైన చీకటి అణగి పోతుంది, అప్పుడు హృదయం అనేయింట్లో కూర్చొని బుద్ధిఅనేకాంత అముడి విప్పేస్తుంది భూలోకంలో ఎవడోధీరుడు ఒకడు మాత్రామే ముడిని విప్పుకోగలుగుతాడు. అతడే కృతార్థుడని చెప్పబడతాడు. అలాముడి విప్పుకొనే సమయంలో అదితెలిసికొని విష్ణుమాయ విఘ్నంచేస్తుంది.

మేలైన వృద్ధినీసిద్ధినీ ప్రేరేపించి నిర్మలమైనబుద్ధికి ఆశకలిగించి విష్ణుమాయా భ్రాంతినిపొందిస్తుంది బుద్ధిఅనేకాంతకు కళవరంపుట్టించి మాయఅనే స్త్రీ ఆసమయంలో దగ్గరకువెళ్లి వేగంగా తనపైటచెంగుతో మహాతేజస్సుతో వెలుగుతున్న ఆహృదయమనే ఇంట్లోనిదీపాన్ని ఆర్పేస్తుంది ఎంతో చాతుర్యంగల ధీరుడై తేనే అపకారంచేసే ఆమాయాకామినిచేసే విలాసాల్ని లెక్కచేయకగొప్పధైర్యంతోనిలిచి ఆమాయచేసేవిఘ్నాలన్నీ దాటి కృతకృత్యుడౌతాడు అంతటితోసరా? ఇంద్రియాలకి అధిపతులైన దేవతలు ఊరుకోకుండా విఘ్నంచేయడానికి ఎంతోప్రయత్నంచేస్తారు. ఇంద్రియాలదగ్గర విషయాలు అనేగాలి వీస్తుంటే ఆ ఇంద్రియాలనే కిటికీలతలుపులు తెరిచేస్తారు. అప్పుడు విషయాలనే గాలి హృదయంలో ప్రవేశించి ఆ ప్రకాశవంతమైన విజ్ఞాన దీపాన్ని ఆర్పేస్తుంది, అప్పుడు ముడివిప్పడానికి సాధ్యంకాక వెలుతురులేక ఈ విషయాలనేవాయువు ఆ బుద్ధి అనే కాంతని విశ్రాంతి పొందనీయకుండా వికలత్వం పొందించడం చేత ముడివిప్పలేక దుఃఖపడుతుంది. ఇంద్రియాధిపతులైన దేవతలకు జ్ఞానం అంటే ఇష్టంలేదు. వాళ్లకి ఎల్లప్పుడూ విషయాలు అనుభవిద్దామనే కోరికే ఎక్కువగా హృదయరంజకంగా ఉంటుంది. విషయవాయువు బుద్ధి అనేస్త్రీని స్పృహ లేకుండా చేసేస్తుంది. ఇంక హృదయంఅనే యింట్లో దీపం ఎవరు వెలిగిస్తారు? అందుచేత సంసారమనే

గాఢాంధకారం హృదయలో నిండి పోతుంది అప్పుడు మళ్లా జీవుడు అనేక విధాలైన సంసారదుఃఖాలు ఎన్నో పొంది కష్టపడవలసివస్తుంది దాటడం చాలాకష్టం అవుటచేత విష్ణుమాయలో పడిపోయి విడిపించుకోనే ఉపాయం తెలియక జీవుడు పరితపిస్తాడు. జ్ఞానంగురించి చెప్పడం తెలిసికోవడం సాధన చెయ్యడం కష్టమే. ఎలాగో ఘుణాక్షరన్యాయం లాగున ఎలాగో జ్ఞానంపొందాలన్నా ఎన్నోవిఘ్నాలు వచ్చిపడిపోతాయి. పదునైన కత్తిమీద నడవడం ఎంతకష్టమో అంతకష్టం జ్ఞానమార్గం. ఎలాగో అన్నివిఘ్నాలూ ధైర్యంతో తప్పించుకొని అజ్ఞానమార్గాన్ని విడిచి కృతార్థుడుకాగలిగినవాడే మోక్షాన్ని పొందగలుగుతాడు. పరమపదం అనగా మోక్షంపొందడం ఎంతో దుర్లభమని వేదాలూ పురాణాలూ సజ్జనులూ అంటుండడం వింటుంటాము గదా! శ్రీరామచంద్రభక్తికలిగిందంటే మనం కోరకుండానే ఆపరమపదం అతిసులభంగా లభిస్తుంది. ఒక పల్లపుప్రదేశం ఉంటేనే నీరు నిలుస్తుంది. అలాగే శ్రీరామచంద్ర పాదభక్తి లిగిఉంటేనే మోక్షసుఖం నిలుస్తుంది. ఇది బాగా ఆలోచించి తెలిసికొని చతురులైన భక్తులు మోక్షసుఖం కోసం ప్రయత్నించక భక్తినే కోరుతుంటారు. భక్తికి కల శక్తిని ఇంతాఅంతా అని చెప్పలేము. పరమేశ్వర పాదభక్తిచేస్తుంటుండగా శ్రమలేకుండా ప్రయత్నించకుండా భయంకరమైన సంసారానికి కారణమైన అవిద్య నాశమైపోతుంది. జనులు ఆకలితీరి తృప్తికలగడానికి భోజనంచేస్తే ఆ పదార్థాలన్నిటినీ జఠరాగ్ని పచనం చేసేస్తుంది ఆవిధంగానే శ్రీరామ చంద్ర పాదపద్మ భక్తి సంసారసంబంధమైన మంచిచెడ్డకర్మలనన్నింటినీ జీర్ణంచేసేసి పరిపూర్ణుడైన పరమాత్మున్ని పొందించేస్తుంది. సంసార సముద్రాన్నిదాటడానికి గొప్పదైన భక్తితో సమానమైన సాధనం మరొకటి లేదు. అతిసులభమై సుఖాన్ని ఇచ్చేదైన శ్రీరామచంద్ర పాదకమల భక్తిఉంటుండగా దాన్ని తెలిసికోలేక అతిమలినమైన విషయసుఖాలు కోరే మనుష్యులు మూఢులేసుమా. ఖగేశ్వరా! సేవించేభక్తుడూ సేవపొందదగినభగవంతుడూ అనే భావంలేకపోతే సంసార సముద్రాన్నిదాటడానికి వీలుపడదు. అందుచేత దీన్ని నీభావంలో నిలుపుకొని శ్రీరామచంద్ర పాదపంకజసేవ చెయ్యి. కదలగలదాన్ని మొద్దులా పడిఉండేలాగునా

మని ప్రార్థిస్తున్నాను. పండితోత్తమా! అన్ని శరీరాలలోనూ దుర్లభమైనదేది? గొప్ప దుఃఖమేది? సుఖాలలో సాటిలేనిదేది? సజ్జనుల లక్షణాలూ దుర్జనలక్షణాలూ ఎటువంటివి? వేదసమ్మతమైన పుణ్యమేది? పాపమేది? మానసరోగమేది? అనగానే విని వాయసముని నాయనా నీవు అడిగిన అన్ని ప్రశ్నలకూ జవాబులు చెప్తాను. విను అన్ని జీవులూ కావాలనేదీ నరకం స్వర్గం మోక్షం అనే మూడూ సంపాదించుకోవడానికీ ఎన్నటికీ చెడని మోక్షానికి ఎక్కడానికి నిచ్చెనలాంటిదీ భక్తిజ్ఞాన వైరాగ్యాలు పొందడానికి తగిందీ నరశరీరమే. దానితో సమానమైంది మరొకటిలేదు. ఏలోకంలోనూను. అటువంటి మనుష్య శరీరం పొందికూడా పరమాత్మన్ని, సేవించని పామరులు ఎల్లప్పుడూ ప్రకృతివిషయ సుఖాలకోసం పడిచచ్చిపోతుంటారు. అటువంటివారు అదృష్టహీనులుగదా! పరశువేదిని బుద్ధిలేక పారేసి గాజుముక్క తీసుకొనే మూర్ఖుల లాంటివారు. ఆపామరులు. ప్రపంచంలో దరిద్రంతో సమానమైన దుఃఖం మరొకటిలేదు. సజ్జన సాంగత్యంతో సమానమైన సుఖమేదీలేదు, త్రికరణ శుద్ధిగా సమ బుద్ధితో ఇతరులకు ఉపకారం చెయ్యడమే సజ్జనుల స్వభావం. పరులకుమేలు చెయ్యడానికి ఎన్ని కష్టాలైనా ఎంతదుఃఖమైనా సహించేవారే సజ్జనులు. దుర్జనులు దౌర్భాగ్యులౌటచేత పరులకు దుఃఖం కలిగించడానికే హేతువౌతుంటారు. ఎన్నికష్టాలను సహించైనా ఇతరులకు మేలు చేసే ఫలవృక్షంతోటీ భూర్జం తోటీ సమానమైన వారు బుద్ధిమంతులైన సాధుజనులు. ఇతరమైన దేన్నైనా బంధించడానికి తన శరీరాన్ని ఉన్నారనైనా ఇచ్చి చచ్చే చెట్టులాగున ఇతరులకు బాధ కలిగించడానికి తమ నాశానికైనా దుష్టులు ఒప్పుకుంటారు. వారికి. ఏలాభమూ లేకపోయినా ఇతరులకు వృధాగాహాని చేస్తుంటారు దుష్టులు. సర్పం రసకేలాభం లేకపోయినా ఇతరులను కాటువేసి చంపేస్తుంది. ఎలుక తన కేలాభంలేకుండా విలువైన వస్త్రాలు కొరికేస్తుంది. అలాగే దుష్టులూను. వడగళ్ళు సస్యాన్ని పాడు చేసి అవి

కూడానాశమైపోతాయి, అలాగే ఇతరుల సంపద పాడు చేసి ఆపాప భారంచేత ఆదుర్జనులు కూడా పాడై పోతారు అధమగ్రహమని ప్రసిద్ధి కెక్కిన కేతువులాగున దుష్టులు అందరకూ ఆపదకలిగించేవారై ఉంటారు ప్రపంచానికి సుఖాన్ని కలిగించే చంద్రుడు ఉదయించినట్లు సజ్జనుడు పుడితే అందరికీ ఆనందమే, వేదంచేత తెలుపబడ్డ నిర్మలమైన ధర్మం అహింస అని తెలిసికో. ఇతరులను నిందచేసే పాపంకంటె పర్వత మంత భారమైంది ఏదీలేదు గురునిందా హరి నిందా చేసేవాడు కప్ప అయిపుడతాడు. ఆపాపంచేత వాడికి వెయ్యి జన్మాల వరకూ ఆకప్ప శరీరమే వస్తుంటుంది. బ్రాహ్మణ నింద చేసేవాడు ఘోరనరకం అనుభ విస్తాడు. ఆ తరువాత కాకి అయిపుడతాడు. దేవతానిందా వేదనిందా చేసిన వాడు రౌరవ నరకంలో పడిపోతాడు. పక్షీంద్రా లోకంలో నిందతో సమాన మైన పాపంలేదు. సజ్జనులను నిందించేవాడు గుడ్లగూబ అయిపుడతాడు ఆదుర్బద్ధి గలవాడికి జ్ఞానం అనే సూర్యుడులేని మోహం అనే రాత్రి సంతోషం కలిగిస్తుంది అందరినీ నిందిస్తుండడమే స్వభావంగా గలమందబుద్ధిగలవాడు గబ్బిలమై పుడతాడు. దేనిచేత జనులు అధికమైన దుఃఖాన్ని పొందుతారో అటువంటి మనోరోగాన్ని చెప్తాను విను, మోహ మే తీరని వ్యాధులన్నింటికీ మూలమైంది. మోహం వల్లే ముఖ్యంగా బాధలన్నీ కలుగుతాయి. క్రోధమే పైత్యవ్యాధి కామమే వాతరోగంలోభం కఫవ్యాధి ఈ మూడు మనుష్యుల హృదయాలను పీడిం చేస్తుంటాయి. ఆమూడూ కఫవాత పైత్యాలు కలిసి ఏకీభవించి పెరిగి పోతే అది భయం కరమైన సన్ని పాతరోగం అయిపోతుంది. ఆరోగంవల్ల కలిగే బాధలు అన్ని ప్రపంచ విషయాలూను. మమత్వం అనేది తామర. ఈర్ష్య దురద. సంతోషదుఃఖాలే కీళ్లనొప్పులు. ఇతరుల సుఖాలు చూచి ఓర్వలేక పోవడమే క్షయ. కపటం దుష్టత్వంతో కూడిన బుద్ధియే. కుష్టువ్యాధి. అహంకార మనే రోగం మూడుకుల నొప్పులు దంభం మదం అభిమానం కపటం అనేది కఠినమైన చర్మరోగాలు. తృష్ణ కడుపు పెరిగించే వ్యాధి. ఈషణ

త్రయం శీతతాపజ్వరం. మచ్చరం అవివేకమైన బుద్ధీ ఇవి రెండువిధాలైన జ్వరాలు. ఇన్ని అన్నీ అని చెప్పడానికి శక్యంకాని రోగాలు ఇలాఎంతవరకూ చెప్పడం? ఒక్కరోగం వస్తేనే ఎటువంటి మనుష్యుడైనా చస్తాడు. ఇన్ని అసాధ్యమైన రోగాలు పట్టుకొని బాధిస్తుంటే భగవద్ధ్యానం వల్ల పొందే యథార్థ సుఖం జనులు ఏవిధంగా పొందగలుగుతారు? జ్ఞానం యజ్ఞాలూ తపాలూ దానాలూ ఆచార నియమాలూ ధర్మాచరణాలూ జపాలూ అనే కోట్లకొలదీ మందులు ఎన్నో ఉన్నాయి. వాటిఅన్నిటిచేతా ఆరోగ్యాలన్నీ అణగిపోవు. ఈవిధంగా మూఢులైన జనులు అనేక రోగాలకు వశమైపోయి. సంతోషం శోకం భయమూ ఇష్టమూ వాళ్లమనస్సులని ఎన్నోవిధాలుగా కలతపెట్టేస్తుంటే యోగవియోగాలు పొందుతుంటూ ఉంటారు. కొంతవరకూ మనోరోగాలను బాగా వర్ణించి చెప్పేను. అవన్నీ తెలుసుకుంటే జనులకు కొంత తాపం తగ్గుతుంది కాని ఆ పాపరోగాలు పూర్తిగా నశించవు అవి పూర్తిగా నశించకముందే విషయాభిలాష అనే అపథ్యదోషం తగిలిందంటే వెంటనే అవిమళ్లా ఎప్పటిలాగా అంకురిస్తుంటాయి. విషయాలనే అపథ్యదోషం తగిలిందంటే మునీశ్వరులకైనా యీ రోగాలన్నీ అంకురిస్తుంటాయి. సామాన్యజనులమాట చెప్పడమెందుకు? వేదాలయందూ సద్గురువునందూ అధికమైన విశ్వాసం ఏర్పడడం విషయాభిలాషపూర్తిగా విడిచి పోవడం శ్రీరామచంద్రుని కరుణ వల్ల కలిగితే అన్నిరోగాలూ అంతరించి పోతాయి. శ్రీరామచంద్ర పాదపద్మభక్తి సంజీవిమూలిక అధికమైన శ్రద్ధయేచక్కని అనుపానం. అటువంటి దివ్యౌషధసేవవల్ల ఆరోగ్యాలన్నీ నశించకపోతే ఇంకెయితరమైన కోటిఉపాయాలు చేసినా ఎంతటి ప్రయత్నాలు చేసినా ప్రయోజనం ఉండదు. దృఢమైన వైరాగ్యంఎప్పుడు అంకురిస్తుందో అప్పుడు అన్నిరోగాలూ పోయి ఆరోగ్యం ఏర్పడుతుంది. మనస్సు నిర్మలంగా ఆనందంగా ఉంటుంది. విషయవాంఛ అనే నీరసం బలహీనతా ఎప్పుడు అణగిపోతుందో అప్పుడే నిర్మలమైన బుద్ధి అనే ఆకలిపుట్టి ఒకనాటి కొకనాడూ వృద్ధిపొంది జనులను

తృప్తిపొందిస్తుంది నిర్మలమైన జ్ఞానం అనే నీటితో నిత్యమూ ఎవడు స్నానం చేస్తుంటాడో వాడికి శ్రీరామభక్తి హృదయంలో పుట్టి పూర్తిగా వ్యాపిస్తుంది. బ్రహ్మదేవుడూ శివుడూ సనకాది మునీశ్వరులూ పరిపూర్ణజ్ఞానులైన నారదుడూ మొదలైన వారంతా శ్రీరామచంద్ర పాదపద్మ భక్తి కాకసుఖం పొందడానికి మరొక సాధనంలేదు. అంటుంటారు. ఎప్పుడూను. వేదాలూ పురాణాలూ ధర్మాన్ని తెలియజేసే గ్రంథాలూ సౌఖ్యంపొందడానికి తగినఉపాయం రామభక్తి తప్ప ఇంకేదీలేదనీ మోక్షలక్ష్మి సాంగత్యం పొందించి నిత్యానందం అనుభవించడానికి ఆభక్తియే పరమసాధనమనీ చెపుతుంటాయి. ఆభక్తివల్ల సమస్త దుఃఖాలూ నశించిపోతాయి. వైనతేయా! తాబేలు వెన్ను చిప్పమీద రోమాలు పుట్టినా గొడ్రాలి కొడుకు శత్రువులను చంపినా ఆకాశం మీద పువ్వులు పూచినా విష్ణుద్వేషం గలవాడు ఎన్నడూ సుఖం పొందలేడు. ఎండమావుల నీటివల్ల దాహం దీరినా కుందేటికి రెండు కొమ్ములు మొలిచినా పెద్ద చీకటివచ్చి సూర్యున్ని నశింపజేసినా మంచులో అగ్నిపుట్టినా సీతానాథునికి విరుద్ధంగా నడిచేవాడు ఎన్నడూ సౌఖ్యంపొంద లేడు నీటిలో కవ్వంపెట్టి మథించితే వెన్నవచ్చినా ఇసుకనుండినూనె వచ్చినా శ్రీరామచంద్రున్ని సేవించకుండా సంసారసముద్రాన్ని తరింపడానికి ఎవరికీ శక్యంకాదు. ఇదే సిద్ధాంతం. దోమని బ్రహ్మని చేసేస్తాడు. బ్రహ్మను దోమకంటె హీనుడుగా చేసెయ్య గలడు. శ్రీరామచంద్రుడు, కాబట్టి ఆరహస్యం తెలిసిన జ్ఞానులు సందేహంలేకుండా నిరంతరం సేవిస్తుంటారు ఆప్రభువుని. నిశ్చయమైన మాట చెపుతున్నాను విను పక్షీంద్రా! నిరంతరం రాముని భజించే నరుడెవడో వాడే బహుకష్ట సాధ్యమైన సంసార సముద్రాన్ని దాటగలుగుతాడు దేవా! శ్రీరామచంద్ర చరిత తెలిసేలాగున విస్తారంగానూ సంగ్రహంగానూ నా బుద్ధికి అందినట్టూ చెప్పేను. వేద సిద్ధాంతమిదే విహగవరా! పద్నాలుగులోకాలలోనూ అన్నిపనులూ మానేసి సీతానాథుని పాదపద్మాలు భక్తితో సేవిస్తూ ఆనందపరవశులై సుఖించే వారిదే సుమా భాగ్యము. రామున్ని కాక ఇంకె

వరిని సేవించడం? అతి మూఢుడనైన నన్ను ఆ ప్రభువు తన వానినిగా చేసుకున్నాడు. అటువంటి పరమేశ్వరుని చేత స్తోత్రం చెయ్య దగిన రాముని పాదపద్మాలే నేనెల్లప్పుడూ సేవిస్తుంటాను. నీవు అనుభవ జ్ఞాన స్వరూపుడివి. నీకు మోహం ఎక్కడిది? నామీద పరిపూర్ణదయ కనపరిచి పరమేశ్వర శుక సనక సనందనా దిమునులకు హృదయ రంజక మైన శ్రీరామచంద్ర చరిత్రను అడిగినావు. ఏమి భాగ్యము! ఒక నిమిషమైనా గడియైన సజ్జనుల స్నేహం దుర్లభంగదా! నేను అధమ జాతి పక్షిని అపవిత్రమైన వాడిని అయినప్పటికీ పరమ పురుషుడైన రామున్ని భజించడానికి ఎలా అధికారినైనానో ఆలోచించు. చివరకు ఆ ప్రభువు నన్ను ఒక జగద్విఖ్యాత పవిత్రునిగా చేసేసేడు. ఎంతో ధన్యున్ని అతినీచున్నైన నన్ను జానకీనాథుడు తనవానిగా చేసికొని సజ్జన సమాగమం నాకు కరుణతో కలుగజేసినాడు. నాభాగ్యం ఏమని చెప్పేది? అపరిమితమైన శ్రీరామచంద్ర చరిత్రను వివరించి చూడ డానికి ఎవరికీ సాధ్యంకాదు, కాబట్టి నాబుద్ధికొలదీ రహస్యం ఉంచకుండా చెప్పేను. నీవు శ్రద్ధగా విన్నావు ఎవని మహిమను నేతినేతి వాక్యాలతో వేదాలు చెపుతుంటాయో సాటిలేని శక్తి, ప్రభావాలుగల విభుడు ఎవడో ఆవిభుడైన శ్రీరామచంద్రున్ని తలంచి తలంచి అతని పవిత్రగుణాలను వర్ణించి వర్ణించి ఆనందరసంలో తేలిన బుద్ధిగలవాడై పొంగిపోయేడు కాకముని దేవీ! ఆహా! అతని దృఢమైన భక్తిని ఏమనివర్ణించేది? అని చంద్రశేఖరుడు ఉమాదేవితో అని మళ్లాచెప్తున్నాడు పర్వతపుత్రీ! అప్పుడు కాకముని గరుత్మంతునితో భక్తిరసంతోనుకుతుండగా ఈవిధంగా అన్నాడు. శివునిచేతా బ్రహ్మచేతా పూజింపబడే కీర్తిగా వికసించిన మృదువైనన దివ్యపాదపద్మములుగలవాడై సమస్త లోకాధిపతియైఉన్న శ్రీరామచంద్రుడు సంసారదుఃఖ నివారకుడు నన్ను కరుణకటాక్షతో చూసేడు రామునితో సమానమైనవాడు ఎవడున్నాడని చెప్పేది? అతడే కాక ఇంకేవడూలేడుగదా! రామవిభుని స్వభావం సాటిలేనిది. అటువంటి

స్వభావం నేను మరెక్కడా చూడలేను. వినలేదు సాధకులూ సిద్ధిపొందిన వారూ ఉదాసీనులూ ముక్తిపొందిన వారూ కవులూ పండితులూ నిర్మల బుద్ధిగలవారూ సన్యాసులూ కృతజ్ఞత గలవారూ తపస్వులూ యోగులూ ధర్మ తత్పరులూ జ్ఞానవిజ్ఞాన నిధులూ శౌర్యవంతులూ ఐనవారిలో ఎవరైనా నాప్రభువును శ్రీరామచంద్రుణ్ని సేవించకుండా తరించలేరు. అటువంటి అవ్యయుడైన శ్రీరామచంద్రునికి ఆదీ మధ్యమూ అంతమూ లేనివాడికి అప్రమేయునికి నాదైవానికి నా నాథునికి నమస్కరించేను. నమస్కరిస్తున్నాను. నమస్కరిస్తాను. రామచంద్రా! నీకు నమస్కారం ముకుందా! నమస్కారం. భక్తవరదా! నమస్కారం. పరమానందా మృత సముద్రా! నమస్కారం రాజీవాక్షా! నమస్కారం. నీలమేఘశరీరా! నమస్కారం. ఏమహాత్ముణ్ని శరణుపొందినందువల్ల నాలోటిహీన జీవులూ పాపాత్ములూ మహా పరిశుద్ధులైపోతారో అటువంటినామునికి భవతారక నామునికి గొప్పవారందరికీ గొప్పవానికి నేను నమస్కరిస్తున్నాను. ఎవని నామం తలంచగానే తాపత్రయందూరమైపోతుందో భవరోగాలు నశించి పోతాయో మోక్షసుఖం లభిస్తుందో ఆ పరమాత్ముడు నీకూనాకూ అనుకూలు డగుగాక! అని గరుత్మంతునితో కాగభుశుండి మహాముని చెప్పి శరీరం పులకరిస్తుండగా తన్మయుడైపోయి సాటిలేని ఆనందంతో సమస్తమూ మరచిపోయేడు పూర్ణేందుముఖీ! ఆమునీశ్వరుని రామపాదభక్తి యేమని చెప్పేది? అని శివుడు అంబికతో చెప్పి భక్తిపరవశుడైపోయేడు. తానే శ్రీ మహావిష్ణువైన శ్రీరామచంద్రుడౌటచేత. రామా! రామా! శ్రీరామా శ్రీరామరామరామా! శ్రీరామరామరామా! శ్రీరామరామరామా! శ్రీరామ రామరామా! రామా సద్గుణతిలకా రామా! భక్తులు పొందదగిన పరం ధామా! భూమా! నిరంతరం శంకరునిచేస్తుతింపబడే నామంగలవాడా! పాపని వారణా! శ్రీరామ రామరామా! శ్రీరామా రామరామా! సీతారామా! శ్రీరామరామ రామా! శ్రీ రఘురామచంద్రా! పద్మపత్రనేత్రా! పరమ పవిత్రా! సీతాకళత్రా! నిర్మలచరిత్రా! స్వామీ అవధరించు. అప్పుడు

అంబతో పరమేశ్వరుడు ఇలాఅంటున్నాడు. రమణీ! గరుత్మంతుడు కాకముని శుభకరమైన మనోహర వాక్యాలువిని శరీరం గగుర్పాటు చెందు తుండగా సందేహంతీరిపోయి ఆనందంతో అతనికి నమస్కరించి అంటున్నాడు. అనఘా! గోవిందపాదభక్తిరసభరితమైన నీమాటలు విని కృతకృత్యున్ని అయ్యాను. మోహం అంతావదిలిపోయింది. సీతారామచంద్ర పాదారవిందభక్తినాకు కొత్తగా కలిగి వృద్ధిపొందిపోతుంది. మాయవల్ల పుట్టిన అపరిమితమైన ఆపద నశించిపోయింది మహామోహ సముద్రాన్ని దాటించడానికి నీవు నాకొక నావవైనావు. మిత్రమా! అన్నివిధముల చేతనూ నాకు అపరిమిత సుఖాన్ని అనుగ్రహించినావు. నీకునేను ఏయుప కారమూ చెయ్యలేను నీపాదాలకు నమస్కరిస్తున్నాను. ఓ మునీంద్రా! నీతో సమానమైన గొప్పవారెవరూలేరు. రామ భక్తిస్వరూపుడివి. అన్ని కోరికలూ సిద్ధించినవాడవు. నిన్నుస్తుతిచెయ్యడానికి శక్యంకాదు. సద్గుణ రత్ననిధీ! సజ్జనులూ వృక్షాలూ పర్వతాలూ భూమి నదులూ సముద్రాలూ పరులకు మేలుచెయ్యడంలో ప్రసిద్ధిచెందినా అందులో సజ్జనులు వెన్న లాంటి హృదయంకలవారని కవీశ్వరులు అంటారుగాని వెన్నకాగి కరిగి పోతుంది. ఇతరుల దుఃఖం చూచితంనమాత్రాన్ని సజ్జనుల మనస్సులు కరిగిపోతాయి. నాజన్మ జీవితం ధన్యమయేయి. నీప్రసాదం వల్ల సందేహం తీరి పోయి ది. నన్ను నీ సేవకునిగా చూడు. అనిమాటి మాటికీ కాగ భుశుండి మునీంద్రునితో గరుత్మంతుడు చెప్పినమస్కా రాలు చేసేడు. మనస్సులో శ్రీరామచంద్రున్ని నిలుపు కొని వినయంతో మరొక మారు ఆమునికి నమస్కరించి వైన తేయుడు వైకుంఠానికి వెళ్ళి పోయేడు. పార్వతీ! సజ్జన సంగంతో సమానమైన లాభం మరొకటిలేదు. మూడు లోకాలలోనూ. హరికరుణలేకపోతే అసత్సంగం లభించదు అని వేదాలు ఇతిహాసాలూ చెపుతున్నాయి. శాతోదరీ! విన్నంత మాత్రం చేత

సమస్త పాపాలూ పారకోలేదీ భవబంధవిముక్తి చేసేదీ అయిన శ్రీ సీతా రామచరిత్ర నీకు చెప్పేను. ఈ సచ్చరిత్ర విన్నంతనే శ్రీసీతారామచంద్ర పాదభక్తియందు దృఢమైన నమ్మకము ఎడతెగని సుఖానుభవం వాసనారాహిత్యం తప్పక కలుగుతాయి మనస్ఫూర్తిగా ఈ చరిత్ర వింటే మూడు విధాల తాపాలూ తొలగి పోతాయి. మనస్సు చేతామాటల చేతా శరీరంచేతా చేసిన పాపాలన్నీ పోతాయి. భవానీ! సాధనంచేతా తీర్థయాత్రల చేతా యోగంచేతా జ్ఞానంచేతా వైరాగ్యంచేతా త్యాగంచేతా ధర్మకార్యాల చేతా శమదమా లచేతా ఆత్మసంయమనం చేతా వ్రతాలచేతా జప తపాలచేత నానా యజ్ఞాలచేతా భూతదయ చేతా బ్రాహ్మణ గురుపాద సేవచేతా నిర్మల వివేకం చేతా విద్యచేతా వినయం చేతా ఇంకా యేయేసద్గుణాలు నాలుగు వేదాలచేత ఎన్నబడుతుంటాయో ఆసద్గుణా లన్నిటి చేతా పొంద దగిన ఫలము శ్రీరామచంద్ర భక్తి యేసుమా. అటువంటి పరమ భక్తిరా మానుగ్రహం వల్ల ఎవడో ఒకధన్యాత్ముడు మాత్రమే పొందగలుగు తాడు. ఇతరులకు సాధ్యంకాదు. తరళాక్షి! మునీశ్వరులకైనా దుర్లభమైన శ్రీరామభక్తిని విశ్వాసంతో నిరంతరం ఈపవిత్ర చరిత్ర వింటుండే జనులు శ్రమలేకుండా పొందగలరు. ఎవని మనస్సనే తుమ్మెద రామపాద పద్మాల యందు లగ్నమై పోయి ఉంటుందో వాడే సర్వజ్ఞుడూ గుణవం తుడూ జ్ఞానీ భూమికి అలంకారమూను. పండితుడూ అతడే పరమ ధర్మ పరుడూ అతడే వంశరక్షకుడూ అతడే దాతా అతడే. ఎల్లప్పుడూ శ్రీరామచంద్రున్ని సేవించ గలవాడే అట్టిధన్యుడు. వేదసిద్ధాంతం తెలిసిన బుద్ధిమంతుడూ అతడే గొప్ప నీతిమంతుడూ అతడే. చతురుడూ అతడే కవీ అతడే ఏకపటంలేకుండా రామున్ని సేవిస్తే చాలును ఎల్ల ప్పుడూను. అటువంటివాడు రణధీరుడూ నాశంలేని సౌఖ్యవంతుడూ ఔతాడు. పద్నాలుగు లోకాలలోనూ. దేవనదికలిగిన దేశం ధన్యమైంది.

పతివ్రతముగలిగిన స్త్రీధన్యురాలు నీతితప్పనిరాజు ధన్యుడు. తన ధర్మాన్ని తప్పక ప్రవర్తించే బ్రాహ్మణుడు ధన్యుడు. దానంచెయ్యడానికి తగిన ధనమేధన్యమైంది పుణ్యమందు ఆసక్తి కలబుద్ధి ధన్యమైంది భూమియందు బ్రాహ్మణ జన్మ పొందడం సజ్జన సాంగత్యం చెయ్యటం భక్తి లభించటం ఇవన్నీ ధన్యమైనవే రామభక్తి పరాయణులైన నరుల జన్మవల్ల కులం పవిత్రమూ జగత్పూజ్యమూ అవుతుంది. మొదట అతిరహస్యంగా ఉంచి నీమనస్సులో అధికమైన ప్రేమ ఉండడం కనిపెట్టి పరమపవిత్రమైన శ్రీరామచంద్ర చరిత్ర నాబుద్ధికి అందినట్టూ చెప్పేను. మనోహరీ! శఠులకూ సత్ప్రవర్తన లేనివారికీ శ్రీరామచంద్రుని పవిత్ర లీలలను చదువుతుండగా వినని పాపాత్ములకూ మూఢులై దుష్కర్మ పరులైన వారికీ క్రోధం లోభం మదం మచ్చరం కామం మొదలైన వాటిచేత మదోన్మత్తులైన వారికీ కఠినాత్ములకీ ఈకథ ఎప్పుడూ చెప్పగూడదు. అచలాత్మజా! ఈసచ్చరిత్రను చంచల చిత్తులకీ శ్రీరామచంద్రుడ్ని పూజించని ఖలులకూ చెప్పగూడదు. బ్రాహ్మణ ద్రోహంచేసే రాజు దేవేంద్రునితో సమానుడైనా వానికి ఈచరిత్ర చెప్ప గూడదు. ఎవరికి సజ్జన సహవాసమంటే అధిక మైన ప్రీతి ఉంటుందో ఆసుజనులే సీతానాథ పవిత్ర చరిత్ర విండానికి తగిన అధికారులు. నీతియందు ఆసక్తి కలవారూ గురు పాదపద్మ భక్తులూ బ్రాహ్మణ భక్తి కలవారూ శ్రీరామచరిత్ర విండానికి తగిన అధికారులు. శ్రీరామచంద్రుడు ఎవరికి ప్రాణప్రియుడో వారికి ఈశుభ చరిత్ర అపరిమిత సుఖం కలిగిస్తుంది. శ్రీరామచంద్ర పాదపద్మ భక్తులై గొప్ప మోక్షపదవిని కోరే సజ్జనులు ఈ చరిత్ర అనే అమృతాన్ని ఆసక్తితో చెవులతో పానం చెయ్యడానికి అపేక్షిస్తుంటారు. గిరిరాజతనయా! శ్రీరామచంద్ర చరిత్ర కలికాల దోషాలన్నీ పోగొడుతుంది. మనస్సులలోని కల్మషాలను నశింప జేస్తుంది, గొప్ప భవ

రోగాన్ని మానపగల సంజీవి మూలికసుమా. సీతానాధుని చరిత్ర వేదాలచేత వర్ణింపబడేదీ భక్తజనులకు పరమ సుఖాన్నిచ్చేదీనీ, దానిశుభకర మైన మహిమను స్తోత్రం చెయ్యలేము. అందులో ఏడుసోపానాలూ రామభక్తిని వృద్ధిపొందింపడానికి చక్కని మార్గం. శ్రీరామచంద్రుని కరుణపొంద గలిగినవాడే ఆమార్గాన్ని పట్టి నడుస్తాడు. కపటం లేకుండా ఈ కథ విన్నవారు ఇష్టకామ్యార్థ సిద్ధిని పొందుతారు.

ఈ చరిత్ర వినిపించేవారూ వినేవారూ స్తోత్రంచేసేవారూ సంసార సముద్రాన్ని ఆవుపాదపు గుంటదాటినంత సులభంగా దాటిపోతారు. అని పరమేశ్వరుడు చెప్పగా విని పరమేశ్వరి అపరిమితానందంతో చక్కని మధురమైన మాటలతో ఇలా అంటుంది, నాథా! మీ కరుణచేత నాసంశయా లన్నీ తీరిపోయేయి. శ్రీరామచంద్ర భక్తికొత్తగా కలిగి నాహృదయాన్ని ఆనందరసంతో నింపేసింది నేను ధన్యురాలినయ్యేను. కృతకృత్యురాలి నయ్యేను. జగత్పతీ! మీప్రసాదంవల్లక్లేశాలన్నీ తొలగిపోయేయి. మీ కరుణపొందిన ప్రతిప్రాణీ సంసార దుఃఖ సముద్రాన్ని దాటడం అతి సులభం. అని నాధునితో సమస్తలోకేశ్వరి పలికింది. ఆవెంటనే శ్రీ సీతా రాముల యదార్థతత్వాన్ని భావించి ఆ ఆదిదంపతులు తాదాత్మ్యం పొంది పోయి సీతారాములై పోయి సాటిలేని సుఖాన్నిపొందేరు. ఈశుభకరమైన గౌరీశంకరుల సంవాదరూపమైన కథ స్థిరమైన సౌఖ్యాన్ని ఇస్తుంది. సంసార బంధాల్ని తెంపేస్తుంది. అన్ని దుఃఖాలనీ పోగొడుతుంది. సమస్త సందే హాలు తొలగించేస్తుంది. సజ్జనులకూ భక్తజనులకూ మహానందాన్ని చేకూరుస్తుంది. ప్రపంచంలో మందమతులు దీనిమహిమ తెలిసికోలేరు. ఇంతా అంతా అని చెప్పలేని ఎడతెగని సౌఖ్యాన్ని ఇచ్చేది. ఇదేఅవుటచేత శ్రీరామభక్తులకు దీనితో సమానమైన అత్యంత ప్రియమైంది ఏదీలేనేలేదు.

శ్రీరాముని అనుగ్రహంచేత నేను నాకు అలవడి నంతయే ఈపవిత్ర చరిత్ర రచించేను. అపారమైందీ సమస్త సంసార దుఃఖాలనూ రోగాలనూ నివారణ చేస్తుందిది. కలియుగంలో యోగాభ్యాసం జపం తపం యజ్ఞం పూజలూ మొదలైన సత్కర్మలు చెయ్యడం సులభంకాదు. రాముణ్ని తలంచుటా కీర్తించుటా ఆ చరిత్ర వినుటా సులభమైనవి. కాబట్టి నిర్మలమైన భక్తితో ఎల్లప్పుడూ రాగద్వేషాలు విడిచిపెట్టి యీకథను వింటుంటే చాలును మోక్షసుఖాన్ని పొందగలుగుతారు. పరమ పావనమైన శ్రీరామచంద్ర చరిత్ర ఎవరికి త్వరగా మోక్షసుఖాన్ని ఇయ్యదు? వేదాలూ పురాణాలూ కవులూ దాన్నిఎల్లప్పుడూ కీర్తిస్తుంటారు. ఓమనస్సా కుటిల స్వభావం విడిచిపెట్టి వైకుంఠేశ్వరుడైన రాముణ్ని ఎల్లప్పుడూ భజించుతుండు. గజేంద్రుణ్ని అజామీళుని వేశ్యనూ జటాయువునీ నీచులని భావించక రక్షించేడుకాడా ఆప్రభువు? యవనులూ గొల్లలూ కిరాతులూ శ్వపచులూ మొదలైన మిక్కిలి పాపాత్ములైనా శ్రీరామచంద్రుని నామామృతాన్ని వివేకంతో తాగినట్టయితే శాశ్వత పదాన్ని పొందగలుగుతారు. ఆసీతానాథుని పాదపద్మాలను నేను ధ్యానించి నమస్కరిస్తున్నాను. ఇది శ్రీరామచరిత్ర. సందేహంమాని మనుష్యులు దీన్ని విన్నావినిపించినా చదివినా సకలార్థసిద్ధి సంప్రాప్తిస్తుంది. శ్రీరామచరిత్రతో సమానమైన మోక్షప్రదమైన చరిత్ర భూలోకంలో మరొకటి లేనేలేదు. కలికాల కలుషాలను మనస్సులలో ఉన్నమలినాలనూ పూర్తిగా కడిగేసి సాటిలేని మోక్షసుఖాన్ని మానవులకి ఇస్తుంది ఈచరిత్ర. ఈ రామచరితలోని పద్యాలు మనోహరమైనవి మనస్సులో నిలుపుకొని ప్రతిదినమూ స్మరిస్తున్నవారికి అవిద్యవల్ల కలిగే ఐదు విధాల వికారాలను శ్రీరామచంద్రుడు నివారణ చేస్తాడు. ఆసుందరమూర్తి కృపానిధీ అనాథులనూ సజ్జనులనూ రక్షించుటయందు ప్రీతికలవాడూ నిష్కాములకు మేలుచేసేవాడూ మోక్షాన్ని ఇచ్చే

వాడూ రామచంద్రుడే కాక ఇంకెవరున్నారు? ఏపరమపురుషుని కృపావేశం చేత మందమతినైన తులసీదాసున్ని గొప్ప నిత్యసుఖ ప్రాప్తించే ఆనం దిస్తున్నానో అపరమాత్ముడైన రామవిభునితో సమానులెవరున్నారు? నావంటి దీనుడూ నీవంటి కరుణా సముద్రుడూ లేడూ భయంకర సంసార సముద్రాన్ని దాటించి నన్నురక్షించు సమస్త భువనాధిపతీ! రామా! కామంగల వాడికి స్త్రీయందూ లోభివానికి ధనమందూ ఎలా అపరిమిత ప్రేమ ఉంటుందో అలా నీవు ఎల్లప్పుడూ అపరిమిత ప్రియుడవై ఉండు. పూర్వం పరమ శివుడనే సత్కవీశ్వరునిచేత పరమ పవిత్రమైన చరిత్ర రామపాదపద్మభక్తి పెంపొందేలాగున రచింపబడ్డది. దాన్ని విస్తరించి తనహృదయ నిర్మలత్వం కోసం నిరంతరం రామభక్తి పరాయణుడైన తులసీదాసు హిందీభాషలో సమస్తజనులూ స్తుతించేలాగా పరిపూర్ణ భక్తి జ్ఞానవైరాగ్య విజ్ఞానాలు కలిగించేలాగా భక్తులకు ప్రాణసమాన ప్రియంగా ఉండేలాగా దుఃఖాలని నశింపజేసేలాగా రచించేడు. ఈరామచరిత మానసం అనే సరోవరంలో ఎవరు స్నానంచేసినా నిత్యానందాన్ని పొందుతారు. సంసార దుఃఖాలనే ఎండతాపం వారిని బాధించదు. ఆ రామచరిత మాన సమనే మోక్షప్రదమైన గ్రంధాన్ని శ్రీరామచంద్రుని కరుణ వలన ఆంధ్ర భాషలో నిర్వచన పద్యకావ్యముగా పూజ్యులైన నా అగ్రజులు శ్రీ జగన్నాథ కవిగారు వ్రాసేరు. నేనుదాన్ని వ్యావహారిక భాషలో వచనంగా వచ్చీరానిమాటలతో వ్రాసేను. ఇదంతా శ్రీరామచంద్రుని కటాక్షం నా మనస్సులో శ్రీరామచంద్రుడు ఉండి వ్రాయించేడు ఇదిరామచరిత్ర. కోరికలన్నీ ఈడేరుస్తుంది అన్ని ఉపనిషత్తులసారం. ఉత్తములకి ఆనందంగా ఉంటుంది. గర్వశ్రోతులకు ఇది యిష్టంగా ఉండదు. ఈ శ్రీరామ చరిత్రను శక్త్యానుసారంగా వ్రాసేను ఎలాఉన్నా దీని సారాన్ని మాత్రం తీసికొని తప్పులున్న క్షమిస్తారని పండితులను ప్రార్థిస్తున్నాను.

శ్రీరామచంద్రమూర్తీ! నిన్నే శరణు పొంది ఉన్నాను. నన్ను కాపాడు. కరుణ గలవాడవు. పాపాలను నశింప జేసేవాడవు. శరణాగతులను రక్షించేవాడవు. నీవు ప్రభువువు నేను సేవకురాలను. మందమతిని. పెద్దలందరూ నన్ను గురించి చెప్పుకోనే మాటలు విని ఎటువంటి నీచులనైనా దయతో చూస్తావని నిన్నాశ్రయించేను రామా! నిన్నాశ్రయించినందుకు నా అజ్ఞానాన్ని కొంచెంవదలగొట్టేవు. ఎందరెంతచెప్పినా బోధపడనటువంటి అవిద్యలో పడియున్న నన్ను అనుగ్రహించి నీచరిత్ర నాచేత వ్రాయించి కొంత జ్ఞానోదయాన్ని కలిగించేవు నీదర్శనం నాకెలాలభిస్తుందో? నిన్నెలా కొనియాడాలో? నీవు ఎక్కడుంటావో? అనే సందేహాలు నన్నుగొప్పగా బాధిస్తుండేవి. నీ పరిపూర్ణ కృపవల్ల ఇప్పటికి నీవు సర్వాంతర్యామివి. అంతటానిండి పరిపూర్ణంగా ఉన్నావని బోధపడింది. కాగభుశుండి ముని పూర్వజన్మలో గురువుగారి బోధతెలియక చిక్కులు పడినట్టు నాకు గురువు గారైన పూజనీయులు అవ్యయానందస్వాములు నాఅగ్రజులు నాకెంతబోధించినా తెలియక నానా చిక్కులూపడ్డాను. కాకముని గురువుగారి వలెనే నన్నూ నాగురువుగారు కోపించకుండా నెమ్మదిగా బోధించగా బోధించగా ఇప్పటికి కొంచెం కృతార్థతను పొంద గలిగేనని ఊహిస్తున్నాను. మహామహులైన శంకరుడూ బ్రహ్మాది దేవతలూ మునులూ పండితులూ కవులూ ఇంకా పెద్దలందరూ శ్రీరామచంద్రమూర్తి యొక్క పరిపూర్ణతత్వాన్ని పూర్తిగా తెలిసి కోలేనప్పుడు దోమకంటే నీచమైన నేను తెలిసి కోగలిగేనని ఎలా చెప్ప గలను? ప్రభూ! శ్రీరామచంద్రా! ఇప్పటికి వదలిన అవిద్యను మాత్రం మళ్లా ప్రవేశింప నియ్యకు. తండ్రీ! ఈ జ్ఞానం దూరంచేసి జ్ఞానమే నాహృదయంలో ప్రకాశించేలాగున చెయ్యుమని ప్రార్థిస్తున్నాను. నా హృదయంలో జ్ఞానదీపం ఎల్లప్పుడూ వెలుగుతుంటే ఆ వెలుతురులో నిన్ను చూడ గలుగుతాను. కాని అజ్ఞానాంధకారంలో నిన్ను తెలిసికోలేను.

దేవా! నీ దాసులనందరినీ రక్షించేవు. నన్ను మాత్రం విడిచిపెట్టవనే నమ్మేను ఈ సర్వ ప్రపంచాన్నీ మాయా దేవిచేత నడిపిస్తూ నీవు అందులో అంటకుండా ప్రకాశిస్తుంటావు. నీ ప్రభావాన్ని ఎవరు నుతించగలరు? యజ్ఞకర్తవు నీవు. యజ్ఞభోక్తవు నీవు, యజ్ఞ రక్షకుడవు నీవు. పరిపూర్ణ దయతో రక్షించే వాడవు నీవు. శిక్షించే వాడవు నీవు సమస్త లోకేశ్వరా! సీతానాథా! శ్రీరామచంద్రా! నన్ను నీమాయా జాలంలో పడిపోకుండా కాపాడు కామక్రోధ లోభమోహమదమత్సరాలనే శత్రువులను జయించగల శక్తి నాకిచ్చి రక్షించు. నీపాదపద్మాలను ఎల్లప్పుడూ మరిచిపోకుండా ఉండేలాగున ప్రసాదించు. నిన్ను మనసారా నమ్మి యున్నాను. నీవుతప్ప నన్ను ఈ భవసాగరంలోంచి తప్పించేవారు లేరు. రామా! శబరిని రక్షించేవు అహల్యనురక్షించేవు. ఇంకానిన్ను శరణన్నవారినందరినీ విడిచిపెట్టక రక్షించేవు. నీచురాలనని నన్ను మాత్రం విడిచిపెట్టకు. నీవు తప్ప ఇతర రక్షకులను ఎరుగను. నా తప్పులన్ని క్షమించి నీదాసురాలిగా చేసికో. నిన్ను సేవించి నీభక్తులైన జ్ఞానులకు స్త్రీపుంభేదాలులేవు. కాని శారీరకంగా నీదాసురాలని అనవలసి వచ్చిందికాని శరీరాభిమానంతో అన్నమాటకాదు నీకుతెలియదా! అందరిహృదయాలూ నీకు తెలుసును, నిన్నుతెలుసుకున్న తరువాత లింగభేదాలూలేవు. తెలియునంతసేపే అవన్నీని తెలిసిన తరువాత అవేవీతానుకాదు. నీవేనేను నేనేనీవు. ఇకవేరులేదు తెలియునంతసేపే నీవూనేనూ అనే భేదం శ్రీహరీ! ఈ భేదాలలోనుండి విడదీసి నీలో చేర్చుకో నన్ను విడిచిపెట్టకుమని ముమ్మాటికి ప్రార్థిస్తున్నాను నా స్వామీ! రఘునాథా! నిన్ను విడిచి ఉండలేను. నాకు సమస్తమూ నీవే. ఐహిక సుఖాలు నేను కోరలేదు. నీ నామాన్ని ఎన్నడూ మరవకుండా జపిస్తుండేలాగున చెయ్యి తండ్రీ! నీభక్తులకు జన్మలేదనికదా పెద్దలు చెపుతున్నారు. దేవా! మళ్లా నన్నీ భవసాగరంలో పడవేయకు స్వామీ ఇప్పుడీ సంసార సాగరం దాటించి ముక్తిని ప్రసాదించు ప్రభూ!

నామొరవినరా? నాడు గజేంద్రుని మొర లక్ష్మీదేవితో వినోదిస్తూ ఉన్న సమయంలో వినలేదా? నీకు భక్తుల మొఱవినడానికి సమయా సమయాలు లేవు. నీవు ఎల్లప్పుడూ ఆర్త్రత్రాణ పరాయణుడవు. కరుణామయుడవు. సీతాపతీ! నీదాసులకు దాసురాలను. నన్ను మరువక రక్షించు. జానకీనాథా! ఈచరిత్ర వ్రాసి నీకు కృతిగా సమర్పించేను. నాకు ఫలకాంక్ష యేదీలేదు. కాని నన్ను నీలో చేర్చుకోమని ఒక్క కోరిక నిన్ను కోరుకుంటున్నాను. అదితప్పుగా భావించక నెరవేర్చమని ప్రార్థిస్తున్నాను. ఈనాకోరికనెరవేర్చే దాతవని నిన్నే నమ్మేను. తక్కిన ఏకోరికలైనా ఎవరైనా తగినవారు ఇస్తారుకాని నేను కోరిన కోరిక నీవుతప్ప ఇతరు లెవరూ ఇయ్యలేరు. రఘు రామా! శ్రీరామచంద్రా! సీతారామా! కన్నులు విప్పినానీవే మూసుకున్నా నీవే ఇక ఇతర మేమీలేదు. అంతారామ మయం. నిరాకారా! నిరంజనా! శుభకరా! సీతాకళత్రా! నమస్తే. నీలమేఘశ్యామా! నమస్తే భక్తరక్షణా! నమస్తే దుష్టశిక్షకా! నమస్తే. వేదాలచేత వినుతింపబడేవాడా! కోదండ రామా! నీకునమస్కారం. సౌఖ్యనిలయా! నమస్కారం.పార్వతీదేవిచే విను తింపబడే నామం గలవాడా! నమస్కారం సర్వేశా! ఆనందమూలా, విశ్వ పాలకా! పరమేశ్వరునిచే నుతింపబడేవాడా! కోదండరామా! నీకు నమస్కారం మళ్లామళ్లా నీకు నమస్కారం నీకు అనేక నమస్కారాలు. ప్రపంచాతీ తుడైన శ్రీరామచంద్ర మూర్తికి నమస్కారం. సీతానాథా! ఎల్లప్పుడూ నీపాదపద్మాల యందు భక్తి ఏమరుపాటు లేకుండా ప్రసాదించు. నీకు సాష్టాంగ నమస్కారాలు. శ్రీసీతారామచంద్రప్రభూ! నీదాసురాలను. దయతో కాపాడు. నీకిదే ప్రణుతి. ఎల్లవేళలందూ నీ నామస్మరణ చేసు కుంటూ ఈజన్మతరించేలాగున ప్రసాదించి పునర్జన్మలేని స్థానాన్ని పొం దించు. ప్రభూ! నానాదిక్కులందూ ప్రదక్షిణ పూర్వకంగా నీకు నమస్కారి

స్తున్నాను. నీ నామ జపం నీ రూపధ్యానం తప్ప ఇతర మేమీనాకు రాదు. ఎలా కాపాడతావో నీవేదిక్కని నమ్మేను. గోవిందా! నమోనమః శ్రీశుభకృతు సంవత్సరం పుష్య శుద్ధవాడ్యమి గురువారం సంపూర్ణం.

గద్య :— ఇది శ్రీసీతారామచంద్ర వరప్రసాదం వల్ల భూసురులూ కాశ్యపసగోత్రోద్భవులూ ఐ. సన్యాసేశ్వరశర్మగారి తనయ రుక్మిణీ నామధేయ చేత రచింపబడ్డ వ్యావహారికవచన తులసీరామాయణమందు ఉత్తరకాండమనే ఏడోసోపానం సర్వం సంపూర్ణం

ఓం తత్సత్

శ్రీసీతారామచంద్రార్పణమస్తు.

—)o(—

శ్రీ కొండపల్ల ముద్రాక్షరశాల, రాజమండ్రి.

# వెలువడనున్నవి

1) శ్రీ మహాంధ్ర తులసీ రామాయణము (షష్ఠ, సప్తమ సోపానములు)

2) శ్రీమహాంధ్రధ్యాత్మరామాయణము
సప్తకాండములు (శ్రీ స్వామి అవ్యయానంద విరచితము)

3) మహత్తిరి రామాయణము (వ్యావహారికవచనము)
శ్రీమతి చైనుల వెంకట రమణమ్మ విరచితములు

4) అనుభవజ్ఞానదర్పణము వచనము ,,

5) శ్రీ వ్యావహారిక భాగవతములు ,,

6) అంతస్స్రోతస్విని శ్రీపతి వేణుగోపాలశర్మ విరచితములు

7) మానవా! ,,

8) వనితా! ,,

9) విద్యార్థీ ,,

10) సమసమాజము ,,

11) వర్తమానము ,,

12) వైరాటిపరిణయము (బుఱ్ఱకథ)

13) దశకంధరపరాభవము (హరికథ)

14) ప్రజారాజ్యము (నాటకము)